"నవగ్రహారాధన" శ్రీ గణేశారాధన, ఆదిత్యారాధన, శ్రీ సాయీ ఆరాధన,
శ్రీ శివ ఆరాధన, రచయిత మరో అద్భుత సృష్టి

# నిత్య జీవితములో
# పండగలు - పర్వదినాలు

పరిశోధనాత్మక గ్రంథము

వ్యాఖ్యాత, శతాధిక గ్రంథ సంకలనకర్త, పంచాంగకర్త :
శ్రీ సాయిభక్తాగ్రగణ్యులు, ఓం శ్రీసాయిరామ్ శరణ్
గురుదేవులు శ్రీ ఆదిపూడి మోహనరావు మహరాజ్
(ఓం శ్రీ సాయిరామ్ చైతన్య కేంద్ర వ్యవస్థాపకులు) గారి కుమారులు
డా॥ **ఆదిపూడి వేంకట శివసాయిరామ్** B.Sc., L.L.B., (లేఖిఖా చైతన్య)
**గుంటూరు - 7.**

రచనా సహకారం :
**శ్రీ పాద సీతారామయ్య**
బ్రాంచి పోస్టు మాష్టార్, మొగలికుదురు-533 249, తూ॥గో॥జిల్లా.

ప్రకాశకులు : ☎ 246 2565
**మోహన్ పబ్లికేషన్స్**
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1.
కాపీరైట్ 2012 వెల : 90-00



**నిత్య జీవితములో పండగలు - పర్వదినాలు**



సంపాదకులు, వ్యాఖ్యాత, శతాధిక గ్రంథ సంకలనకర్త, పంచాంగకర్త :
**డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్** B.Sc., L.L.B.,
(లేఖిఖా చైతన్య)
కొరిటెపాడు, గాంధిబొమ్మ బజారు, **గుంటూరు - 7.**
ఫోన్ : (0868) 2353321, సెల్ : 9440262421

రచన సహకారం :
**శ్రీ పాద సీతారామయ్య**
బ్రాంచి పోస్టు మాష్టార్,
మొగలికుదురు-533 249, తూ॥గో॥జిల్లా.
ఫోన్ : (08862) 2747114



ప్రకాశకులు :
**మోహన్ పబ్లికేషన్స్**
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.




**రచయితలు**

**డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్, శ్రీ పాద సీతారామయ్య**

**EVERY ONE HAS A REASON TO READ**

FROM UN REAL TO REALITY F FROM DARKNESS TO LIGHT F FROM DEATH TO IMMORATLITY

**భక్తి కెరటం - ఆధ్యాత్మిక సాగరం-దైవకటాక్షం - ముక్తితీరం**

**ఆదిపూడి వారి పుస్తకాలు**

**చదవండి !** **చదివించండి !!**

# మా మనవి

ఇది వరకు మేము ప్రచురించిన
**నవగ్రహారాధన, నిత్యజీవితములో రుద్రాక్షలు,**
**నవగ్రహ వైభవము, శివారాధన,**
**శ్రీ గణేశరాధన, నిత్య జీవితములో నవరత్నాలు**
**హనుమదారాధన, శ్రీ సాయిూ ఆరాధన**
అత్యద్భుతముగా ప్రశంసలు అందుకున్నవి.
అందుచే
**డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్ వారిచే**
**నిత్య జీవితములో పండగలు - పర్వదినాలు**
అనే పుస్తక రాజము అందించినాము.
కావున ప్రతి ఒక్కరు ఇది చదవదగినది.
చదవటానికి ఇచ్చినచో మళ్లీ
ఈ పుస్తకము తిరిగి మీ వద్దకు రాదు
అంతటి అమూల్య గ్రంథరాజము..

పండగలు - పర్వదినాలు గురించి పూర్తి
వివరణాత్మక గ్రంథం

ప్రకాశకులు...
మోహన్ పబ్లికేషన్స్

The NO.1 Publishing house which publish
the only creative books




(మీ మీ ఆప్తమిత్రునికి / బంధువునకు మీ కానుకగా
ఈ పుస్తకమును ఇవ్వదలిస్తే ఈ పేజీని ఉపయోగించండి.)



# కృతజ్ఞతాభివందనములు



**నా జననీ జనకులు గురుదేవులు**
**శ్రీ ఆదిపూడి మోహనరావు మహరాజ్, శ్రీమతి దుర్గాంబ గార్లకు**

1. నాలో ఆధ్యాత్మిక సంపదను పెంపొందిస్తున్న నా ఇష్టదైవమైన సమర్థ సద్గురు సాయినాథ్ మహరాజ్‌కు
2. అనుక్షణం నా వెంట నడుస్తు, నన్ను నా రచనలను ప్రోత్సహిస్తున్న ప్రాణ స్నేహితులకు, సన్నిహితులకు, సహచరులకు
3. ఇంతకు ముందు పుస్తకములు ఒకరోజు పారాయణ శ్రీసాయి సచ్చరిత్ర, శ్రీగురు చరిత్ర శ్రీసాయి సత్యవ్రతం గ్రంథములకు విజయం చేకూర్చిన పాఠకులకు
4. నవగ్రహారాధన, గణేశారాధన, హనుమదారాధన, శ్రీ సాయీ ఆరాధన, శ్రీ శివ ఆరాధన, శ్రీ ఆదిత్యారాధన, నిత్య జీవితములో రుద్రాక్షలు, నవరత్నములు గ్రంథములకు అత్యంత విజయాన్ని చేకూర్చిన పాఠకులకు కృతజ్ఞతాభివందనములతో...
5. ఈ గ్రంథ రచనకు సహకరించిన శ్రీపాద సీతారామయ్యవారికి మరియు డా॥ రోహిణి వేంకట సుందర వరద రాజేశ్వరిగారికి, ఆధ్యాత్మిక, మాసపత్రికలైన ఋషిపీఠం, భక్తిరంజని, భక్తితేజం వారికి కృతజ్ఞతలు.

డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్

ఈ గ్రంథంపై తమ అమూల్య అభిప్రాయములు కార్డు ద్వారా వ్రాసి పంప ప్రార్థన.

**డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్**
**4-7-84, కొరిటెపాడు, 9వ వీధి, గాంధీబొమ్మ బజారు, గుంటూరు. ఫోన్ : (0863) 2353321**

## డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరాంగారి రచనలు

| | | |
|---|---|---|
| 1. | గణేశారాధన (దిష్టిగణపతి, కాణిపాకగణపతి ఫోటోలు ఉచితం) | 54-00 |
| 2. | నవగ్రహారాధన | 54-00 |
| 3. | నిత్యజీవితములోరుద్రాక్షలు (షణ్ముఖీరుద్రాక్ష ఉచితం) | 54-00 |
| 4. | శ్రీదేవీ లీలామృతము | 54-00 |
| 5. | జాతకచక్రం వేయడం ఎలా? | 18-00 |
| 6. | శ్రీ అనఘాదేవి వ్రతం | 11-00 |
| 7. | శ్రీ సాయీసచ్చరిత్ర (బైండ్) | 29-00 |
| 8. | శ్రీ గురు చరిత్ర (బైండ్) | 29-00 |
| 9. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 16-00 |
| 10. | అఖిలదేవత స్తోత్రమంజరి | 36-00 |
| 11. | లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు | 16-00 |
| 12. | భక్తుల ప్రశ్నలకు - బాబా జవాబులు | 18-00 |
| 13. | అక్షర క్రమంలో శ్రీ సాయిసూక్తులు | 18-00 |
| 14. | మనసులోని ప్రశ్నకు శ్రీసాయిబాబా జవాబులు | 18-00 |
| 15. | శ్రీ సత్యదత్త వ్రతము | 10-00 |
| 16. | ఓం శ్రీసాయిరామ్ కోటి | 10-00 |
| 17. | రాహుకాలములో శ్రీదుర్గాపూజ | 6-00 |
| 18. | కాత్యాయనీ వ్రతము (కుజదోషనివారణకు) | 8-00 |
| 19. | శ్రీ వైభవలక్ష్మి వ్రతము | 8-00 |
| 20. | శ్రీ సాయీ సత్యవ్రతం | 10-00 |
| 21. | శ్రీ లక్ష్మీకుబేర వ్రతము (యంత్రం ఫోటో ఉచితం) | 9-00 |
| 22. | కుజదోషము (పరిహారము) | 6-00 |
| 23. | కాలసర్పదోషము (పరిహారము) | 6-00 |
| 24. | మీ అప్పులు తీరాలా? (పరిహార మార్గములు) | 6-00 |
| 25. | శ్రీసాయినాథ చాలీసా | 6-00 |
| 26. | యజుర్వేదీయ పంచసూక్తములు (స్వర సహితంగా) | 6-00 |
| 27. | గాయత్రీ సంధ్యావందనమ్ (యజుర్వేదం) | 6-00 |
| 28. | ఆరుచాలీసాలు(శివ,దుర్గ,సాయి,హనుమాన్,నవగ్రహ,శని) | 6-00 |
| 29. | బాలల బాబా శ్రీసాయిచరితము | 6-00 |
| 30. | ప్రతిరోజు అష్టోత్తర శతనామావళిపూజ (11దేవతలకు) | 4-00 |
| 31. | ప్రతిరోజు నవగ్రహ నిత్యపూజ | 6-00 |
| 32. | ప్రతి ఆదివారం శ్రీ సూర్యనారాయణ నిత్యపూజ | 6-00 |
| 33. | ప్రతి ఆది/బుధవారం శ్రీరామనిత్యపూజ (రామదేవునికథతో) | 6-00 |
| 34. | ప్రతి సోమవారం శ్రీ శివనిత్యపూజ | 6-00 |
| 35. | రుద్రనమకమ్ చమకమ్ (స్వరసహితంగా) | 6-00 |
| 36. | ప్రతి మంగళవారం శ్రీ ఆంజనేయ నిత్యపూజ | 6-00 |
| 37. | ప్రతి మంగళవారం శ్రీ సుబ్రహ్మణ్య నిత్యపూజ | 6-00 |
| 38. | ప్రతి బుధవారం శ్రీ విష్ణు నిత్యపూజ - విష్ణు సహస్రంతో | 6-00 |
| 39. | మన్యు సూక్త మంత్ర పారాయణము | 6-00 |
| 40. | ప్రతి గురువారం శ్రీ సాయినిత్యపూజ | 6-00 |
| 41. | ప్రతి గురువారం శ్రీ రాఘవేంద్ర నిత్యపూజ | 6-00 |
| 42. | ప్రతి శుక్రవారం లక్ష్మి-గౌరీ నిత్యపూజ | 6-00 |
| 43. | ప్రతి శుక్రవారం శ్రీదుర్గాదేవీ నిత్యపూజ | 6-00 |
| 44. | ప్రతి విద్యార్థి, విద్యార్థినికి శ్రీసరస్వతీ నిత్యపూజ | 6-00 |
| 45. | ప్రతి శనివారం శ్రీ వేంకటేశ్వర నిత్యపూజ | 6-00 |
| 46. | ప్రతి శనివారం శ్రీశనైశ్చర నిత్యపూజ | 6-00 |
| 47. | సంక్షిప్త శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 6-00 |
| 48. | శ్రీ తులసీ నిత్యపూజ నిత్యజీవితములో తులసి ఉపయోగాలు | 6-00 |
| 49. | గోమాత నిత్యపూజ - కృష్ణ నిత్య పూజతో | 6-00 |
| 50. | శ్రీస్వామి అయ్యప్ప దీక్ష (నిత్యపూజ) | 6-00 |
| 51. | శ్రీ స్వామి అయ్యప్ప భక్తిగీతాలు (పాటలు) | 6-00 |
| 52. | సకలదేవతా గాయత్రీ మంత్రములు (108) | 6-00 |
| 53. | శ్రీచక్రపూజ విధానము | 6-00 |
| 54. | శ్రీ సాయీ స్తవన మంజరి | 6-00 |
| 55. | అద్భుత ఫలప్రదాయ పంచరత్న స్తోత్రములు | 6-00 |
| 56. | కరావలంబ స్తోత్రములు | 6-00 |
| 57. | దశావతార స్తోత్రములు (శ్రీరామరక్ష స్తోత్రంతో) | 6-00 |
| 58. | సర్వదేవతా అష్టోత్తరశతనామ స్తోత్రములు | 6-00 |
| 59. | ఏకాదశ భుజంగ స్తోత్రములు | 6-00 |
| 60. | ప్రతి ఉదయం పఠించదగిన ప్రాతఃస్మరణములు | 6-00 |
| 61. | సర్వదేవతా జపమంత్రములు | 6-00 |
| 62. | ప్రతిరోజూ పారాయణకు సుప్రభాతములు | 6-00 |
| 63. | శ్రీవిఘ్నేశ్వరపూజ (కాణిపాక క్షేత్రమహాత్యం) | 6-00 |
| 64. | ద్వాదశనామస్తోత్రములు | 6-00 |
| 65. | సర్వదేవత ధ్యాన శ్లోకములు | 6-00 |
| 66. | రామదాసుకీర్తనలు | 6-00 |
| 67. | ప్రతి శుక్రవారం గాయత్రీదేవి పూజ | 6-00 |
| 68. | ప్రతి శుక్రవారం బాలత్రిపురసుందరీదేవి పూల | 6-00 |
| 69. | ప్రతి శుక్రవారం అన్నపూర్ణాదేవి పూజ | 6-00 |
| 70. | ప్రతి శుక్రవారం రాజరాజేశ్వరీ దేవి పూజ | 6-00 |
| 71. | అన్నమాచార్య కీర్తనలు | 6-00 |
| 72. | త్యాగరాజస్వామి కీర్తనలు | 6-00 |
| 73. | కుమారస్వామి స్తోత్రమాల (మోపిదేవీ క్షేత్ర మాహాత్మ్యంతో) | 6-00 |
| 74. | సర్వశత్రు వినాశనమునకు సుదర్శన స్తోత్రమాల | 6-00 |
| 75. | హయగ్రీవ స్తోత్రమాల | 6-00 |
| 76. | పంచముఖి ఆంజనేయ స్తోత్రం (అరగొండ క్షేత్ర మహాత్యంతో) | 6-00 |
| 77. | దండకరత్నాలు | 6-00 |
| 78. | దేశభక్తి గీతములు | 6-00 |
| 79. | శివదీక్ష | 6-00 |
| 80. | ద్వాదశ జ్యోతిర్లింగాలు (పంచారామములు) | 6-00 |
| 81. | శ్రీ సూక్తం - పురుష సూక్తం | 6-00 |
| 82. | ప్రతి శుక్రవారం లక్ష్మీనిత్యపూజ | 6-00 |
| 83. | సకల విద్యాప్రాప్తికి దక్షిణామూర్తి స్తోత్రములు | 6-00 |
| 84. | లలితా విష్ణు సహస్రనామస్తోత్రములు | 6-00 |
| 85. | పంచ అధర్వణ శీర్షములు | 6-00 |
| 86. | ప్రతి ఆదివారం వీరబ్రహ్మేంద్రస్వామి నిత్యపూజ | 6-00 |
| 87. | సకల కార్యసిద్ధికి ప్రార్థనాశ్లోకములు | 6-00 |
| 88. | సకల కార్య జయమునకు గణపతి స్తోత్రములు | 6-00 |
| 89. | శ్రీ గురుగీత | 6-00 |
| 90. | తిరుపతి వెళదాం (తిరుపతి గైడ్) | 6-00 |
| 91. | విశ్వకర్మ వ్రతము (నిత్యపూజతో) | 6-00 |
| 92. | ప్రతి సోమవారం వీరభద్ర నిత్యపూజ | 6-00 |
| 93. | దృష్టి దోషము తొలగొంచుకొనుట ఎలా? | 6-00 |
| 94. | హిందుసంస్కృతి-సంప్రదాయాలు | 6-00 |
| 95. | నిత్య జీవితములో అదృష్ట సంఖ్యలు | 6-00 |
| 96. | పురాణోక్త విష్ణు స్తోత్రమాల | 6-00 |
| 97. | శ్రీ దేవీ స్తోత్రమాల | 6-00 |
| 98. | భర్తృహరి సుభాషితములు | 6-00 |
| 99. | శివస్తోత్రమాల | 6-00 |
| 100. | నిత్యజీవితములో నక్షత్రములు | 6-00 |
| 101. | హనుమదారాధన | 54-00 |
| 102. | శ్రీ సాయీ ఆరాధన | 54-00 |
| 103. | నవగ్రహ వైభవం | 54-00 |
| 104. | శ్రీ శివ ఆరాధన | 54-00 |
| 105. | దాసగణుకృత శ్రీసాయిసచ్చరిత్ర | 20-00 |
| 106. | ఏడు శనివారముల వ్రతము | 10-00 |
| 107. | నవగ్రహ రెమిడీస్ | 54-00 |
| 108. | షిరిడి గైడ్ | ------- |

పై పుస్తకములు కావలసినవారు : మోహన్ పబ్లికేషన్స్ కోటగుమ్మం-రాజమండ్రి. ఫోన్ : 246 2565





## ఈ గ్రంథ రచనకు సహకరించిన రచనలు

1. ఋషిపీఠం మాసపత్రికలు

   (ఎన్. రామమూర్తి శర్మ, విశ్వనాథ రాజేశ్వరీపావన్ గారి రచనలు)

2. భక్తి టుడే, భక్తిరంజని, భక్తితేజం, ఓంకార వేదమ్ మాస పత్రికలు

3. దశావతారములు

   - డా॥ రోహిణి సుందర వరద రాజేశ్వరీ

4. శ్రీ సాయిబాబా సచ్చరిత్ర

   - ఆలూరు గోపాలరావు

5. ఇంకా అనేక భక్తి తత్త్వ ప్రచార మాసపత్రికలు మరియు అనేక ఆధ్యాత్మిక గ్రంథములు

వీరందరికి పేరు పేరునా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.



ఇట్లు

**రచయితలు**

## విషయ సూచిక







## ఒక్క క్షణం ..! మీతో...!!



మన హిందూసంస్కృతీ సంప్రదాయాలు కట్టుబాట్లును చూచి మెచ్చుకుంటూ ఇతర దేశస్తులు సహితం ఆకర్షితులవుటవెనుక! అందులో మనకు మంచి ఆంతర్యమేదో ఒకటి గోచరిస్తూ ఉంటుంది. దానికిగల కారణం! మన హిందూ సంప్రదాయ విధానంతో నడచుకునే మానవులు; వారి 'జీవనసాగర' ప్రయాణాల్లో ఎన్నోరకాల ఆటుపోటులు ఎదురవుతున్నా! వాటిని నిబ్బరంగా ఎదుర్కుంటూ వారి భావిజీవితాన్ని చక్కని 'ఆదర్శవంతంగా' తీర్చిదిద్దుకుంటూ! ఇహమందు సంపూర్ణ ఆరోగ్యవంతులై; సర్వసౌఖ్యాలను అనుభవిస్తూ, చివరి దశలో పరమేశ్వర సాయుజ్యము పొందేందుకు మన ఋషిపుంగవులు ఒక చక్కని "జ్ఞానజ్యోతిని" వెలిగించి ఇచ్చినారు. ఆ దివ్య జ్యోతి కాంతితో కష్టాలు అను చిమ్మ చీకట్లలను పారద్రోలుకుంటూ ఆ బాటలో ధర్మ, అర్థ, కామ, మోక్షములకొరకై తప్పటడుగులు వేయకుండా ఉండేందుకూ, మనకు ఈ నోములు అంటూ, వ్రతాలు అంటూ, ఉపవాసాలు అంటూ, పుణ్యనదీస్నానాలు అంటూ, పండుగలంటూ ఏర్పరచి మన హిందువులకు చక్కని ఆదర్శవంతమైన జీవితగమ్యాన్ని నిర్దేశించి; అటుచక్కని ఆధ్యాత్మిక సంపదతోపాటు ఇటు మంచి ఆరోగ్య సంపదను కూడా వారు మనకు అందించినారు, అట్టి మార్గాన్ని వారు ఆచరించి మనకు మార్గదర్శకులైనారు.

మన పూర్వీకులు కూడా అట్టి మార్గములో నడచి కృతకృత్యులైన సంగతి మనకు విదితమే! అటువంటి పూలబాటలో మనమూనడుస్తూ!

మనభావితరాల వారినికూడా నడిపించే ఈ చిరుప్రయత్నమే పూజ్యులైన దైవజ్ఞరత్న డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరాంగారి అభిలాష. అలా! వారి కలంనుండి జాలువారే వివిధ ఆణిముత్యాలలో "పండగలు – పర్వదినాలు" పుస్తకం ఒకటి. మన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలపట్ల అభిరుచి, గౌరవభావము కలిగిన ప్రతీవారి ఇంటి యందును తప్పకుండ ఉండదగిన "మార్గదర్శి" ఈ పుస్తకం. అంతేకాకుండా అట్టి మనోభావాలతో ఏకీభవించే మీ బంధువులు, స్నేహితులకు వారి వారి శుభకార్యాలలో మంచి బహుమతిగా ఈయతగినది ఈ పుస్తకం.

డా॥ సాయిరామ్‌గారి తండ్రిగారైన గురుదేవులు శ్రీ ఆదిపూడి మోహనరావు మహరాజ్‌గారు; తల్లిగారైన శ్రీమతి ఆదిపూడి దుర్గాంబ మోహనరావుగారు గత 1985లో వ్యవస్థీకరించిన "ఓం శ్రీసాయిరామ్" పత్రిక నేడు డా॥ సాయిరాం గారి పర్యవేక్షణలో వెలుగొందుచున్న సమయంల్లో! నేను గడచిన 2001 నుండి వారి పత్రికద్వారా "తూర్పు గోదావరిజిల్లాలోని" వివిధ పురాతన పుణ్యక్షేత్రాల విశిష్టతలను మరోమారు ప్రజలముందుంచి ఆయాక్షేత్రాలను భక్తులు గుర్తించి, అసంఖ్యాకంగా భక్తులు ఆ క్షేత్రాలలోగల దేవతామూర్తులను సేవించి తరించుటయే! నా పరమావధిగా భావించి! నేను అలా వ్రాస్తున్న వ్యాసాలను చూచి స్పందించి నాచే ఈ పుస్తకములో "మనపండగలు" యొక్క విశిష్టతలను "సంకలన"పరచి వ్రాసేందుకు తగు స్ఫూర్తినిచ్చి, వారి సంపూర్ణ సహాయ సహకారములు అందించినందులకు ముందుగా వార్కి నా హృదయపూర్వక ధన్యవాదాలు సమర్పించు కుంటున్నాను. అలాగునే నేను 'సంకలన' పరచి వ్రాసిన వ్యాసముల వెనుక ఉన్న ఎందరో మహాత్ములకు! నా హృదయ పూర్వక పుష్పాంజలులు సమర్పించు కుంటున్నాను.

సదాసాయి సేవలో

**శ్రీపాద సీతారామయ్య**

(సహ రచయిత)

---

**బ్రాంచి పోస్టుమాస్టర్**

**మొగలికుదురు-533249** రాజోలు మండలం,

తూర్పుగోదావరి జిల్లా ఫోన్ : 08862 -247114





# పండగలు - పర్వదినాలు

## చైత్రమాసం - పండుగలు, పర్వదినాలు

| | |
|---|---|
| చైత్రశుద్ధపాడ్యమి (ఉదయంవేళ) | ఉగాది లేక సంవత్సరాది<br>వసంత నవరాత్రుల ప్రారంభం |
| చైత్రశుద్ధ విదియ | ఉమాశివాగ్ని పూజ చంద్రదర్శనం<br>మొహరం నెల ప్రారంభం |
| చైత్రశుద్ధ తదియ | శ్రీరామడోలోత్సవం, సౌభాగ్యశయనవ్రతం<br>శివడోలోత్సవం |
| చైత్రశుద్ధ చవితి | గణేశ దమనపూజ |
| చైత్రశుద్ధ పంచమి (అపరాహ్నవేళ) | మత్స్యావతార జయంతి, కూర్మకల్పాది<br>లక్ష్మీపంచమి, నాగపూజ |
| చైత్రశుద్ధ షష్ఠి | స్కంధపూజ |
| చైత్రశుద్ధ సప్తమి | సూర్యపూజ |
| చైత్రశుద్ధ అష్టమి | అశోకాష్టమి |
| చైత్రశుద్ధ నవమి | శ్రీరామనవమి వరాహజయంతి కవీంద్ర తీర్థపుణ్యదినం |
| చైత్రశుద్ధ దశమి | ధర్మరాజ దశమి(మధ్యాహ్నవేళ) |
| చైత్రశుద్ధ ఏకాదశి | దమనైకాదశీ డోలోత్సవం, మొహరం,<br>పీర్ల పండుగ,రుక్మిణీపూజ |
| చైత్రశుద్ధ ద్వాదశి | వామన ద్వాదశి |
| చైత్రశుద్ధ త్రయోదశి | మహవీర జయంతి అనంత త్రయోదశి, సత్యవ్రత<br>తీర్థపుణ్యం దినం (రాత్రివేళ) |
| చైత్రశుద్ధ చతుర్దశి | ఇంద్రపూజ |
| చైత్రపూర్ణిమ | మధన పూర్ణిమ దినోత్సవం, శ్రీహనుమద్వ్జయోత్సవము |
| చైత్ర బహుళ విదియ | వృషభాయనం |
| చైత్రబహుళ తదియ | వాగీశ తీర్థ పుణ్యదినం |
| చైత్రబహుళ చవితి | సంకష్టహార చతుర్థీ వ్రతం |
| చైత్రబహుళ ఏకాదశి | వరూధిన్యైకాదశి |
| చైత్రబహుళ త్రయోదశి | వరాహజయంతి |
| చైత్రబహుళ చతుర్దశి | శివసన్నిధౌ స్నానము |

## వైశాఖమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| వైశాఖ శుద్ధ పాడ్యమి | వైశాఖ స్నానారంభం |
| వైశాఖ శుద్ధ తదియ | త్రేతాయుగాది, పరశురామ జయంతి (మధ్యాహ్నవేళ) కరకప్రదానం, గంగాస్నానం పుణ్యదినం, వార్తాక గౌరీవ్రతం, బలరామ జయంతి, అక్షయ తృతీయ |
| వైశాఖ శుద్ధ పంచమి | శ్రీ భావనాఋషి జయంతి, శంకరాచార్య జయంతి, రామానుజాచార్య జయంతి |
| వైశాఖ శుద్ధ షష్ఠి | శ్రీరామచంద్రతీర్థం పుణ్యదినం |
| వైశాఖ శుద్ధ సప్తమి | కన్యాకుమారి గంగోత్పత్తి |
| వైశాఖ శుద్ధ అష్టమి | ద్వాపరయుగాంతం |
| వైశాఖ శుద్ధ నవమి | చండికాదేవి పూజ |
| వైశాఖ శుద్ధ దశమి | బ్రహ్మంగారి ఆరాధన, శ్రీ వాసవీ జయంతి |
| వైశాఖ శుద్ధ ఏకాదశి | మోహిన్యేకాదశి అన్నవరం సత్యనారాయణస్వామివారి కళ్యాణం, శ్రీ లక్ష్మీ నరసింహస్వామివారి కళ్యాణం |
| వైశాఖ శుద్ధ ద్వాదశి | పరశురామ ద్వాదశి |
| వైశాఖ శుద్ధ త్రయోదశి | శ్రీ నృసింహజయంతి (సాయంకాలవేళ) |
| వైశాఖ శుద్ధ చతుర్దశి | నరసింహావతార జయంతి |
| వైశాఖ శుద్ధ పూర్ణిమ | సింధూ స్నానపుణ్యదినం అర్ధనారీశ్వరవ్రతం, బుద్ధావతార జయంతి, వ్యాసపూర్ణిమ, సంపద్గౌరీవ్రతం, అన్నమాచార్య జయంతి, మహావైశాఖ కూర్మజయంతి (సాయంవేళ) |
| వైశాఖ బహుళ తదియ | పార్థివకల్పాదిః |
| వైశాఖ బహుళ చవితి | సంకష్టహర చతుర్థీవ్రతం |
| వైశాఖ బహుళ దశమి | హనుమజ్జయంతి |
| వైశాఖ బహుళ ఏకాదశి | అపరైకాదశి |
| వైశాఖ బహుళ చతుర్దశి | మాసశివరాత్రి, వటసావిత్రివ్రతం, కృష్ణాంగారక చతుర్దశీ |



## జ్యేష్ఠమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి | కరవీరవ్రతం |
| జ్యేష్ఠ శుద్ధ విదియ | సత్యసంధ తీర్థ పుణ్యదినం, సోమపదం, బౌద్ధకల్కి జయంతి |
| జ్యేష్ఠ శుద్ధ తదియ | రంభావ్రతం |
| జ్యేష్ఠ శుద్ధ చవితి | ఉమాదేవి పూజ |
| జ్యేష్ఠ శుద్ధ షష్ఠి | వనగౌరీవ్రతం |
| జ్యేష్ఠ శుద్ధ అష్టమి | శ్రీ శుక్లాదేవి పూజ |
| జ్యేష్ఠ శుద్ధ నవమి | బ్రహ్మణీ పూజ |
| జ్యేష్ఠ శుద్ధ దశమి | గంగాభగవతీవ్రతం, దశహరా వ్రతం |
| జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి | నిర్జల ఏకాదశి శ్రీ ఆదిశంకరులు కైలాసగమనము |
| జ్యేష్ఠ శుద్ధ ద్వాదశి | రామలక్ష్మణ ద్వాదశి శాకవ్రతారంభం |
| జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి | శ్రీవిద్యారణ్య గురుచరణారాధనం |
| జ్యేష్ఠ శుద్ధ చతుర్ధశి | సత్యాభినవతీర్థనం పుణ్యదినం |
| జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ | భౌచ్యక మన్వాదిః వృషభపూజా వట సావిత్రీ వ్రతం, కృషి పూర్ణిమ |
| జ్యేష్ఠ బహుళ విదియ | సత్యపూర్ణ తీర్థర పుణ్యదినం |
| జ్యేష్ఠ బహుళ తదియ | రఘువర్య తీర్థం |
| జ్యేష్ఠ బహుళ చవితి | సంకష్టహర చతుర్థీ వ్రతం |
| జ్యేష్ఠ బహుళ అష్టమి | త్రిలోచన పూజ |
| జ్యేష్ఠ బహుళ దశమి | తిరువళ్ళూరు వీరరాఘవస్వామి ముడుపోత్సవం |
| జ్యేష్ఠ బహుళ ఏకాదశి | యోగిన్యేకాదశి |
| జ్యేష్ఠ బహుళ ద్వాదశి | కూర్మజయంతి |
| జ్యేష్ఠ బహుళ అమావాస్య | వటసావిత్రీ వ్రతం |

## ఆషాఢమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| ఆషాఢశుద్ధ విదియ | శ్రీ పూరిజగన్నాథస్వామి వ్రతోత్సవం |
| ఆషాఢశుద్ధ పంచమి | స్కంధ పంచమి |
| ఆషాఢశుద్ధ షష్ఠి | స్కంద షష్ఠి |
| ఆషాఢశుద్ధ సప్తమి | వివస్వత్సప్తమీ, భానుసప్తమీ |
| ఆషాఢశుద్ధ అష్టమి | మహిషాసురమర్దనీదేవి పూజ |
| ఆషాఢశుద్ధ నవమి | ఇంద్రపూజ |
| ఆషాఢశుద్ధ దశమి | లక్ష్మీవ్రతం ప్రారంభం, చాక్షుషమన్వాదిః శాకవ్రతం |
| ఆషాఢశుద్ధ ఏకాదశి | శయన ఏకాదశి, గోపద్మవ్రతం ప్రారంభం, చాతుర్మాస్యారంభః |
| ఆషాఢశుద్ధ ద్వాదశి | వాసుదేవ ద్వాదశి శాకా వ్రతారంభం |
| ఆషాఢశుద్ధ చతుర్దశి | పవిత్రారోహణం |
| ఆషాఢశుద్ధ పూర్ణిమ | వ్యాసపూర్ణిమ, గురుపూర్ణిమ, శివశయనవ్రతం, సింధూస్నాన పుణ్యదినం, పోలావ్రతం,కోకిలావ్రతం |
| ఆషాఢబహుళ విదియ | చాతుర్మాస్యాద్వితీయా, అశూన్య శయనవ్రతం (రాత్రివేళ) |
| ఆషాఢబహుళ చవితి | దక్షిణాయన పుణ్యకాలం |
| ఆషాఢబహుళ పంచమి | శ్రీ జయతీర్థ పుణ్యదినం |
| ఆషాఢబహుళ అష్టమి | రుద్రసావర్ణిక మన్వాది |
| ఆషాఢబహుళ ఏకాదశి | కామినైకాదశి |
| ఆషాఢబహుళ అమావాస్య | చుక్కల అమావాస్య |

## శ్రావణమాసం - పండగలు, పర్వదినాలు

(మంగళవారములలో కుజగౌరీవ్రతము)

| | |
|---|---|
| శ్రావణ శుద్ధ పాడ్యమి | గౌరీవ్రతం ప్రారంభం |
| శ్రావణ శుద్ధ తదియ | స్వర్ణ గౌరీవ్రతం |
| శ్రావణ శుద్ధ చవితి | నాగ చతుర్ధశి |
| శ్రావణ శుద్ధ పంచమి | నాగపంచమి, గరుడ పంచమి |
| శ్రావణ శుద్ధ షష్ఠి | సూర్యషష్ఠివ్రతం, కల్కిజయంతి (సాయంకాలవేళ) |
| శ్రావణ శుద్ధ సప్తమి | సత్యవర తీర్థర పుణ్యదినం |
| శ్రావణ శుద్ధ దశమి | దధి వ్రతారంభం |
| శ్రావణ శుద్ధ ఏకాదశి | పుత్రదైకాదశి, లలితైకాదశి |
| శ్రావణ శుద్ధ ద్వాదశి | దామోదర ద్వాదశి |
| శ్రావణ శుద్ధ పూర్ణిమ | హయగ్రీవ అవతారం, ఆపస్తంబోపాకర్మ వరలక్ష్మీవ్రతం, జంధ్యాల పౌర్ణమి (రాఖీపండుగ) రక్షాబంధనము (శ్రవణానక్షత్రం సాయంత్రంవేళ) |
| శ్రావణ బహుళ విదియ | అశూన్య శయనవ్రతం, రాఘవేంద్ర తీర్థర పుణ్యదినం, చాతుర్మాస్యద్వితీయా |
| శ్రావణ బహుళ చవితి | సంకష్టహర చతుర్థీవ్రతం (రాత్రివేళ) |
| శ్రావణ బహుళ సప్తమి | శీతలావ్రతం |
| శ్రావణ బహుళ అష్టమి | దశఫలవ్రతం, శ్రీకృష్ణ జయంతి (అర్థరాత్రివేళ) కృష్ణాష్టమి |
| శ్రావణ బహుళ ఏకాదశి | ధర్మప్రభైకాదశి (పూర్ణిమముందు వచ్చే శుక్రవారం వరలక్ష్మీవ్రతం) |
| శ్రావణ బహుళ అమవాస్య | పోలాల అమావాస్య, పోలాంబావ్రతం |

## భాద్రపదమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| భాద్రపద శుద్ధ పాడ్యమి | శైవమౌనవ్రతం |
| భాద్రపద శుద్ధ తదియ | బలరామజయంతి, షోడశోమావ్రతం, గజగౌరీవ్రతం, హరితాలికా గౌరీ వ్రతం, సువర్ణగౌరీ వ్రతం, వరాహ జయంతి (అపరాహ్నవేళ) |
| భాద్రపద శుద్ధ చవితి | వినాయక చవితి, శివచతుర్ధి, చిత్తాచతుర్ధి (మధ్యాహ్నవేళ) |
| భాద్రపద శుద్ధ పంచమి | ఋషిపంచమీ వ్రతం |
| భాద్రపద శుద్ధ షష్ఠి | సూర్య షష్ఠీవ్రతం, పాపాహర షష్ఠి |
| భాద్రపద శుద్ధ సప్తమి | అముక్తా భరణ సప్తమి |
| భాద్రపద శుద్ధ అష్టమి | దూర్వాష్టమీ వ్రతం, జ్యేష్ఠాష్టమి నందాదేవి పూజ |
| భాద్రపద శుద్ధ నవమి | నందనవమివ్రతం, శ్రీమద్భాగవత జయంతి |
| భాద్రపద శుద్ధ దశమి | క్షీరవ్రతారంభం, గజలక్ష్మీవ్రతం, సత్యేష్టకామ తీర్థం పుణ్యదినం |
| భాద్రపద శుద్ధ ఏకాదశి | పరివర్తన ఏకాదశి |
| భాద్రపద శుద్ధ ద్వాదశి | వామనజయతి, కల్కిద్వాదశి (మధ్యాహ్నంవేళ) |
| భాద్రపద శుద్ధ చతుర్ధశి | అనంత పద్మనాభవ్రతం (ఉదయంవేళ) |
| భాద్రపద శుద్ధ పూర్ణిమ | ఉమామహేశ్వర వ్రతం |
| భాద్రపద బహుళపాడ్యమి | మహాలయ పక్షారంభం |
| భాద్రపద బహుళవిదియ | అశూన్య శయన వ్రతం |
| భాద్రపద బహుళతదియ | బృహత్యుమావ్రతం, ఉండ్రాళ్ళతద్దె, బహుళావ్రతం |
| భాద్రపద బహుళ చవితి | సంకష్టహర చతుర్ధీ వ్రతం |
| భాద్రపద బహుళ షష్ఠి | చంద్రషష్ఠీ వ్రతం, కపిలాష వ్రతం |
| భాద్రపద బహుళ అష్టమి | రుద్రాష్టమీ వ్రతం, మధ్వాష్టమి |
| భాద్రపద బహుళ నవమి | అవిధనా నవమీ శ్రాద్ధః |
| భాద్రపద బహుళ ఏకాదశి | ఇందిరైకాదశి |
| భాద్రపద బహుళ ద్వాదశి | యతీనాం మహాలయ |
| భాద్రపద బహుళ త్రయోదశి | గజచ్ఛాయ |
| భాద్రపద బహుళ అమావాస్య | మాధవ తీర్థం పుణ్యదినం మహాలయ అమావాస్య |

## ఆశ్వయుజమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| ఆశ్వయుజశుద్ధపాడ్యమి | శ్రీదేవీ నవరాత్రులు ప్రారంభం, తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలు ప్రారంభం (కలశస్థాపన ఉదయంవేళ) |
| ఆశ్వయుజశుద్ధ విదియ | ప్రీతి విదియ |
| ఆశ్వయుజశుద్ధ తదియ | స్తన్యవృద్ధి గౌరీవ్రతము (మధ్యాహ్నవేళ) |
| ఆశ్వయుజశుద్ధ పంచమి | ఉపాంగ లలితా గౌరీవ్రతం |
| ఆశ్వయుజశుద్ధ షష్ఠి | మూలా సరస్వతీ పూజ |
| ఆశ్వయుజశుద్ధ సప్తమి | సత్యనారాయణ తీర్థం పుణ్యదినం |
| ఆశ్వయుజశుద్ధ అష్టమి | దుర్గాష్టమి, సత్యపరాక్రమ తీర్థపుణ్యదినం (ఉదయంవేళ) |
| ఆశ్వయుజశుద్ధ నవమి | మహానవమి, సువాసినీపూజ |
| ఆశ్వయుజశుద్ధ దశమి | విజయదశమి, బుద్ధజయంతి(సాయంవేళ) శమీపూజ, (మధ్యాహ్నవేళ) |
| ఆశ్వయుజశుద్ధ ఏకాదశి | ద్విదళ వ్రతారంభం, పాపాంకుశైకాదశి |
| ఆశ్వయుజశుద్ధ ద్వాదశి | గోద్వాదశి, పద్మనాభ ద్వాదశి |
| ఆశ్వయుజశుద్ధ చతుర్ధశి | కోజాగరీ వ్రతం (అర్ధరాత్రివేళ) |
| ఆశ్వయుజశుద్ధ పూర్ణిమ | కౌమదిపూజ, దాన ఫలవ్రతం, శ్రీవిద్యా శంకర భగవచ్ఛోణారాధనం, శ్రీ వాల్మీకి జయంతి |
| ఆశ్వయుజబహుళ తదియ | చంద్రోదయ గౌరీవ్రతం, అట్లతద్దె |
| ఆశ్వయుజబహుళ చవితి | సంకష్టహర చతుర్ధశీ వ్రతం |
| ఆశ్వయుజబహుళ ఏకాదశి | రమ్యైకాదశి |
| ఆశ్వయుజబహుళ ద్వాదశి | గోవత్సద్వాదశి (ప్రదోషవేళ) |
| ఆశ్వయుజబహుళ త్రయోదశి | ధనత్రయోదశి ( చంద్రోదయవేళ) |
| ఆశ్వయుజబహుళ చతుర్దశి | యమ తర్పణం నరకచతుర్ధశీ |
| ఆశ్వయుజబహుళ అమావాస్య | ధనలక్ష్మీపూజ, ఇంద్రపూజ, దీపావళి, కేదారవ్రతం, ఘూర్జరాణాం సంవత్సరాది (ప్రదోషవేళ) |

## కార్తీకమాసం - పండగలు, పర్వదినాలు



| | |
|---|---|
| కార్తీకశుద్ధ పాడ్యమి | బలిపాడ్యమి, ఆకాశదీపం ప్రారంభం |
| కార్తీకశుద్ధ విదియ | యమ పూజ, ధన్వంతరీ ద్వాదశీ, భగినీ హస్తభోజనం (అపరాహ్నవేళ) |
| కార్తీకశుద్ధ తదియ | త్రిలోచనగౌరీ వ్రతం |
| కార్తీకశుద్ధ చవితి | నాగులచవితి, వాల్మీకపూజ |
| కార్తీకశుద్ధ పంచమి | నాగపంచమి |
| కార్తీకశుద్ధ షష్ఠి | అగ్నిపూజా మహాషష్ఠి భౌమవారవ్రతం |
| కార్తీకశుద్ధ సప్తమి | యాజ్ఞవల్క్య జయంతి |
| కార్తీకశుద్ధ అష్టమి | గోష్ఠాష్టమీవ్రతం |
| కార్తీకశుద్ధ నవమి | అక్షయనవమీ వ్రతం కృతయుగాది |
| కార్తీకశుద్ధ దశమి | సత్యసర తీర్థంపుణ్యదినం |
| కార్తీకశుద్ధ ఏకాదశి | వేదనిధి తీర్థం పుణ్యదినం, ఉత్థానైకాదశి, భీష్మైకాదశి |
| కార్తీకశుద్ధ ద్వాదశి | యోగీశ్వర ద్వాదశీ, చిలుకు ద్వాదశీ, క్షీరాబ్ధి పూజా చాతుర్మాస్యవ్రతం సమాప్తి |
| కార్తీకశుద్ధ చతుర్దశి | తులసీ వివాహం, వైకుంఠ చతుర్దశీ (అరుణోదయవేళ) |
| కార్తీకశుద్ధ పూర్ణిమ | జ్వాలాతోరణం, వ్యాసపూర్ణిమ, సింధూస్నానపుణ్యదినం, కార్తీక పౌర్ణమి, గురునానక్ జయంతి, పౌర్ణమినోములు (ఉసిరికపూజ) |
| కార్తీకబహుళ విదియ | చాతుర్మాస్య ద్వితీయా |
| కార్తీకబహుళ తదియ | భగవాన్ సత్యసాయి బాబా జన్మదినం, త్రేతాయుగాంతం |
| కార్తీకబహుళ చవితి | సంకష్టహర చతుర్దశీ వ్రతం, విద్యానిధి తీర్థంపుణ్యదినం |
| కార్తీకబహుళ సప్తమి | సావిత్రీ కల్పాదిః, భానుసప్తమి |
| కార్తీకబహుళ అష్టమి | ఇంద్ర సావర్ణిక మన్వాదిః కాలాష్టమి (ప్రదోషవేళ) |
| కార్తీకబహుళ నవమి | శ్రీ ఈశ్వరమ్మ ఆరాధన |
| కార్తీకబహుళ ఏకాదశి | ఉత్పత్తికైకాదశి, గురు ఏకాదశి |
| కార్తీకబహుళ ద్వాదశి | గోవత్స ద్వాదశి |
| కార్తీకబహుళ త్రయోదశి | యమప్రీతి దీపదానం, మాసశివరాత్రి ధన్వంతరీ జయంతి |
| కార్తీకబహుళ చతుర్దశి | పద్మనాభ తీర్థం పుణ్యదినం కృష్ణాంగారక చతుర్దశీ |
| కార్తీకబహుళ అమావాస్య | |





## మార్గశిరమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| మార్గశిర శుద్ధ షష్ఠి | శ్రీసుబ్రహ్మణ్యషష్ఠి, సంహార షష్ఠి చంపాషష్ఠి |
| మార్గశిర శుద్ధ సప్తమి | మిత్ర సప్తమీ, నందా సప్తమి |
| మార్గశిర శుద్ధ అష్టమి | కాలభైరవాష్టమి |
| మార్గశిర శుద్ధ నవమి | ప్రళయ కల్పాదిః |
| మార్గశిర శుద్ధ దశమి | సత్యనిధి తీర్థం పుణ్యదినం |
| మార్గశిర శుద్ధ ఏకాదశి | మోక్షైకాదశి సత్యనాథతీర్థం పుణ్యదినం, గీతాజయంతి |
| మార్గశిర శుద్ధ ద్వాదశి | మత్స్య ద్వాదశి, వాసుదేవత ద్వాదశి, అఖండ ద్వాదశి |
| మార్గశిర శుద్ధ త్రయోదశి | హనుమాన్ వ్రతం |
| మార్గశిర శుద్ధ చతుర్దశి | పాషాణ చతుర్దశీ |
| మార్గశిర శుద్ధ పూర్ణిమ | దత్తాత్రేయ జయంతి, చంద్రపూజ (ప్రదోషవేళ) |
| మార్గశిర బహుళ విదియ | పరశురామ జయంతి |
| మార్గశిర బహుళ సప్తమి | త్రిసోష్టకాం |
| మార్గశిర బహుళ అష్టమి | కాలభైరవ అష్టమి |
| మార్గశిర బహుళ నవమి | ధనుర్మాసారంభం |
| మార్గశిర బహుళ ఏకాదశి | సఫలైకాదశి |
| మార్గశిర బహుళ ద్వాదశి | రఘునాథ తీర్థం పుణ్యదినం |
| మార్గశిర బహుళ చతుర్దశి | సంకష్టహర చతుర్దశీ వ్రతం |
| మార్గశిర బహుళ అమావాస్య | సంక్రాంతి (మకరసంక్రమణ) మార్గశిర మాసం లేక పుష్య మాసములలో వచ్చును. |

## పుష్యమాసం - పండగలు, పర్వదినాలు

(మకర సంక్రాంతి ఉత్తరాయణ పుణ్యకాలము)

| | |
|---|---|
| పుష్య శుద్ధ తదియ | సావిత్రీ గౌరీవ్రతం |
| పుష్య శుద్ధ షష్ఠి | తుళ్వషష్ఠి, సుబ్రహ్మణ్య పూజ |
| పుష్య శుద్ధ అష్టమి | బుధాష్టమి, రుద్రాష్టమీ (అపరాహ్నవేళ) |
| పుష్య శుద్ధ ఏకాదశి | వైకుంఠ ఏకాదశి, నందైకాదశి, పుత్రదైకాదశి, రైవత మన్వాది ముక్కోటి ఏకాదశి |
| పుష్య శుద్ధ ద్వాదశి | కూర్మద్వాదశి, రఘూత్తమ తీర్థర పుణ్యదినం |
| పుష్య శుద్ధ చతుర్దశి | సావిత్రి గౌరీవ్రతం |
| పుష్య బహుళ చవితి | సంకష్టహర చతుర్థశీవ్రతం |
| పుష్య బహుళ పంచమి | శ్రీ త్యాగరాజ స్వామి ఆరాధన |
| పుష్య బహుళ షష్ఠి | సత్యకామతీర్థర పుణ్యదినం |
| పుష్య బహుళ సప్తమి | నరహరితీర్థరపుణ్యం (తిస్రోష్టకా) |
| పుష్య బహుళ ఏకాదశి | కళ్యాణ్యేకాదశి,న షట్తిలైకాదశి |
| పుష్య బహుళ చతుర్దశి | విద్యాదీశ తీర్థర పుణ్యదినం |
| పుష్య బహుళ అమావాస్య | పురందరదాసు పుణ్యదినం, చొల్లంగి అమావాస్య. |

## మాఘమాసం - పండగలు, పర్వదినాలు



| | |
|---|---|
| మాఘ శుద్ధ పాడ్యమి | మాఘస్నానారంభము (అరుణోదయవేళ) |
| మాఘ శుద్ధ చవితి | తిలచతుర్దశి,కుందచతుర్దశి (అపరాహ్నవేళ) |
| మాఘ శుద్ధ పంచమి | మదన పంచమి, వసంత పంచమి, శ్రీ పంచమి |
| మాఘ శుద్ధ సప్తమి | రథసప్తమి, సూర్యచంద్రుల వ్రతం, అబోజ్యార్క వ్రతం వైవస్వత మన్వాదిః శ్రీభావనాఋషి స్వామి కళ్యాణము (అరుణోదయవేళ) |
| మాఘ శుద్ధ అష్టమి | భీష్మ అష్టమీ వ్రతం, భీష్మ తర్పణం(మధ్యాహ్నవేళ) |
| మాఘ శుద్ధ నవమి | మధ్వనవమి, ఆనంద తీర్థర పుణ్యదినం |
| మాఘ శుద్ధ ఏకాదశి | కామదైకాదశి, జయైకాదశి, భీష్మ ఏకాదశి, భీష్మ పంచకవ్రతము |
| మాఘ శుద్ధ ద్వాదశి | భీష్మ ద్వాదశి, తిలద్వాదశి |
| మాఘ శుద్ధ త్రయోదశి | వరహకల్పాదిః |
| మాఘ శుద్ధ చతుర్దశి | బ్రహ్మపూజ |
| మాఘ శుద్ధ పూర్ణిమ | సింధూస్నాన పుణ్యదినం, మహామాఘీ |
| మాఘ బహుళ చవితి | సంకష్టహర చతుర్దశీ వ్రతం |
| మాఘ బహుళ అష్టమి | తిస్రోష్టకాః |
| మాఘ బహుళ చతుర్దశి | మహాశివరాత్రి (అర్ధరాత్రివేళ) |
| మాఘ బహుళ అమావాస్య | ద్వాపరయుగాది |

## ఫాల్గుణమాసం - పండగలు, పర్వదినాలు

| | |
|---|---|
| ఫాల్గుణ శుద్ధ విదియ | సత్యబోధ తీర్థర పుణ్యదినం |
| ఫాల్గుణ శుద్ధ తదియ | వాదిరాజస్వామిపుణ్యదినం శాలివాహనశకసంవత్సరాది |
| ఫాల్గుణ శుద్ధ చవితి | శాంత చతుర్థశి, వ్యాసరాయగళ పుణ్యదినం పుత్ర గణపతి వ్రతం |
| ఫాల్గుణ శుద్ధ షష్ఠి | సత్యవ్రత తీర్థర పుణ్యదినం |
| ఫాల్గుణ శుద్ధ అష్టమి | శ్రీ స్వామి బోధానంద జయంతి |
| ఫాల్గుణ శుద్ధ ఏకాదశి | ధాత్రైకాదశి, ఆమలక్యైకాదశి |
| ఫాల్గుణ శుద్ధ ద్వాదశి | నృసింహద్వాదశి, ఆమలకపూజ |
| ఫాల్గుణ శుద్ధ చతుర్దశి | కామదహనం |
| ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ | హోలికోత్సవం, మధన పూర్ణిమ, బ్రహ్మసావర్ణి రమన్వాదిః (ప్రదోషవేళ) |
| ఫాల్గుణ బహుళ పాడ్యమి | వంసతోత్సవం (సూర్యోదయవేళ) |
| ఫాల్గుణ బహుళ విదియ | చాతుర్మాస్యాద్వితీయ, బ్రహ్మకల్పాదిః |
| ఫాల్గుణ బహుళ తదియ | శ్రీ అయ్యప్పస్వామి జయంతి |
| ఫాల్గుణ బహుళ అష్టమి | తిస్రోష్టకాః |
| ఫాల్గుణ బహుళ ఏకాదశి | సౌమ్యైకాదశి, పాపమోచన్యైకాదశి |
| ఫాల్గుణ బహుళ ద్వాదశి | శ్రీరామకృష్ణ పరమహంస జయంతి |
| ఫాల్గుణ బహుళ త్రయోదశి | శ్రీ బ్రహ్మంగారి కళ్యాణం |
| ఫాల్గుణ బహుళ చతుర్దశి | స్వామి దయానంద జయంతి |



## దశావతార ఉద్భవ తిథులు (వరాహపురాణము)

**1. శ్రీ మత్స్య జయంతి :**

చైత్రశుక్ల తృతీయాతిథి, మధ్యాహ్న సమయము గడిచిన తరువాత కృతమాలా తీర్థ స్థలమందు.

**2. శ్రీ కూర్మజయంతి :**

వైశాఖ శుక్లపూర్ణిమ, సాయంకాలము సముద్రమందు

**3. శ్రీ వరాహ జయంతి :**

భాద్రపద శుక్లపంచమి, మధ్యాహ్న సమయము గడిచిన తరువాత హరిద్వార మందు (వరాహక్షేత్రము)



**4. శ్రీ నృసింహ జయంతి :**

వైశాఖ శుక్ల చతుర్దశి, సాయంకాల సమయమున మూలస్థానము.

**5. శ్రీ వామన జయంతి :**

భాద్రపద శుక్ల ద్వాదశీ, మధ్యాహ్న సమయమున ప్రయాగ యందు

**6. శ్రీ పరుశురామ జయంతి :**

వైశాఖ శుక్ల తృతీయ, మధ్యాహ్న సమయమున జమనియా గ్రామమందు

**7. శ్రీరామ జయంతి :**

చైత్రశుక్ల నవమి, మధ్యాహ్న సమయము అయోధ్య యందు

**8. శ్రీ కృష్ణ జయంతి :**

భాద్రపద కృష్ణాష్టమి మధ్యరాత్రి మధుర యందు

**9. శ్రీ బుద్ధ జయంతి :**

పౌషశుక్ల సప్తమీ, సాయంకాలము గయా క్షేత్రమందు

**10. శ్రీకల్కి జయంతి :**

భాద్రపద శుక్ల తృతీయా సాయంకాలము సంభళ గ్రామమునందు.

## చైత్రమాసం



**శ్రీరామనవమి :** చైత్రశుక్ల నవమి యందు, పునర్వసు నక్షత్రాన మధ్యాహ్నవేళ కర్కాటక లగ్నమందు, సూర్యుడు మేషమందుండగా ఐదు గ్రహములుచ్ఛ స్థానము లందుండగా శ్రీరాముని ఆవిర్భావం.

శ్రీరామనవమినాడు కొందరు ఉపవాస వ్రతం కూడా చేస్తారు. రామ మంత్రోపాసకులు అనివార్యంగా ఉపవాసముండాలని శాస్త్రవచనం. ముందురోజు (అష్టమి) రాత్రి భోజనం చేయకుండా, ఏకభుక్తముచేసి, మరురోజు (నవమినాడు) రామారాధనచేయాలి.

ఈ రోజున శ్రీరాముని ప్రతిమకు షోడశోపచారపూజ చేయడం సంప్రదాయం.

**శుక్రమౌఢ్యత్యాగం :** ఈ రోజుతో మూఢమి తొలగిపోతుంది. ఇటుపై శుభకార్యాలు చేయవచ్చు.

**మేషసంక్రమణం :** ఈ రోజున సూర్యుడు ప్రథమరాశియైన మేషంలో ప్రవేశిస్తున్నాడు. పవిత్రమైన పర్వదినమిది. సౌరమానం ప్రకారం ఈ రోజు కొత్త సంవత్సరానికి ఆరంభం.

**శనిత్రయోదశి :** ఈరోజున శనికి అభిషేకాదులు చేస్తే శనిదోషం తొలగు తుంది. శివునకు అభిషేకం చేసినా, గ్రహదోషాలు శాంతిస్తాయి.

**అక్షయతృతీయ :** ఈ రోజున సింహాచలంలో వరాహలక్ష్మి నృసింహస్వామికి చందనోత్సవం వైభవంగా జరుగుతుంది. అంతేకాక పరశురాముడు అవతరించిన పుణ్యతిధి ఇది.

**శ్రీ శంకర జయంతి :** వైశాఖశుద్ధ పంచమి జగద్గురువు ఆదిశంకరుల జన్మతిధి శంకరుని అవతారమైన ఆదిశంకరుని స్మరణ, అర్చన, వారి గ్రంథపఠనం భారతీయుల కర్తవ్యం.

**శ్రీ త్యాగరాజ స్వామి జయంతి :** నాదబ్రహ్మ త్యాగరాజస్వామివారు పుట్టిన తిధి (వైశాఖశుద్ధషష్ఠి) భక్తయోగి, నాదయోగి త్యాగరాజు సంగీత, భక్తి ప్రపంచంలో ధృవతార. ఆ పరమభాగవతుని స్మరణ భగవత్ప్రీతికరం.

**గంగా జయంతి :** వైశాఖశుద్ధ సప్తమినాడు గంగ ఆవిర్భవించిందని పురాణాలు చెప్తున్నాయి. పరమ పావనియైన గంగాదేవిని గంగానది యందుగానీ, గంగాజల కలశానగానీ అర్చించితే ఆ జగజ్జనని కృప లభిస్తుంది.



## వైశాఖమాసం

పవిత్రమైన మాసాలలో వైశాఖం ఒకటి. దీనిని 'మాధవమాసం' అని కూడా అంటారు. విష్ణుప్రీతికరమైన రూపం ఇది.

**అక్షయతృతీయ :** ఇదిపవిత్ర తిథి. ఈరోజున గంగాస్నానం, నదీస్నానం సముద్రస్నానం శ్రేయస్కరం.

అంతేకాక శ్రీకృష్ణునకు (విష్ణువునకు) ఈ రోజున చందనం పూయడం చాలా శుభఫలాలనిస్తుందనీ, విష్ణుసాలోక్యాన్ని ప్రసాదిస్తుందని ధర్మశాస్త్రవిషయం.

**యఃకరోతి తృతీయాయాం కృష్ణం చందన భూషితం ।**
**వైశాఖస్య సితేపక్షే సయాత్యచ్యుతమందిరమ్ ॥**

వైశాఖశుక్ల తృతీయనాడు నారాయణునికి చందనలేపనం చేయడం వల్ల విష్ణు మందిర వాసం లభిస్తుంది. ఈ కారణం చేతనే సింహాచల క్షేత్రంలో చందనో త్సవం ఈ తిథిని జరుగుతుంది.



ఈ రోజున కృతయుగముకు ఆది. పితృకర్మలుచేసే వాళ్లు ఈ రోజున పిండరహితముగ యాగాది శ్రాద్ధం చేయాలనీ, లేదా తిలతర్పణమైనా చేయాలని ధర్మశాస్త్ర నిర్ణయం.

ఈరోజున "ఉభయకుంభదానం" (నీటి కుండదానం) చేయడం మంచిది.

చలువ కలిగించే పదార్థాలు – పానకం, వడపప్పు వంటివి విష్ణువునకు, నివేదించడం; మామిడిపళ్లు, విసనకర్ర విష్ణుప్రీతిగా యోగ్యవిప్రునకు దానం చేయడం మంచిది. ఈదినమే పరశురామ జయంతి కూడా.

**ఆదిశంకర జయంతి :** భారతీయ సనాతన ధర్మాన్ని ప్రతిష్ఠ చేసిన వ్యాసదేవుని తరువాత, అంతటి పూజ్యులు ఆదిశంకరులు. పాషండాది బౌద్ధ మతాల నుండి, మన మతంలో చెలరేగిన శైవవైష్ణవ భేదాల దాడులనుండి సనాతనమైన వేదమతాన్ని సంరక్షించిన మహాత్ముడు సాక్షాత్తూ శంకరుని అవతారం.

**శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయమ్ ।**
**నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్ ॥**

అని ఈ జగద్గురువును స్తుతిస్తారు ఉపనిషత్తులకు, భగవద్గీతకు, బ్రహ్మ సూత్రాలకు, విష్ణుసహస్రనామాలకు భాష్యం వ్రాసి, అనేక స్తోత్రగ్రంథాలు, వేదాంత గ్రంథాలు రచించి, "ప్రపంచసారతంత్రం" అనే మహాగ్రంథాన్ని జగత్తుకు ప్రసాదించి ఆ సేతు శీతాచలం ప్రయాణించి సనాతన ధర్మప్రతిష్ఠాపన చేసిన ఆదిశంకరా చార్యులని స్మరించడం, ఆరాధించడం (తిథిని) ప్రతిభారతీయునికర్తవ్యం.

**త్యాగరాజ జయంతి :** నాదోపాసక చక్రవర్తి మహా వాగ్గేయకారులు త్యాగరాజులవారు జన్మించిన శుభతిథి.

**గంగోత్పత్తి, విద్యారణ్యస్వామి జయంతి :** గంగాదేవి జన్మించిన తిథిరోజున గంగ పూజ గంగాస్నానం ఫలప్రదం.

ఇదే తిథినాడు విద్యారణ్య స్వామి జన్మించారు. ఆదిశంకరుల పద్ధతిలో పతనమైన మన మతాన్ని క్లుచ్ఛుల ఆధిపత్యం నుండి కాపాడిన సిద్ధ పురుషులు, భారతజాతి ఋణపడిన మహాత్ముడు. వేదాలకు భాష్యం వ్రాయడమేకాక, హరిహర బుక్కరాయలద్వారా విద్యానగర (విజయనగర) రాజ్యాన్ని ప్రతిష్ఠించారు. ఆదిశంకరుల చరిత్రను "శంకరవిజయం"పేరుతో రచించారు.

**ఏకాదశి :** వైశాఖశుక్ల ఏకాదశి విష్ణువునకు ప్రీతికరమైన ఏకాదశుల్లో ఒకటి. మహిమాన్వితమైనది. ఈ రోజున విష్ణుసహస్రనామ పారాయణ వంటివి మహాఫల ప్రదం. మరుసటిరోజు వచ్చే ద్వాదశి కూడా దివ్యమైన తిథి.

**వైశాఖమాసే ద్వాదశ్యాం పూజయేన్మధు సూదనం ।**
**అగ్నిష్టోమ మవాప్నోతి సోమలోకం సగచ్ఛతి ॥**

వైశాఖమాస ద్వాదశినాడు మధుసూదనుని పూజించినవారికి, యజ్ఞాలు చేసిన ఫలం లభిస్తుంది అని ధర్మశాస్త్ర వచనం.

**శ్రీ నృసింహజయంతి :** దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు నారాయణుడు నృసింహస్వామిగా ఆవిర్భవించిన దివ్యదినమిది. నృసింహోపాసన సర్వశ్రేష్ఠమైనది.

ఈరోజున ప్రహ్లాదచరిత్ర పఠనం, నరసింహార్చన చేయాలి. సర్వగ్రహ దోషాలు పోగొట్టి, జ్ఞానానందాలను ప్రసాదించేది నరసింహార్చన.

**మహావైశాఖీ, అన్నమాచార్య జయంతి :** వైశాఖపూర్ణిమికి చాలా వైశిష్ట్యం ఉంది. ఈ రోజున విష్ణుపూజ తప్పనిసరిగా చేయాలి. జలకుంభదానాదులు ఈ దినాన విశిష్టఫలప్రదం. ఈ పుణ్యతిథినాడే మహావాగ్గేయ కారుడు, పదకవితామహుడు అన్నమాచార్య జన్మించాడు. 32,000 కీర్తనలతో తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించిన ఈ మహాత్ముని రచనలు వేదవేదాంత పురాణాది విషయాలకీ, అద్భుత కవితా రీతులకీ నిధులు.

శ్రీనివాసుని నందకాంశంగా జన్మించిన ఈ సంకీర్తనాచార్యులు మనందరికీ పూజ్యులు. విష్ణుధర్మాన్ని వేనోళ్ల చాటిన ధన్యాత్ముడాయన.

**శ్రీ హనుమజ్జయంతి :** రుద్రాంశసంభూతుడైన ఆంజనేయుని జన్మదినమిది. సర్వాభీష్టప్రదాయకుడైన ఈ స్వామిని సింధూరాదులతో అర్చించి, స్వామి అనుగ్రహాన్ని పొందడానికి ఈతిథి విశిష్టమైనది.





## జ్యేష్ఠమాసం

**రంభా తృతీయ :** ఈ రోజున పార్వతీదేవి బంగారు ప్రతిమను పూజించుతారు. దానాదులకు శుభకాలం. ఈ దినానికి తరువాతి దినం–చతుర్థినాడు 'ఉమా' నామంతో అమ్మవారిని అర్చించాలి.

**నిర్జల ఏకాదశి, దశహర దశమి :** ఈ రోజు ప్రాతఃకాలాన దశమీ తిథి ఉన్నది. ఈ దశమినాడు గంగాస్నానం, గంగాస్మరణం శ్రేష్ఠం. ఇది దశపాపాలను హరించుతుంది. గంగాదేవిని దశవిధ కుసుమాలతో, దశఫలాలతో అర్చించి దశాంగ ధూపమివ్వాలి.

తదుపరి ఏకాదశి ఉన్నది. ఈ ఏకాదశి చాలా విశేషమైనది. పగలంతా నీరుకూడా తీసుకోకుండా (నిత్యమూ చేసే ఆచమనాదులకు జలం తీసుకోవచ్చు) ఉపవసించాలి. మరునాటి ద్వాదశి రోజున త్రివిక్రమమూర్తిని పూజించి, దానాదులు చేసి (సువర్ణమూ, చక్కెర కలిపిన ఉదకకుంభాన్ని – నీటికలశను–దానం చేయడం శ్రేష్ఠం) పారణచేయాలి. ఈ ఏకాదశీవ్రతాన్ని ఆచరించితే 12 ఏకాదశులు చేసిన ఫలం లభిస్తుంది.

**గంగాపూజ :** దశమినాడేకాక ఈ రోజున (జ్యేష్ఠశుక్ల ద్వాదశి) కూడా గంగాపూజ చేయాలి. గంగాతీరంలో పూజించవచ్చు. లేదా ఇంట్లోనే గంగాజలం నిండిన కలశాన్ని పూజించాలి. షోడశోపచారాలతో గంగను ఆరాధించిన వారికి విశేష ఫలం లభిస్తుంది.

"నమోభగవత్యై దశపాపహరాయై గంగాయై, నారాయణ్యై, రేవత్యై, శివాయై దక్షాయై అమృతాయై విశ్వరూపిణ్యై నందిన్యైతే నమోనమః" అనే మంత్రంతో గంగను స్తోత్రించాలి.

**మిథున సంక్రాన్తి పుణ్యకాలం :** ఈ దినాన సూర్యుడు మిథునరాశిలో ప్రవేశిస్తున్నాడు. ఈ పుణ్యకాలంలో చేసే జప, ధ్యాన, పూజా, దాన, పారాయణాదులకు విశేషఫలముంటుంది.

ఈ దినాన వృషభాన్ని పూజించటం పుణ్యమని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి......చేయాలి. ప్రదోషవేళ "దీపపూజ" దీనినే లక్ష్మీపూజగా కూడా వ్యవహరిస్తారు. సాధ్యమైతే పగలు ఉపవసించి, సాయంత్రం దీపారాధన అనంతరం విందును ఆరగించవచ్చు. బాలురు, వృద్ధులు, అనారోగ్యవంతులు ఉపవసించ నవసరంలేదు.

## ఆషాఢమాసం

**జగన్నాథయాత్ర :** పురుషోత్తమక్షేత్రం (పూరీ) లో జగన్నాథ బలభద్ర సుభద్రలకు రథయాత్ర. ఆధ్యాత్మికంగా చాలా విశిష్టమైన ఈ రథయాత్ర ప్రఖ్యాతి గాంచినది. ఈ రోజునే శ్రీరామునికి రథోత్సవమని శాస్త్రవచనం. విష్ణువునకు ప్రీతికరమైనది.

**కుమారషష్ఠి :** ప్రతిమాసంలోనూ శుద్ధషష్ఠి సుబ్రహ్మణ్యునకు ప్రీతికరమైనది. ప్రత్యేకించి ఈ మాసంలోవచ్చే ఈ షష్టినాడు కుమారస్వామి ఆరాధన చేయడం స్వామి అనుగ్రహాన్ని కలిగిస్తుంది.

**తొలి ఏకాదశి (శయనైకాదశి)చాతుర్మాస్యారంభం :** ఆషాఢమాసంలో ఏకభుక్తవ్రతం, ఒంటిపూజ భోజనం. చేయడం ఉత్కృష్టం. ఈ ఏకాదశినాడు మాత్రమూ ఉపవాసం ఉండడం శ్రేష్టం. ఈ ఏకాదశినే 'విష్ణుశయనోత్సవం' జరుపుతారు. అనేక ఉపకరణాలతో కూడిన తల్పమందు, శేషశాయి అయిన లక్ష్మీనారాయణుని మూర్తిని నానావిధ ఉపచారాలతో పూజించాలి.

**త్వయి సుప్తే జగన్నాథ! జగత్సుప్తం భవేదిదం ।**
**విబుద్ధే త్వయి బుధ్యేత తత్సర్వం స చరాచరమ్ ॥**

"ఓ జగన్నాథ! నీవు నిద్రించ, జగము నిద్రించును. నీవు మేల్కాంచిన జగము తెలివొందును" అని ప్రార్థించి, ఉపవాస జాగరణలతో ఈ ఏకాదశిచేయాలి. మరుసటి



దినాన ప్రాతఃకాలాన పునఃపూజచేసి, త్రయోదశినాడు గీతనృత్య వాద్యాదికాలు సమర్పించాలి. ఇది మూడుదినాలు చేయవలసిన వ్రతం.

ఈ రోజునుండి చాతుర్మాస్యవ్రతారంభం అవుతుంది. శివ, విష్ణుభక్తులు తమ శక్త్యనుసారం చేయదగిన వ్రతమిది.

ఈ ఏకాదశినుండి, కార్తీకశుద్ధ ఏకాదశి వరకు (4నెలలు) చేసే వ్రతం చాతుర్మ్యవ్రతం. గుడం, తైలం వంటివి విడిచి పెడతానని సంకల్పించుకోవడం. విష్ణువునకు నివేదన చేయని ఆహారం, కాల్చివండినవి, మాంసాహారం, పుచ్చకాయ, గుమ్మడికాయ, చెరకు, కొత్త ఉసిరిక, చింతపండు, మంచం పైశయనం, పరాన్నం, తేనె, పొట్లకాయ, ఉలవలు, తెల్లఆవాలు, మినుములు ఇవి ఈ నాలుగు నెలల్లో తీసుకోకుండా భగవత్పూజలో గడపడం ఈ వ్రతంలో అవసరం.

**వామన పూజ :** ఆషాఢ శుక్ల ద్వాదశినాడు వామనమూర్తిని పూజించితే యజ్ఞఫలం లభిస్తుంది.



**వ్యాస పూర్ణిమ (గురుపూర్ణిమ) :** కర్కాటక సంక్రమణం, దక్షిణాయనం ప్రారంభం. ఈ రోజు వేదవ్యాసులవారి జన్మదినం. వ్యాస దేవుని పూజించాలి. వారి వారి గురువులను అర్చించాలి. నిజమైన గురుపూజ ఈరోజే. చదువుచెప్పే గురువుని, మంత్రోపదేశం చేసిన గురువుని యథోచితంగా సత్కరించి అర్చించాలి. గురువులోనే వ్యాసదేవుని భావించి ఆరాధించాలి. వారివారి గురుపరంపరని పూజించాలి.

వ్యాసకృతమైన పురాణాది గ్రంథాల పఠనం ఈ రోజున అవశ్యకం. నారాయణ, సదాశివ, బ్రహ్మ, వశిష్ఠ, శక్తి, పరాశర, వ్యాస, శుక, గౌడపద, గోవింద భగవత్పాద, శంకరాచార్యులను ఆరాధించాలి.

యతులైనవారు ఈరోజున చాతుర్మాస్యదీక్ష ప్రారంభిస్తారు. ఒకేచోట స్థిరంగా ఈ నాలుగు మాసాలూ ఉండాలి. సన్యాసి, నాలుగు మాసాలూ కుదరనపుడు రెండు మాసాలైన ఏకస్థలాన నివసించాలి.

**"చాతుర్మాసం ద్విమాసం వా సదైకత్రైవ సంవసేత్"** అని ధర్మశాస్త్రం.

శ్రీకృష్ణుని, వ్యాసుని, జైమిని సుమంత వైశంపాయన పైలాది వ్యాసశిష్యులను, శ్రీ ఆదిశంకర, పద్మపాద, విశ్వరూప, తోటక, హస్తామలకాచార్యులను ఆవాహనచేసి పూజించాలి. ఈదినాన్నే సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశిస్తున్నాడు. ఇక్కడి నుండి దక్షిణాయనం ప్రారంభమౌతుంది. ఈ రోజు కర్కాటక సంక్రమణం, విష్ణుపూజ, దానాదికాలు, జపతపాలు, విష్ణు సహస్రనామ పారాయణం సత్ఫలప్రదం.

## శ్రావణ మాసం

**శ్రావణ మంగళవారం :** ఘనాసినులు పెళ్లయిన మొదటి ఐదు సంవత్సరాలు సకల మంగళములు కలగవలెనని గౌరీ అమ్మవారి నుద్దేశించి చేసేవ్రతములు.

**శ్రావణ సోమవారం : తత్రాపి దుర్లభం మన్యేనభో మాసేందువాసరే,** శ్రావణసోమవారాలు పూజ చేస్తే మాత్రికన్నాఫలితం ఎక్కువని శాస్త్రవచనం.

**వరలక్ష్మి వ్రతం :** శ్రావణమాసంలో వచ్చే ముఖ్యమైనపర్వమిది. శ్రావణ పూర్ణిమ ముందువచ్చే శుక్రవారం శ్రీ మహాలక్ష్మిని "వరలక్ష్మి" పేరుతో అర్చించడం మన సంప్రదాయం. సర్వవిధ సంపదలను అనుగ్రహించే వ్రతమిది. కలశాన వరలక్ష్మిని ఆవాహనచేసి షోడశోపచారాలతో పూజించడం ఈ వ్రతాచరణ విధి. స్త్రీలందరూ లక్ష్మీమయంగా అలంకరించుకొని, అమ్మవారిని అర్చిస్తారు.

**ఉపాకర్మ, వేదారంభం :** ఈ రోజు నూతన యజ్ఞోపవీతధారణ చేసి జప, అర్చనాదులు నిర్వహిస్తారు.

**శ్రావణ పూర్ణిమ :** భ్రాతృక్షేమకారకంగా "రక్షాబంధన" పర్వం కూడా కొన్ని ప్రాంతాలవారి ఆచారం. నారాయణుని విద్యామూర్తి 'హయగ్రీవుని' జయంత్సుత్సవం ఈరోజే. విద్యార్థులు తప్పకుండా ఆచరించవలసిన పూజ ఇది.

**శ్రీకృష్ణాష్టమి :** ఇది శ్రీకృష్ణ పరమాత్మ ఆవిర్భవించిన దివ్యతిథి. పదహారు కళల పూర్ణావతారంగా శ్రీ మహావిష్ణువు భూమిపై అవతరించినది అర్థరాత్రివేళ. ఈ రోజు ఉదయాన్నే స్నానాదులు చేసి శ్రీకృష్ణుని షోడోశోపచారాలతో అర్చించడం మహోత్కృష్టం. ఉదయమేకాక రాత్రివేళకూడా ఈ స్వామిని అర్చిస్తారు. కృష్ణునికి ప్రీతిపాత్రమైన సాత్త్వికాహారం-పాలు, పళ్లు, వెన్న, మీగడ మొదలైనవి నివేదన చేసి ఆరాధించాలి. చాలామంది ముగ్గులతో కృష్ణ పాదాలను ఇంటిముందు చిత్రిస్తారు.స్వామికి ఆహ్వానంగా...

బాలకృష్ణ రూపం నుండి అన్ని కృష్ణ రూపాలు ఆరాధనీయాలే. ఇదిశక్తి ప్రధాన పర్వదినం కూడా. కాబట్టి రాత్రివేళ (అర్థరాత్రికూడా) అమ్మవారి స్తోత్రాలను పఠించడమో, ఉపదేశమైన మంత్రాలను జపించడమో మహిమాన్వితం.



## భాద్రమాసం

**వినాయకచవితి :** ఏడాదిలో మహా ప్రధానమైన పర్వదినమిది. మహాగణపతి పార్వతీ తనయుడుగా ఆవిర్భవించిన రోజు. మధ్యాహ్నం చవితి (చతుర్థి) ఉన్న రోజునే "వినాయకచవితి" ని జరుపుకోవాలి.

శాస్త్రోక్తంగా గణపతి ప్రతిమని (మట్టితోగానీలేదా వెండి వంటి లోహాలతో గానీ) అర్చించాలి. దూర్వాలు, బిల్వాలు (మారేడు) గణపతికి ప్రీతికరాలు. కనుక వాటితో అర్చించాలి. అవివేక శాస్త్రంలో చెప్పబడ్డ 21 పత్రాలతో పూజించాలి. ఇవన్నీ ఔషధీయ విలువలున్న పత్రాలు.

గణపతి విద్యాబుద్ధులనిచ్చే వేల్పు. పైగా బాలగణపతి కూడా. కాబట్టే "పిళ్లైయార్" అనే పేరుతో తమిళనాట పూజిస్తారు. ఇంటిల్లిపాదీ ఊరూ వాడా పూజించుకొనే పర్వమిది. కొన్నిచోట్ల నవరాత్రులుచేసే సంప్రదాయమూ ఉంది. ప్రతి ఇంట యథావిధిగా గణపతిని పత్రాలతో పూజించి, ఆయనకు ప్రీతికరంగా ఉండ్రాళ్లు, కుడుములు, వెలగ, అరటి, కొబ్బరి మొదలైన ఫలాలు నివేదించాలి.

ఈ స్వామి ఆరాధన వల్ల అన్ని శుభాలు లభిస్తాయి. గుంజీలు తీయడం ఈయనకి ప్రీతికరం. అత్యంత ప్రధానమైన పర్వదినం వినాయకచతుర్థి. ఈసారి గొప్ప యోగంతో కూడి వున్నదీపండుగ. భాద్రపదశుద్ధ చవితినాడు ప్రణవస్వరూపుడైన గణపతి మధ్యాహ్నవేళ పార్వతీ తనయునిగా ఆవిర్భవించాడు. ఈ చవితి ఆదివారం గానీ,మంగళవారంగానీ వస్తే అది ప్రశస్తం-అని ధర్మశాస్త్రం చెబుతోంది. ఈ ఏడాది మంగళవారం (భౌమవారం) చవితి రావడం ప్రశస్తయోగం.

గణపతిపూజ, ఉపాసనవంటివి ఈ రోజున విశేష ఫలాన్నిస్తాయి. శీఘ్రంగా అనుగ్రహించి అభీష్టాలనిచ్చే దయామయుడు గణపతి. అన్ని ఆటంకాలను

(విఘ్నాలను) ఆపదలను తొలగించే పరతత్త్వం. ఈ రోజున చంద్ర దర్శనమైన దోషపరిహారార్థం గణపతిని పూజించి అక్షతలు శిరస్సున ధరించాలి. అంతేకాక, ఈ క్రింది శ్లోకం చదివితే, చతుర్థి చంద్రదర్శనదోషం పరిహారమవుతుంది.

**సింహః ప్రసేనమవధీః సింహోజాంబవతా హతః।**
**సుకుమారక మారోదీః తవహ్యేషస్య మంతకః॥**

–"సత్రాజిత్తు తమ్ముడైన ప్రసేనుని సింహం చంపింది. దానిని జాంబవంతుడు చంపి ఆ మణిని నీకిచ్చాడు. శోకించాడు సుకుమారకా!" అని జాంబవత్పుత్రుని ఉయ్యాలలో నుంచి దాసిపాడినది. ఇది విన్న తరువాతనే శ్యమంతకమణి అసలు కథ బయటపడింది. శ్రీకృష్ణపరమాత్మ మణిని అపహరించాడనే అపవాదునుండి విముక్తుడయ్యాడు. ఈ శ్లోకపఠనం చేత అపవాద దోషాలు తొలగుతాయని శాస్త్రవచనం.

భాద్రపద శుద్ధపంచమి ఋషిపంచమి, ఈ రోజున ఋషులను స్మరించి అర్చించాలి. అంతేకాక దున్నుట, త్రవ్వుట మొదలైనవి జరగని భూమిలో స్వయంగా పుట్టిన శాకాలను ఆహారంగా స్వీకరించాలి. ఋషిఋణం తీర్చుకొనే పర్వదినమిది.

**ఋషిపంచమి :** ఇది సప్తర్షులకు ప్రీతికరమైనతిథి. బహిష్టులు ఆగిన స్త్రీలు అప్పటివరకూ ఏవైనా తెలిసీ తెలియని దోషాలుంటే తొలిగించేందుకు సప్తర్షుల్నీ వారి పత్నులతో సహా పూజిస్తారు.

**సూర్యషష్ఠి :** సప్తమి కలసిన ఈ షష్ఠి సూర్యప్రీతికరం. ఈ రోజున అభ్యంగస్నానంచేసి సూర్యుని ఆరాధించి పంచగవ్యాలను (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, పేడ, మూత్రం) ప్రాశనంచేస్తే అశ్వమేధం కంటే ఎక్కువ ఫలం కలుగుతుందని శాస్త్రం. పైగా సప్తమితో కూడిన షష్ఠిశ్రేష్ఠం.

ఈ యోగం కలసిన దినమిది. ఈ రోజున సుబ్రహ్మణ్యస్వామిని దర్శించి ఆరాధిదించితే ఎటువంటి పాతకాలైనా నశిస్తాయి.

**కేదారవ్రతం :** భాద్రపదశుక్లాష్టమియందు కేదారేశ్వరుడైన సదాశివుని ఆరాధించి 21 వారాలతో చేసిన ప్రతిసరాన్ని హస్తానధరించి ఉపవసిస్తారు. మరునాటి నుండి విప్రునకు భోజనంపెట్టి, అమావాస్య వరకు క్రతుచరణచేస్తారు. గౌతమా శ్రమంలో ఈ వ్రతాన్ని చేసి గౌరీదేవి శివుని అర్థాభాగాన్ని స్వీకరించినది. అప్పటి నుండి ఈ వ్రతాచరణతో అనేకమంది సుఖసౌభాగ్యాలను పొందారని 'కల్పం'చెప్తోంది.

**సర్వపరివర్తన ఏకాదశి కన్యాసంక్రమణం :** ఆషాఢ ఏకాదశినాడు యోగనిద్రకు సంక్రమించి శ్రీమన్నారాయణుడు ఈ రోజున ప్రక్కకు ఒత్తిగిల్లుతాడని పురాణం.



చాతుర్మాస్యాలలో ఇది ఒక మలుపు. అత్యంత పవిత్రమైన ఈ దినాన సంధ్యాకాలంలో విష్ణువును పూజించి,

**వాసుదేవ జగన్నాథ ప్రాప్తేయం ద్వాదశీ తవ ।**
**పార్శ్వేన పరివర్తస్య సుఖం స్వపిహి మాధవ॥**

అనే మంత్రాన్ని పఠించి ప్రార్థించాలి.

**శ్రవణ ద్వాదశి, వామనజయన్తి :** భాద్రపద శుద్ధద్వాదశి శ్రవణానక్షత్రంతో కూడితే గొప్పయోగముండి, వీలైనవారు భాద్రపద ఏకాదశి, ద్వాదశి రెండు రోజులూ ఉపవాసముండాలి. అందుకు అసమర్థులైనవారు ఏదో ఒక రోజున (ఏకాదశి, లేదు ద్వాదశి) ఉపవసించి విష్ణుపూజ చేయాలి.

ఈరోజున (ద్వాదశి) ఉపవసించి విష్ణువును ఆరాధించిన వారికి ఏకాదశి ఉపవాస పుణ్యంకూడా లభిస్తుందని నారదవచనం.

**ఉపోష్య ద్వాదశీం పుణ్యాం విష్ణు ఋక్షేణసంయుతాం,**
**ఏకాదశ్యుద్భవం పుణ్యం నరఃప్రాప్నోత్యసంశయమ్॥ (నారదోక్తి)**
**ఈ దినాన వామనమూర్తిగ విష్ణువు అవతరించిన తిథి.**
**దేవేశ్వరాయ దేవాయ దేవసంభూతికారిణే**
**ప్రభవే సర్వదేవానాం వామనాయ నమోనమః**
**అని వామదేవుని నమస్కరించి –**
**నమస్తే పద్మనాభాయ నమస్తే జలశాయినే**
**తుభ్యమర్ఘ్యం ప్రయచ్ఛామి బాలవామనరూపిణే**
**నమశ్శార్ఙ్గ ధనుర్బాణ-పాణయే వామనాయచ**
**యజ్ఞభుక్ ఫలదాత్ర చ వామనాయ నమోనమః**

అనే శ్లోకాలతో అర్ఘ్య ప్రదానం చేయాలి.

**అనంతవ్రతం :** భాద్రపదశుద్ధ చతుర్దశి అనంతవ్రతం ఆచరిస్తారు. అనన్త స్వరూపుడైన నారాయణుని ఆరాధించేవ్రతమిది. ఇరవైనాలుగు గ్రంథులు (ముడులు) ఉన్నతోరం (పట్టుత్రాడుతో) చేసి దానిలో అనంతుని ఆరాధించి నియమంగా ధరించుతారు. నియమంగా, సంప్రదాయంగా (పరంపరగ) గృహాలలో ఈ వ్రతం అనూచానంగా ఆచరిస్తారు.

**మహాలయపక్ష ప్రారంభం :** మృతులైన పితరులకు (తల్లితండ్రులకు) పూర్వీకులకు ఈనాటి నుండి పాడ్యమి వరకు నిత్యం తప్పనిసరిగా తర్పణలివ్వాలి. శ్రాద్ధాన్ని చేయాలి. ఇది ఆచరించకపోతే పాతకం చేకూరుతుందని శాస్త్రవచనం. యథాశక్తి ఈ దినాలలో పితృశ్రాద్ధాన్ని పాటించాలి.

## ఆశ్వయుజమాసం

నక్షత్రాలలో మొదటిది అశ్విని. ఆ నక్షత్రంతో కూడిన పూర్ణిమ కల మాసమిది. అంటే ఒక విధంగా ఇక్కడినుండి కొత్త సంవత్సరం ఆరంభమౌతున్నట్లే. ఇలాగే చైత్రం కూడా మరోవిధంగా కొత్త ఏడాది. అందుకే ఈ రెండు నెలలోనూ మొదటి తొమ్మిది రోజులు (శరన్నవరాత్రులు, వసన్త నవరాత్రులు) అమ్మవారిని ఆరాధిస్తారు. ఈ నవరాత్రులూ జగదంబను ఆరాధించేవారికి సర్వమంగళములూ సంప్రాప్తిస్తాయి. వారి వారి విధానాలననుసరించి జగదంబను ఆరాధించాలి. అనంత నామాలతో, అనంత రూపాలతో విలసిల్లే శక్తి స్వరూపిణిని ఏనామంతోనైనా, ఏ రూపంతోనైనా ఆరాధించవచ్చు. సంప్రదాయసిద్ధంగా పద్ధతిగలవారు కలశాన్ని స్థాపించి ముగురమ్మల మూలపుటమ్మను ఈనాటి నుండి తొమ్మిది రోజులపాటు నియమంగా ఆరాధిస్తారు. రామాయణ, భారతాది విజయగాధలన్నీ ఈ నవరాత్రులతో ముడిపడి ఉన్నాయి.

**సరస్వతీ పూజ :** మూలానక్షత్రంలో సరస్వతిని ఆరాధించాలి. తొమ్మిది రోజులు పూజచేయ లేనివారు ఈనాటినుండి నవమి వరకు మూడు రోజులపాటైనా ఆరాధించాలి. ఇలాకూడా ఆచరించే వీలులేనివారు మహానవమినాడైనా అమ్మను ఆరాధించాలి. ఈ రోజున పుస్తకరూపిణి సరస్వతిని అర్చించడం ముఖ్యం.

**మహానవమీ :** నవరాత్రులలో అత్యంత ప్రధానమైనది మహానవమీ. ఈ రోజున జగదంబను ఆరాధించి తీరాలి. తొమ్మిదిరోజులూ చేయలేనివారు సప్తమి నుండి మూడురోజులు పూజించాలి. అలాకుదరని పక్షంలో ఈ రోజైనా అర్చించాలి. దసరా పూజలకి ఇదే ప్రధానం. విజయదశమి పునఃపూజ, ఉద్వాసన మాత్రమే. ప్రధానపూజ నవమినాడే చేయాలి. నవమిపూజ చేసినవారే, దశమినాడు పునః పూజ చేస్తారు.

**విజయదశమి :** నవరాత్రులూ పూజించినవారు ఈ రోజున కలశ ఉద్వాసన చేస్తారు. శమీపూజను నిర్వహిస్తారు. గ్రామస్థులందరూ ఈశాన్య దిక్కుగా వెళ్ళి శుచిప్రదేశంలో భూమి అలికి, చందనాదులతో అష్టదళపద్మం లిఖించి, "మమ



సకుటుంబస్య క్షేమ సిద్ధ్యర్థమపరాజితా పూజనం కరిష్యే" అని సంకల్పించి, "అపరాజితాయైనమః" అని దేవిని ఆవాహనచేసి, ఆమెకు దక్షిణాన జయాదేవిని "క్రియాశక్త్యై నమః" అని, విజయాదేవిని "మాయై నమః" అని పూజించాలి.

"జయా, విజయా సహిత అపరాజితాయై నమః " అని అర్చించాలి. ఈ రోజు సంధ్యాకాలం కొంచెం నక్షత్రాలు కనబడిన వేళ "విజయా ముహూర్తం" ఈ ముహూర్తంలో తలపెట్టిన పనులు, చేసిన ప్రయాణాలు విజయవంత మవుతాయి.

**శమీ ప్రార్థన :**

**అమంగళానాం శమనీం దుష్కృతస్య చ ।**
**దుస్స్వప్ననాశనీం ధన్యాం ప్రపద్యేహం శమీంశుభామ్ ।**
**శమీ శమయతే పాపం శమీ లోహిత కంటకా।**
**ధరిత్ర్యర్జున బాణానాం రామస్య ప్రియవాదినీ ॥**
**కరిష్యమాణయాత్రాయాం యథాకాలం సుఖంమయా ।**
**తత్ర నిర్విఘ్న కర్త్రీత్వం భవ శ్రీరామపూజితే॥**

**ఆశ్వయుజ పౌర్ణమి :** ఇది చాలా ముఖ్యమైన పర్వం. అసలు పాడ్యమి నుండి పూర్ణిమవరకు శక్తి ఆరాధన విశిష్టం. శ్రీవిద్యాసంప్రదాయంలో పూర్ణిమ వరకు పూజ చాలా ప్రశస్తి. "ముఖ్యరాకా" అంటే ఈ పూర్ణిమయే. ఈరోజున జగదంబ పూజ, లలితా సహస్రనామ పారాయణ వంటివి విశేష ఫలాలనిస్తాయి.

**అట్లతద్దె :** చంద్రకళలో గౌరీదేవిని ఆరాధించే తిథి ఇది. ఈ పండుగలో కన్యలు మొదలుకొని ముత్తైదువల వరకు కలిసి ఆటలాడుకోవడం, వేడుకలు జరపడం, రాత్రివేళ చంద్రునీ, గౌరీనీ పూజించి అట్లనోము జరుపుకొనడం సంప్రదాయం. ఆటపాటలూ దాగివున్నాయి. ఈ సంప్రదాయంలో మధురమైన అనుభూతులూ, ఆటపాటలూ, తల్లులంతా పిలలచేత ఈ నోము నోపించి, వీటి మాధుర్యాన్ని రుచి చూపించాలి. చక్కని వైవాహిక జీవితాన్ని ప్రసాదించేశక్తి ఈ నోములో ఉంది.

**నరకచతుర్దశి :** ఈ రోజున స్నానాదులు పుణ్యప్రదం. వేడినీళ్ళు చన్నీళ్ళ కలిపిన నీటిలో దుచ్చన చెట్టుకొమ్మగానీ, ఆనపబీగ కొమ్మగానీ, ఆముదపు, చెట్టు శాఖగానీ త్రిప్పి స్నానంచేయాలి. ఈ రోజున ప్రదోషాన దీపాలు వెలిగించాలి.ఇంట్లో, దేవాలయంలో, వీధులలో గోశాలలో దీపాలు వెలిగించడం ఈ రోజునుండే ప్రారంభించడం మంచిది.

**దీపావళి అమావాస్య :** ఈ ఆశ్వయుజ అమావాస్య ఉదయాన్నే అభ్యంగన స్నానం చేయాలి. ఇది లక్ష్మీప్రదం.తైలంలో ఈ రోజున లక్ష్మీవసించి ఉంటుంది. స్నానానంతరం దేవపూజ.

## కార్తీకమాసం

ప్రదోషకాలంలో లక్ష్మీపూజ ఐశ్వర్యప్రదం. **"అమాయుక్త ప్రదోషేతు ధనలక్ష్మీం ప్రపూజయేత్"** – అనిధర్మశాస్త్రాలు చెప్తున్నాయి. ఈ అమావాస్య ప్రదోషాన ధనలక్ష్మిని దీపారాధనతో అర్చించాలి. దీపాలను వెలిగించి, లక్ష్మీనారాయణ స్మరణచేయాలి. అలాగే కొరవులు ధరించి పితృదేవతలకు మార్గము చూపించే సంప్రదాయాలు కొన్ని చోట్ల ఉన్నాయి. మరణించిన పూర్వీకులలో అగ్నిప్రమాదాలు వంటి వాటితో పోయినవారికి ఉత్తమగతులు కలిగేందుకు ఇలా చేస్తారు.

దీపారాధనలు,బాణసంచా అయిన తరువాత అర్ధరాత్రివేళ ఇల్లు, వాకిళ్ళు ఊడిపించాలి. ఇది అలక్ష్మిని తొలగిస్తుంది.

**దివ్యమైనది కార్తీకమాసం – కార్తీక మాస ప్రారంభం :** దివ్యమైన కార్తీకమాసం ఈరోజునే ఆరంభం. కార్తీకం దీపానికి ప్రసిద్ధి. ఉభయ సంధ్యలలో ఇంట్లోనూ, ఆలయంలోనూ దీపాలు వెలిగించడం ఇహపరసౌఖ్యాలనిస్తుంది. సూర్యోదయానికి ముందు స్నానం చేయాలి. ఈ మాసమంతా దీక్షగా ఏదైనా అనుష్ఠానం చేయవచ్చు. ఈ నెల శివకేశవులుభయులనూ ఆరాధించి, వారి అనుగ్రహాన్ని పొందాలి.

"ఆకాశదీపం" ఆరంభించేది ఈరోజునే.

**భగినీ హస్తభోజనం, కార్తీక సోమవారం :** కార్తీక సోమవారాలు చాలా ప్రసిద్ధి. పగలంతా ఉపవసించి, ప్రదోషాన శివార్చనచేసి భుజించడం నక్తవ్రతం. ఈ వ్రతాచరణ కార్తీక మాసమంతా చేస్తారు. అలా చేయలేనివారు సోమవారాలు ఆచరిస్తారు. అక్కచెల్లెళ్ళ చేతివంట తినడం ఈ రోజున మంచిది. సోదరిని సత్కరించి సోదరుడు శుభాలను పొందుతాడు. ఎంత దూరాన వున్నా వీలుచేసుకొని సోదరి ఇంటికి వెళ్ళి ఆమెచేతి భోజనంచేసి, ఆమెకు చీరె, పసుపు కుంకుమలు వంటి మంగళద్రవ్యాల నివ్వడం చక్కని ఆచారం. ఇప్పటికీ దీనిని పాటించేవాళ్ళు ఉన్నారు.

**నాగులచవితి :** ఇది శక్తిమంతమైన తిథి. ఈరోజున పుట్టవద్ద నాగపూజ చేసి పాలు, నువ్వుల పదార్థాలు, చలిమిడి నివేదించి ఆరాధిస్తారు. నాగదేవతల ప్రసన్నతవల్ల అనేక అరిష్టాలు తొలగుతాయి. గ్రహదోషాలు నశిస్తాయి.



**కార్తీకమాసం :** కార్తీకమాసం అత్యంత పవిత్రమైనది. మహిమాన్వితమైనది, ఆధ్యాత్మికంగా దివ్యమైనది. శివకేశవులకు అత్యంత ప్రీతిపాత్ర మైనది. ఈ మాసం స్నానానికి విశిష్టమైనది. ఈ రోజునుండి సూర్యోదయానికి పూర్వమే మేల్కొని రోజూ నదీస్నానం చేయడం శ్రేష్ఠం. కనీసం ప్రధాన తిథులలో (ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, సోమవారాలు) నైనా చేయాలి. ఇది దామోదర మాసం కనుక "కార్తీక దామోదర" అనే స్మరణతో స్నానంచేయాలి. నది లభ్యం కాకపోతే లభ్యమైన జలాలతోనే స్నానం చేయాలి.

**నమః కమలనాభాయ నమస్తే జలశాయినే ।**
**నమస్తేస్తు హృషీకేశ గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥**
అనే మంత్రంతో అర్ఘ్యమిచ్చి,

**కార్తికేహం కరిష్యామి ప్రాతస్నానం జనార్ధన ।**
**ప్రీత్యర్థం తవ దేవేశ జలేస్మిన్ స్నాతుముద్యతః॥**
**తవ ప్రసాదాత్పాపం మే దామోదర వినశ్యతు॥**
అనే మంత్రాలతో స్నానం చేసి,

**నిత్యేనైమిత్తికే కృష్ణ కార్తికే పాపనాశనే ।**
**గృహాణార్ఘ్యం మయాదత్తం రాధయా సహితో హరే॥**
అనే మంత్రంతో తిరిగి అర్ఘ్యమివ్వాలి.

ఈ విధంగా చేసేస్నానం పుణ్యప్రదం. అరుణోదయ సమయంలో శివాలయంలో గానీ, విష్ణ్వాలయంలోగానీ గడపాలి. అరుణోదయం కాలంలో జాగరూకుడై విష్ణు, శివాలయాల్లో భగవత్ ధ్యానం, స్తోత్రం, జపం చేయడం వల్ల వేల గోవుల్ని దానం చేసిన ఫలం లభిస్తుంది. శివ విష్ణ్వాలయాలు లభించని పక్షంలో ఏ దేవాలయంలోనైనా లేదా రావిచెట్టు మొదట్లో గానీ, తులసీవనంలో గానీ వుండి భగవత్ స్మరణ చేయాలి.

సూర్యోదయానికి ముందుగా 'ఆకాశదీపం' పెట్టే సంప్రదాయం వుంది. హృదయాకాశంలో పరంజ్యోతి వెలుగుతోంది. అందుకు ప్రతీకగా ఈ 'ఆకాశదీపం' ద్యోతకమవుతోంది. దీనిని దేవాలయంలోనేకాక, ఇంట్లో కూడా వెలిగించవచ్చు. ఈ మాసం దీపారాధనకి విశిష్టమైనది.

ఉభయ సంధ్యలలో శివకేశవ మందిరాల్లో, తులసి సన్నిధిలో దీపాన్ని వెలిగించడం మహోత్కృష్టమైన సత్కర్మ. "ఏక స్సర్వదానాని దీపదానం తథైకతః" అన్ని దానాలు ఒకవైపు, దీపదానం ఒకవైపు అని శాస్త్రవచనం.

ఈ నెలంతా 'నక్తం'ని నియమంగా చేయడం కూడా సంప్రదాయం. పగలంతా ఉపవాసముండి సాయంత్రం శివార్చన/ విష్ణుపూజ చేసుకొని, నక్షత్ర దర్శనం చేసుకొని

భగవంతునికి నివేదించిన ఆహారాన్ని స్వీకరించడాన్ని 'నక్తవ్రతం' అంటారు. నెలంతా కుదరక పోయినా సోమవారాలు ఈ వ్రతం ఆచరించడం శ్రేష్ఠం.



కార్తీకమాసం శివప్రీతికరమైనది. ఈ మాసం శివార్చన చేసిన వారికి ఈతిబాధలు, గ్రహదోషాలు ఉండవు. కార్తీక మాసంలో ఏ మంత్రదీక్షను తీసుకొన్నా గొప్ప ఫలితాన్నిస్తుందని ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి. ఈ మాసంలో తులసి (పూసల) మాల ధరించడం మంచిది. ఆమలక వృక్షాన్ని (ఉసిరికచెట్టును) అర్చించడం కూడా విశిష్ట శుభకారకం.

కార్తీకమాసమంతా కార్తీక పురాణం (30 అధ్యాయాలు) రోజుకో అధ్యాయం పారాయణచేయడం శుభకరం. శివుడు 'ఆశుతోషుడు' వెంటనే సంతోషించే స్వామి. ఆయనకు అలంకారాలతో, నైవేద్యాదులతో, రాజోపచారాలతో పనిలేదు. ఒకసారి 'శివ'అని, మరోసారి'శివ'అనే లోపలే ఆయన కరిగిపోతాడట.

శివునికి 'అర్కద్రోణ ప్రభృతి కుసుమైః అర్చనం తే విధేయం' జిల్లేడు, ఉమ్మెత్త మొదలైన విలువలేని పువ్వులే శివుడికి ప్రీతి. ఇటువంటి ఆశుతోషి. శివానుగ్రహానికీ, విష్ణువు అనుగ్రహానికీ ఈ మాసం శ్రేష్ఠమార్గం.



**అభిషేకప్రియంః శివః** – అన్నారు గనుక ఈ మాసంలో శివాభిషేకం అన్ని దోషాలను పోగొట్టి, సకల శుభాలను ప్రసాదిస్తుంది.

**కార్తీకమాసంలో కూడనివి :** కార్తీక నియమాన్ని పాటించేవారు రెండు రకాల ఉల్లి, ఇంగువ, పుట్టకొక్కు, గంజాయి, ముల్లంగి, ఆనపకాయ, మునగకాయ, వాకు వంకాయ, గుమ్మడికాయ, చిక్కుడు, పుచ్చకాయ, వెలగపండు, రెండుమార్లు వండిన అన్నం, చవిడిఅన్నం, మాడన్నం, మినుములు, పెసలు, శెనగలు, ఉలవలు, అనుములు, కందులు (ద్విదళ ధాన్యాలు) వాడరాదు.

సప్తమినాడు ఉసిరిక, తిలలు; అష్టమినాడు కొబ్బరి, ఆదివారం ఉసిరిక ఉపయోగించరాదు. ఇది ఏ మాసమైనా నియమమే.

**చంద్రగ్రహణం, కార్తీక పౌర్ణమి :** ఇది మహోత్కృష్టమైన పర్వదినం. శివార్చన, విష్ణుపూజ, శక్తిపూజ...ఈ మూడింటిలో ఏదైనాసరే ఈ రోజున చేయడం సర్వశ్రేష్ఠం. రాత్రిపూట చేయవలసిన పూజలు ఈ రోజునే చేయాలి. గ్రహణానంతరం ఈ రోజున 'సముద్ర స్నానం' విశేష ఫలాన్నిస్తుంది.

ఆంధ్రదేశంలోని శివాలయాల్లో ప్రార్థన, లింగార్చన, బిల్వార్చన వంటి విధానాలు ఈ మాసంలోని విశేష ఫలాన్ని ప్రసాదిస్తాయి. అష్టోత్తర శతలింగార్చన, మహా (360) లింగార్చన, సహస్ర లింగార్చన శ్రేష్ఠమైన అర్చనా విధానం, సంవత్సరం మొత్తం శివార్చన చేసిన ఫలాన్ని ప్రసాదిస్తుంది.

**శుద్ధ ఏకాదశి :** దీనికి ప్రబోధైకాదశి 'బృందావన ఏకాదశి' అనిపేరు. ఆషాఢ ఏకాదశి (శయనైకాదశి) నాడు శయనించిన స్వామి (యోగనిద్ర) ఈ రోజు మేల్కొంటాడని పురాణకథనం.

**"ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద! త్యజనిద్రాం జగత్పతే,**
**త్వయిసుప్తే జగత్ సుప్తం ఉత్థితే చోత్థితం జగత్"**

అనే ప్రబోధన మంత్రంతో ప్రార్థనచేసి, శ్రీ మహావిష్ణువును అర్చించి ఉపవసించాలి. భాగవతంలోని 'అంబరీషోపాఖ్యానం' చదివినా, విన్నా మేలు జరుగుతుంది.

**శనిత్రయోదశి, మాసశివరాత్రి :** ఈరోజు శనికి ఎంతో ప్రీతికరమైనది. శనీశ్వరాలయంలో నువ్వుల నూనెతో తైలాభిషేకం చేస్తే శనిగ్రహ దోషాలు తొలగుతాయి.

**సుబ్రహ్మణ్య షష్ఠి :** శివశక్తుల ఏకస్వరూపుడై సుబ్రహ్మణ్యుడు ఆవిర్భవించిన పుణ్యతిథి సుబ్రహ్మణ్యషష్ఠి. పరబ్రహ్మ రూపంగా పురాణాల్లో వర్ణించబడిన స్కందుని, ఆయనశక్తి అయిన షష్ఠీదేవిని ఆరాధిస్తే ఉత్తమ ఫలాలు లభిస్తాయి. షోడశోపచార పూజ, 'శరవణభవ' అనే ఆరు అక్షరాల నామమంత్రాన్ని జపించడం మనలో దివ్యశక్తిని జాగృతంచేస్తాయి. విజ్ఞానవృద్ధికీ, వంశవృద్ధికి, బుద్ధి సమృద్ధికి, ముఖ్యంగా కుజ, రాహు గ్రహదోషాలను తొలిగించుకోవడానికి సుబ్రహ్మణ్యారాధన ఉపకరిస్తుంది.

కార్తీకమాసం ఇది. ఇహపరశుభాలను ప్రసాదించేమాసం. ఈ మాసంలో శివకేశవులను పూజించుట విశేషఫలప్రదం. సత్యనారాయణవ్రతం, విష్ణు సహస్ర నామపారాయణ, రుద్రాభిషేకాదులు ఈ మాసంలో ఉత్కృష్టం. కార్తీకమాసంలో రోజూ సూర్యోదయానికి ముందు నిద్రలేచి స్నానం చేయడం మంచిది. లేదా ప్రధాన తిథులలో (ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, సోమవారాలు) నైనాచేయాలి.

**నమఃకమలనాభాయ నమస్తే జలశాయినే ।**
**నమస్తేస్తు హృషీకేశ గృహాణార్ఘ్యం నమోస్తుతే ।**
**అనే మంత్రంతో అర్ఘ్యమిచ్చి,**
**కార్తికేహం కరిష్యామి ప్రాతస్నానం జనార్ధన ।**
**ప్రీత్యర్థం తన దేవేశ జలేస్మిన్స్నాతుముద్యతః।**
**తవప్రసాదాత్ పాపంమే దామోదర వివశ్యతు ॥**

అనే మంత్రాలతో స్నానం చేసి, తిరిగి ఈ క్రింది మంత్రంతో అర్ఘ్యమివ్వాలి.

**నిత్యేనైమిత్తికే కృష్ణ కార్తికే పాపనాశనే ।**
**గృహాణార్ఘ్యం మయాదత్తం రాధయాసహితో హరే॥**

(నిత్యమును, నైమిత్తికమును అయిన పాపములను పోగొట్టి ఈ కార్తికమందు నేనిచ్చే అర్ఘ్యం రాధాసహితుడవై గ్రహింపుమో శ్రీహరీ!)



ఈ విధంగా చేసే స్నానం పుణ్యప్రదం

**స్మృత్వాభాగీరథీం, విష్ణుం, శివం, సూర్యం, జలంనిశేత్ ॥**

భాగీరథినీ, విష్ణువునీ, శివునీ, సూర్యునీ స్మరించి స్నానం చేయాలని స్మృతి వచనం. నిత్యపూజ్య అయిన తులసీదేవిని ఈ మాసంలో విశ్లేషించి పూజించాలి.

**తులసీదళ లక్షేణ కార్తికే యోర్చయేద్ధరిం ।**
**పత్రేపత్రే మునిశ్రేష్ఠ మౌక్తికం ఫలమశ్నుతే ॥**

తులసీదళాలతో శ్రీ విష్ణువును, కార్తీకాన అర్చిస్తే ముక్తిదం అని శాస్త్రవచనం. ఈ మాసాన విష్ణువు 'దామోదర' నామంతో వ్యవహృత మౌతాడు. "కార్తీకదామోదర ప్రీత్యర్థం" అని ఈ మాసాన ప్రతికర్మ ఆచరించాలి. ఈ మాసాన తులసిచెట్టు పాతుట, పెంచుట, తులసి చెంత హరిపూజ పుణ్యప్రదాలు.



**నివేద్యకేశవే మాలాం తులసీకాష్ఠ సంభవాం ।**
**వహతేయో నరోభక్త్యా । తస్యనైవాస్తి పాతకమ్ ।**

**తులసీ కాష్ఠ సంభూతే మాలేకృష్ణ జనప్రియే ।**
**మాలే కృష్ణ జనప్రియే । బిభర్మిత్వామహంకంఠే**
**కురు మాం కృష్ణవల్లభమ్॥**

తులసి పూసల మాలను విష్ణువునకు సమర్పించి, తిరిగి దానిని, పై స్తోత్రము చదువుతూ ధరించాలి. 'ధాత్రి'పూజ, ధాత్రి మూలంలో విష్ణుపూజ కూడా ఈ మాసంలో శ్రేష్ఠం. ధాత్రి అంటే ఉసిరికెచెట్టు.

**కార్తికే ధాత్రి వృక్షాధః చిత్రాన్నైస్తోషయేద్ధరిం ।**
**బ్రాహ్మణానేభోజయుద్భక్త్యా స్వయంభుంజేత బంధుభిః॥**

కార్తీకమాసంలో ఉసిరికెచెట్టు క్రింద శుచిగా వండిన వివిధ వంటల్ని కేశవారాధనతో నివేదించిన బంధుమిత్ర సహితంగా ఆరగించాలి.

**శ్రీదేవి నమస్తుభ్యం సర్వపాప క్షయంకరి!**
**ఆయుర్ దేహిమహాప్రాజ్ఞే! యశోదేహి బలంచమ్ ॥**

**మేధాంచ సౌభాగ్యం విష్ణుభక్తి శాశ్వతీం ।**
**కురుమాం నిత్యం, నిష్పాపం కురుసర్వదా ॥**



**గోష్టాష్టమి :** కార్తీక శుక్లాష్టమినాడు గోష్టాష్టమి. గోపూజ గోప్రదక్షిణము ఈ దినము.

**బోధనైకాదశి :** ఈ రోజున ఉపవాసం చేసి విష్ణు పూజచేయడం సర్వశ్రేష్ఠం.

**క్షీరాబ్ధి ద్వాదశి :** ఈ దివ్యదినాన క్రొత్తగా తులసీ మొక్కనుపాతి, విష్ణువును పూజించాలి. ఈ రోజున తులసీ విష్ణుల వివాహం, తులసిని పసుపు కుంకుమలతో పూజించాలి. "శ్రీ మహావిష్ణవే దామోదరాయ శ్రీ దేవ్యై తులస్యై నమః" అని స్తోత్రించాలి.

**బ్రహ్మేంద్ర రుద్రాద్రి కుబేర సూర్య సోమాదిభిర్వందితవందనీయ ।**
**బుధస్వదేవేశ జగన్నివాస మంత్రప్రభావేన సుఖేన దేవ ॥**

**ఇయం చ ద్వాదశీ దేవ ప్రభోదార్థం తు నిర్మితా ।**
**త్వయైన సర్వలోకానాం హితార్థం శేషశాయినా ।**
**ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద । త్యజనిద్రాం జగత్పతే ।**
**త్వయిసుప్తే జగత్సుప్తం ఉత్థితే చోత్థితంజగత్ ॥**

అని ముందుగా, విష్ణువును ప్రార్థించి అనంతరం పూజించాలి. ఈ రోజునే చాతుర్మాస్య వ్రతసమాప్తి.

**కార్తీక పూర్ణిమ :** పూర్ణిమతిథుల్లో కార్తీక పూర్ణిమ శ్రేష్ఠమైనది. ఈ రోజున ఉపవాసం, దానం, అర్చన, స్నానం విశేష ఫలదాయకం. కార్తీకమంతా శివాలయంలో గానీ, విష్ణ్వాలయంలోగానీ సాయంవేళల దీపాన్ని వెలిగించితే సర్వశ్రేష్ఠం. పూర్ణిమ నాడు విశేషంగా దీపారాధన చేయడం మంచిది. కార్తీక మాసాన 'ఆకాశదీపాన్ని' వెలిగించడం సత్కార్యంగా వర్ణించాయి శాస్త్రాలు. సూర్యాస్తమయ కాలమందు గృహానికి సమీపంగా యజ్ఞార్హమైన కర్రను, చేయెత్తు పొడవు గల దానిని పాతి, దానిపైని అష్టదళాధ్యాకాంగా నిర్మించిన దీపయంత్రం మధ్యంలో ముఖ్య దీపాన్నీ, దానిచుట్టూ ఎనిమిది దీపాలను ఉంచి సమర్పించాలి.

**దామోదరాయ నభసి తులాయాం దోలయాసహా, ప్రదీపంతే ప్రయచ్ఛామి నమోనంతాయ వేధసే॥** అని నమస్కరించాలి. మాసమంతా ఈ దీపాన్ని వెలిగేలా చూడాలి.

**శని త్రయోదశి ప్రదోషం :** ఈ రోజున నియమంగా శనికి శాంతి, పూజలు జరిపించితే శనిదోషాలు పోతాయి. ఈ రోజు ప్రదోషసమయంలో శివారాధన చేయడం మంచిది. మార్గశిర శుద్ధ త్రయోదశినాడు భక్తాభీష్ట వరప్రసాదుడు సుందర హనుమను కొలవడం మంగళప్రదమైనది. సకల కార్య సిద్ధులు లభిస్తాయి.

## మార్గశిరమాసం

**దత్తాత్రేయ జయన్తి :** మార్గశిరపూర్ణిమ దత్తాత్రేయులవారు అవతరించిన దివ్యతిథి. త్రిమూర్త్యాత్మకమైన శ్రీదత్తాత్రేయులవారు అనఘావల్లభులు. 'దత్త' అనే నామమే మహిమాన్వితం. గురు సంప్రదాయంలో ఈ దేవతామూర్తిది ప్రత్యేక స్థానం.'దత్తసంప్రదాయం' పేరిట పరంపరగా గురు సంప్రదాయం వుంది.

దత్తాత్రేయారాధనకు ఈ రోజు చాలా మంచిది. అత్రి అనసూయలకు కుమారునిగా త్రిమూర్తుల తేజం 'దత్త'నామంతో అవతరించింది. భాగవతం ప్రకారం 'దత్తో మయాహమితి యద్భగవాన్ సదత్తః' తనని తాను పుత్రరూపంగా ఇచ్చుకొని అలా ఇవ్వబడిన కారణంగా 'దత్త' నామధేయుడయ్యాడు విష్ణువు. అత్రి కుమారుడు కనుక 'ఆత్రేయుడు'. ఈ రెండు నామాలు కలిసి దత్తాత్రేయుడు ఇది గురు స్వరూపం. జ్ఞానస్వరూపం. ప్రధానంగా నారాయణుడై, తదుపరి బ్రహ్మరుద్రాత్మకుడై త్రిమూర్తుల స్వరూపంగా ఆరాధ్యుడయ్యాడు.

కృతయుగంలో ఈ స్వామిని సంకృదుడు, ప్రహ్లాదుడు ఆశ్రయించి ఉపదేశం పొందారు. త్రేతాయుగంలో అలర్కుడు మొదలైనవారు యోగవిద్యను, ఆధ్యాత్మ విద్యను సంపాదించి కృతార్థులయ్యారు. ద్వాపరయుగంలో పరశురాముడు, హైహయ చక్రవర్తి, కార్తవీర్యుడు మొదలైనవారు దత్తాత్రేయుని అనుగ్రహం పొందారు. కలి యుగంలో శంకరాచార్యులు గోరక్షనాధుడు మొదలైనవారు ఈ స్వామి కృపను సంపాదించారు. సంత్ జ్ఞానేశ్వర్, సంత్ ఏక్‌నాథ్. దత్తాత్రేయుని ప్రత్యక్ష దర్శనాన్ని పొందారు. పరమ కరుణామయుడైన దత్తుని స్మరించితే చాలు అనుగ్రహిస్తాడని శాస్త్రవచనం–అందుకే 'స్మర్తృగామి' అని స్వామికి పేరు. ఈరోజున దత్తారాధన, స్మరణ ఆవశ్యక ధర్మాలు.

**పరశురాముని జయన్తి :** నారాయణాంశ సంభూతమైన మహావతారం పరశురాముడు. రేణుకా జమదగ్నులకు పుత్రుడు భార్గవరాముడు. భృగువంశ సంజాతుడు కనుక 'భార్గవుడు'. సర్వ అస్త్రవిద్యాధిదేవతయైన శంకరునికై తపస్సు చేసి అమోఘమైన అస్త్రాలను సాధించాడు. ధనుర్వేద విద్యావేత్త.దుష్టక్షత్రియకులాలను ఇరవై యొక్కసార్లు క్షయం చేసిన వీరావతారమిది.



## ధనుర్మాసము

**ధనుర్మాసారంభం :** ఈ రోజు సూర్యుడు ధనురాశిలో ప్రవేశించే పుణ్యవేళ. ఈ సంక్రమణ కాలంలో విష్ణుపూజ, దానజపాదులు విశేషఫలప్రదం. ఈరోజునుండే ధనుర్మాసం ప్రారంభం.'మార్గళి' వ్రతం వేళ ఇది. 'తిరుప్పావై' పారాయణ ఈ రోజు నుండి మొదలు. వైష్ణవ సంప్రదాయంలో విశేషించి ఈ మాసానికి ప్రత్యేక ప్రాధాన్యం.

**వైకుంఠ ఏకాదశి :** ధనుర్మాసంలో వచ్చే ఈ ఏకాదశి పవిత్రమైనది. ఈ రోజున ఉపవాసం, విష్ణు ఆరాధన – విశేష ఫలాన్ని ప్రసాదిస్తాయి. విష్ణు ప్రీతికరమైన ఏకాదశులలో ఇది అత్యంత ప్రధానమైనది. వైకుంఠ ద్వారాలు తెరచుకొనే రోజుగా దీనిని భావిస్తాం. సౌరశక్తి ఉత్తరాయణంకి మారే ముందు వచ్చే ఏకాదశి ఇది. దీనిని మహిమాన్వితమైన ఏకాదశిగా పురాణాలు వర్ణించాయి. ఏకాదశి ముందు ఉపవసించాలి. ఆ రోజు షోడశోపచారాలతో నారాయణుని అర్చించాలి. ద్వాదశినాడు తిరిగి పూజించి అన్నాదికాలు నివేదించి పారణ చేయాలి.



**ఏకాదశ్యాం నిరాహారో భూత్వాహమపర్వేహని ।**
**భోక్ష్యామి పుండరీకాక్ష, శరణం మే భవాచ్యుత ॥**

అని మంత్రముచ్చరించి పుష్పాంజలిని దేవునికి సమర్పించాలి.

ప్రతిశనివారం సంవత్సరంపాటు ఈ క్రింది నామాలను, స్తోత్రాన్ని పఠిస్తే శనిపీడ కలుగదు.

**కోణస్థః పింగలో బభ్రుః కృష్ణో రౌద్రోంతకో యమః**
**శౌరః శనైశ్చరో మందః పిప్పలాదేన సంస్తుతః ॥**

**నమస్తే కోణ సంస్థాయ పింగలాయ నమోస్తుతే ।**
**నమస్తే బభ్రు రూపాయ కృష్ణాయ చ నమోస్తుతే ॥**

**నమస్తే రౌద్రదేహాయ నమస్తే చాంతకాయచ ।**
**నమస్తే యమ సంజ్ఞాయ నమస్తే సౌరయేవిభో ॥**

**నమస్తే మంద సంజ్ఞాయ శనైశ్చర నమోస్తుతే ।**
**ప్రసాదం మమదేవేశ దీనస్య ప్రణతస్యచ ॥**

**సఫల ఏకాదశి :** ధనుర్మాసంలో వచ్చే రెండవ ఏకాదశి, విష్ణుప్రీతికరమైన ఈ రోజున విశేష ఫలప్రదం.రోజు, నారాయణార్చన, విష్ణు సహస్రనామ పారాయణ వంటివి. భోగము కలది భోగి. విష్ణుచిత్తుని కుమార్తె అయిన శ్రీ గోదాదేవి (ఆండాళ్) శ్రీరంగనాధుని వరించి తరించిన భూలక్ష్మి స్వామిని అలంకరించాల్సిన పూలమాలను తాను ధరించి, వాటి సౌందర్యానికి మురిసి–ఆ తరువాత భగవంతునికి అలం

కరించేది, శ్రీమన్నారాయణుని పతిగాకోరి – ధనుర్మాసవ్రతం (మార్గశిరవ్రతం) ఆచరించి, ఆ స్వామి అనుగ్రహాన్ని పొందినది. వ్రత పరిసమాప్తి జరిగి, స్వామిని చేపట్టిన రోజు ఇది. నారాయణునిచేరి, ఆ జగజ్జనని భోగములందిన దినమిది. ఈ రోజున తలంటుస్నానం చేసి భగవదర్చన చేయడం శ్రేయఃప్రదం. చలిమంటలు వేయడం ఈ రోజున ఆచారం.

**భోగి :** హేమంత (ధనుర్మాస) వ్రత ఫలంగా గోదాదేవి రంగనాథుని వివాహమాడిన పుణ్యదినమిది. ఈ రోజున మృష్టాన్నాది ఇష్టభోగాలను స్వీకరించాలని శాస్త్రవచనం.

**మకర సంక్రమణం :** ఇది అత్యంత పుణ్యకాలం. పైగా ఈ ఏడాది 'ముక్కోటి ఏకాదశి' కూడా కలవడంతో మరింత పుణ్యయోగం కలిగింది. స్నాన, దాన, జపాదులు విశేషఫలాన్నిస్తాయి. ఉదయాన్నే స్నానం చేయడం ముఖ్య కర్తవ్యం.

**రవి సంక్రమణే ప్రాప్తే నస్నాయా దృస్తు మానవః ।**
**సప్త జన్మ సురోగీస్యాత్ నిర్ధనశ్చైవ జాయతే ॥**

సంక్రాన్తి నాడు స్నానం చేయనివానికి రోగాదులు వస్తాయని ధర్మశాస్త్ర వచనం.

**సంక్రాన్తేయానిదత్తాని హవ్యకవ్యాని దాతృభిః ।**
**తాని నిత్యం దదాత్యర్కః పునర్జన్మని జన్మని ॥**

"సంక్రాన్తినాడు దేవతలకు, పితృదేవతలకు, పాత్రులకు ఏఏ పదార్థాలను దానంచేస్తామో అవి అత్యధికంగా జన్మజన్మలకీ లభిస్తాయి. ఉత్తరాయణ పుణ్యకాలానికి ఆరంభమిది. ఈ పుణ్యకాలంలో తిలలు, బియ్యం కలిపి శివుని పూజించుట, నువ్వుల నూనెతో దీపం వెలిగించుట చాలా శ్రేష్ఠం. నల్లనువ్వులతో పితృతర్పణం చేయాలి. శివునకు ఆవునేతితో అభిషేకం శ్రేష్ఠం. సంక్రాన్తి తదుపరి వచ్చే పర్వదినాలు పశుపూజకి వినియోగిస్తారు. శ్రమకీ, సంపదకీ ఆరాధ్యస్థాన మిచ్చిన పండుగలివి.ట

**మకరసంక్రాంతి :** సూర్యభగవానుడు మకరరాశిలో ప్రవేశించే పుణ్యఘడియ, ఉత్తరాయణ పుణ్యకాల ఆరంభం, దేవమార్గం ప్రారంభమయ్యేరోజు, ఈ సంక్రాంతి వేళ స్నాన, దాన, జప, వ్రతాదులు విశేషఫలం, గుమ్మడి వస్త్రములుదానంచేయడం ఆచారం. పంట చేతికందిన ఈ పర్వం నాడు ప్రతి ఇంటా శోభ వెల్లివిరుస్తుంది. విష్ణు సహస్రనామ పఠనం ఈరోజున విశేషమైన శుభఫలాలనిస్తుంది. దేవ, పితృ దేవతలనుద్దేశించి చేసే తర్పణాదులు, దానాదులు పుణ్యప్రదం, పౌష్యలక్ష్మిగా జగదంబను ఆరాధించే కాలమిది.

**కనుమ :** పాడి పంటలను పూజించే రోజు, పశుసంపదను లక్ష్మీ స్వరూపంగా భావించి అర్చించడం ఈ రోజున విశేషం. ప్రకృతిలో తన్మయమయే పండుగలివి.



## పుష్యమాసం



**త్యాగరాజ ఆరాధన :** మహాభక్తుడు, సంగీత సాహిత్య సమ్రాట్, మహావాగ్గేయ కారుడు రామానుగ్రహసిద్ధుడు నాదబ్రహ్మ శ్రీ త్యాగరాజస్వామివారు పరమపదించిన పుష్య బహుళ పంచమి ఈదినం. సన్యాసాశ్రమ స్వీకారంచేసి, కైవల్యం పొందిన కారణంగా వారి తిథిని 'ఆరాధన'గా చేస్తారు. వారు సమాధిగా పొందిన 'తిరువారూరు' క్షేత్రంలో ప్రసిద్ధ వర్ధమాన సంగీతకారులు విచ్చేసి స్వామివారి 'ఘనరాగ పంచరత్న కీర్తనలు' మొదలైనవి ఆలపిస్తారు. త్యాగరాజస్వామిని ఆరాధిస్తారు. తెలుగువారేకాక, సంగీత సాహిత్య ప్రియులు, భారతీయ సంస్కృతి ప్రీతి కలవారంతా ఆరాధించవలసిన పుణ్యమూర్తి శ్రీత్యాగరాజులవారు.

**వైకుంఠ (ముక్కోటి) ఏకాదశి :** ఈ రోజున ఉపవాసము, విష్ణుపూజ విశేష ఫలప్రదం. వైకుంఠ ద్వారాలు తెరచుకొనే రోజుగా దీనిని భావిస్తాం. సౌరశక్తి ఉత్తరాయణంకి మారే ముందు వచ్చే ఏకాదశి ఇది. మహిమాన్వితమైన ఏకాదశిగా దీని గురించి పురాణాలు వర్ణించాయి. ఏకాదశి ముందు రోజు ఏకభుక్తము (ఒంటిపూట భోజనం) చేసి, ఏకాదశినాడు శక్తి కొలది ఉపవసించాలి. ఆ రోజున షోడశోపచారాలతో నారాయణుని అర్చించాలి. ద్వాదశినాడు తిరిగి పూజించి అన్నాదికాలు నివేదించి, పారాయణచేయాలి.

**ఏకాదశ్యాం నిరహారో భూత్వాహ మవరేహని ।**
**భోక్ష్యామి పుండరీకాక్ష ! శరణం మేభవాచ్యుత ॥**

అని మంత్రముచ్చరించి పుష్పాంజలిని దేవునికి సమర్పించాలి.

## మాఘమాసం



**మాఘమాసం ప్రారంభం :** మాఘమాసం స్నానానికి ప్రసిద్ధి. మాఘస్నానం ఇహపరశుభదాయకం.

**మాఘమాసే రటంత్యాపః కించి దభ్యుదితే రవౌ ।**
**బ్రహ్మఘ్నం వా సురాపం వా కంపతంతం పునీమహే ॥**

సూర్యోదయం కాబోతున్న సమయంలో మాఘమాసంలో స్నానంచేస్తే మహా పాతకాలుపోతాయి.

**బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థోథభిక్షుకః ।**

నాలుగు ఆశ్రమాలవారు ఎల్లరూ ఈ స్నానం చేయవచ్చు.

**తప్తేన వారిణా స్నానం యద్గృహే క్రియతే నరైః**
**షడబ్ధం ఫలదం తద్ధి మకరస్థే దివాకరే**



సూర్యుడు మకరంలో ఉండే సమయంలో (మాఘమాసంలో) సూర్యోదయానికి మునుపు, వేడినీటిలోనైనా ఇంట్లో స్నానం చేసినా ఆరు సంవత్సరాల అఘఘుర్ణ స్నానఫలం లభిస్తుంది. బావినీటి స్నానం పన్నెండేళ్ల పుణ్యస్నాన ఫలాన్నీ, తటాకస్నానం ద్విగుణం, నదీస్నానం చాతుర్గుణం, మహానదీ శతగుణం, మహానదీ సంగమ స్నానం దానికి చతుర్గుణం, గంగాస్నానం సహస్రగుణం, గంగా యమునా సంగమ (త్రివేణీ సంగమ) స్నానం నదీ శతగుణ ఫలాన్ని ఇస్తాయి. అందుకే ఈ సమయాన అలహాబాద్ (త్రివేణీ సంగమం) లో కుంభమేళా జరుగుతుంది. మాఘంలో ఇంట్లో స్నానం చేసేటప్పుడు గంగాయమునాది దివ్య తీర్థాలను స్మరించి స్నానం చేయాలి.

**"దుఃఖ దారిద్ర్య నాశాయ శ్రీ విష్ణోస్తోషణాయ చ ।**
**ప్రాతః స్నానం కరోమ్యద్య మాఘే పాపవినాశనం ॥**
**మకరస్థే రవౌ మాఘే గోవిందాచ్యుత మాధవ ।**
**స్నానేనానేనమే దేవ యథోక్త ఫలదోభవ" ॥**

అనే ఈ శ్లోకాన్నిచదివి స్నానంచేయాలి. ఇలా రోజూ కుదరనప్పుడు (ఆరోగ్యం అనుకూలించనప్పుడు, మాఘ, పాడ్యమి, విదియ, తదియ తిథులలో స్నానం చేసి, మళ్లీత్రయోదశి, చతుర్దశి మాఘపూర్ణిమ తిథులలో స్నానం చేయవచ్చు.

మాఘమాసపు ఆదివారాలలో నియమబద్ధంగా సూర్యునకు క్షీరాన్నంవండి నివేదించితే రోగ, దారిద్ర్యాలు పోతాయి. ఆ రోజున తరిగిన కూరలు తినకూడదు. తైలాన్ని రాసుకోవడం, మాంసం, ఉల్లి, వెల్లుల్లి తినడం పనికిరాదు. మాఘమాసంలో ముల్లంగిని తినరాదని ధర్మశాస్త్రం.



ఒక రోజులో సంధ్య ఎటువంటిదో, ఒక సంవత్సరంలో మాఘమాసం అటువంటిది. ఇది సంవత్సరానికి సంధ్య వంటిది. దైవశక్తులు జాగృతమయ్యే ధ్యానానికి అనువైన కాలం ఇది. యోగానికి, ఉపాసనకి ఇది ఎంతో ఉపయోగకరం. సంవత్సర కాలంలో చవితి, షష్ఠి, సప్తమి, ఏకాదశి, పూర్ణిమ, చతుర్దశి, వంటి పుణ్యతిథుల్లో చేసిన సాధనలన్నీఒక ఎత్తు ఈ మాసంలో ఆ తిథుల్లో చేసిన సాధనలు మరోఎత్తు. అందుకే ఈ మాసంలో చవితి, సప్తమీ, పూర్ణిమ, ఏకాదశి, అలాగే మాసశివరాత్రి అన్నీ మహాఫలాన్నిస్తాయి. ప్రత్యేకించి ఈ మాసంలో ఆయా తిథులన్నిటియందు, ఆ ప్రధాన దేవతలను పూజించడాన్ని గమనిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. ఆధ్యాత్మికత, పవిత్రత, దైవశక్తి ఉన్న నెలలలో మాఘమాసానికి ప్రత్యేక స్థానం. పురాణాలలో మాఘమాస మహిమను అనేక విధాల ప్రస్తావించారు. ఉత్తరాయణ పుణ్యకాలంలోని ఈ పవిత్ర మాసంలో సూర్యారాధన, విష్ణ్వర్చన, శివోపాసన వంటివి విశేష ఫలాన్నిస్తాయి. సర్వదేవతలకు ప్రీతికరమైన మాసమిది.

**స్నాన మహిమ :** కార్తీకం దీపానికి ప్రధానం, మాఘమాసం స్నానానికి ముఖ్యం, సూర్యోదయానికి ముందు నదీస్నానం శ్రేష్ఠం. నది లభ్యం కానప్పుడు తటాకంగానీ, నూయిగానీ స్నానానికి శ్రేష్ఠం. ఇవేవీ లేనప్పుడు లభ్యమైన జలాలలో పవిత్ర నదీస్మరణతో స్నానం చేయాలి. మాఘమాసంలో స్నానం, అందులోనూ 'త్రివేణీసంగమ'స్నానం ఉన్నతమైన ఫలాన్ని ప్రసాదిస్తుందని ధర్మశాస్త్ర వచనం. స్నాన సమయంలో శివకేశవాది దేవతాస్మరణ,గంగ,యమునా, సరస్వతీ, గోదావరి వంటి పుణ్యనదులస్మరణ చేయాలి. అదేవిధంగా ఈ మాసంలో దానం, జపం, విశేషంగా చేస్తే అంతమంచిది.

**సూర్యారాధన :** సర్వదేవతామయుడు, సర్వ వేదమూర్తి సూర్య భగవానుని ఈ నెలలో ఆరాధించడం ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. ఈ మాసమంతా నియమంగా సూర్యుని ఆరాధిస్తూ, 'ఆదిత్య హృదయం' వంటివి పారాయణం చేయడం మంచిది. ప్రతిఆదివారం ఉదయాన్నే శుచిగా క్షీరాన్నం (పాయసాన్నం) వండి సూర్యుని అర్చించాలి. ఆ రోజు తరిగిన కూరల్ని తినరాదు. (కత్తి తగలని పదార్థాలను తినవచ్చు) ఈ మాసం ఆహారాదుల్లో నియమాన్ని పాటించితే మంచిది.

**గణపతిపూజ :** మాఘశుక్ల చతుర్థి ఢుండి గణపతికి ప్రీతికరం. ఈ రోజు పగలు ఉపవాసముండి రాత్రి ప్రారంభంలో గణపతిని పూజించాలి. తిలలతో చేసిన లడ్డుకాలను నివేదించాలి. ఇది సంపదలను ప్రసాదిస్తుంది. ఈనాడు శివుని మల్లెపువ్వులతో పూజించితే ఐశ్వర్యం లభిస్తుంది.

**శ్రీపంచమీ :** ఇది అత్యంత మహిమాన్వితమైన తిథి. సకల విద్యా స్వరూపిణి పరాశక్తి సరస్వతిగా ఆవిర్భవించిన తిథి. దేవీభాగవతం, బ్రహ్మవైవర్తం తదితర

పురాణాలు, మంత్రశాస్త్రాలు ఈరోజున సరస్వతీపూజదేవిని అర్చించాలని శాసిస్తున్నాయి. పిల్లలు మొదలుకొని పెద్దల వరకు అందరూ ఈ రోజున శారదాంబను ఆరాధిస్తే విద్యా బుద్ధులు లభిస్తాయి. మేధాశక్తి వృద్ధిచెందుతుంది.

ఉదయాన్నే అభ్యంగనస్నానం చేసి, పరిశుభ్రమైన గృహంలో మామిడాకుల తోరణాదులతో మంటపాన్ని అలంకరించి సరస్వతీ ప్రతిమనుగానీ, పటాన్ని ఉంచి, పుస్తకాలను, కలాన్ని కూడా ఉంచి షోడశోపచారాలతో పూజించాలి. క్షీరాన్నం, పళ్ళు, కొబ్బరి, ఇతర పిండివంటలు నివేదించాలి. తెల్లని పువ్వులతో పాటు ఇతర కుసుమాలను అర్చనకు ఉపయోగించాలి. ప్రతివారూ ఆచరించవలసిన దివ్యపర్వమిది. సరస్వతీ అనుగ్రహం వల్లనే ఉలుకూ, పలుకూ, బుద్ధి, శక్తి పనిచేస్తాయి. బుద్ధి సరిగా ఉన్నవారికే నిర్ణయాలు, ఆలోచనలు సవ్యంగా ఉంటాయి. సరియైన జ్ఞానం వల్లనే ఇహమూ, పరమూ, మోక్షమూ లభిస్తాయి. విజ్ఞానం మొదలుకొని ఆత్మజ్ఞానం వరకూ అన్నీ ఈ పరాశక్తి కృపవల్లనే సంప్రాప్తిస్తాయి. ఈ దినాన చేసే జపం, పారాయణ అధిక ఫలాన్నిస్తాయి. ఈ రోజునే వసంత పంచమి. రానున్న వసంతానికి శుభాహ్వానంగా ఈ పండుగను కొన్నిచోట్ల మహావైభవంగా నిర్వహిస్తారు.

మాఘశుద్ధ పంచమిని "శ్రీపంచమీ" అంటారు. ఇది మహాప్రసిద్ధమైన పర్వం. దేవీభాగవతం, బ్రహ్మవైవర్తం వంటి పురాణాల్లో ఈ తిథి మహిమ ప్రస్తావించారు. సరస్వతీదేవి ప్రాదుర్భవించిన ఈ పుణ్యదినాన సరస్వతీ దేవిని పుస్తకాది రూపాలలో, విగ్రహంలో ఆవాహన చేసి పూజించితే సర్వాభీష్టాలూ లభిస్తాయి. మేధాశక్తి, విద్య, ధారణ, స్ఫురణ, ప్రజ్ఞ, వాక్కు-మొదలైన బుద్ధిశక్తులు వృద్ధిచెందుతాయి. ధవళ (తెల్లని) కుసుమాలతో సరస్వతీ దేవిని పూజించి, క్షీరాన్నం, నారికేళం, అరటిపళ్లు నివేదనచేసి, సరస్వతీదేవిని స్తుతిస్తే ఆ తల్లి అనుగ్రహం లభిస్తుంది. దేవతలు సైతం ఈరోజున సరస్వతీదేవిని ఆరాధిస్తారు.

సరస్వతీదేవి కృపవల్లనే జ్ఞానవిజ్ఞానాలు వృద్ధిచెందుతాయి. లౌకికమైన చదువులు, పరమమైన బ్రహ్మవిద్య రెండు ఈ జగజ్జనని కృపచేతనే లభ్యాలు.

మాఘశుద్ధ పంచమిని "శ్రీ పంచమి" అంటారు. ఉత్తరాదిలో, ఒరిస్సా, బెంగాల్ రాష్ట్రాలలో ఇంకా అనేక ప్రాంతాలలో ఈ పంచమిని విశేషంగా నిర్వహిస్తారు. దేవీ భాగవతం, బ్రహ్మ వైవర్త పురాణం, బ్రహ్మాండ పురాణం మొదలైన వాటిలో ఈ "శ్రీపంచమి" గురించి విశేషంగా చెప్పారు. ప్రతిఒక్కరూ ఈ రోజున బ్రాహ్మీముహూర్తంలోలేచి, తలస్నానంచేసి, నిత్యనైమిత్తిక కర్మలు పూర్తి చేసుకొని సరస్వతీదేవిని ఆరాధించాలి. ప్రతిమలోగాని,పుస్తక రూపంలో గానీ, పటం రూపంలో గాని సరస్వతి ఆవాహన చేసి షోడశోపచారాలతో పూజించాలి. చదువులకూ, బుద్ధికీ, జ్ఞానానికీ అధిష్ఠానదేవత అయిన సరస్వతి పరమేశ్వరుని "వాక్కు, జ్ఞానశక్తి" ఈ



మాఘ పంచమినాడే పరమాత్మ నుండి ఆవిర్భవించింది ఈతల్లి. కాబట్టి ఈరోజు సరస్వతీ దేవిని ప్రతిఒక్కరూ విధిగా ఆరాధించాలి.

పుస్తకరూపంలోగాని, పటంగా, విగ్రహారాధనలోఉన్న సరస్వతీ రూపాన్నీ ఈరోజున షోడశోపచారాలతో పూజించి, సరస్వతీ స్తోత్రాలతో ధ్యానంతో, గానంతో గడపాలి. విద్యాబుద్ధులను, సర్వైశ్వర్యాలను ప్రసాదించే శ్రీమాత సరస్వతి. ఈమె అనుగ్రహంలేనిదే బుద్ధి, వాక్కుపనిచేయవు. ఈ ప్రపంచమంతా ఈతల్లి దయవల్లే నడుస్తోంది. ఈమె ప్రేరణలేనిదే జగత్తులేదు. ఆ బుద్ధికి అధిష్ఠానదేవత భారతీ దేవియే...ఈ అమ్మ వల్లనే వాఙ్మయం, లౌకిక పార లౌకిక విద్యలు విలసిల్లాయి.

**సుబ్రహ్మణ్య షష్ఠి :** మాఘశుద్ధ షష్టినాడు కుమార స్వామిని ఆరాధించడం ఉత్తమ పుణ్యఫలాలను ప్రసాదిస్తుంది. కొంతమంది ఈ రోజున పుట్టలో నాగదేవతకు పాలు పోస్తారు.

**రథసప్తమి :** ఈనాటినుండి సూర్యశక్తి పృధ్వికి విశేషంగా శక్తినిస్తుంది. ఈ దినాన అరుణోదయంతో స్నానం చేస్తే జన్మల పాపాలు నశిస్తాయి. రోగము, శోకము మొ॥ ఇబ్బందులు తొలగుతాయి.

ఈ రోజున సూర్యభగవానుని ఆరాధించి, ఆవుపేడ పిడకల మంటతో వండిన క్షీరాన్నాన్ని చిక్కుడాకులలో నివేదించాలి. చిక్కుడు కాయలతో చేసిన రథాన స్వామిని ఆవహింపజేసి పూజించాలి. ఉత్తరాయణ పుణ్యకాలంలో పవిత్రమైన పర్వదినమిది.

సూర్యభగవానుని కాంతి కిరణాల భూమికి అధికంగా లభించడం ఈ రోజునుండి ప్రారంభం. సూర్యగమనంలో వచ్చేమార్పు ఇది. సూర్యుడు రథంమారడంగా అభివర్ణింపబడిన తిథి ఇది.

సూర్యుని మహిమ అందరికీ అనుభవేద్యమే. జగచ్ఛక్షువు, కర్మసాక్షీ అయిన సూర్యుని దైవీశక్తిని ఉపాసించే విధానాలు భారతీయ ఋషులు ఆవిష్కరించారు. ఈ రోజున సూర్యునకు పాయసాన్ని నివేదన చేసి (చిక్కుడు ఆకుల్లో) ఆరగిస్తారు. చిక్కుడు,జిల్లేడు సూర్యశక్తిని అధికంగా గ్రహించే వృక్షాల్లో కొన్ని కనుక వాటిని ఈరోజు వినియోగిస్తారు.

**భీష్మ ఏకాదశి :** 'మాఘశుద్ధ ఏకాదశి' గొప్ప ఏకాదశీ పర్వాలలో ఒకటి. ఈ ఏకాదశికిముందే వచ్చే అష్టమినాడు, భీష్మాచార్యులవారు కైవల్యం పొందారు. ఆ పరమ భాగవతాగ్రేసరుని స్మరిస్తూ, ఈ ఏకాదశికి భీష్ములవారి పేరుంచారు. భీష్ముని చరిత్ర దివ్యాతిదివ్యం. ఆ మహాత్మునివల్ల అనేక ధర్మాలు తెలుసుకున్నాడు ధర్మరాజు. విష్ణుసహస్రం, భీష్మస్తవరాజం;వంటి దివ్యస్తోత్ర రత్నాలు మనకు అనుగ్రహించినది భీష్మపితామహుడే. ఈ ఏకాదశి రోజున విష్ణుపూజ, ఉపవాసం, విష్ణుసహస్రనామ పారాయణం విశేష ఫలప్రదం.

**మాఘపూర్ణిమ :** ఈరోజున స్నానం, విశేషించి సముద్ర స్నానం మహాఫల ప్రదం. శివకేశవార్చనతో, దేవీ పూజతో రోజున గడపడం సర్వశుభాలను ప్రసాదిస్తుంది. దీనినే 'మహామాఘి' అని కూడా అంటారు. ఆధ్యాత్మిక జగత్తులో ధృవతార వంటి మహాయోగి శ్రీరామకృష్ణపరమహంస జన్మించింది ఈరోజునే. ఆ పరమభాగవత శిఖామణి జీవితం, ఉపదేశం సర్వులకూ ఆరాధ్యం, అనుసరణీయము.

**సంకష్టహరచతుర్థి :** సమస్త కష్టాలను పోగొట్టే గణపతి వ్రతాన్ని అచరించే పర్వదినమిది.

**మహాశివరాత్రి :** మాఘబహుళ చతుర్దశి రాత్రిని 'శివరాత్రి' అంటారు. శివారాధనకు సర్వోత్కృష్టమైన రోజు ఇది. ఉదయాన్నే శివస్మరణతోలేచి, స్నానాది కర్మలైన తరువాత శివపూజ చేసుకోవాలి. షోడశోపచారాలతో పూజించాలి. లేదా శివాలయానికి వెళ్లైనా అర్చన, అభిషేకం చేయించడం శ్రేష్టం. శివుడు 'ఆశుతోషుడు' అంటే వెంటనే సంతోషించే దేవుడు. సులభప్రసన్నుడు. అభిషేక ప్రియుడైన ఈ స్వామిని కొబ్బరి నీరు, ఫలరసాలు, పంచామృతాలు, చెరకురసం, పాలు మొదలైన వాటితో అభిషేకిస్తారు. నిరాకారుడూ, సర్వసాకారాలకూ మూలమైనవాడూ, ఆది మధ్యాంత రహితుడూ, జ్యోతిః స్వరూపుడూ కనుక "లింగ" రూపంలో శివుని ఆరాధిస్తారు.

వెయ్యి పార్థివలింగాలు చేసి అర్చించే "సహస్రలింగార్చన" మున్నూట అరవై పైగా లింగాలు (పార్థివం మట్టితో చేసినవి) చేసి పూజించే 'మహాలింగార్చన' రుద్రనమకాలతో అభిషేకించే 'రుద్రాభిషేకం' ఒక రుద్రనమకం (చమకసహితంగా) తో అభిషేకించే రుద్రార్చన....ఇలా అనేక శివపూజలు వారి వారి శక్త్యనుసారం చేయవచ్చు.

స్ఫటిక, బాణలింగాలను అర్చించేందుకు చాలా నియమనిష్టలు అవసరం. అలాకాక వెండి, బంగారం వంటి వాటితో చేసిన శివలింగాలను అర్చించుకోవచ్చు. మంత్రాలు రాకపోయినా, ఫరవాలేదు. శివనామం చాలు. 'శివాయనమః' అనే పంచాక్షరాలు పలుకుతూ శివుని ధ్యానించి అభిషేకంచేసి, మారేడు దళాలతో, తులసిదళాలతో, జిల్లేడు, ఉమ్మెత్త, తుమ్మివంటి పూలతో పూజించితేచాలు. మనసారా స్మరించడమే మహాదేవుని అనుగ్రహానికి కారణం. విబూది ధరించి, రుద్రాక్షలు ధరించి శివార్చన చేయాలి. (రుద్రాక్షాదుల్ని శుచిగా ఉన్నప్పుడే ధరించాలి.)

**మహాదేవ మహాదేవ మహాదేవేతి వాదనమ్ ।**
**వత్సం గౌరివ గౌరీశో ధావంత మనుధావతి ॥**

"మహాదేవ-మహాదేవ-మహాదేవ" అని పలికే వారివెంట పార్వతీ సహితుడైన శివుడు నిరంతరం తోడు ఉంటాడు. పరుగెడుతున్న దూడవెంట వదలకుండా పరుగుపెట్టే గోమాతలా గౌరీశుడు ఆభక్తుని కాచుకుంటాడు.



## ఫాల్గుణమాసం

ఫాల్గుణమాసం విష్ణుప్రీతికరమని భాగవతం చెప్తోంది. ఫాల్గుణశుక్ల పాడ్యమి మొదలుకొని పన్నెండు దినాలు 'పయోవ్రతం' ఆచరించితే శ్రేష్ఠమని భాగవతం చెబుతోంది. శ్రీ విష్ణువునకు క్షీరాన్ని నివేదించి, దానిని ప్రసాదంగా స్వీకరించే వ్రతమిది. అదితీదేవి ఈ వ్రతాన్ని ఆచరించి వామనుని పుత్రునిగా కన్నది. ఫాల్గుణంలో గోదానం, ధాన్యదానం, వస్త్రదానం, గోవిందునికి ప్రీతిని కలిగిస్తాయని ధర్మశాస్త్ర వచనం.

**పుత్రగణపతి వ్రతం :** ఈరోజు గణపతిని దీక్షగా ఆరాధించిన వారికి పుత్రప్రాప్తి కలుగుతుందని శాస్త్రవచనం. ఉదయాన్నే అభ్యంగన స్నానం చేసి, "భక్తిశ్రద్ధలతో" గణపతిని కుసుమాలతో, అక్షింతలతో, గరికలతో, మారేడుతో, చందనాదులతో అర్పించి, షోడశోపచార పూజచేయాలి. గణపతికి ప్రీతికరమైన ఉండ్రాళ్లు, కుడుములు, వడపప్పు, బెల్లం, కొబ్బరి, అరటిపళ్ళు వంటివి నివేదన చేసి, వాటిని ప్రసాదంగా స్వీకరించాలి. (వినాయకచవితినాడు చేసినట్టే ఈరోజు ఆచరించవచ్చు.) ఇలా వ్రతం చేసిన వారికి సత్పుత్రుడు జన్మిస్తాడు.

**శుద్ధ ఏకాదశి మీన సంక్రమణం :** ఇది ఒక విశిష్టమైన ఏకాదశి, ఈరోజున భక్తితో నారాయణుని ఆరాధించి, ఉపవాసాది దీక్షలతో విష్ణు సహస్ర నామా పారాయణ వంటివి ఆచరించడం ఉత్తమ ఫలాలనిస్తుంది. విశేషించి ఈ రోజున మీన సంక్రాంతి కూడా కావడంతో వ్రత, జప, పారాయణాదులు మంచి ఫలితాల్నిస్తాయి.

**ఫాల్గుణ పూర్ణిమ :** ఈ రోజు హోలీపండుగ నిర్వహిస్తారు. సాయంత్రవేళ రాక్షస బాధానివారణకు ఈ పూజ చేస్తారు. ఇప్పటికీ భారతదేశంలో కొన్ని ప్రాంతాల్లో ఈ ఆచారాన్ని తు.చ.తప్పకుండా పాటిస్తున్నారు. 'హోళికా' అనే శక్తిని ఈ రోజున పూజిస్తారు. హోళికా పూజాఘడియలు అంటే రాత్రి సమయంలో గ్రహణంవలె – ఇంకే శుభకార్యాలు చేయరాదు. పూర్ణిమ ఉదయాన్నే మహాలక్ష్మీపూజ విశేష, ఫలప్రదం, ఉత్కళ, వంగ రాష్ట్రాలలో ప్రత్యేకించి కృష్ణ ప్రతిమకు డోలోత్సవం నిర్వహిస్తారు. ఫాల్గుణ పూర్ణిమనాడు ఊయలలో శ్రీకృష్ణ ప్రతిమనుంచి పూజించడం విశేషఫలప్రదం.

ఈ పూర్ణిమ విశేష శక్తితో కూడినది. ఈ దినాన రాక్షసపీడ పోయేందుకు "హోళికా" అనే ఒక విధమైన శక్తిని ఆరాధిస్తారు. ఆమె ప్రీతికోసం అందరూ కలిసి గానాలు చేయడం, పరిహాసాలాడడం చేస్తారు. హోళికాగ్నిని రగిల్చి ఆరాధించే సంప్రదాయం. ఇప్పటి నుండే ఆవిర్భవించిందని పురాణకథ. ఈ ఏడాది పూర్ణిమ, ఉత్తర ఫల్గుణి కలిసి వచ్చాయి. కనుక ఈ దినాన భక్తిశ్రద్ధలతో మహాలక్ష్మిని షోడశోపచారాలతో చక్కగా ఆరాధించి లక్ష్మీఅష్టోత్తర శతనామాలు, కనకధారస్తోత్రం

వంటివి పారాయణ చేయడం మంచిది. ఈ రోజున లక్ష్మిని శ్రద్ధగా అర్చించే వారికి సమస్త ఐశ్వర్యాలు సిద్ధిస్తాయి. స్వామి అయ్యప్పకూడా ఈ రోజే ఉదయించాడని ఆరాధనలు జరుపుతారు. ఈరోజుననే శ్రీకృష్ణుని ఉయ్యాలలో వేసి ఆరాధించాలి. దీనిని "డోలోత్సవం" అంటారు. ఒరిస్సావంటి ప్రాంతాలలో డోలా పూర్ణిమ పేరుతో ఇప్పటికీ దీనిని ఆచరిస్తారు.

**నరాడోలాగతం దృష్ట్వా గోవిందం పురుషోత్తమం ।**
**ఫాల్గున్యాం ప్రయతో భూత్వా గోవిందస్య పురంవ్రజేత్ ॥**

ఉయ్యాలలో అర్చింపబడిన పురుషోత్తముడైన గోవిందుని ఈ రోజున దర్శించిన వారికి వైకుంఠలోకం ప్రాప్తిస్తుందని ధర్మశాస్త్రాల వాక్యం.

**వసంతోత్సవం :** వివిధ వర్ణాల పొడులను, నీళ్లను జల్లుకొనే ఉత్సవం ఈ రోజున ఆచరించాలని ధర్మశాస్త్రం చెబుతోంది. ఇదే వసంతోత్సవం. "వసంతాలు ఆడడం" అనే ఆచారంగా తెలుగునాడు ప్రాచీనకాలం నుండి ప్రాచుర్యం పొందింది ఈ పండుగ. ఈ రోజున ఉదయాన్నే 'తైలాభ్యంగము' చేయాలి. (తలకు నూనె రాసుకొని, ఒంటికి నలుగు పెట్టుకొని స్నానం చేయాలి). తరువాత 'చూతకుసుమ భక్షణం' అనే ప్రక్రియను ఆచరించాలి.



దానివిధి : ఆవుపేడతో అలికిన ఇంటి ప్రాంగణంలో తెల్లని వస్త్రాన్ని ఆసనంగా చేసుకొని, తూర్పుముఖంగా కూర్చుని, ఒక ముత్తైదువుచే వందన తిలకం, నీరాజనం పొంది చందనంతో కూడిన మామిడి పువ్వును భక్షించాలి. ఇది అన్ని కోరికలను తీర్చుతుందని శాస్త్రోక్తి.

**చూతమగ్ర్యం వసంతస్య మాకందకుసుమం తద ।**
**సచందనం పిచామ్యద్య సర్వకామార్థ సిద్ధయే ॥**

అనే శ్లోకంతో మామిడి పూతను స్వీకరించాలి. పౌరులు, జానపదులు అంతా కలిసి సింధూరచూర్ణం, భర్గుండ, చందనపు పొడివంటి వాటిని జల్లుకొని తాంబూలా లిచ్చుకొని నృత్యగీత వాద్యాలతో మహోత్సవం చేయాలని శాస్త్రాలు చెబుతున్నాయి. ఇదీ రంగులు జల్లుకొనే పద్ధతి.

(అందరి మధ్య స్నేహాన్ని పెంచి, గౌరవాన్ని కలిగించే ఈ చక్కని పండుగ కూడా కొన్నిచోట్ల వికృత ధోరణులకు గురి అవుతుండటం విచారకరం. ప్రమాద కరమైన పొడులు, నూనెలు కలిపి హింసాయుతంగా కూడా రంగులు జల్లడం జరుగుతోంది. ఇటువంటి ధోరణుల్ని వదలి, మన ఆచారంలోని అచ్చమైన అసలు విధానాలను మళ్లీ అమలుపరిస్తే ఆరోగ్యకరమైన వాతావరణం వెల్లివిరుస్తుంది.

**మీన సంక్రమణం :** ఈ రోజున సూర్యుడు మీనరాశిలో ప్రవేశించే సమయం. పవిత్రకార్యాలు, జపదానాదులు ఈ సమయాన విశేష ఫలప్రదం. దీనిని షడశీతి సంక్రమణం అంటారు.



## చైత్రమాసం

### నూతన సంవత్సరాది ఉగాది.

**ఉగాది పండుగ :** ఇది మనకు సంవత్సరాది. భారతదేశంలో అనేక ప్రాంతాలలో రమారమి ఇదే సమయాలలో సంవత్సరాది ప్రారంభమౌతుంది. మనకు తొలి పండుగ ఇది. సూక్ష్మప్రపంచంలోని దైవీశక్తుల స్పందనలను, అందుకొనేందుకు అనువైన సమయమిది. బ్రాహ్మీ ముహూర్తానలేచి, అభ్యంగన స్నానం చేసి, భగవత్పూజ చేయడం ఈ రోజువిధి. అభ్యంగన స్నానం అతిముఖ్య మైనవిధి. తదనంతరం నూతన వస్త్రాలు ధరించి, ఇష్టదేవతారాధనచేసి, ఉగాది పచ్చడి దేవునికి నివేదించి ఆరగించాలి. మరోముఖ్యవిధి–పంచాంగశ్రవణం. తిథి,వార, నక్షత్రాదులకు అధిదేవతలున్నారు. కనుక పంచాంగ శ్రవణంవల్ల ఆ దేవతలు సంతృప్తి చెందుతారు.

ఈరోజు నుండి నవరాత్రులు ప్రారంభమవుతాయి. వీటిని 'వసంత నవ రాత్రులు' అంటారు. ఈ నవరాత్రులూ దేవిని ఆరాధిస్తారు. లలిత, దుర్గాది శక్తిమూర్తుల్ని ఈ తొమ్మిదిరోజులు ఆరాధించడం మహిమాన్వితం. ఈ రోజునుండే శ్రీరామనవరాత్రులు ఆరంభిస్తారు. ఈ పాడ్యమినుండి తొమ్మిది రోజులు శ్రీరామార్చన, శ్రీమద్రామాయణ పారాయణ క్షేమకరం, శుభప్రదం. 'చలివేందర'లు ఏర్పాటు చేయడానికి కూడా ఇది విశేషఫలప్రదం.

మనభారతీయ సంస్కృతిలో "భూతయజ్ఞం" చెప్పబడింది. సాటిమానవులకు, ప్రాణులకు సంతృప్తి కలిగించడం, ఆదుకోవడం భగవత్ ప్రీతికరం అని మన ఆర్ష గ్రంథాలు చెస్తున్నాయి. కనుక ఈ చలివేందర లను ఏర్పాటుచేయుట మన ఆచారాలు. బాటసారులకు దాహార్తులకేకాక ఇతర ప్రాణులకు కూడా జలాలను ఇచ్చి ఆదుకోవడం విధి. ఈరోజు నుండి నాలుగు నెలలపాటు ఈ చలివేందర జరగాలి. దీనినే ప్రసారాలు అంటారు.

చైత్రారంభాన ప్రకృతిలో అంతా కొత్తదనం చిగురులూనే ఈ తరుణంలోనే కొత్తసంవత్సరాదిని జరుపుకోవటంలో మన సంప్రదాయంలో ఖగోళశాస్త్ర విజ్ఞానం ఇమిడివుంది. ఖగోళపరంగా జరిగే మార్పునీ, ఆ మార్పువల్ల మనకు కలిగే ప్రభావాన్ని దర్శించిన ఋషులు ఆ ప్రభావం సత్ప్రభావం అయ్యేందుకని వారి ప్రపంచ విజ్ఞానంతో ఏర్పాటు చేసిన పర్వదినాలు మన పండుగలు.



సంవత్సరానికి ప్రారంభమైన తొలి తొమ్మిది దినాలు వైష్ణవీ శక్తిని (ఈ శక్తికి పురుషరూపుడు శ్రీరాముడు) ఆరాధించితే లోకక్షేమంకలుగుతుంది.

**చైత్రేమాసి జగద్బ్రహ్మోససర్జ ప్రథమేహని ।**
**శుక్లపక్షే సమగ్రంతు తదా సూర్యోదమేసతి ॥**

చైత్రమాసపు తొలిరోజున సృష్టి ప్రారంభమయ్యింది. కనుక ప్రతి ఏటా ఆనాడు "యుగాది" పర్వదినం జరుపుకుంటాం. (ఇంచుమించు అన్ని ప్రాంతాలవారు వారి వారి సంప్రదాయాల ప్రకారం. అటుయిటూగా (కొంచెం ముందు వెనకల) నూతన సంవత్సరాన్ని జరుపుతారు.) ఈ రోజున ఉదయాన్నే అభ్యంగస్నానం (తలంటు స్నానం) చేయడం ముఖ్యకర్తవ్యం. స్నానం తరువాత నూతన వస్త్రధారణ, భగవత్పూజ పంచాగశ్రవణం (పఠనం), నింబకుసుమాది (ఉగాది పచ్చడి) భక్షణం కర్తవ్యాలు. ఆయుర్వేద శాస్త్రరీత్యా ఈ కాలంలో ఉండే వాతావరణాది లక్షణాలను ఆధారం చేసుకొని మన పెద్దలు ఈ రోజున ఈనైవేద్యాన్ని భక్షించమని నిర్దేశించారు.

తిథి, వార, నక్షత్రాదులలో దేవతాశక్తి అధిష్ఠించి ఉంది. తిథి దేవత, నక్షత్ర, దేవత, దినదేవత, పంచాంగ పఠితను ఆశీర్వదిస్తారు. అందుకే ప్రతిదినం సంకల్పంలో మనం తిథి మొదలైనవి చెప్పుకుంటాం. అదేవిధంగా సంవత్సరదేవత అనుగ్రహార్థం పంచాగపఠనం దైవసన్నిధిలో జరుపుతాం. ఈ రోజునుండి వసంతనవరాత్రులు (నవమివరకు) నిర్వహిస్తారు. శ్రీరామచంద్రమూర్తి ఆరాధన, శ్రీ మద్రామాయణ పారాయణ, ప్రవచనాదులు "శ్రీరామ వసంతనవరాత్రుల" కర్తవ్యం. అదేవిధంగా శక్తి ఆరాధనకు కూడా విశిష్టమైన కాలమిది. ఈ తొమ్మిది రోజులుకూడా 'దేవీనవరాత్రులు' నిర్వహిస్తారు. ఆ నవరాత్రుల ప్రారంభమిదే. ఈ నవరాత్రులు అమ్మను ఆరాధిస్తే విజయైశ్వర్యాదులు లభిస్తాయి.

ఈ దినం నుండి 'చలివేంద్రం' ఏర్పాటు చేయడం శాస్త్రాచారం, బాటసారులకు దాహశాంతి కలిగించే నిమిత్తం వీటిని ఏర్పాటు చేస్తారు. ఇక్కడి నుండి నాలుగు నెలలపాటు వీటిని కొనసాగించాలి. ప్రాణికోటిని తృప్తిపరచడమే మన యజ్ఞ సంస్కృతిలో ప్రధాన విషయం.

**ప్రమేయం సర్వసామాన్యా భూతేభ్యః ప్రతిపాదితా ।**
**ప్రదానాత్పితరస్సర్వే తృప్యంతు చ పితామహాః ।**
**అనివార్యమితోదేయం జలం మాస చతుష్టయమ్ ॥**



(ఈ చలివేంద్రం సమస్తప్రాణుల నిమిత్తం ఏర్పాటు చేయబడింది. దానివలన తండ్రులు, తాతలు తృప్తిని పొందుదురుగాక.) అనే మంత్రంతో 'చలివేంద్ర' ప్రారంభించాలి. ఈ చలివేంద్రం నిర్వహించే శక్తిలేనివారు ఈనాటి నుండి ప్రతిదినం ఒక కలశాన్ని దానంచేయాలి.

**ఏషధర్మఘటో దత్తో బ్రహ్మ విష్ణు శివాత్మకః ।**
**అస్య ప్రదానాత్ సకలా మనుసంతు మనోరథాః ॥**

-అనే మంత్రంతో ఉదకుంభ (నీటికడవ) ప్రదానం చేయాలి.

**మత్స్యజయంతి - ఆందోలినీవ్రతం :** ఇది చైత్రశుక్ల తృతీయ. ఈరోజును 'మన్వాది' అంటారు. పార్వతీ పరమేశ్వరులను ఆరాధించి డోల (ఉయ్యాల) లో ఉంచి పూజిస్తారు.

**తృతీయాయాం యజేద్దేవీం శంకరేణ సమన్వితామ్**
**కుంకుమా గరుకంచ్చర మణివస్త్ర సుగంధకైః**
**స్రగ్గంధధూపదీపైశ్చ దమనేన విశేషతః**
**ఆందోలయేత్తతో వత్స శివోమాతుష్టయే సదా (దేవీపురాణం)**



ఉమామహేశ్వరులను గంధపుష్పధూపదీపాదులతో అర్చించి, ఉయ్యాలలో ఉంచాలని దేవీపురాణం చెప్తోంది. తద్వారా ఉమాశివులు తృప్తి పొందుతారని చెప్పబడింది. అంతేకాక ఈ రోజున నారాయణుడు మత్స్యరూపంతో అవతరించి వేదాలను ఉద్ధరించిన తిథి. "చైత్రశుక్ల తృతీయనాడు అపరాహ్ణమున మత్స్యోత్పత్తి" అనిపురాణ ప్రమాణం. ఈవిధంగా ఈరోజున విష్ణ్వారాధన ప్రాధాన్యం కూడా చెప్పారు.

**చతుర్థి - గణేశపూజ :** ఈ రోజున లడ్డుకాదులు నివేదన చేసి గణపతిని పూజించిన విఘ్నములు నశించి, సర్వాభీష్టాలు నెరవేరుతాయని ధర్మశాస్త్రము.

**నాగపూజ :** ఈ రోజున (పంచమి) అనంతాది నాగపూజ చేసి క్షీరాన్ని, నెయ్యిని నివేదనచేయాలి. ఈ పంచమినాడే లక్ష్మీపూజను చేయడం కూడా ఉంది.

**స్కంధపూజ :** ఒక్కొక్క తిథి ఒక్కొక్క దేవతారాధనా విశేషంతో ఉంటుంది. సంవత్సరంలో ప్రథమమాసమైన చైత్రమాసంలోనైనా ఆయా తిథులలో ఆయాదేవతల్ని పూజించడం సంవత్సరమంతా ఉత్తమ ఫలాలనిస్తుంది.

ఈ షష్ఠి తిథినాడు సుబ్రహ్మణ్యస్వామిని పూజించితే శ్రేష్ఠం.

**శ్రీరామనవమి :** చైతశుక్ల నవమినాడు పునర్వసు నక్షత్రాన మధ్యాహ్నవేళ, కర్కాటక లగ్నంలో, సూర్యుడు మేషంలోను, ఐదుగ్రహాలు ఉచ్ఛస్థానంలో ఉండగా

శ్రీరామావిర్భావం జరిగింది. ఈ రోజున శ్రీరాముని ఆరాధించి ఉపవసించడం ఆచారం. లేదా ఏకభుక్తం చేయవచ్చు.



**నవమ్యా అంగభూతేన ఏకభుక్తేన రాఘవ ।**
**ఇక్ష్వాకువంశతిలకలక ప్రీతోభవ భవప్రియ ।**

అని అర్చనాదుల్ని రామార్పణం చేయాలి. ఈజుతో దేవీ నవరాత్రులు కూడా పూర్తవుతాయి.

## అష్టమి వ్రతాలు

మన హిందూమతంలో ప్రతీదానికి ఎన్నో నియమాలు, నిష్ఠలు, శాస్త్రాలు, నిర్బంధాలు ఏర్పరిచారు మనపెద్దలు. అన్నిటికీ బలమైన కారణం ఉండడం మన మతానికున్న విశేషం. వివరణ లేకపోయినా, సముచితమైన ఆలోచనలతో సర్వజనావళి శ్రేయస్సు కోసం ఏర్పరిచినవే అవి అన్నీ. అందుకే, చాలా వాటికి “ఎందుకు?” అనే ప్రశ్న వేయకుండా ఆచరించడం మనకెంతో సుఖమయం. కానీ, కొన్ని విషయాలకొస్తే, అవి వ్యతిరేకంగా కనబడతాయి. అందుకు కూడా కారణాలు ఉంటాయేమో మనకు అవగాహన లేకపోవచ్చు. అంతమాత్రాన అవి పూర్తి విరుద్ధమని మనం చెప్పకూడదు. ఇకపోతే, మన తిథులు, వాటి గురించి నిర్ణయించిన విధివిధాన స్వభావ విశేషాల గురించి ప్రస్తుతం పరిశీలిద్దాం.

సంఖ్యాశాస్త్రంలో కొన్ని సంఖ్యలకి ఎలాగైతే ప్రాముఖ్యత నిచ్చారో, అలాకొన్ని తిథులకి ప్రాముఖ్యత నిచ్చారు. మన వేదకోవిదులు, అమావాస్య నుండి పౌర్ణమిదాకా శుద్ధము, శుక్లము అని, పౌర్ణమి నుంచి అమావాస్య దాకా బహుళమని విభజించడమే గాక, రెండు పక్షాలలోనూ కొన్ని తిథులను మంచివిగా, సుముహూర్తపు తిథులుగా నిర్ణయించారు. కొన్నిటిని నిషేధిస్తే, కొన్నిటిని మధ్యమంగా ఉంచారు. నిషేధించబడ్డ తిథులంటే అవి అసలు దేనికీ పనికిరావని కాదు. వివాహోపనయనాలు ఆ నిషేధించబడ్డ తిథులలో జరుగుతాయి కూడా. ఎందుకంటే, వివాహోపనయనాలకి తారాబలం, చంద్రబలం, వంటి వేరే ముహూర్త పొంతనలు ఆధారమవుతాయి కాబట్టి.

**తిథులు-వాటి వివరణ :** అమావాస్య, పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పౌర్ణమి. వీటిలో విదియ తదియలు పంచమి, షష్ఠి సప్తమి, దశమి, ఏకాదశిలు సర్వశ్రేష్ఠం. ప్రయాణాలకు చవితి, త్రయోదశి, చతుర్దశి,నవమి, షష్ఠి అనుకూలం కాదు. ప్రయాణం చేయడానికి, ఎవరింటికైనా వెళ్ళడానికి నవమి పనికి రాకపోయినా, కొన్నింటికి ఉపయోగిస్తారు. షష్ఠిరోజు ఎక్కడికైనా వెళితే, అక్కడి వారితో కలహం సంభవిస్తుందంటారు. కానీ, నవమి లాగానే షష్ఠికూడా కొన్నింటికి శ్రేష్ఠమే.



ఇక- పాడ్యమి జాడ్యమి అని, అష్టమి కష్టాలు అని అసలు దేనికీ పనికిరావని నిర్ణయించడమైనది. త్రయోదశి, చతుర్దశి విషయానికొస్తే శుక్లపక్షంలో అయితే మంచిది, అదే బహుళంలో అస్సలు కూడదు. ద్వాదశి మంచిదిగా అతి తక్కువ మంది అభిప్రాయపడినా ఏకాదశి వ్రతం, పూజ, ద్వాదశి పారణతో గానీ పూర్తికాక పోవడం వల్ల ద్వాదశి కూడా మంచిదే కానీ, ద్వాదశి అంతగా శ్రేష్ఠం కాదు.

అమావాస్య తమిళనాడు, కేరళ ప్రాంతాలకు సర్వశ్రేష్ఠం. ఆ మరుసటి రోజు నుంచే చంద్రుడు ఎదగడం ప్రారంభిస్తాడు గనుకనే, అమావాస్య రోజు ప్రారంభిస్తే ఏ పనైనా, చంద్రుని లాగా సంపూర్ణంగా వృద్ధి నొందుతుందని, అలాగే మనకు అమావాస్య శ్రేష్ఠం కాకపోయినా “శుక్లపక్ష చంద్రునిలాగా దినదినం వృద్ధిచెందు” అనే దీవెన మనకు కూడా వాడుకలో ఉన్నదే. ఏదిఏమైనా బహుళపక్షం కంటే, శుక్లపక్షం అత్యంతశ్రేష్ఠం.

**ఇక అష్టమి కష్టాలు అన్న మనవారే, అష్టమి జయతిథి అనికూడా అంటారు.** సాక్షాత్తు శ్రీమహావిష్ణువు ద్వాపరయుగావతారంగా శ్రీకృష్ణపరమాత్ముడిగా భూలోకంలో జన్మించినది అష్టమిరోజునే. తల్లిదండ్రులు చెరసాలలో బంధింపబడి ఉండడం తప్ప మరే ఇతర కష్టాలు శ్రీకృష్ణుడి విషయంలో మనం చూడం.



శ్రీరాముడు స్వచ్ఛమైన మానవ జన్మలాగా కష్ట సుఖాల సమ్మిళతమైతే శ్రీకృష్ణుడు స్వచ్ఛమైన భోగయోగి, సర్వసుఖాలను భవిస్తూనే, సూక్ష్మాతి సూక్ష్మమైన తత్వాన్ని మనకు తెలియజెప్పాడు. మరి అంతటి సునిశిత సూక్ష్మమహోత్తమ యోగపురుషుడు జన్మించిన అష్టమి ఖచ్చితంగా జయ తిథే, సందేహంలేదు. అలాంటి అష్టమిరోజు చేయదగ్గ వ్రతాల వివరణ చూద్దాం. ఈ అష్టమి వ్రతాలు - ముఖ్యంగా నవగ్రహాలకు సంబంధించి నవే. నవగ్రహాల పూజలు ప్రత్యేకంగా నవగ్రహాలకు మాత్రమే చేయరు.

ఏదేని ఒక దైవానికి ప్రధానంగా పూజచేసి, ఆ తర్వాత ఆ సంబంధిత గ్రహానికి పూజచేస్తారు. దేనికైనా అగ్రతాంబూలంగా ముందు విఘ్నేశ్వర పూజ చేయాల్సిందే కదా!

**వ్రతాలపేర్లు :** 1. సూర్యవ్రతము 2. చంద్ర వ్రతం 3. రాజరాజేశ్వర వ్రతం 4. మహా వ్రతం 5. విశ్వరూప వ్రతం 6. పుత్రవ్రతం 7. భౌమవ్రతం 8. బుధవ్రతం 9. గురువ్రతం 10. శుక్రవ్రతం 11. శనీశ్వరవ్రతం. పైన పేర్కొన్న అన్ని వ్రతాలు రెండు పక్షాల అష్టమి తిథులలో చేయదగ్గవే. ఆ అష్టమితో పాటు కొన్ని నక్షత్రాలు. కొన్ని వారాలు కలిసినపుడు ఒక్కొక్క వ్రతం చేయాలి.

**ఈ వ్రతాల ఫలితం ఏమిటి :** మనకున్న ప్రతి పూజ, వ్రతం ఒక్కొక్క విషయానికి సంబంధించినవి. ఒక్కొక్క సత్ఫలితాన్ని ఇచ్చేవీనూ. దసరాలప్పుడు చేసే సరస్వతీ పూజ విద్యారంభానికి, వరలక్ష్మీవ్రతం ధనధాన్య సౌభాగ్యానికే అని మనకు నమ్మకం. ఈ వ్రతాలన్నీ ధనధాన్య సమృద్ధి, పుత్రపౌత్రాభివృద్ధి, సకల శుభసంతోషాలు, అష్టైశ్వర్యాలు ఏర్పడటం కోసం చేసేవి. వీటితో పాటు అష్టసిద్ధులు, సర్వజనాకర్షణ కలగడం కూడా ఈ వ్రతాల వల్ల జరుగుతుంది. ఈ వ్రతాల వల్ల నవగ్రహ శాంతి జరుగుతుంది. ఎప్పుడైతే మనిషి గ్రహస్థితి మెరుగవుతుందో, అప్పుడు మనిషికి అన్ని రకాల సుఖశాంతులు కలుగుతాయి. అందుకే, గ్రహదోషం ఉన్నవారు, గ్రహస్థితి సరిగా లేనివారు, అష్టమి వ్రతాలు చేయవచ్చు.

**అష్టమి వ్రతాల ప్రత్యేకత :** ఈ అష్టమి వ్రతాలన్నింటికి విఘ్నేశ్వర ధ్యానా నంతరం, లోకరక్షకుడు, లయకారకుడు, ముక్కంటితో భువనాలన్నీ పరిరక్షించే పాలకుడు, నిరాడంబరుడు, నిర్వికారుడు, సాకారుడు, నిశ్చలుడు, నిర్మలుడు, సకలసద్గుణ సంపన్నుడు, మనోవాక్కాయ కర్మఫలుడు, లలితకళాప్రీతిపాత్రుడు, చంద్ర గంగాధరుడు అయిన పరమేశ్వరుడికి, ఆయన సహధర్మచారిణి పార్వతీదేవికి పూజచేయాలి. ఈ శివపార్వతులకు పూజఅంటే ఏమిటో, ఎలా ఎంతసేపు చేయాలో లాంటి సందేహాలు పెట్టుకోనక్కర్లేదు. అన్ని పూజలలోకి శివపార్వతుల పూజే అత్యంత సులభదాయకం. పూవులో, అక్షింతలో, తీసుకుని శివపార్వతుల విగ్రహానికో, పటానికో శివాష్టోత్తరం, గౌరీ లేదా ఉమాష్టోత్తరం చదువుతూ పూజచేస్తే చాలు. ఆ తర్వాత ఏ గ్రహానికి సంబంధించిన వ్రతమైతే...ఆ గ్రహాష్టోత్తరం చేయాలి. ఇది ఈ వ్రత విధానం.

**1. సూర్యవ్రతం :** అష్టమి, ఆదివారంతోపాటు అశ్విని, రోహిణి, పునర్వసు, మఖ, ఉత్తర, ఉత్తరాభాద్ర ఉత్తరాషాఢ, రేవతి నక్షత్రాలలో ఏదేని ఒక నక్షత్రం కలిసిన రోజున శివపార్వతులపూజచేసి, ఎరుపురంగు పూలతో సూర్యాష్టోత్తరము చేస్తూ పూజించి, శక్త్యానుసారం నైవేద్యం పెట్టాలి.

**2. చంద్ర వ్రతం :** శుద్ధాష్టమి, బహుళాష్టమి, సోమవారం, మృగశిర, రోహిణి నక్షత్ర సంయోగమైన రోజున చంద్రవ్రతం చేసుకోవచ్చు. తెల్లరంగు పూలతో చంద్రాష్టోత్తరం చేయడంవల్ల, సర్వజనాకర్షణ తథ్యం.

**3. రాజరాజేశ్వరవ్రతం :** బహుళాష్టమి, బుధవారం, స్వాతీనక్షత్ర శుభ యోగంలో చేసే ఈ వ్రతానికి ఏ గ్రహాష్టోత్తరం పారాయణ అవసరంలేదు కానీ, శివపార్వతుల పూజానంతరం; రుద్రాష్టకం, విశ్వనాథాష్టకం, లింగాష్టకం పారాయణ చేస్తూ, బిల్వం లేదా ఏదేని తెల్లరంగు పూవులతో పూజించాలి.



**4. మహావ్రతం:** బహుళాష్టమి, శుక్రవారం, ధనిష్ఠ నక్షత్రం గూడిన ఈ శుభవ్రతానికి కాస్త మరింత ప్రత్యేక ఫలితం ఉంది. వెనక 7 తరాల పితృదేవతలు శివసన్నిధికి చేరుకుని, జన్మ రహితులవుతారన్నది నిజం.

**5. విశ్వరూపాయ వ్రతం :** శుద్ధాష్టమి, సోమవారం, రేవతి నక్షత్రాన చేసే ఈ వ్రతం రోజు రాత్రి శివరాత్రి, వైకుంఠ ఏకాదశి లాగా జాగరం అనివార్యం. కోరుకున్నవన్నీ లభ్యమవుతాయన్నది ఈ వ్రత ప్రత్యేకత.

**6. పుత్ర వ్రతం :** శుద్ధాష్టమి, సోమవారం, రోహిణి నక్షత్రాన జరుపబడే ఈ పుత్ర వ్రతం పేరు వినగానే ఆ వ్రత వైశిష్ట్యం తెలుస్తూనే వుంది కదా! సంతాన ప్రాప్తికోసం చేసే వివిధ రకాల పూజలలో ఈ పుత్రవ్రతం సైతం గణనీయం.

**7. భౌమావ్రతం :** మంగళవారం శుద్ధాష్టమి, రోహిణి నక్షత్రాన చేసే ఈ పూజ కుజదోష నివారణకు దోహదపడుతుంది.

**8. బుధవ్రతం :** శుద్ధాష్టమి, బుధవారం, రోహిణి నక్షత్రాన శివపార్వతుల పూజతో పాటుగా, బుధాష్టోత్తరం చేయాలి. తులసితో పూజ శ్రేష్ఠం.

**9. గురువ్రతం :** శుద్ధాష్టమి, గురువారం, పునర్వసు నక్షత్రపు ఈ వ్రతం వల్ల గురుబలం కలుగుతుంది. చామంతులతో గురు అష్టోత్తర పూజచేయాలి.

**10. శుక్రవ్రతం :** శుక్రాష్టోత్తరం చేస్తూ, తెల్లరంగు పూలతో పూజించాల్సిన ఈ వ్రతం, శుక్రవారం, శుద్ధాష్టమి, పునర్వసు నక్షత్ర సంయోగ శుభ దినాన చేయడం వలన కుటుంబ క్షేమం కూడా మెరుగవుతుంది.

**11. శనివ్రతం :** శుద్ధాష్టమి, శనివారం, కృత్తికా నక్షత్రాన చేయదగ్గ ఈ వ్రతానికి, తక్కిన వ్రతఫలితంతోపాటుగా, శనీశ్వర శాంతి అనుగ్రహమేగాక, కృత్తికా నక్షత్రం కావడం మూలాన షణ్ముఖుని అనుగ్రహం కూడా కలుగుతుంది. నీలం రంగు పూలతో శనీశ్వరాష్టోత్తరం చేయాలి. మొత్తానికి ఈ అష్టమివ్రతాలకు ఎంతో నియమం,మడి, ఆచారం, మాత్రమేకాదు. పెద్దపెద్ద ఖరీదైన పిండివంటలు నైవేద్యంగా అవసరంలేదు. పూజావిధానం కూడా అత్యంత సులభదాయకం కావడం మరొక విశేషం. ఇలా ఎన్నో ప్రత్యేకతలున్న ఈ అష్టమి వ్రతాలు ప్రత్యేక ఫలితాల నిస్తాయనడంలో సందేహంలేదు.

## అధిక మాసం...అంటే! :-



ఆకాశాన్ని గమనిస్తూ, కాలగమనాన్ని గుర్తించే భారతీయ సిద్ధాంత గణితాన్ని "పంచాంగము" అని అంటారు. "పంచ" అనగా అయిదు. "అంగము" అనగా భాగము. ఐదు విభాగాలుగా ఉన్న ఈ సిద్ధాంత గణితంలో మొదటిది. "తిథి" మిగిలినవి వారము, నక్షత్రము, యోగము, కరణము అని నాలుగు.

ఆధునికంగా వాడబడుతున్న "తేదీ"అనే మాట ఈ తిథి అనే శబ్దం నుంచి పుట్టినదే. తిథి తేదీగా, తేదీదేతీగా; దేతీడేటీగా ఇలా మార్పులు చెంది చివరికి, 'డేట్'అనే ఇంగ్లీషు పదంగా రూపాంతరం చెందిందని కొందరు భాషాశాస్త్ర వేత్తల అభిప్రాయం కూడా.

సూర్యుడు ఉదయించి అస్తమించే వరకు గడిచేకాలాన్ని "అహస్సు" (పగలు) అనీ, ఇలా గడిచే ఒక "అహోరాత్రి" కాలాన్ని "దినం" అనీ లేదా "వారం" అనీ పిలుస్తాం.



అయితే తూర్పున కనిపించే సూర్యుడు, నిత్యం దిగంతరేఖలో ఒక బిందువు లో ఉదయించాడు. సూర్యోదయ బిందువు దినదినం మారుతూ ఉంటుంది. ఆ మారటం కొంతకాలం దక్షిణంవైపుకీ, కొంతకాలం ఉత్తరంవైపుకీ జరుగుతూ వుంటుంది. అవే ఉత్తర దక్షిణాయనాలు. దక్షిణపు చివరి బిందువు మీద ఉదయించిన సూర్యుడు ఉత్తరంగా జరిగి జరిగి, తిరిగి వెనక్కి మళ్ళీ, మళ్ళీ అదే బిందువు దగ్గర ఉదయించడానికి మొత్తం 360 (180+180) బిందువుల కాలంపడుతుంది. ఇది ఒక వృత్తంలోని కోణాల సంఖ్యకి సమానం. కానీ ఉత్తర దక్షిణ అంత్య బిందువుల దగ్గరవెనక్కి మళ్ళడానికి పట్టే కాలాన్ని కూడాగుణిస్తే, ఒక ప్రమాణంపూర్తయి, మరో ప్రమాణం ప్రారంభం కావడానికి 365 హోరాలు (అహోరాత్రులు) నడుస్తాయి. (ఇంకా సూక్ష్మ దశాంశస్థానాలు కూడా గుణింపబడ్డాయి.) దీనిని ఒక సంవత్సరం (సౌర) అన్నారు.

ఇలా అహోరాత్రాలు అనంతంగా సాగిపోయే ఈ సూర్య గమనం ఒక్కొక్క దినం ఒక్కొక్క గ్రహాధిపత్యంతో ప్రారంభిస్తుందనీ, అవి సప్త గ్రహాలనీ, అవే తిరిగి తిరిగి వస్తున్నాయనీ గుర్తించి, ఆయా దినాలకు ఆయా గ్రహాల పేర్లు పెట్టారు. అవే ఆది, సోమ, మంగళ మొదలైనవారాలు.

ఇలా వారంతో పాటు మరొక గుర్తుకూడా ఏర్పడితే, జరిగినదినాల్ని విడివిడిగా ప్రత్యేకంగా గుర్తించడం తేలిక, ఆకాశంలో సూర్యుడితోపాటు ప్రస్ఫుటంగా కనిపించే మరొక గోళం చంద్రుడు. మార్పు త్వరితంగా విస్పష్టంగా కనిపించే ఆ చంద్ర గమనమే చంద్రకళ. దానినే వాడుకలో 'తిథి' అన్నారు.



చంద్రకాంతి అర్ధవలయరేఖగా కనిపించే దినం నుంచి పూర్ణబింబంగా కనిపించే దినం (పౌర్ణమి) వరకూ పదిహేను తిథులు. అక్కడి నుంచి తిరిగి శూన్య బింబంగా భాసించే దినం (అమావాస్య) వరకు పదిహేను తిథులు. అది శుక్ల పక్షం, ఇది కృష్ణపక్షం. మొత్తం ముప్పై తిథులూ కలిసి ఒకమాసం.

ఏడు వారాలూ ఏడు హోరల్లో ఎలా తిరుగుతుంటాయో – ఈ చంద్రగమనం కూడా ప్రతి పౌర్ణమికీ ఒక నిర్దిష్టమైన నక్షత్రమునందే జరుగుతుంది. ఆ నక్షత్రాలే వరసగా చిత్త, విశాఖ, జ్యేష్ఠ, పూర్వ ఉత్తరాషాఢలు, శ్రావణం, పూర్వ ఉత్తరాభాద్రలు, అశ్వని, కృత్తిక, మృగశిర, పుష్యమి, మఖ, పూర్వ, ఉత్తర ఫల్గుణీ నక్షత్రాలు. ఆ కారణంగానే ఆయా నెలలు చైత్రం,వైశాఖ, జ్యేష్టం, ఆషాఢం, శ్రావణం, భాద్రపద, ఆశ్వయుజం, కార్తీకం, మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం అయినాయి.

ఈ పన్నెండు మాసాలూ కలిపితే మొత్తం 30×12=360 తిథులైనాయి. ఇవి వృత్తంలోని 360 కోణాలకి సమానమే.

అయితే సూర్యగమనంలో ఏర్పడే అహస్సు ప్రమాణం ఖచ్చితంగా 60 ఘడియలు (గంటలు) ఉంటుంది. కాని చంద్రభ్రమణము ఏర్పడితే, తిథిప్రమాణం అలా ఉండదు. ఒకసారి ఎక్కువా, ఒక్కొక్కసారి తక్కువా ఉంటుంది ఇది ఏకపక్షానికి, ఋతువుఋతువుకీ హెచ్చవుతుంది. మొత్తం మీద సూర్యసంవత్సరము365 దినాలలో చంద్రసంవత్సరం లోనికి సరితూగవు. ఆ సంవత్సర ప్రమాణం....సంవత్సర ప్రమాణంవేరు. కాని ఈ రెండూ 2-3 సంవత్సరాల కొకసారి సర్దుకుంటాయి. సర్దుబాటే రెండు మూడు సంవత్సరాలకొకసారి వచ్చే అధికమాసం– మరియు ఏభై అరవైఏళ్ళ కొకసారి వచ్చేక్షయమాసం. క్షయమాసం దీనిని తర్వాత చర్చిద్దాం. ముందు ఈ అధికమాస సంబంధించిన ఉదాహరణ గమనించండి.

శ్రావణం, భాద్రపదం, ఆశ్వయుజం,కార్తీక ఈ నాలుగునెలలూ వరసగా ఒకదానితో ఒకటి రావాలిగదా! రావాలంటే పౌర్ణమినాడు, శ్రావణం, భాద్రపద, అశ్వని, కృత్తికపక్షానికి ఉండాలి గదా. శ్రావణమాసంలో ....శ్రవణానక్షత్రం లోనే ఉంది. అంటే చంద్రుడు నక్షత్రంలో సమరేఖలో ఉన్నడన్నమాట. కాబట్టి దాని తర్వాతి పౌర్ణమి పూర్వాభాద్రలోగాని, ఉత్తరాభాద్రలోగాని ఉండాలి. అలాగే ఆ తర్వాత పౌర్ణమి అశ్వనిలో ఉండాలి. కాని అలా జరగడంలేదు,. ఈశ్రావణ పౌర్ణమి తర్వాతి పౌర్ణమి ఎక్కువభాగం శతభిషంలోనూ ఆ తర్వాతి పౌర్ణమి ఉత్తరాభాద్రలోనూ ఉండి, ఆపై పౌర్ణమికి గాని అశ్వనికి చేరడంలేదు. ఆ తర్వాత వరస కుదిరి కృత్తికలో పౌర్ణమి యధాతథంగా జరిగిపోయింది.

ఈలోగా శ్రావణం, శతభిషం, ఉత్తరాభాద్ర, అశ్వని నక్షత్రాలలో శతభిషం అధికంగా పెరిగింది–భాద్రపదం అవతలికి జరిగింది. ఇది ఒక విధంగా అధిక

భాద్రపదం అనిపిస్తుంది. కాని వరుసలో అశ్వనిస్థానంలో వచ్చింది కాబట్టి దీన్ని అధిక ఆశ్వయుజం అన్నారు. పౌర్ణమి అశ్వనిలో జరగడానికి ఈకాలం అధికంగా పట్టింది కాబట్టి యిది అధిక ఆశ్వయుజం. అశ్వనిలో వచ్చింది నిజ ఆశ్వయుజం.

ఇదికాక మరొక ప్రసిద్ధమైన పద్ధతికూడా ఉంది. ప్రతినెలా సూర్యుడు ఒక రాశినుండి మరొకరాశికి మారుతూ ఉంటాడు. ఈ మారడం ముప్ఫైరోజులూ ఒకరాశిలో ఉంటాడన్న మాట.

మరొకరాశిలోకి మారేటప్పుడు చాంద్రమానంలోని పాడ్యమి నుండి అమావాస్య వరకు ఉన్న తిధులలో ఏదో ఒక తిధిలో మారతాడు. దాన్నే సంక్రమణ దినం అంటాము అలా మారే దినం ఒక చంద్రమాసంలో ఏ తిధిలోనూ పడకపోతే అదే అధికమాసం.

ఉదాహరణకి : 2004 సెప్టెంబరు 17 అనగా భాద్రపద అమావాస్యనాడు సూర్యుడు కన్యాసంక్రమణం చేశాడు. అనగా కన్యారాశిలోకి ప్రవేశించాడు. మళ్లీ తులా సంక్రమణం అక్టోబరు 17న జరిగింది. ఆరోజు పాడ్యమి అయింది. అంటే మరో అమావాస్యదాటి పాడ్యమి వచ్చిందన్నమాట. కన్యాసంక్రమణం జరిగిన తర్వాత ఒక శుద్ధపాడ్యమి తులా సంక్రమణానికి ముందు రోజున ఒక అమావాస్యా మొత్తం ముప్ఫయి రోజులు గడిచాయి. ఈ ముప్ఫై రోజులలో (అనగా చంద్రమాసంలో) సూర్యసంక్రమణం జరగలేదు. కాబట్టి ఈ ముప్ఫైరోజుల్ని అధికమాసం అని వ్యవహరించారు. వ్యవహరించి దీన్ని అధిక ఆశ్వయుజంగానూ, సంక్రమణం జరిగిన తిధినుంచి నిజ ఆశ్వయుజంగానూ వ్యవహరించారు. ఈ విధంగా సూర్య గమనం లోని ఒకరోజు, చంద్రగమనంలోని ముప్ఫయిరోజులికి దారి తీసిందన్నమాట.



## ఉగాది

1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లు మొత్తం శుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి -మామిడి తోరణాలు, పూజా మందిర ములో ముగ్గులు.
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : తెలుపు
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజావస్తువులు శుభ్రం చేయాలి పటములు శుభ్రముచేసి గంధము ఉంచాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : తెలుపు
8. కలశముపై వస్త్రము రంగు : తెలుపు
9. పూజించవలసిన ఫోటో : మీకు నచ్చిన దైవం
10. పూజించవలసిన ప్రతిమ : మీకు నచ్చిన దైవం
11. పూజించవలసిన దైవము : మీకు నచ్చిన దైవం
12. తయారు చేయవలసిన అక్షతలు : పసుపు
13. పూజకు కావలసిన పువ్వులు : అన్నిరకములు
14. అలంకరణకు వాడవలసినపూలు : అన్నిరకములు
15. నివేదన చేయవలసిననైవేద్యం : ఉగాది పచ్చడి
16. సమర్పించవలసిన పిండివంటలు : ఏదైన ఫర్వాలేదు
17. నివేదించవలసిన పండ్లు : ఏవైనా ఫర్వాలేదు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : మీకు నచ్చిన అష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన ఇతర స్తోత్రాలు : మీకు వచ్చిన స్తోత్రాలు
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : మీకు వచ్చిన స్తోత్రాలు
21. పారాయణచేయవలసిన సహస్రాలు : మీకు వచ్చిన సహస్ర నామాలు
22. పారాయణ చేయవలసినగ్రంథం : మీ దగ్గరవున్న పారాయణ గ్రంథం (పంచాంగ శ్రవణం)
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : మీకు నచ్చిన అధ్యాయములు (మీ రాశిఫలితాలు)
24. దర్శించవలసిన దేవాలయాలు : మీ దగ్గరలోని దేవాలయాలు

| | | |
|---|---|---|
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : మీరు ఇంతకుముందు చూడనిపుణ్య క్షేత్రం |
| 26. | చేయవలసిన ధ్యానములు | : మీకు నచ్చిన దైవధ్యానము |
| 27. | చేయించవలసిన పూజలు | : మీరు చేయగలిగే పూజ |
| 28. | దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : మీరు చేయించగలిగే పూజ |
| 29. | ఆచరించవలసిన వ్రతము | : లేదు |
| 30. | ఉపవాసము నియమము | : లేదు |
| 31. | జాగరణ నియమము | : లేదు |
| 32. | సేకరించవలసిన పుస్తకములు | : సనాతన వైదిక బ్రాహ్మణ సంస్థానవారి సనాతన పెద్ద పంచాంగం, కాలచక్రం పంచాంగం |
| 33. | సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : పంచాంగములు |
| 34. | స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : కాలచక్రం క్యాలెండర్లు |
| 35. | దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : వసంతనవరాత్ర ఉత్సవములు |
| 36. | దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : రాబోవు సం॥లో గోచార ఫలితములు ఉపన్యాసములు |
| 37. | పర్వదిన నక్షత్రము | : |
| 38. | పర్వదిన తిథి | : చైత్రశుద్ధ పాడ్యమి |
| 39. | పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : ఆదివారం |
| 40. | పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ6గం॥నుండి 9గం॥ |
| 41. | వెలిగించవలసిన దీపారాధన కుంది | : మీ దగ్గర వున్నకుంది. |
| 42. | వెలిగించవలసిన దీపారాధనలు | : 2 |
| 43. | వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 5+5 |
| 44. | వెలిగించవలసిన వత్తులు | : దూది |
| 45. | దీపారాధన వాడవలసిన నూనె | : ఆవునెయ్యి |
| 46. | వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : పంచహారతి |
| 47. | ధరించవలసిన తోరము | : లేదు |
| 48. | నుదుటన ధరించవలసినది | : కుంకుమ |
| 49. | 108 మార్లు జపించవలసిన మంత్రం | : మీకు నచ్చినది. |
| 50. | జపమునకు వాడవలసిన మాల | : లేదు |
| 51. | మెడలో ధరించవలసిన మాల | : లేదు |
| 52. | మెడలో ధరించవలసిన మాల | : లేదు |
| 53. | చేయవలసిన అభిషేకము | : మీకు నచ్చిన దైవానికి |
| 54. | ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : లేదు |





## "ఉగాది" విశిష్టత

"బ్రహ్మ" గత ప్రళయం! పూర్తి అయిన తరువాత తిరిగి సృష్టి ప్రారంభించుసమయాన్ని "బ్రహ్మకల్పం" అంటారు. ఇలా ప్రతికల్పంలోను మొదటవచ్చేది యుగాదిని యుగానికి ఆదిగా, ప్రారంభసమయంగా "ఉగాది" అని వ్యవహరిస్తూ ఉంటారు. అలాగునే ఈ "ఉగాది" పర్వదినం మనకు చైత్రమాసంలో ప్రారంభ మవడంవల్ల! ఆరోజునుండి మన తెలుగు సంవత్సర ఆరంభ దినంగా పరిగణించి, లెక్కించుటకు వీలుగా, ఉండేందుకే ఉగాదిపండుగను మనకు ఋషిపుంగవులు ఏర్పాటు చేసారు.

మనకు తెలుగు సంవత్సరాలు "ప్రభవ" మొదలుపెట్టి "అక్షయ" నామ సంవత్సరము వరకు గల 60 సంవత్సరములలోను "మానవుడు" తాను జన్మించిన "నామ సంవత్సరాన్ని" జీవితంలో ఒక్కసారో! రెండుసార్లో! చూస్తూఉంటారు! వారి జన్మాంతరసుకృతాలనుబట్టి ! అందువల్లనే వారు జన్మించిన 60 సంవత్సరములకు ఆ నామ సంవత్సరం వస్తుంది కనుక! అది ఒక పర్వదినంగా భావించి "షష్టిపూర్తి" ఉత్సవాన్ని వైభవంగా అందరు చేసుకుంటూ ఉంటారు.

ఈ ఉగాది పర్వ శుభదినాన అందరు ప్రాతఃకాలమున నిద్రలేచి అభ్యంగన స్నానమాచరించి నూతన వస్త్రములు ధరించి మంగళ ప్రదమైన మావిడాకులు, రంగవల్లికలు ముంగిట అలంకరించుకుని "వసంతలక్ష్మి"కి స్వాగతిస్తూ, షడ్రుచులతో సమ్మిళితమైన "ఉగాది" ప్రసాదాన్ని; పంచాంగానికి, సంవత్సర దేవతకు నివేదనచేసి తమ తమ భావిజీవితాలు మృదుమధురంగా సాగించాలని ఆకాంక్షిస్తూ...ఉగాది పచ్చడి స్వీకరిస్తూ ఉంటారు. ఈ "ఉగాది పచ్చడిని" వైద్యపరంగా ఆలోచిస్తే! ఇది వ్యాధి నిరోధకశక్తిని ఇస్తుందని కూడా చెప్తారు. ఆ పచ్చడిలోని షడ్రరుచులలోని "తీపి–చేదులే" మానవ మనుగడలకు ప్రతీకలై నిలుస్తూ ఉంటాయని అంటూ ఉంటారు.

తెలుగువారి సంప్రదాయాలలో మరోముఖ్యమైన విషయం "పంచాంగ శ్రవణం" ఆనాడు అందరూ కలసి నిష్ణాతులైన జ్యోతిష పండిత శ్రేష్టులను ఆహ్వానించి వారిని సన్మానించి ఒక పవిత్ర ప్రదేశమందు పంచాంగశ్రవణము చేస్తారు. ఆ రోజు అందరూ ఆ నూతన సంవత్సరంలోని శుభాశుభాలను తెలుసుకుని దానికి అనుగుణంగా వారి భావిజీవితాన్ని తీర్చి దిద్దుకునేందుకు అంకురార్పణలు చేస్తారు. ఈ పంచాంగ శ్రవణంలోని పంచ అంగాలవల్ల; తిథితో సంపదను, వారంతో ఆయుష్షు, నక్షత్రంతో పాపప్రక్షాళన, యోగం వలన వ్యాధి నివృత్తికావటం, కరణంవల్ల గంగాస్నానం చేసినంత పుణ్యఫలాన్ని అందిస్తుందని పలువురి విశ్వాసం ఈ ఉగాది పర్వదినాన ఇష్టదేవతారాధనలు గావించుకుని; ఇది సర్వులకు ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలిగించి సుఖమయజీవనాన్ని అందించాలని మనసారా కోరుకుందాం! ఆలాగునే కోకిల గానామృతంతో అందరి జీవితాలు "నవ వసంతం"కావాలని ఆశిద్దాం.

## శ్రీరామనవమి

1. లేవవలసిన సమయము : ఉదయం 6 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లు మొత్తం శుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : పూజామందిరము, గడపకు పసుపు, కుంకుమ ఇంటిముందు ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : పసుపురంగువి
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజకు ఉపయోగపడు వస్తువులు పటములకు గంధము,కుంకుమ
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : పసుపు
8. కలశముపై వస్త్రము రంగు : పసుపు
9. పూజించవలసిన ఫోటో : శ్రీసీతారామలక్ష్మణ, భరత, శతృఘ్నులు
10. పూజించవలసిన ప్రతిమ : శ్రీరాముడు
11. పూజించవలసిన దైవము : శ్రీరాముడు
12. తయారు చేయవలసిన అక్షతలు : పసుపు
13. పూజకు కావలసిన పువ్వులు : తెల్లనివి సన్నజాజి
14. అలంకరణకు వాడవలసినపూలు : తామర
15. నివేదన చేయవలసిననైవేద్యం : పానకం
16. సమర్పించవలసిన పిండివంటలు : వడపప్పు
17. నివేదించవలసిన పండ్లు : కమలాకాయలు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : శ్రీరామఅష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : శ్రీరామరక్షా స్తోత్రము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : శ్రీరామాష్టకము
21. పారాయణచేయవలసిన సహస్రాలు : శ్రీరామ సహస్రము
22. పారాయణ చేయవలసినగ్రంథం : శ్రీమద్రామాయణం
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : శ్రీరామ పట్టాభిషేకము
24. దర్శించవలసిన దేవాలయాలు : శ్రీరామ దేవాలయం
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : భద్రాచలం, ఒంటిమెట్ట, గొల్లల మామిడాడ
26. చేయవలసిన ధ్యానములు : శ్రీరామ ధ్యానశ్లోకములు
27. చేయించవలసిన పూజలు : శ్రీరామ అష్టోత్తర పూజ





28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : సీతారామకళ్యాణము
29. ఆచరించవలసిన వ్రతము : శ్రీరామదేవునికథ (వ్రతము)
30. ఉపవాసము నియమము : లేదు
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించివలసిన పుస్తకములు : శ్రీమద్రామాయణముపారాయణ పద్ధతులు
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : శ్రీరామరక్షా స్తోత్రము
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి: శ్రీరామ నిత్యపూజ
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : శ్రీసీతారామపట్టాభిషేకము
36. దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : శ్రీసీతారామకళ్యాణం
37. పర్వదిన నక్షత్రము : పునర్వసు
38. పర్వదిన తిథి : చైత్రశుద్ధ నవమి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : ఆదివారం
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : మ॥12గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : కంచుదీపము
42. వెలిగించవలసిన దీపారాధనలు : 2
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5
44. వెలిగించవలసిన వత్తులు : దూదితో
45. దీపారాధన వాడవలసిన నూనె : కొబ్బరినూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : సింధూరముది
48. నుదుటన ధరించవలసినది : సింధూరము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : శ్రీరామ మంత్రం
50. జపమునకు వాడవలసిన మాల : తులసిమాల
51. మెడలో ధరించవలసిన మాల : తులసిమాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ: శ్రీరామ
53. చేయవలసిన అభిషేకము : పంచామృతముతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : తూర్పుదిక్కు

## శ్రీరామనవమి

దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై చైత్రశుద్ధనవమినాడు ఐదుగ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉన్నకాలమందు పునర్వసు నక్షత్రంతో కూడిన కర్కాటక లగ్నంలో పగటి సమయాన సాక్షాత్తు ఆ శ్రీహరియే కౌసల్యాపుత్రుడై ఈ భూమిపైన జన్మించిన పర్వదినాన్ని మనం "శ్రీరామనవమి"గా విశేషంగా జరుపుకుంటాం !

"రామ"యనగా రమించుట అని అర్థం. కావున మనము ఎల్లప్పుడు మన హృదయకమలమందు వెలుగొందుచున్న "ఆ శ్రీరాముని" కనుగొనుచుండవలెను. అగ్నిని మనము తెలిసియో తెలియకో తాకినచో, అది ఎట్లు దహించునో; అట్లే శ్రీరామనామధ్యానముతో మనపాపాలన్నీ దహించివేయబడును.

ఒకసారి పార్వతీదేవి పరమశివుని–"కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకం" అని....విష్ణు సహస్రనామ స్తోత్రమ్‌నకు కాస్త సూక్ష్మమైన మార్గం చెప్పమని కోరుతుంది. దానికి పరమేశ్వరుడు ఓ పార్వతీ! నేను నిరంతరము ఆ ఫలితము కొరకు జపించేది ఇదే సుమా!

**శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే**
**సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే॥**

అని, మూడుమార్లు స్మరించినంతనే ఒక్క విష్ణు సహస్రనామ పారాయణ ఫలితమేకాదు, అభేదస్వరూపులమైన మావల్ల భక్తులకు శివసహస్రనామ ఫలితంకూడా లభిస్తుంది సుమా! అని ఆ పార్వతికి మంత్రోపాసనచేస్తాడు ఆ పరమశివుడు. ఏ భక్తులు కాశీలో జీవిస్తూ ఆ పుణ్యక్షేత్రమందు మరణిస్తారో వారి మరణ సమయాన ఆ భక్తవశంకరుడే ఈతారకమంత్రం వారి కుడి చెవిలో చెప్పి వార్కి సద్గతి కలిగిస్తారన్నది! భక్తుల ప్రగాఢ విశ్వాసం.

ఇక "భక్తరామదాసు" అయితే సరేసరి! శ్రీరామనామ గానమధుపానాన్ని భక్తితో సేవించి, శ్రీరామ నీనామ మేమిరుచిరా...ఎంతోరుచిరా...మరి ఎంతో రుచిరా అని కీర్తించాడు. మనం శ్రీరామనామాన్ని ఉచ్ఛరించేటప్పుడు "రా" అనగానే మన నోరు తెరచుకుని మనలోపల పాపాలన్ని బయటకు వచ్చి "ఆ రామనామ" అగ్నిజ్వాలలో పడి దహించుకుపోతాయట!

ఆలాగునే "మ" అనేఅక్షరం ఉచ్ఛరించినప్పుడు మననోరు మూసుకుంటుంది కనుక బయట మనకు కనిపించే పాపాలు ఏవి మనలోకి ప్రవేశించలేవుట, అందువల్లనే మానవులకు"రామనామ స్మరణ" మిక్కిలి జ్ఞానాన్ని, జన్మరాహిత్యాని





కలిగిస్తుందట! ఇందుకు తార్కాణం. పూర్వం "వాల్మీకి మహర్షి" జన్మతహః కిరాతకుడై పుట్టిన ఒకసారి ఆకిరాతకుని నారదుడుచూచి నీవు చేస్తున్న ఈ కిరాతకమైన పాప కార్యంలో నీ భార్యబిడ్డలు ఏమైనా పాలుపంచుకుంటారేమో తెలుసుకునిరా, అనిపంపు తాడు. వెంటనే ఆ కిరాతకుడు భార్యబిడ్డల వద్దకువెళ్ళి ఆ ప్రశ్న అడుగుతాడు. దానికివారు "గృహస్తుడుగా" మమ్ములను పెంచి పోషించే బాధ్యత నీది కాని నీవు చేసే పుణ్యకార్యంలో భాగం పంచుకుంటామేతప్ప పాపకార్యంలో కాదు. అని నిష్కర్షగా పలుకుతారు. వారి పలుకులకు వైరాగ్యము చెంది మహర్షి నాకు చక్కని మోక్షమార్గానికి ఉపాయము చెప్పమని ప్రాధేయపడతాడు.

అంత నారదుడు "రామ రామ రామ" అను తారక మంత్రాన్ని చెవిలో ఉపదేశిస్తాడు. చివరకు నోరు తిరగకపోయి శరీరంపై పుట్టలుపోస్తున్నా "మర" అంటూనే ఆతారకమంత్రాన్ని వీడలేదు. బ్రహ్మ అనుగ్రహముతో వల్మీకము నుండి పునర్జీవింపబడి "వాల్మీకి మహర్షి"గా జ్ఞానసంపదను ఈ తారకమంత్రముచే పొంది శ్రీమద్రామాయణం అను కమనీయకావ్యం రచించి కారణజన్ముడై ఊర్థ్వలోకమందు ఆ చంద్రతారార్కం తరగని నిధిని పొందిన మహా భాగ్యశాలి అయినాడు.

అట్టి "శ్రీమద్రామాయణం" మనకు ఎంతో ఆదర్శవంతమైనది. అందలి "శ్రీసీతారామచంద్రమూర్తి" మూర్తీభవించిన ధర్మదేవతా స్వరూపం. ఆ కావ్యమే మనకు మనభావితరాలకు "మార్గదర్శి" కావాలని ఆశిస్తూ ఆ స్వామికి శిరస్సువంచి చేతులు జోడించి ఇలా హృదయపూర్వక నమస్కారం చేసుకుందాం.

**శ్రీరాఘవం దశరథాత్మజ మప్రేమయం**
**సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్**
**ఆజానుబాహుమరవింద దళాయతాక్షం**
**రామం నిశాచర వినాశకరం నమామి.**

**మత్స్య జయంతి :** వశిష్ఠులవారు "అగ్నిదేవా! సృష్టికి ఆదికి కారణభూతుడైన విష్ణు భగవానుని మత్స్యాది అవతారములను చెప్పు"డని కోరెను.

అగ్నిదేవుడు "వసిష్ఠా! మత్స్యావతారమును చెప్పుదును, వినుము. దుష్ట శిక్షణ శిష్టరక్షణకొరకు భగవానుడు అవతారములను ధరించును. పూర్వము కల్పాంతమున బ్రహ్మ నైమిత్తిక ప్రళయము సంభవించెను. ఆ సమయమున "భూ" ఆది లోకములు సముద్ర జలమందు మునిగిపోయెను. ప్రళయమునకుముందు సత్యవ్రతుడను రాజు భోగ–మోక్ష సిద్ధులకొరకు తపస్సు చేయుచుండెను. ఒక దినము కృతమాలానదీ జలమందు పితరులకు తర్పణము గావించుచుండగా అతని దోసిలి లోనికి ఒక చిన్న చేప వచ్చెను. మునుపు దానిని జలమందు వదలుటకు నిశ్చయించుచుండ ఆ

మత్స్యము "మహారాజా! నన్ను జలమందు విడువకుడు. మొసలి మొదలగు జలజంతువుల వలన నాకు భయము గలుగుచున్నది" అని పలికెను.

రాజు దానిని తన కలశమందున్న జలమందు వేసెను. వెను వెంటనే ఆ మత్స్యము పెరిగిపోయి "రాజా! నన్ను మరియొక పెద్ద స్థానమున నుంచు"మనగా, రాజు దానిని మరియొక పెద్ద జలపాత్రయందుంచెను. దాని యందును పెరిగిపోయి మత్స్యము "రాజా నన్ను విశాలమైన స్థానమున నుంచు"మనెను. అప్పుడా రాజు దానిని తిరిగి ఆ సరోవర జలమందే విడచెను. కాని ఆ మత్స్యము ఆ సరోవరమంతను వ్యాపించి "ఇంకొక పెద్ద స్థానములో నుంచు" మని కోరగా, రాజు దానిని సముద్రమున వదిలెను. అచటను క్షణములో ఆ మత్స్యము ఒక లక్ష యోజనములు పెరిగి పోయెను.

రాజు విస్మయము జెంది ఆ మత్స్యముతో "నిశ్చయముగ మీరు శ్రీ విష్ణు భగవానులవలె గోచరించుచున్నారు. నారాయణా! నీకు నమస్కారము జనార్ధనా ! ఎందుకు మీ మాయతో నన్ను మోహితుని గావించుచున్నారు?" అని ప్రార్థించెను.

"రాజా! నేను దుష్టులను సంహరించి, జగత్తును రక్షించుటకు అవతరించితిని. నేటికి ఏడవ దినమున సముద్రము సమస్త జగత్తును ముంచి వేయును. ఆ సమయమున నీ సమీపమున ఒకనౌక యుండును. దానిపై నీవు సమస్త బీజాదులను తీసికొని కూర్చుండుము. సప్తర్షులు కూడ నీ వెంట నుండెదరు. వెయ్యి చతుర్యుగ ములు గడచినప్పుడు బ్రహ్మకు ఒక దినము పూర్తియగును. ఆ సమయమున నైమిత్తిక ప్రళయము వచ్చును. దీనినే బ్రహ్మలయ మనెదరు. నీవు ఆ నావపై నుండుము. నావ వచ్చిన తరువాత నేను కూడ ఈ రూపముననే వచ్చెదను. అప్పుడు నీవు నా కొమ్మునకు మహా సర్పమయమగు త్రాడుతో నావను కట్టుము" అని పలికి మత్స్యము అంతర్ధాన మయ్యెను.

మను మహారాజు ఆ సమయము కొరకు అచటనే వేచియుండెను. సమయము ఆసన్నముకాగా సముద్రము పొంగసాగెను. అప్పుడు రాజు నౌకపై కూర్చుండెను. అట్టి సమయమందు కొమ్ము ధరించిన సువర్ణమయ మత్స్య భగవానుడు ప్రాదుర్భవించెను. అతని శరీరము పదిలక్షల యోజనముల పొడవు గలిగి యుండెను. కొమ్మునకు నావ కట్టి యుంచి మహారాజు, మత్స్య భగవానుడు "మత్స్య"పురాణము చెప్పుచుండ వినెను. ఇది సమస్త పాపములను నశింపజేయును. మను మహారాజు అనేక స్తోత్రములతో మత్స్య భగవానుని స్తుతించెను.

ప్రళయానంతరము బ్రహ్మచెంత నున్న వేదములను "హయగ్రీవు"డను దానవుడు తీసికొని వెళ్ళగా మత్స్య భగవానుడు ఆ దానవుని వధించి, వేద మంత్రాదులను రక్షించెను.





## అక్షయ తృతీయ

ఈనాడు మనం 21వ శతాబ్దంలోకి అడుగుపెట్టాము. ఇది ఎంతో స్పీడు యుగం, అయినప్పటికి ఈ జీవితాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దుకునేందుకు చివరిగా పరమేశ్వర సాయుజ్యం పొందేందుకు మన హిందూ సంస్కృతి సంప్రదాయాలలో మన జీవిత గమ్యం గాడితప్పకుండా ధర్మార్థ కామ, మోక్షాలకొరకు చక్కని మార్గాన్ని తల్లి గర్భధారణ మొదలుకొని క్రమపద్ధతిలో జరిగే షోడశ సంస్కారాలతో మనకు ఆరంభమవుతాయి. అట్టి పూలబాటలో అలనాటి మన ఋషులు ఆదర్శవంతంగా ఆచరించి మనకు మార్గగమ్యాన్ని చూపించారు. ఆ బాటలోనివే ఈ నోములు, వ్రతాలు, ఉపవాసాలు, పండుగలు అన్నవి. వాటికన్నిటికినీ యుగయుగాలనాటి చరిత్రతో మేళవించబడినవి. అటువంటి పండుగయే ఈ "అక్షయ తృతీయ –ఉగాది" పర్వదినం.

**"వైశాఖమాసస్య చ యా తృతీయా నవమ్య సౌ కార్తీక శుక్లపక్షే**
**నభస్య మాసస్య తమిస్రపక్షే త్రయోదశీ పంచదశీ చ మాఘే"**

కావున ఇది కృతయుగ ఆరంభ ఉగాది అని విష్ణు పురాణాదులు పేర్కొను చున్నవి.కొన్ని ప్రాంతములలో వైశాఖశుద్ధ తదియనాడు ఈ పండుగ చేయుచుందురు. ఈనాడే "బదరీనారాయణ" మందిర ద్వారములు భక్తుల దర్శన నిమిత్తం తిరిగి తెరుతురు. అంతవరకు ఈ ఆలయం మంచుతో నిండియుండి అగమ్య గోచరమైన ఈ హృషీకేశము భక్తులచే కిటకిటలాడుచు పూజాదికాలు ప్రారంభమగును. ఈ దినమున కొన్ని ప్రాంతములందు స్త్రీలు చిన్నికృష్ణునికి, గౌరీదేవికి డోలోత్సవము జరిపించి ముత్తైదువలను కన్యలను పూజించి ఫలపుష్పాదులు శనగలు వాయనమిచ్చి సత్కరించెదరు.

ఈ పుణ్యదినమందు దేవతలను, పితృదేవతలను ఆరాధించుట, గోదానము, భూదానము, సువర్ణదానము, వస్త్రదానము, పూర్ణఘటముతో నిండియున్న ఉదక

దానము మున్నగునవి, మరియు ఈ దినమందు చేయు జప, హోమ, దానాదు లన్నియు "అక్షయము" పొందునుగాన ! ఇది "అక్షయతృతీయ" మని కృష్ణభగవానుడు స్వయముగా ధర్మరాజుకు వివరించినాడు.



ఇందులకొక పురాణగాథకలదు. పూర్వము ఒక వైశ్యుడు ఎన్నో దారిద్ర్య బాధలు వెంటాడుతున్నా; సత్ప్రవర్తన వీడక జీవించుచు ఒకసారి ఒక పౌరాణికుడు "వైశాఖశుద్ధ తృతీయనాడు చేయు స్వల్పదానమైనను అక్షయ ఫలప్రదము" అని చెప్పగా విని, ఆ దినమందు గంగలో పుణ్యస్నానమాచరించి దేవతలకు, పితృదేవలకు తర్పణమాచరించి, ఇంటికివచ్చి సద్బ్రాహ్మణులను ఆహ్వానించి వార్కి యథాశక్తి భోజన తాంబూలాదులతో దానమిచ్చెను. అలా ఆచరించిన పుణ్యఫలమే వాని వెంటవచ్చి మరుజన్మమున ఆతడు కుశావతీనగరమునకు రాజుగా జన్మించెను. అయినను ఆతడు ఎన్నో యజ్ఞయాగాదులు, దానధర్మాలు నిర్వర్తించుచున్నను వాని సంపద అక్షయమగుటేగాని తరుగలేదుట. "అందువల్లనే మన పౌరాణికుల మాటలు పెడచెవిని పెట్టకుండా, విశ్వసించేవార్కి విశ్వసించినంత ఫలం ఉంటుందని పెద్దలు చెప్తూఉంటారు.



**"వైశాఖ శుక్ల పక్షేతు తృతీయా రోహిణి యుతా,**
**దుర్లభా బుధచారేణ సోమనాపి యుతా తథా"**

వైశాఖ శుక్లపక్ష తృతీయ రోహిణీయుతమైన అత్యంత పుణ్యప్రదమైనది అని విష్ణుపురాణాదులు చెప్పుచున్నవని, పరమభాగవతోత్తముడు నారదీయవచన మును నిర్ణయామృతకారుడు ఉదహరించినాడు. అట్టి పుణ్య ఫలాన్ని అందించే ఈ అక్షయ తృతీయాను భక్తి శ్రద్ధలతో ఆచరించి సర్వులము పునీతులౌదాము.





## శంకర జయంతి

శ్లో॥ **భజగోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే**
**సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్కరణే ॥**

అనే శ్లోకాలు మన చెవికి తాకినంతనే వెంటనే మనకు జ్ఞప్తికి వచ్చేది శ్రీశంకరభగవత్పాదులే! మానవులకు భక్తి, జ్ఞాన, కర్మలద్వారా మానవజీవిత లక్ష్యమైన మోక్షప్రాప్తికి మార్గము చూపిన మార్గదర్శకులు శ్రీశంకర భగవత్పాదులే. మానవులలో అమృతానంద ఫలములను పండించి బ్రతుకులలో శాంతిని నింపుటకు అవతరించిన అపర అవతారమూర్తి వీరు. వీరు పలికిన పలుకులు మనకు శుభప్రదము. వీరిబాట మానవులకు మంగళకరం మరియు అత్యంత జయప్రదం. అట్టి వీరి 'జన్మదినం' హిందూ జాతికంతటికి మరపురాని మహాపవిత్రమైన పుణ్యదినం. అటువంటి పుణ్యపురుషుని గాథ ఏమిటో? అని ఎదురు చూస్తున్నారా! మరి మీరు చదివి తరించండి....!

పూర్వం కేరళ రాష్ట్రమందు "శివగురువు- ఆర్యాంబ" అనువారు కాలడి అనే ఒక చిన్ని గ్రామములో జీవిస్తూ ఉండేవారుట! వారు ఇరువురు భగవంతునిపై ఎంతో భక్తిభావము ఉంచి ఎన్ని నోములు నోచిన, ఎన్ని వ్రతాలు చేసిన ఆ పుణ్య దంపతులకు "సంతానభాగ్యము" మాత్రము కలుగలేదుట! ఆ దంపతులు 'తిరుచునాపల్లి' చేరి అచ్చటగల వృషభాచలేశ్వరుని దర్శించి సేవించినారు. ఒకనాడు శివగురువునకు భగవానుడు కలలో కనిపించి "మీకు తక్కువ కాలము జీవించు జ్ఞానవంతుడు కావలెనా? లేక అయోగ్యుడై ఎక్కువకాలము జీవించు కుమారుడు కావలెనా? వీటిలో ఏ వరం కావాలో కోరుకోమంటాడు-అంత శివగురువు ఆలోచించి దీర్ఘాయువు కలిగిన అయోగ్యుడైన కుమారుని వల్ల ఏమి ప్రయోజనము? "పుత్రోత్సాహము తండ్రికి" అనునటుల, మాకు యోగ్యుడైన కుమారుని ప్రసాదించ మని శివగురువు కోరుకుంటాడు. ఆ వర ప్రభావముతో కొలది కాలానికి ఆర్యాంబ గర్భందాల్చి "వైశాఖశుద్ధ పంచమి"నాడు దివ్యతేజోకాంతులతో విరాజిల్లే పుత్రుని కన్నదట! ఆ పుత్రుని అల్లారు ముద్దుగా పెంచుకుంటూ వానికి 'శంకరుడు' అనిపేరు పెట్టుకున్నారు. "శంకరోతి ఇతి శంకరః" అంటే మానవులకు సర్వశుభాలకు, సర్వ సంపదలకు, సర్వవిద్యలకు మూలాధారమైనవాడు అని అర్థము. ఆలాగునే ఆ బాలుడు శుక్లపక్షచంద్రునిలో కళలు రోజురోజుకు అభివృద్ధిచెందునట్లు, పువ్వుపుట్టగానే పరిమళాలను వెదజల్లుతున్నట్లు ఆ పిల్లవాడు 'మూడవసంవత్సరం' బాల్యమందే సమస్తవిద్యలు చదువుట వ్రాయుట నేర్చుకున్నాడట.

ఇలా వుండగా వృద్ధుడవుతున్న 'శివగురువు' తన కుమారునకు ఏడవ ఏట ఉపనయన సంస్కారములు చేయాలను కోరికతోనే ఆకస్మికమరణం పొందినాడు. అంత ఆ వైధవ్యము పొందిన 'ఆర్యాంబ' తమతోటి బంధువుల సహాయమును

అర్థించి, కుమారునకు ఉపయనయ సంస్కారము చేయిస్తుంది. అనంతరం శంకరులకు ఎనిమిదవ సంవత్సరము వచ్చుసరికి సర్వశాస్త్ర పండితుడు, సర్వశక్తి వంతుడు అవుతాడు. అందులకు తార్కాణంగా!

తన మాతృమూర్తి వృద్ధాప్యముతో బాధపడుచు ఎండనక, వానఅనక, సుదూర ప్రాంతమందుగల నదికి స్నానానికి నిత్యము వెళుతూ ఉండేది. ఆతల్లి పడుతున్న బాధకు కలతచెంది ఎలా అయినాసరే? ఆతల్లి బాధను తొలగించాలని తలచి "గంగా స్తవం" చేయగా ఆ నదీమతల్లి ప్రసన్నురాలై తన ప్రవాహమార్గాన్ని మరలించుకుని ఆచార్యులవారి గృహమునకు అత్యంత సమీపంగా ప్రవహించ సాగిందట! అది వారికి గల మాతృభక్తికి, వారికి గల దివ్యశక్తికి కేవలం మచ్చుతునక మాత్రమే!

ఆ తల్లి 'ఆర్యాంబ' కుమారుని మాతృభక్తికి ఎంతో సంతసిస్తూ కుమారునికి యుక్తవయస్సు వస్తోందని గమనించి కుమారునకు వివాహ ప్రయత్నాలు చేయసాగింది. కాని శంకరులకు సన్యాస దీక్ష వహించాలని కోరిక! అట్టి వివేక వైరాగ్యములతో మనసంతా నింపుకునియున్నారు. కాని తల్లికి ఏ మాత్రము మనస్సుకు కష్టము కలుగుకుండా జ్ఞానబోధతో ఒప్పించి సన్యాసదీక్ష తీసుకుంటారు. ఎంతైనా మాతృమూర్తికి గల పుత్రవాత్సల్యం వెలకట్టగలమా చెప్పండి... ఆతల్లి మనోవేదన గ్రహించిన శంకరుడు మాతా! నీవు ఏ మాత్రము చింతించవలదు. నీ అవసాన దశలో కేవలం నన్ను స్మరించినంతనే నీముందుండి నీకు తృప్తిగా సర్వకర్మలను నెరవేర్చగలనని చెప్పెను. ఆ ఇచ్చిన మాటప్రకారం ఆమె అవసాన కాలమందు కుమారా శంకరా! అని తలవగానే ప్రత్యక్షమయి, జరామరణ భారంతోనున్న తల్లికి సర్వలోక సుఖప్రదమైన "శుద్ధనిర్గుణ" తత్వాన్ని బోధించుటకు ప్రయత్నిస్తారు. కాని తల్లి వారి మాటలు అర్థంచేసుకునే స్థితిలో లేదు. దానితో మాతృభక్తి పరాయణుడైన శంకరుడు ఇలా పరమేశ్వరుని ప్రార్థిస్తారు.

**"అనాద్యంత మాద్యం పరంతత్వమర్థం చిదాకార మేకం తురీయం త్వమేయం**
**హరిబ్రహ్మ మృగ్యం పరబ్రహ్మరూపం మనోవాగతీతం మహాశైవమీడే"**

అని శంకరులు స్తుతించగా! ఆ మహాదేవాది దేవుడు 'పరమేశ్వరుడు' ప్రత్యక్ష భాగ్యముతో తల్లికి సద్గతి కలిగించి మాతృభక్తిని నిరూపించుకున్నారు.

ఒకసారి శంకరులు గురుకుల విద్యాభ్యాస సమయమందు ఒక బ్రాహ్మణుని ఇంట భిక్షను అర్థిస్తారు. ఆ ఇంటి ఇల్లాలు కడుదారిద్ర్య బాధను అనుభవిస్తూ, నాయనా! మావద్ద ఈ ఎండిన ఉసిరికాయ తప్ప మరి ఏదియును లేదు అని వాని భిక్షపాత్రలో వైచి కన్నీరు మున్నీరుగా దుఃఖించసాగింది. ఆ దంపతుల దీనావస్థకు కలతచెందిన శంకరులు "శ్రీమహాలక్ష్మిని" స్తోత్రము చేసి ప్రసన్నము చేసికొని వారి దారిద్ర్య బాదను తొలగిస్తారు. ఆ స్తోత్రమే "శ్రీకనకధారాస్తోత్రమ్" అట్టి స్తోత్రమును 'మానవాళికి' అందించి వారి ఈతి బాధలను తొలగించుటకు మార్గము చూపిన



'కరుణామూర్తి' శ్రీశంకరాచార్యులవారు. వారు ప్రార్థించిన శ్రీ మహాలక్ష్మి కేవలం ఐశ్వర్యానికే ప్రధానం కాదుట! మానవులు కోరుకునే జ్ఞానము, సౌందర్యము, శక్తి మున్నగు సర్వ అభీష్టాలను ప్రసాదించే దేవతామూర్తియట!

**"శ్రుత్యై నమో஽స్తు శుభకర్మ ఫలప్రసూత్యై**
**రత్యైనమో஽స్తు రమణీయ గుణార్థవాయై**
**శక్త్యై నమో஽స్తు శతపత్ర నికేతనాయై**
**పుష్ట్యై నమో஽స్తు పురుషోత్తమ వల్లభాయై "**

అంటే, 'శృతి' అంటే వేదం. అదేజ్ఞాన సంపదకు మూలాధారమైనది. 'రతి' సౌందర్యం అనే అర్థాన్ని ఇస్తుంది. 'శక్తి' కదలిక లేక మనోవాంఛా బలం కలుగచేస్తుంది. 'పుష్టి' అంటే ! మానవులు ఆశించే మనోరథములు అన్నియు ఈయగల వరప్రదాయని అని ఆ శ్లోకార్థాన్ని వివరించి చెప్పుకోవచ్చు.

ఒకసారి శంకరాచార్యులువారు నర్మదా నదీతీరాన తపోదీక్షలోనున్న గోవింద భగవత్పాదులను కలిసినప్పుడు వారు అడిగిన ప్రశ్నలకు 'దశశ్లోకి' ద్వారా జవాబు చెప్పగా,వారువారిని తనప్రియ శిష్యునిగా అంగీకరించి వారు రచించిన 'బ్రహ్మసూత్రములకు' వ్యాఖ్య వ్రాయమని కోరినారుట! ఆ విధంగా కాశీపురమందు బ్రహ్మ సూత్రములకు భాష్యము వ్రాసియున్నారు. ఆ సమయమందు చెప్పినదే 'మనీషాపంచకము'

ఇలా ఉండగా ఒకరోజు వ్యాసభగవానులు శంకరాచార్యులవారిని పరీక్షించ దలచి వృద్ధబ్రాహ్మణ వేషముతో బ్రహ్మసూత్రముపై ఒక సందేహము వెలిబుచ్చినారుట! దానికి శంకరాచార్యులవారు వారి సందేహము సంతృప్తికరంగా తీర్చుటచే వారు ఎంతగానో సంతసించి మరో 16 సం॥ ఆయుర్దాయమును ప్రసాదించి అద్వైత మత ప్రచారము చేయవలెనని కోరినారుట! దానితో శ్రీ శంకరభగవత్పాదులు దేశము నలుమూలలా శంకరమఠములు ఏర్పరచి సనాతన సంప్రదాయ ప్రచారము విస్తృతము గావించుచూ! తుంగభద్రానదీ తీరమున 'శారదానిలయము'నందు తాను స్వయముగా చెక్కిన "శ్రీచక్రరాజముపై" శారదా పీఠము ప్రతిష్ఠించి, వారు కైలాసమునుండి తెచ్చుకున్న ఐదుస్ఫటిక లింగాలను ప్రతిష్టించినారు.

ఆలాగునే శంకరులవారు తన అద్వైత మత సిద్ధాంత ప్రచారముతో శృంగేరి, ద్వారక, గోవర్ధన, జ్యోతిర్మఠము అను నాలుగు పీఠాలను నిర్మించి, దేశము నలుమూలలా ఎన్నో దేవాలయములందు దేవి-దేవతలను ఎన్నో స్తోత్రములతో గానము చేస్తూ! వారిని పూజించి సేవిస్తూ మానవులందరిని భక్తి, జ్ఞాన, కర్మల ద్వారా అద్వైత మార్గాభిముఖులుగా త్రిప్పి, మోక్షమార్గాన్ని చూపిన జగద్గురువులు శ్రీ శంకరభగవత్పాదులు.

అటువంటి పుణ్యమూర్తి జన్మదినమున మన మంతా విశేషంగా జరుపుకుని పునీతులౌదాము.

## నృసింహ జయంతి

1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లు మొత్తం శుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : పూజామందిరము, గడపకు పసుపు కుంకుమ ఇంటిముందు ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : ఎర్రటి రంగువి
6. పూజామందిరంలో చేయవలసినవి : పటములకు పసుపు, గంధము పూజకు ఉపయోగపడువస్తువులు శుభ్రము
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : ఎర్రటి వస్త్రము
8. కలశముపై వస్త్రము రంగు : ఎర్రటి రంగు
9. పూజించవలసిన ఫోటో : లక్ష్మీనృసింహ స్వామి
10. పూజించవలసిన ప్రతిమ : నృసింహస్వామి
11. పూజించవలసిన దైవము : నృసింహస్వామి
12. తయారు చేయవలసిన అక్షతలు : ఎర్రటి రంగు
13. పూజకు కావలసిన పువ్వులు : కడిమి పూలు
14. అలంకరణకు వాడవలసినపూలు : తులసి మాలలు
15. నివేదన చేయవలసిననైవేద్యం : పానకం
16. సమర్పించవలసిన పిండివంటలు : వడపప్పు
17. నివేదించవలసిన పండ్లు : యాపిల్ పండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : నరసింహఅష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : లక్ష్మీనరసింహకరావలంబ స్తోత్రము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : నృసింహాష్టకం
21. పారాయణచేయవలసిన సహస్రాలు : నరసింహ సహస్రనామము
22. పారాయణ చేయవలసినగ్రంథం : నరసింహ పురాణం
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : ప్రహ్లాద చరిత్ర
24. దర్శించవలసిన దేవాలయాలు : నృసింహదేవాలయం
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : సింహాచలం, మంగళగిరి, వేదాద్రి
26. చేయవలసిన ధ్యానములు : నృసింహ ధ్యానశ్లోకములు
27. చేయించవలసిన పూజలు : నృసింహ అష్టోత్తర పూజ





28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : నృసింహ చందనోత్సవపూజ
29. ఆచరించవలసిన వ్రతము : –
30. ఉపవాసము నియమము : ఉన్నది
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించివలసిన పుస్తకములు : నృసింహ పురాణము
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : నృసింహ నిత్యపూజ
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : నరసింహ కళ్యాణము
36. దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : నరసింహ చందనపూజ
37. పర్వదిన నక్షత్రము : ---
38. పర్వదిన తిథి : ఏకాదశి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శనివారం
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : మ॥12గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : కంచుదీపము
42. వెలిగించవలసిన దీపారాధనలు : 2
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5
44. వెలిగించవలసిన వత్తులు : దూదితో
45. దీపారాధన వాడవలసిన నూనె : కొబ్బరినూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : సింధూరము
48. నుదుటన ధరించవలసిన : సింధూరము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం నమో నారసింహాయ
50. జపమునకు వాడవలసిన మాల : తులసిమాల
51. మెడలో ధరించవలసిన మాల : తులసిమాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : శ్రీనృసింహ
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : తూర్పుదిక్కు

## శ్రీ నృసింహ జయంతి

**సంసార సాగర నిమజ్జన ముహ్యామానం దీనం విలోకయ విభో కరుణానిధేమామ్।**
**ప్రహ్లాద భేద పరిహార పరావతార లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్ ॥**
**సంసార కూప మతిఘోర మగాధమూలం సంప్రాప్య దుఃఖ శతసర్పసమాకులస్య।**
**దీనస్యదేవ కృపాయ శరణాగతస్య లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్ ॥**

అవి తొలుత ఆలా! శ్రీ నృసింహస్వామివారిని ప్రార్థించి ఆ స్వామి వారి ఆవిర్భావమునకు గల కారణాలు ఏమిటో? ఒక్కసారి మననంచేసుకుందాం!

ఈ భూమిపై 'మానవుడు' అవతరించిన నాటినుండి తనమనుగడకు ఆనందం కలిగించేవాటిని, తనకు అన్ని విధాలమేలును చేకూర్చే ప్రకృతి సంపదకు "దేవతా స్వరూపాలు కల్పించి" వాటిని పూజిస్తూ ఉండటం మనం చూస్తూ ఉంటాము. అలా మానవుడు ఈ సృష్టిలోని చరాచరములను అన్నిటిని పూజ్యభావముతో చూడటం ఒక విశేషం! అంతేకాదు మన భారతీయ సంస్కృతిలో చెట్టు, పుట్ట, రాయి, రప్ప, కొండ, కోన, నది, పర్వతాలు ఇలా ప్రకృతిలోని సంపదను అన్నిటిని పదిలపరుచుకునేందుకు తగు చర్యలు తీసుకుంటూ ఉండటం మరోవిశేషం.అందువల్లనే మన భారతదేశము కర్మభూమిగా పేరుగాంచినది. అట్టి భారతీయుల ప్రబలమైన విశ్వాసము నకు ప్రామాణికమైనది ఈ నృసింహస్వామి ఆవిర్భావచరిత్ర.

పూర్వం వైకుంఠపురిని ద్వారపాలకులైన 'జయ విజయులు'సంరక్షించుచూ ఉండు సమయాన, ఒక్కసారి సనక,సనందన, సనత్కుమార సనత్సజాతులైన బ్రహ్మమానసపుత్రులు వైకుంఠవాసుని దర్శనార్థమై వస్తారు. వారు వచ్చినది శ్రీమహావిష్ణువు ఏకాంత సమయం అగుటవల్ల, శ్రీహరి దర్శనానికి వారిని అనుమతించక అడ్డగిస్తారు. దానితో ఆగ్రహించిన ఆ తపోధనులు వారి ఇరువురును శ్రీ మహావిష్ణువునకు విరోధులై మూడు జన్మలపాటు రాక్షసులుగా జన్మించండి అని శపిస్తారు.





అలా శాపగ్రస్తులైన వారు ఇరువురు మొదటి జన్మలో హిరణ్యాక్ష, హిరణ్యాకశిపులుగా రెండవ జన్మలో రావణ, కుంభకర్ణులుగా మూడవ జన్మలో శిశుపాల, దంతవక్త్రులుగా జన్మిస్తారు.

అలా మొదటి జన్మలో దితి, కశ్యపు దంపతులకు హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా జన్మించి ఘోరమైన తపస్సులుచేసి, ఆ వరగర్వంతో లోకకంటకులైనారు. దానితో దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థం ఆ అసురుల వరాలకు అనుగుణమైన ఎన్నో అవతారాలు ఎత్తుతూ వాటిలో వరాహావార రూపంలో హిరణ్యాక్షుని ఆటలు కట్టించి హిరణ్యాక్షుని సంహరిస్తాడు శ్రీమహావిష్ణువు.

తన సోదర సంహారముపై మిక్కిలి ఆగ్రహించిన 'హిరణ్యకశిపుడు' బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సుచేసి దానవ పరిజ్ఞానముతో వివిధ రీతుల మరణము లేకుండా వరాలుపొంది, తనకు ఒక ఏవిధముగాను మరణమే లేదు అను వర గర్వముతో ఎన్నో అకృత్యాలు చేస్తూ విర్రవీగిపోతూ ఉంటాడు. అట్టి దానవ శ్రేష్ఠునకు నలుగురి కుమారులలో పెద్దకుమారుడైన "ప్రహ్లాదుడు" విష్ణుభక్తుడై తండ్రి ఆగ్రహానికి గురైనా, హరి నామస్మరణ వీడడు. దానితో వానిని గురుకులాల్లో వేసి బుద్ధిని మార్చుటకు ప్రయత్నిస్తాడు. అక్కడ గురుకులాల్లో కూడా తోటి బాలురకు "హరినామ మాధుర్యాన్ని" పంచిపెడుతూ వారిచే కూడా హరికీర్తనలు పాడించేవాడు. చివరకు హరినామస్మరణ వీడమని సామ, దాన , భేద, దండోపాయాలతో ప్రయత్నిస్తాడు. అందువల్ల కూడా ఏ ప్రయోజనము పొందలేక పోతాడు. చివరకు పుత్రవాత్సల్యమనేది లేకుండా "ప్రహ్లాదుని" సంహరించుటకు వివిధ మార్గాలు అవలంబిస్తాడు. ప్రహ్లాదుని హరినామస్మరణ వానిని రక్షక కవచంలా కాపాడుతూంటుంది. అందులకు మరింత ఆగ్రహించిన హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో నిన్ను అనుక్షణము కాపాడుచున్న శ్రీహరి ఎక్కడరా? ఈ స్తంభమునందు చూపగలవా? అని ప్రశ్నిస్తాడు. అందుకు ప్రహ్లాదుడు తండ్రీ! సర్వాంతర్యామి అయినా శ్రీహరి "ఇందుగలడందులేడను సందేహములేదు" ఎందెందు వెదకిన అందందే కలడు అని జవాబుఇస్తాడు. అయితే ఈ స్తంభమునందు చూపగలవా? అని ఆగ్రహంతో తనచేతిలో ఉన్న గదతో ఒక్క ఉదుటన స్థంబాన్ని గట్టిగా కొడతాడు.

అంత శ్రీహరి 'హిరణ్యకశిపుడు' తన దానవ పరిజ్ఞానముతో 'బ్రహ్మ'వలన పొందిన వరాలు ఏమిటో? వాటిలోని లోపాలు క్షణకాలం ఆలోచించి, అంటే గాలి, నీరు, అగ్ని, భూమి, ఆకాశమునందుగాని, దిక్కులలోగాని, రాత్రిగాని, పగలుకాని, చీకటిగాని, వెలుతురుగాని, నీటిజంతువులు, క్రూరమైన అడవిజంతువులవల్లగాని, సర్పాలవల్లగాని, దేవతలవల్లగాని, మనుషులవల్లగాని, అస్త్రశస్త్రాలవల్లగాని, ఇంటగాని, బయటగాని, చావులేకుండా పొందిన వరాలకు అనుగుణమైన రూపుదాల్చి

హిరణ్యకశిపుడు మోదిన స్తంభమునుండి తన అవతారాలలో 'నాలుగవ అవతారం' "శాశ్వత అవతారం" అంటే! నిర్యాణము పొందిన రాముడు, కృష్ణుడువంటి అవతార ముల వలెకాకుండా! సద్యోజాతుడై అంటే అప్పటి కప్పుడు అవతరించినవాడు మిగిలిన అవతారములలోవలే తల్లి దండ్రులతో నిమిత్తములేకుండా! స్వచ్ఛందంగా ఆవిర్భవించిన అవతారమే ఈ "నృసింహ అవతారము" శాశ్వతమైనదిగా చెప్పబడినది.

అలా ఈ శ్రీ నృసింహస్వామివారు వైశాఖ శుక్లపక్షములో పూర్ణిమకు ముందువచ్చే 'చతుర్దశి' నాడు ఆవిర్భవించారు. ఆపుణ్యదినమునే మనం "శ్రీనృసింహ జయంతి" గా జరుపుకుంటూ ఉంటాము. ఇది కృతయుగంలో వచ్చిన పరిశుద్ధావతారం.

**"వైశాఖ శుక్ల పక్షేతు చతుర్థశ్యాం సమాచరేత్,**
**మజ్జన్మ సంభవం వ్రతం పాపప్రణాశనం"**

అని సాక్షాత్తు శ్రీహరి స్వయంగా ప్రహ్లాదునితో చెప్పినట్లు "నృసింహపురాణం" లో చెప్పబడినది.

ఆవిధంగా ప్రహ్లాదుని విశ్వాసమైన (సర్వాంతర్యయామి) అనిపలుకులకు ప్రామాణికంగా హిరణ్యకశిపుడు మోదిన స్తంభము ఫెళఫెళమని విరిగిపడుచుండగా భూనభోంతరాలన్ని దద్దరిల్లేలా సింహగర్జనతో ప్రళయగర్జన చేస్తూ! ఉగ్రనరసింహ రూపంతో ఆవిర్భవిస్తాడు. అట్టి స్వామి ఆకారంచూస్తే సింహంతల, మానవశరీరం. సగం మృగత్వం, సగం నరత్వం. ఇంకా ఆమూర్తిలో క్రౌర్యం, కరుణ, ఉగ్రత్వం, ప్రస న్నత ఆవిధంగా పరస్పర విరుద్ధమైన గుణాలతో కూడియున్న అవతారమూర్తిలా ఉన్నారు ఆ నృసింహస్వామి.

అలా ఆవిర్భవించిన ఆ స్వామి "హిరణ్యకశిపుడు" పొందిన వరాలను ఛేదించకలిగే రూపాన్ని మరియు అట్టి వాతావరణాన్ని అంటే అటురాత్రి ఇటుపగలు కాని సంధ్యా సమయాల్లో, ఇటు భూమి అటు ఆకాశముకాని ప్రదేశము "గడపపైన" మృగ నరలక్షణాలతో గూడి, ఒక్క ఉదుటన హిరణ్యకశిపుని మెడపట్టి తన తొడలపై పరుండబెట్టి జీవము నిర్జీవముకాని గోళ్ళతో హిరణ్యకశిపుని ఉదరమును చీల్చి చండాడి సంహరించినాడు.

అనంతరము ఆ ఉగ్రనరసింహమూర్తిని దేవతలు ఎవ్వరు శాంతింప చేయలేక, దేవతలందరు ప్రహ్లాదుని ఆ స్వామిని శాంతింప చేయమని కోరతారు. అలా ప్రహ్లాదుని ప్రార్ధనతో శాంతించిన ఆ స్వామి శ్రీ మహాలక్ష్మీ సమేతుడై భక్తులకు ప్రత్యక్షమౌతాడు. అట్టి స్వామి నిర్యాణములేని అవతారమూర్తిగా, పిలిస్తే పలికేదైవంలా భక్తుల పాలిట కల్పతరువుగా కొనియాబడచూ పూజించబడుచున్నారు.



## ఇంకొక కథ :

హిరణ్యాక్షుని వధానంతరము అతని సోదరుడు హిరణ్యకశిపుడు చాల దుఖిం చెను. భగవానునిపై విరోధము పెంచుకొనెను. తాను అజేయుడగుటకు కఠోరమైన తపస్సు చేసెను. దీనివలన దేవతలతోను, మానవులతోను, పశ్వాదులతోను మరణము లేకుండునట్లు వరమును పొంది అజేయుడయ్యెను. హిరణ్యకశిపుడు "దేవ దానవులందరును తన చరణములకు వందనము చేయవలె"నని కఠోర శాసనము చేసెను. భగవంతుని పూజించు వారిని కఠినముగ దండించుచుండెను. వీని శాసనమునకు భయపడి లోకపాలురందరు భగవానుని ప్రార్ధించసాగిరి. దేవతలు ప్రార్ధించగా ప్రసన్నుడైన నారాయణ భగవానుడు "హిరణ్యకశిపుని వధించెద"నని చెప్పెను.

దైత్యరాజు అత్యాచారములు రోజు రోజునకు పెరుగసాగెను. తన పుత్రుడైన ప్రహ్లాదుడు భగవానుని నామము స్మరించుచున్నాడని పలు విధములుగ కష్టములు పెట్టుచుండెను.

ప్రహ్లాదుడు బాల్యము నుండియు ఆటలు మాని భగవానుని ధ్యానించుచు తన్మయత్వము జెందుచుండెను. ఇతడు భగవానునకు ప్రియమైన భక్తుడు. ఇతడు సమయము లభించునప్పుడు అసురబాలురకు ధర్మము ఉపదేశించుచుండెను. ఇది వినిన హిరణ్యకశిపుడు ఉగ్రుడయ్యెను. ప్రహ్లాదుని దర్బారునకు పిలిపించెను. ప్రహ్లాదుడు వినయముగ చేతులు జోడించి దైత్యరాజు ఎదుట నిలువబడెను. వీనిని చూచిన రాజు "మూర్ఖా! నీవు గొప్ప ఉద్దండుడవైతివా? నీవు నిర్భయముగ నా ఆజ్ఞకు విరుద్ధము ఎందులకు చేయుచుంటివి?" అని అడుగగా,

ప్రహ్లాదుడు "తండ్రీ! బ్రహ్మ మొదలు సమస్త జీవరాశులు భగవానుని వశమందున్నవి. ఆ పరమేశ్వరుడే తన శక్తులచే ఈ విశ్వమును సృష్టించుచున్నాడు, రక్షించుచున్నాడు, సంహరించుచున్నాడు. కావున మీరు ఈ అసుర భావమును విడచి అందరియందు ఉదారభావము చూపుడు" అని అనెను. ఆ మాటలు వినిన హిరణ్యకశిపుని శరీరము క్రోధముతో కంపించి "అరే! మందబుద్ధీ! నీ భగవానుడు సర్వాంతర్యామి అయిన ఈ స్తంభమున ఎందులకు కనిపించడు?" అని ఉగ్రుడై క్రోధముతో సింహాసనముపై నుండి దుమికి ఈ స్తంభముపై ఒక గ్రుద్దు గ్రుద్దెను.

అదే సమయమున ఆ స్తంభము నుండి నృసింహ భగవానుడు ఉద్భవించెను. ఇతనికి సగము శరీరము సింహము, సగము శరీరము మనుష్యుని రూపమున నుండెను. లీలాధారి నృసింహ భగవానుడు క్షణములో హిరణ్యకశిపుని జీవన లీలను సమాప్తము గావించెను. తన ప్రియ భక్తుడైన ప్రహ్లాదుని రక్షించెను.

సర్వవ్యాపకుడైన నృసింహ భగవానునకు నమస్కారము.

## హనుమజ్జయంతి



1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లు మొత్తం శుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ పూజా మందిరములో ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : సింధూరపు రంగు పట్టు వస్త్రాలు
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజకు ఉపయోగపడు వస్తువులు, శుభ్రముచేసిపటములు, గంధము, కుంకుమ వుంచాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : సింధూరం
8. కలశముపై వస్త్రము రంగు : సింధూరం
9. పూజించవలసిన ఫోటో : పంచముఖాంజనేయ
10. పూజించవలసిన ప్రతిమ : ప్రసన్నాంజనేయ స్వామి
11. పూజించవలసిన దైవము : పంచముఖాంజనేయస్వామి
12. తయారు చేయవలసిన అక్షతలు : ఎర్రటి అక్షతలు
13. పూజకు కావలసిన పువ్వులు : ఎర్రటి పువ్వులు
14. అలంకరణకు వాడవలసినపూలు : కనకాంబరములతో మాల
15. నివేదన చేయవలసిననైవేద్యం : అప్పాలు
16. సమర్పించవలసిన పిండివంటలు : బూరెలు
17. నివేదించవలసిన పండ్లు : దానిమ్మపండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : ఆంజనేయ అష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : మారుతి స్తోత్రము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : హనుమాన్ చాలీసా
21. పారాయణచేయవలసిన సహస్రాలు : ఆంజనేయ సహస్రము
22. పారాయణ చేయవలసినగ్రంథం : హనుమచ్చరిత్ర
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : సుందరకాండ
24. దర్శించవలసిన దేవాలయాలు : ఆంజనేయ దేవాలయం
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : అరగొండ, పొన్నూరు, కసాపురం, గండిక్షేత్రం.
26. చేయవలసిన ధ్యానములు : హనుమాన్ ధ్యానశ్లోకములు
27. చేయించవలసిన పూజలు : 1000 ఆకులతో పూజ



28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : ఆకుపూజ
29. ఆచరించవలసిన వ్రతము : హనుమాన్వ్రతము
30. ఉపవాసము నియమము : ఉదయం నుండి సాయంత్రంవరకు
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : సుందరకాండ, హనుమచ్ఛరిత్ర, హనుమదారాధన
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : ఆంజనేయ నిత్యపూజ, పంచముఖాంజనేయ స్తోత్రమాల
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : హనుమాన్చాలీసా పుస్తకములు
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : హనుమత్ద్దీక్షలు, హనుమత్ వ్రతములు
36. దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : హనుమత్కల్యాణం
37. పర్వదిన నక్షత్రము : పూర్వాభాద్ర (పరాశరసంహిత)
38. పర్వదిన తిథి : చైత్రశుద్ధ పూర్ణిమ, వైశాఖ బహుళ దశమి (పరాశర సంహిత)
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శనివారంగాని, మంగళవారం
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : ఉ॥ 6గం॥నుండి 9గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : ఎర్రటి మట్టి ప్రమిదలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : 5
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5
44. వెలిగించవలసిన వత్తులు : జిల్లేడు వత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : నువ్వుల నూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : సింధూరము రంగు కలిగినది
48. నుదుటన ధరించవలసిన మంత్రం : సింధూరము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం ఆంజనేయాయ నమః
50. జపమునకు వాడవలసిన మాల : చిన్న రుద్రాక్షమాల
51. మెడలో ధరించవలసిన మాల : చిన్నరుద్రాక్షమాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : హనుమత్ ప్రతిమ
53. చేయవలసిన అభిషేకము : పంచామృతముతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : దక్షిణముఖము

## శ్రీరామ భక్త హనుమ - హనుమజ్జయంతి



మన భారతదేశములో పల్లెలు పట్టణాలు అనిభేదము లేకుండా ప్రతీచోట రామాలయమో లేక ప్రత్యేకించి హనుమంతుని శిలావిగ్రహరూపంతో కూడిన ఆలయమో లేకుండా ఉండవు అనుటలో అతిశయోక్తిలేదేమో! అటువంటి శ్రీహనుమంతుని జన్మవృత్తాంత విశేషాలు ఏమిటో సమీక్షగా తెలుసుకుందాం! వీటిలోను అనేక విభిన్న గాధలు కానవస్తున్నాయి.

ఒకసారి దేవలోకమందు దేవేంద్రుడు కొలువుతీరి యున్న సమయాన "పుంజికస్థల" అను అప్సరసకాంత బృహస్పతివద్దకుచేరి హాస్య ప్రసంగము చేయసాగిందట, ఆమె యొక్క హావభావ వికారాలకు బృహస్పతి మిక్కిలి ఆగ్రహించి నీవు భూలోకమందు "వానరస్త్రీ" గా జన్మింతువుగాక! అని శాపముపెట్టినాడు. అంత ఆపుంజక తన తప్పిదాన్ని మన్నించి శాపవిమోచనమీయమని పరిపరి విధాల ప్రార్థించింది. దానికి బృహస్పతి సంతసించి నీవు భూలోకమందు "హనుమంతునికి" జన్మ ఇచ్చిన తరువాత తిరిగి దేవలోకమునకు రాగలవని అనుగ్రహించెను. ఇది కంబరామాయణ గాధలోగల వృత్తాంతము.



ఆ శాపకారణంగా "పుంజికస్థల" భూలోకమందు వానరకన్యగా జన్మించి "కేసరి" అను అందమైన వానరాన్ని ప్రేమించి వివాహమాడింది. అంత ఆమె గర్భముదాల్చి శివాంశ సంభూతుడైన "శ్రీ ఆంజనేయస్వామి" వారికి జన్మ ఇచ్చింది. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రునిలా! దిన దిన ప్రవర్ధమానముగా పెరిగి సూర్య భగవానునివద్ద సమస్త విద్యలు అభ్యసిస్తూ ఏక సంథాగ్రాహియై అచిరకాలములోనే సర్వశాస్త్ర పారంగతుడైనాడు. అందుకు సూర్యభగవానుడు గురుదక్షిణగా ! నీవు "సుగ్రీవుని" వాలి బారినుండి ఎల్లప్పుడు రక్షిస్తూ ఉండవలసిందిగాకోరెను. అందువల్ల హనుమంతుడు సూర్యభగవానుని కోరికమేరకు సుగ్రీవునికి ఆప్తమిత్రుడుగా, మంత్రిగా ఉంటూ వివిధసేవలు అందించసాగెను.

ఇకరామాయణగాధలో సీతాన్వేషణ సమయమందు "శ్రీ ఆంజనేయస్వామి" వారి పాత్ర అత్యంత ప్రశంసనీయమైనది. నిరంతరము శ్రీరామపాదారవిందములు కొలుస్తూ "శ్రీరామనామజప" మాధుర్యాన్ని గ్రోలుతూ స్వామిభక్తి పరాయణుడై నవ్యవ్యాకరణ పండితుడుగా, నీతిశాస్త్ర, తత్వశాస్త్ర, వాస్తుశాస్త్ర కోవిదుడుగా, దేశకాల పరిస్థితులకు అనుగుణంగా బుద్ధి పరాక్రమాలు చూపుతూ శ్రీరామ పాదసేవతో "సానపట్టిన వజ్రము" వలె వెలుగొందసాగెను. ఈతనిని పవనపుత్ర, కేసరి, వాయు నందన, వజ్రకాయ, మారుతి అను పలు నామాలతో కీర్తిస్తూ ఉంటారు.

కారణజన్ముడైన శ్రీ హనుమంతుడు అంతటి శక్తియుక్తులు కలవాడు కాబట్టి, సీతాన్వేషణలో సఫలీకృతుడై రామ-రావణ యుద్ధసమయములో మూర్ఛపోయిన





లక్ష్మణుని బ్రతికించుటకు సంజీవని తెచ్చుటవంటి పలుకార్యక్రమములతో హనుమంతునియొక్క ఆదర్శవంతమైన స్వామిభక్తి, త్యాగనిరతి, ధైర్య సాహసోపేత కార్యక్రమాలతో పలువురి ప్రశంసలు అందుకుని శ్రీరామునిచే "ఆలింగనభాగ్యము" అందుకున్న భాగ్యశీలి అయినాడు. అంతటి మహత్ భాగ్యము మరి ఎవరికి దక్కుతుందో చెప్పండి. అందువల్లనే!

**యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్**
**భాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.**

శ్రీ ఆంజనేయస్వామివారు! ఎక్కడెక్కడ భక్తులు శ్రీరామ భజనలు చేస్తూఉంటారో అచ్చోట ఆనంద భాష్పాలతో అంజలిఘటిస్తూ! చిరంజీవి అయిన ఆ స్వామి ప్రత్యక్ష మవుతారని భక్తుల ప్రగాఢమైన విశ్వాసం. అట్టి మూర్తీభవించిన భక్తాగ్రేశ్వరుని "హనుమజ్జయంతి"నాడు శ్రీ స్వామివారికి విశేషపూజలు, శ్రీరామ భజనలు, సుందరకాండ, హనుమాన్ చాలీసా వంటి పారాయణలు గావించాలి.

### ఇంకొక కథ

**మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్**
**వాతాత్మజం వానరాయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.**

అని ఆస్వామికి ముందుగా అలాప్రణమిల్లి, కారణ జన్ముడైన "శ్రీఆంజనేయ స్వామి" వారియొక్క జన్మవృత్తాంతము, వారి చిన్నారి చేష్టలు, వారి ఔన్నత్య విశేషాలు వారి ఆరాధనతో కలిగే ఫలితాలు మున్నగునవి తెలుసుకుందాం!

సుదీర్ఘచరిత్ర కలిగిన ఆ స్వామిని కొనియాడి చెప్పుటకు చతుర్ముఖుడైన బ్రహ్మ పంచముఖుడైన శివుడు, షణ్ముఖుడైన కుమారస్వామి, సహస్రముఖములు కలిగిన ఆదిశేషుడు, రెండు ముఖములు కలిగిన అగ్ని, ఏకముఖము కలిగిన శ్రీమన్నారాయ ణుడే ఆస్వామివారి మహాత్యాన్ని వర్ణించి చెప్పుట కష్టతరమని చెప్పగా, ఇక మానవ మాత్రులము మనమెంత?

వైశాఖమాసములో పూర్వాభాద్ర నక్షత్రంలో బహుళ దశమి శనివారంనాడు మధ్యాహ్నం వైధృతి యోగములో విష్ణుభక్తి పరాయణుడైన "హనుమ" జననం జరిగిందని "పరాశరసంహిత" ప్రకారం విదితమవుచున్నది. ఆనాడు గ్రామాలు పల్లెలు, పట్టణాలు అనుభేదములేకుండా అన్ని వర్ణములవారు స్త్రీ పురుషభేదము లేకుండా, వివిధ ఆలయాలలో దేశము నలుమూలలా ఈ "హనుమజ్జయంతి" ఉత్సవాలు భక్తులు ఎంతో వైభవంగా నిర్వహిస్తూ ఉంటారు. ఆ రోజు గృహస్థులు ఉపవాసము ఉండపనిలేదు. అది యతులకు మాత్రమే వర్తిస్తుందని చెప్పబడియున్నది.

ఈ స్వామివారి జన్మవృత్తాంతముపై విభిన్నరీతులలో గాథలు కావస్తున్నాయి. ఒకసారి దేవలోకమందు దేవేంద్రుడు కొలువుతీరియున్న సమయాన, "పుంజికస్థల" అను అప్సరసకాంత బృహస్పతివద్దకు చేరి హాస్య ప్రసంగము చేయసాగిందట! ఆమెయొక్క హావభావ వికారాలకు బృహస్పతి మిక్కిలి ఆగ్రహించి నీవు భూలోకమందు 'వానరస్త్రీగా' జన్మింతువు గాక! అని శాపముపెట్టినాడు. అంత, ఆ అప్సరకాంత తన తప్పిదాన్ని మన్నించమని పరిపరివిధాల వేడుకుని శాపవిమోచన మీయమని వేడుకుంటుంది. దానితో శాంతించిన బృహస్పతి నీవు చింతించవలసినపనిలేదు. నీవు కారణజన్ముడైన "హనుమంతుని"కి జన్మ ఇచ్చిన తరువాత తిరిగి దేవలోకమునకు చేరుకోగలవని అనుగ్రహించెను. ఆ శాపకారణంగా "పుంజికస్థల" భూలోకమందు "అంజనాదేవి" అను వానరకన్యగా జన్మించి తరువాత "కేసరి" అను అందమైన వానర రాజును ప్రేమించి వివాహమాడుతుంది.

ఇలా ఉండగా! రాక్షస సంహారకార్యక్రమము బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు విడిగా ఏ ఒక్కరికీ సాధ్యపడుటలేదు. కావున విష్ణుమూర్తి పరిస్థితిని సమీక్షించి "వారిముప్వుర తేజము" కలిపి ఈశ్వరునకు ఇస్తారు. దానిని పరమశివుడు మ్రింగుతాడు. ఆ తేజస్సువలన జన్మించినవాడు రాక్షస సంహారముచేసి అటు దేవతలకు ఇటు ఋషీశ్వరులకు ఆనందాన్ని కలిగిస్తాడని విష్ణువు చెప్పాడు.

అట్టి శివవీర్యశక్తిని పార్వతీదేవి భరించలేక అగ్నిహోత్రునకు ఇస్తుంది. దానిని తాను భరించలేక, వాయుదేవునకు ఇస్తాడు. ఆ సమయమందు మహాబల పరాక్రమ సంపన్నుడైన కుమారుడు కలగాలని వెంకటాచలమందు అంజనాదేవి గొప్ప తపస్సు చేస్తూఉంది. వాయుదేవునకు ఆమెపై అనుగ్రహము కలిగి ప్రతిరోజు ఒక పండును ఆమెచేతిలో ఆహారంగా ఇచ్చేవాడు. అలాగే ఒకరోజు ఆశివవీర్యాన్ని పండుగామలచి ఆమెచేతిలో ఉంచుతాడు. దానిని కూడా పండు అనుకొని తిని ఆమె గర్భం దాలుస్తుంది. ఆ విధంగా హనుమయొక్క స్థూలశరీరం అంజనాదేవి గర్భంనుండి వచ్చింది. సూక్ష్మశరీరము వాయుప్రేరితము గావున వాయుపుత్రుడని అంటారు. కారణశరీరం శివాంశవల్ల ఏర్పడింది అని ఆచార్యులు వివరణ చెప్తారు.

ఆ సమయమందు ఆకాశవాణి అంజనాదేవితో ! అంతవరకూ జరిగినది ఇకపై జరగబోయేది చెప్తూ! భగవదానుగ్రహమువల్ల నీకు ఒక మహానుభావుడు పుట్టబోతున్నాడని, అందువల్ల నీకు కన్యత్వదోషము ఉండదని చెప్తుంది. ఇలా 'ఆంజనేయస్వామి' జన్మవృత్తాంతగాధను పరమశివుడు పార్వతీదేవికి; అది తన 11వ అవతారమని చెప్పినట్లుగా పరాశర సంహిత తెలియ చెబుతోంది.

హనుమ నివాసము 'కిష్కింద'. అదే నేడు మన బళ్లారి ప్రాంతము అయిన కిష్కింద రాజ్యము. అప్పుడు అది ఆంధ్రులది. వాలి సుగ్రీవులు కూడా ఆంధ్రులే!



కాని వారు కేవలం కోతులు కాదని 'నవరజాతికి చెందిన' ఒక జాతి అని డా॥ అన్నదానం చిదంబర శాస్త్రిగారు తమ గ్రంథములో వివరించారు.

త్రిపురాసుర సంహార సమయమందు విష్ణువు పరమశివునకు సహాయపడ్డాడు. అందుకు ప్రతిఫలంగా రామావతారమందు లోకరక్షణార్థమై శ్రీరామునకు సహాయ పడుటకై "రుద్రుడు" ఆంజనేయస్వామిగా అవతరించి రావణసంహారానికి తోడ్పడినాడని పరాశరసంహిత నొక్కివక్కాణిస్తోంది.

అలా! అంజనాదేవికి వరప్రసాదియైన 'హనుమ' శుక్ల పక్ష చంద్రునిలా దిన దిన ప్రవర్ధమానమగుచూ, ఒకనాడు అప్పుడే ఉదయిస్తున్న "సూర్యుని" చూచి అది ఒక తినేపండుగా భ్రమించి, దాన్ని తినడానికి ఆకాశమార్గాన బయలుదేరాడు. అదిచూచిన 'ఇంద్రుడు' వానిపై తన వజ్రాయుధాన్ని విసరుతాడు. దాని తాకిడివల్ల 'హనుమ' ఒక కొండపైబడి ప్రాణులు కోల్పోతాడు. అది తెలుసుకున్న వాయు దేవుడు వానిని బ్రతికించుకునేందుకు ఒక గుహలోనికి తీసుకుపోతాడు. దానితో ముల్లోకాలయందు గాలి స్థంభించి పోతుంది. ఆ గాలి దేవుని వెతుకుతూ బ్రహ్మాది దేవతలు అంతా ఆ గుహవద్దకు చేరుకుంటారు. బ్రహ్మ వాయుదేవుని ఓదార్చి 'హనుమను' బ్రతికిస్తాడు. ఇంద్రుడు తానుచేసిన పనికి పశ్చాత్తాపపడుచూ 'పద్మమాల' అనుదానిని బహూకరిస్తాడు. ఇక పరమేశ్వరుడు "చిరంజీవిగా" దీవిస్తాడు. మిగిలిన దేవతలంతా తలా ఒక వరం ఇచ్చి దీవిస్తారు. తనకు పుత్రసమానుడైన 'హనుమ' బ్రతికినందులకు తిరిగి లోకసంచారంచేయ నారంభిస్తాడు వాయుదేవుడు. హనువు అంటే 'దవడ' ఆతని ఎడమదవడకు దెబ్బ తగులటచే ఆ బాలుడు "హనుమంతుడు" అనుపేరుతో కీర్తింపబడుచున్నాడు.

అట్టి హనుమంతుడు సర్వశక్తివంతుడై "చిరంజీవిగా" పునర్జీవింపబడి తన చిన్నారి అల్లరి చేష్టలతో ఋషులను, మునులను ఆటపట్టిస్తూ ఉండేవాడు. దానితో వారు ఆగ్రహించి "నేటినుండి నీశక్తి ఏమిటో నీకు తెలియకుండా ఉండుగాక! అదియును నీశక్తి ఏమిటో నీకు గుర్తుచేస్తే కాని తెలియకుండుగాక అని శపిస్తారు. ఆ శాపకారణంగా హనుమంతుడు నాటినుండి తన "శక్తి"ని మరచిపోతాడు. కావున అట్టి స్వామిని మనము వారి శక్తి సామర్థ్యములు ఎంతగా గుర్తుకు చేస్తూ స్తోత్రములు చేస్తామో! ఆ స్వామి అంతగా సంతుష్టుడై మనకు సర్వాభీష్టాలు నెరవేరుస్తూ ఉంటారు. నాటినుండి "స్తోత్రప్రియుడైనాడు" ఆ స్వామి.

అటువంటి ఆ స్వామివారియొక్క మహిమాతిశయం మనకు బాగా తెలియాలంటే పరాశర సంహిత, ఉమాసంహిత, హనుమా సంహిత, రుద్ర యామిళము, సుదర్శన సంహిత, శౌనకసంహిత, ఖిల సంహిత మున్నగు గ్రంథములే మనకు ప్రామాణిక మవుచున్నవి.

ఇక స్వామికి విద్యారంభ వయస్సు రాగానే! అంజనాదేవిదంపతులు "హనుమంతుని" సూర్యుని వద్దకు విద్యాభ్యాసానికై పంపుతారు. ఆ సూర్య భగవానునివద్ద సమస్త విద్యలు అభ్యసిస్తూ ఏక సంథాగ్రాహియై అచిరకాలములోనే సర్వశాస్త్ర పారంగతుడైనాడు. అందుకు సూర్యభగవానుడు గురుదక్షణగా! నీవు సుగ్రీవుని వాలి బారినుండి ఎల్లవేళలా రక్షిస్తూ ఉండవలసిందిగా కోరతాడు. అందువల్ల హనుమంతుడు సూర్యభగవానుని కోరికమేరకు సుగ్రీవునికి ఆప్తమిత్రుడుగా, మంత్రిగా ఉంటూ వివిధ సేవలు అందిస్తూ ఉంటాడు.

ఈ ఆంజనేయస్వామి వారిగాథ- రామాయణంలో సీతాన్వేషణ సమయమందు వీరిపాత్ర కడు ప్రశంసనీయమైనది అని చెప్పుకోవచ్చు. నిరంతరము శ్రీరామ పాదార విందములు కొలుస్తూ "శ్రీరామ నామజపం" యొక్క మాధుర్యాన్ని గ్రోలుతూ స్వామి భక్తి పరాయణుడై నవ్య వ్యాకరణ పండితుడుగా, నీతిశాస్త్ర, తత్వశాస్త్ర, వాస్తుశాస్త్ర కోవిదుడుగా, దేశకాల పరిస్థితులకు అనుగుణంగాను బుద్ధి పరాక్రమాలు చూపుతూ శ్రీరామ పాదసేవలో "సానపట్టిన వజ్రము"వలె వెలుగొంద సాగెను. ఈతనికి పవన పుత్ర, కేసరి, వాయునందన, వజ్రకాయ, మారుతీ అను పలునామాలతో భక్తులు కీర్తిస్తూ వుంటారు.

కారణజన్ముడైన ఈ స్వామి అంతటి శక్తియుక్తులు కలవాడు కాబట్టి! సీతాన్వేషణలో సఫలీకృతుడై రామ రావణ యుద్ధసమయములో మూర్ఛపోయిన లక్ష్మణుని బ్రతికించుటకు 'సంజీవని' తెచ్చుట; వంటి పలుకార్యక్రమాలతో హనుమంతుని యొక్క ఆదర్శవంతమైన స్వామిభక్తి, త్యాగనీతి, ధైర్య సాహసోపేతకార్య క్రమాలతో పలువురి ప్రశంసలు అందుకుని శ్రీరామునిచే "ఆలింగభాగ్యము" అందుకున్న భాగ్యశీలి అయినాడు. అంతటి మహత్ భాగ్యము మరి ఎవరికి దక్కుతుందో చెప్పండి. అట్టివి వారియొక్క ఔన్నత్య విశేషాలు చెప్పుకొనుటకు అవి కేవలం మచ్చుతునకలు మాత్రమే!

అటువంటి స్వామి ఆరాధనతో కలిగే ఫలితాలు కొద్దిగా తెలుసుకుందాము.

**యత్రా౽స్తి భోగో నహి తత్ర మోక్షః యత్రా౽స్తి మోక్షోనమి తత్ర భోగః**
**శ్రీమారుతీస్సేవనం తత్పరాణం । భోగశ్చ మోక్షశ్చ కరస్థఏవ ॥**

**(శౌనక సంహిత)**

అంటే, కేవలం భోగాలలోనే కూరుకుని పోతూవుంటే మోక్షంరాదు. ఇక ముముక్షువులకవుతే, భోగాల ప్రసక్తిలేదు. కొందరు దేవతలుఅవుతే కేవలం భోగాలను మాత్రమే ఇస్తారు. కొందరు మోక్షాన్ని ప్రసాదిస్తారు. ఈ "ఆంజనేయస్వామి" వారు అటు భోగాల్ని, ఇటు మోక్షాల్ని రెండింటిని ఇవ్వగల కల్పవృక్షం, కామధేనువుగా చింతామణిగా చెప్పుకోవచ్చని అర్థం.

---





**శ్లో॥ ఏకోదేవ స్సర్వద శ్రీ హనుమా । నేకోమంత్ర శ్రీహనుమత్ప్రకాశః ।**
**ఏకోమూర్తి శ్రీహనూమత్స్వరూపా । చైకం కర్మ శ్రీహనుమత్సపర్యా॥**

**(పరాశర సంహిత)**

సత్య పదార్థమైన బ్రహ్మము ఒకడే ఉన్నాడు. ఆయనే హనుమ. ఒక్కటే మంత్రముంది. అది శ్రీ హనుమన్మంత్రం. ఒకటే మూర్తి ఉంది ఆయనే హనుమ. ఇక మనం చేయవలసినపని ఒక్కటేనట! అది హనుమంతుని సేవ వారి పూజ! అని పరాశరుడు మైత్రేయునికి బోధించినట్లు తెలియుచున్నది.

**శ్లో॥ ఆంజనేయం మహావీరం । బ్రహ్మవిష్ణు శివాత్మకం**
**బాలార్క సదృశాభాసం । రామదూతం నమామ్యహమ్ ॥**

**(ఉమాసంహిత)**

హనుమ అంటే! బ్రహ్మ విష్ణు శివాత్మకమైన త్రిమూర్త్యాత్మక స్వరూపుడని, సృష్టిస్థితి లయకారకుడని, వీరుడనగా బ్రహ్మవేత్తయని, రామదూతయనగా శ్రీరాముని స్వరూప కథనము చేయువాడని, ఇందు స్పష్టముగా తెలియుచున్నది.

ఇక (సుదర్శనసంహిత) లో ఏ ఇంట్లో ప్రతినిత్యం భక్తి శ్రద్ధలతో హనుమంతుని పూజిస్తారో! ఆ యింట్లో హనుమయొక్క ప్రభావంవల్ల "మహాలక్ష్మి" స్థిరముగా ఉంటుంది అని చెప్పబడి యున్నది.

ఏనాడో గడచిన రామాయణ గాథలోని శ్రీ ఆంజనేయస్వామివారు ఇంకా బ్రతికి ఉంటారా......! అని ఎవ్వరూ ఆశ్చర్య పోనక్కరలేదు. వారి "చిరంజీవత్వాన్ని" నిరూపించుకొనుటకు తగు నిదర్శనాలు ఉన్నాయి. పాండవులలో బలశాలియైన భీమునకు హిమవత్పర్వతంలో దర్శనమిచ్చి తనతోకను ఒకసారి కదల్చిచూడమని చెప్పినట్లు; మహాకవి భక్త తులసీదాసునకు ఒకసారి సాక్షాత్కారం ఇచ్చినట్లుగా వారి చిరంజీవత్వము నిరూపించుటకు సూచించు తగు ప్రమాణాలు కలిగిన ప్రత్యక్ష దైవం ఆయన...!

**యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్**
**భాష్పవారి పరిపూర్ణ లోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.**

అంటే! శ్రీ ఆంజనేయస్వామివారు ఎక్కడెక్కడ భక్తులు శ్రీరామ భజనలు, కీర్తనలు చేస్తూ ఉంటారో ! అచ్చోట ఆనంద బాష్పాలతో అంజలిఘటిస్తూ చిరంజీవి అయిన ఆ స్వామి ప్రత్యక్షమవుతారని భక్తుల ప్రగాఢమైన విశ్వాసం.

అట్టి మూర్తీ భవించిన భక్తాగ్రేశ్వరుని "హనుమజ్జయంతి"నాడు ఆ స్వామివార్కి విశేషపూజలు శ్రీరామభజనలు, సుందరకాండ, హనుమాన్ చాలీసా వంటి పారాయణులు గావించి, ఆ స్వామివారి అనుగ్రహపాత్రులౌదాము.

## కూర్మ జయంతి

అగ్ని దేవుడు, వశిష్ఠునితో "వశిష్ఠా! ఇప్పుడు కూర్మావతారమును వర్ణించుచుంటిని వినుము. దీనిని వినిన సమస్త పాపములు నశించును. పూర్వము దేవాసుర సంగ్రామమున దైత్యులు దేవతలను ఓడించిరి. వీరికి దుర్వాసుని శాపము వలన లక్ష్మికూడ తొలగిపోయెను. సమస్త దేవతలు క్షీరసాగరమందు శయనించి యున్న విష్ణు భగవానుని చెంతకేగి "భగవాన్! తమరు దేవతలను రక్షించవలెను" అని ప్రార్థించిరి.

శ్రీహరి, బ్రహ్మాది దేవతలతో "దేవగణములారా! మీరు క్షీర సముద్రమును మధించుడు. అమృతమును పొందుటకును, లక్ష్మీప్రాప్తి గలుగుటకును మీరు అసురులతో సంధి చేసికొనవలెను. ఏదైననూ ఒక మహత్కార్యము నిర్వహించవలెనన్న ఒక మహత్ప్రయోజనము పొందగోరినను, శత్రువులైనను సంధి చేసికొనవలెను. నేను మిమ్ములను అమృతమునకు హక్కుదారులను చేసి దైత్యులను వంచితులను గావించెదను. మీరు దైత్యరాజు బలి చక్రవర్తిని నాయకునిగా నియమించుకొని మందరాచలమును కవ్వముగచేసి, వాసుకి సర్పమును కవ్వపు త్రాడుగచేసి, నా సహాయమును కూడ పొంది, క్షీరసాగరమును మధించుడు" అని చెప్పగా దేవతలు, దైత్యులతో సంధి చేసికొని, క్షీర సముద్రమును చిలుకుట ప్రారంభించిరి. వాసుకి సర్పము తోకవైపు దేవతలు నిలచిరి. వాసుకి సర్ప నిఃశ్వాసములకు దానవులు బలహీనులగుచుండిరి. దేవతలు భగవానుని కృపాదృష్టితో బలవంతులగుచుండిరి.

సముద్ర మథనము ప్రారంభమయ్యెను. ఏమియు ఆధారము లేకపోవుటచే మందరాచలము సముద్రమున మునిగిపోయెను. అప్పుడు విష్ణుభగవానుడు కచ్ఛప రూపము (కూర్మరూపము) ధరించి మందరాచలమును తన వీపుపై ఉంచెను. అప్పుడు తిరిగి సముద్రమును మధించసాగిరి. దానినుండి హాలహల (విషము) ప్రకటమయ్యెను. దానిని శంకర భగవానుడు తన కంఠమందు ధరించెను. దీనిచేత



కంఠమున నల్లని మచ్చ ఏర్పడుటచే శకంర భగవానుడు నీలకంఠ నామముతో ప్రసిద్ధుడయ్యెను.

ఆ తరువాత సముద్రము నుండి వారుణీదేవి, పారిజాత వృక్షము, కౌస్తుభమణి, గోవులు, అప్సరసలు, లక్ష్మీదేవి ప్రాదుర్భవించిరి. లక్ష్మీదేవి విష్ణుభగవానుని చేరగా, సమస్త దేవతలు దర్శించి స్తుతించిరి, దీనివలన అందరూ లక్ష్మీ సంపన్నులయిరి.

అనంతరము ఆయుర్వేద ప్రవర్తకుడైన ధన్వన్తరి భగవానుడు అమృత కలశముతో ప్రకటమయ్యెను. దైత్యులా కలశమును లాగుకొని దాని నుండి సగము దేవతల కిచ్చి మిగిలినది తీసికొని జంభాది దైత్యులు వెళ్ళుచుండిరి. వీరు వెళ్ళుట గాంచిన విష్ణు భగవానుడు మోహినీ రూపము ధరించెను. రూపవతి అయిన ఈ స్త్రీని గాంచిన దైత్యులు మోహితులై "సుముఖీ! నీవు మాకు భార్యవై ఈ అమృతమును మాచే త్రాగించుము" అని కోరగా అట్లే అని మోహినీ రూపమున నున్న భగవానుడు ఆ అమృత కలశము గ్రహించి దేవతలచే త్రాగించుచుండెను. ఆ సమయమున రాహువు చంద్రుని రూపము ధరించి అమృతమును త్రాగుచుండెను. అప్పుడు సూర్య-చంద్రులు వాని కపట వేషమును ప్రకటించిరి. ఇది గాంచిన శ్రీహరి చక్రముతో వాని శిరస్సును ఖండించెను. కాని దయగలిగి మరల జీవింపజేసెను.

అప్పుడు రాహువు, శ్రీహరితో "ఈ సూర్యచంద్రులను నేను అనేక మారులు గ్రహణముగా పట్టెదను, ఆ గ్రహణ సమయమున జనులు ఏ కొద్ది దానము చేసినను, అది అక్షయమగును" అని చెప్పగా శ్రీహరి "తథాస్తు" అనెను.

ఆ తరువాత స్త్రీ రూపమును విష్ణు భగవానుడు త్యజించెను.కాని శంకర భగవానుడు "ఆ మోహినీ రూపమును మరల దర్శింపజేయు" మని కోరుకొనెను. అప్పుడు శ్రీహరి మరల మోహినీ రూపమును ధరించగా, శంకర భగవానుడు మాయతో మోహితుడై పార్వతిని విడిచి మోహిని వెంటపడెను. శంకరుడు ఉన్మత్తుడై మోహిని కేశములను పట్టుకొనెను. మోహిని కేశములను విడిపించుకొని వెళ్ళిపోయెను. శంకర భగవానుని వీర్యము పడినచోట శివలింగక్షేత్రములు మరియు బంగారు గనులు ఏర్పడెను. అనంతరము శంకర భగవానుడు ఇది మాయ అని గ్రహించి తన స్వరూపమున స్థితుడయ్యెను.

అప్పుడు శ్రీహరి శంకరునితో "రుద్రా! నీవు నా మాయను జయించితివి. నామాయను జయించిన వాడవు నీవు ఒక్కడివే. దైత్యులకు అమృతము లభించనందువలన దేవతలు యుద్ధమందు వారిని జయించి తిరిగి స్వర్గమును పొంది" రనెను. దైత్యులు పాతాళమున ప్రవేశించి అచ్చట నుండి సాగిరి. దేవతల విజయ గాథను చదివెడివారు స్వర్గలోకమునకు వెళ్ళుదురు.

## పరశురామ జయంతి

ప్రాచీన కాలమున పృథ్విపై హైహయ వంశీయ క్షత్రియుల అత్యాచారములు ప్రబలి యుండెను. నాలుగు వైపులు హాహాకారములు చెలరేగుచుండెను. గోవులకు, బ్రాహ్మణులకు, సాధువులకు రక్షణలేకుండెను. ఇట్టి స్థితియందు భగవానుడు పరశురామ రూపముతో జమదగ్ని ఋషి పత్ని అయిన రేణుక గర్భమున అవతరించెను.

అప్పుడు హైహయ వంశములో సహస్ర బాహు దర్జునుడను రాజుండెను. ఇతడు అతి క్రూరముగ శాసనము చేయుచుండెను. ఒక పర్యాయము ఇతడు జమదగ్ని ఆశ్రమమునకు వచ్చెను. ఆశ్రమ మందున్న చెట్లను పడగొట్టి జమదగ్ని చెంతనున్న కామధేనువును తీసికొని వెళ్ళెను. పరశురామునకు ఈ విషయము తెలిసి కార్తవీర్యార్జునుని వధించెను. అతని మరణానంతరము అతని పుత్రులు 10వేల మంది భయపడి పారిపోయిరి.

ఒక దినము పరశురాముడు సోదరులతో కలసి, ఆశ్రమము నుండి వెలుపలకు వెళ్ళెను. అనుకూల సమయమునకు ఎదురు చూచుచున్న కార్తవీర్యుని పుత్రులు అచటికి వచ్చి ఒంటరిగా నున్న జమదగ్ని మహర్షిని వధించిరి. రేణుక తలబాదు కొనుచు గట్టిగ విలపించసాగెను. పరశురాముడు తల్లి రోదనను విని అతి వేగముగ ఆశ్రమమునకు వచ్చెను. మరణించియున్న తండ్రిని చూచి దుఃఖించెను. పరశురాముడు క్రోధితుడై తండ్రి శరీరమును సోదరుల కప్పగించి చేత గొడ్డలి ధరించి క్షత్రియ సంహారము గావించుటకు నిశ్చయించుకొనెను. అప్పటి క్షత్రియులు అత్యాచారులుగ నుండిరి. అందుచేత పరశురాముడు తన తండ్రి మృతిని నిమిత్త మాత్రముగ చేసికొని 21 మారులు భూమి యందున్న క్షత్రియులను వధించెను.

ఈ విషయమున మరొక కారణము కూడా కలదు. తండ్రి మరణించినప్పుడు తన తల్లి ఇరువది ఒక్కమారులు తన పొట్ట గ్రుద్దుకొనుచు విలపించినదట. ఈ కారణముచేత 21 మారులు క్షత్రియ వధ జరిపెనని ఒక పురాణమున గలదు.

ఈ విధముగా భగవానుడు భృగుకుల మందు అవతరించి భూమికి భారముగ నున్న అనేక రాజులను వధించెను. అనంతరము తన తండ్రిని జీవింపజేసి సప్తర్షి మండలమందు సప్తర్షులలో నొకనిని జేసెను. ఆ తరువాత పరుశురాముడు యజ్ఞమందు సమస్త భూ మండలమును దాన మొసగి మహేంద్ర గిరిపైకి వెళ్లెను.

## ఏరువాక పూర్ణిమ

ఇది రైతు సోదరులకు అత్యంత ప్రియమైన పండుగ. ఈ "ఏరువాక పూర్ణిమ" ను రైతులు ప్రతి సంవత్సరం 'జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ' నాడు తమపొలాలలో దుక్కుదున్ని ఎంతో వైభవంగా దీనిని ఆచరించెదరు. ఈదినమందు మరో ముఖ్య విషయం, వార్కి అను నిత్యము వ్యవసాయ పనులలోను వ్యవసాయ అభివృద్ధికి చేదోడు వాదోడుగా ఉంటూ, కాలి అందియలు ఘల్లు ఘల్లుమని గంటలు మ్రోగించుకుంటూ "ధాన్యలక్ష్మిని" ఇంటికి తోడ్కొని వచ్చే; ఆ బసవన్నలను శుభ్రముగా కడిగి ఆ ఎద్దుల కొమ్ములకు వివిధ రంగులు పూసి, వాటి మెడలో కొత్త గంటలు, పలురంగుల పూసలు, పూలతో నిండిన దిష్టితాళ్ళతో వాటిని అలంకరించి, పిదప మంగళవాద్యములతో పొలమునకు తోడ్కొని పోయి అచ్చట నాగలిని, ఈ బసవన్నలను ధూపదీప నైవేద్యములతో పూజించి అనంతరము భూమిని దుక్కిదున్ని "ఏరువాక" ప్రారంభించే శుభదినము 'అన్నదాతలకు'. అలా ఆచరించుటవలన వార్కి చక్కని సిరులపంట పండుతుందని వారు విశ్వాసముగా భావిస్తారు. అది కేవలం వారి విశ్వాసమేకాదు వాస్తవము కూడా! అటువంటి వేడుకలు తిలకించాలి అంటే, ప్రకృతి రమణీయ దృశ్యాలతో పచ్చని పైరులతో పాడిపంటలతో నిండి ఉండే పల్లెసీమలే పట్టుగొమ్మలు.

**"మంత్ర యజ్ఞపరా విప్రా సీయజ్ఞాశ్చ కర్షకాః**
**గిరి యజ్ఞస్థథా గోపాః ఇజ్యోస్మాభిర్గిరిర్వనే॥**

అని శ్రీ కృష్ణపరమాత్మ గోపాలురకు గిరియజ్ఞము, కర్షకులకు ఏరువాక యజ్ఞముగా, బ్రాహ్మణులు మంత్రజపమే యజ్ఞముగా చేయుదురని తెలుపగా; విష్ణుపురాణము దీనిని ఏరువాక 'సీతాయజ్ఞ'మని పేర్కొనుచున్నది.

ఈ "ఏరువాక పూర్ణిమ" పండుగ అతి ప్రాచీనమైన పండుగగా గోచరించు చున్నది. శుద్ధోదన మహారాజు ఆనాడు 'కపిలవస్తులో' లాంఛనంగా ఈ ఏరువాకను ప్రారంభిస్తూ ఒక బంగారు రంగు నాగలిని 'కర్షకులకు' అందించినట్లు మరియు ఎంతో ప్రజాదరణ పొందిన శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడు కూడా, వారి కృషిని అభినందించి తగు రీతిని రైతు సోదరులను ప్రోత్సహించినట్లు; ఇలా ఈ "ఏరువాక పూర్ణిమ" గూర్చి ఎన్నో గాథలు ఉన్నాయి.

## కుమార షష్ఠి



1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లు మొత్తం శుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : పూజామందిరము, గడపకు పసుపు కుంకుమ ఇంటిముందు ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : ఎరుపు రంగువి
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకు ఉపయోగపడు వస్తువులు శుభ్రముచేసి,పటములకు గంధము, కుంకుమ ఉంచాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : ఎరుపు
8. కలశముపై వస్త్రము రంగు : ఎరుపు
9. పూజించవలసిన ఫోటో : వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్యస్వామి
10. పూజించవలసిన ప్రతిమ : ఆరుముఖాల సుబ్రహ్మణ్యస్వామి
11. పూజించవలసిన దైవము : కుమారస్వామి
12. తయారు చేయవలసిన అక్షతలు : తెల్లటి అక్షతలు
13. పూజకు కావలసిన పువ్వులు : ఎర్రటి పువ్వులు
14. అలంకరణకు వాడవలసినపూలమాల : మందార మాల
15. నివేదన చేయవలసిననైవేద్యం : కందిపప్పు (నానబెట్టి)
16. సమర్పించవలసిన పిండివంటలు : కందిపప్పుతో వంటకాలు
17. నివేదించవలసిన పండ్లు : దానిమ్మపండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : సుబ్రహ్మణ్య అష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : షోడశనామ స్తోత్రము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : సుబ్రహ్మణ్య కరవాలంబస్తోత్రము
21. పారాయణచేయవలసిన సహస్రాలు : సుబ్రహ్మణ్య సహస్రనామము
22. పారాయణ చేయవలసినగ్రంథం : సుబ్రహ్మణ్య చరిత్రము
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : సుబ్రహ్మణ్య జననం
24. దర్శించవలసిన దేవాలయాలు : సుబ్రహ్మణ్య స్వామి
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : బిక్కవోలు
26. చేయవలసిన ధ్యానములు : సుబ్రహ్మణ్య ధ్యానములు



27. చేయించవలసిన పూజలు : సుబ్రహ్మణ్య సహస్రనామ పూజ/అష్టోత్తరపూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : పుట్టలకుపూజలు, పుట్టలకు పాలు
29. ఆచరించవలసిన వ్రతము : సుబ్రహ్మణ్య వ్రతము
30. ఉపవాసము నియమము : వున్నది
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : సుబ్రహ్మణ్య ఆరాధన
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : కుమారస్వామి స్తోత్రమాల
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : సుబ్రహ్మణ్య నిత్యపూజ
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : సుబ్రహ్మణ్య కళ్యాణం
36. దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : సుబ్రహ్మణ్య వ్రతము
37. పర్వదిన నక్షత్రము : --
38. పర్వదిన తిథి : షష్ఠి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : ఆదివారం
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : ఉ॥9 గం॥లోపుగా
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : 2 ఎర్రటిమట్టి ప్రమిదలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : ఎర్రటి ప్రమిదలు
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 7వత్తులు
44. వెలిగించవలసిన వత్తులు : దూదితో 7 వత్తులు (ఎరుపురంగు)
45. దీపారాధన వాడవలసిన నూనె : నువ్వుల నూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : 7 వత్తులతో హారతి
47. ధరించవలసిన తోరము : ఎరుపు రంగు
48. నుదుటన ధరించవలసినది : కుంకుమ
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం హ్రీం శరవణభవాయ నమః
50. జపమునకు వాడవలసిన మాల : రుద్రాక్షమాల
51. మెడలో ధరించవలసిన మాల : రుద్రాక్షమాల
52. మెడలో ధరించవలసిన మాలకు ప్రతిమ : సుబ్రహ్మణ్యస్వామి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతముతో
54. ఏ దిక్కుకు తిరిగి పూజించాలి : పడమర దిక్కు.

## కుమారషష్ఠి



షణ్మతాలలో కుమారోపాసన (సుబ్రహ్మణ్యోపాసన) ఒకటి. మిగిలినవి. సౌర, శాక్త, వైష్ణవ, గాణాపత్య, శైవములు. అయితే 'అగ్నిగర్భుడు' అని పేరు పొందిన సుబ్రహ్మణ్యారాధన అగ్ని ఉపాసనతోనే జరుగుతుందని శాస్త్ర హృదయం. అంచేత పంచదేవతారాధనలో సుబ్రహ్మణ్యుని ప్రస్తావనరాలేదు. అయితే దీపారాధన 'శివ శక్త్యాత్మకుడైన ఆగ్నేయుని సుబ్రహ్మణ్యు'ని ఆరాధించడమేనని తత్త్వజ్ఞుల వచనం. ఈ విధంగా వైదికమతంలో సుబ్రహ్మణ్యోపాసన చెప్పబడింది.

**"...యం సిద్ధ్యంతి స్కందం దేవం సుబ్రహ్మణ్యోం సుబ్రహ్మణ్యోం."**

బ్రహ్మణస్పతి, బృహస్పతిగా వేదంలో వర్ణితుడైన గణపతివలె...సుబ్రహ్మణ్యునిగా (మంత్రవాచ్య పరతత్త్వంగా) స్కందదేవుని కీర్తించారు. బ్రహ్మణస్పతి, సుబ్రహ్మణ్య నామాల సామ్యం పరిశీలించదగ్గది.

సుబ్రహ్మణ్య గణపతులు పరబ్రహ్మ స్వరూపులేగాక, "కుమార" తత్త్వానికి ప్రతీకలు. మాతాపితృతత్త్వానికి ప్రతీకలు." పార్వతీ పరమేశ్వరులు" ఈ జగత్తుకి ఈ మూడు తత్త్వాలు మూలాలు. అవ్యక్తం, వ్యక్తం, మహత్, అహంకారం.. ఈనాలుగూ పంచభూతాత్మక జగత్తుకి ఆధారమైనవి. ఇందులో మొదటి రెండు-అవ్యక్తం, వ్యక్తం-శివుడు, పార్వతి, మహత్ తత్త్వం..గణపతి.. అహంకారం... కుమారస్వామి. నిజానికి ఒకే పరతత్త్వం యొక్క నాలుగు భూమికలవి.





"అహంకారం" అంటే లోకంలో అనుకొనే 'గర్వం' అనే భావం కాదు. 'నేను' అనే స్పృహని 'అహంకారం'అంటారు. ఈ స్పృహ 'వ్యష్టి'గానే కాక, సమిష్టిగానూ ఉంటుంది. (Micro-and Macro Levels.) ఈశ్వరుని పరంగానూ ఈ భావం ఉంటుంది. ఇక్కడి నుంచే సృష్టి విస్తృతి ప్రారంభమవుతుంది. చైతన్యం యొక్క లక్షణం అహంకారం. ఈసృష్టిలో కృత్రిమంగా, యాంత్రికంగా, వైజ్ఞానిక సాంకేతికంగా....మానవుని మెదడు వంటి జ్ఞాపకశక్తి గల యంత్రాన్నో, కంప్యూటర్‌నో తయారు చేయవచ్చు. కానీ దానికి "నేనీ పనిచేస్తున్నాను" 'I' అనే అహంభావం, స్పందన ఇవ్వలేం. అదికేవలం స్వాభావికమైన సృష్టిలక్షణం. అనుభూతులకీ, ఆలోచనలకీ, స్పందనలకీ కేంద్రం ఈ 'అహం'తత్త్వమే.

ఈ అహంతత్త్వానికి ప్రతీక సుబ్రహ్మణ్యుడు. రహస్యంగా అందరిలో ప్రకాశించే పరమాత్మ చైతన్యమిది గనుక 'గుహ' అన్నారు స్వామిని. జ్ఞానలక్షణం గల తత్వం గనుక 'గురుగుహ' అన్నారు.

**పురుషోవిష్ణు రిత్యుక్తః శివోనానామతః స్మృతః।**
**అవ్యక్తం తు ఉమాదేవీ శ్రీర్వా పద్మనిభేక్షణా ॥**
**తత్ సంయోగా దహంకారః స చ సేనా పతిరుహః॥**

పరమపురుషుడు "విష్ణువు" లేక "శివుడు" అవ్యక్త శక్తి "లక్ష్మి" లేక ఉమాదేవి, వీరిరువురి సమైక్య, సమన్వయ తత్వమూర్తి కుమారస్వామి అని స్కాందపురాణం.

అంటే కుమారస్వామిని అర్చిస్తే శివశక్తుల్నీ, లక్ష్మీనారాయణుల్నీ కలిపి అర్చించినట్లే. ప్రకృతీ పురుషుల ఏకత్వం కుమారస్వామితత్వం. షట్కోణ యంత్రమే షణ్ముఖతత్వానికి ప్రతీక.

ఇది రెండు త్రికోణాల సంయోగము. ఊర్ధ్వంగా సాగే త్రికోణం. శివతత్వం అధోముఖంగా సాగే త్రికోణం. శక్తితత్వం. శివశక్తుల సంకేతమైన రెండు త్రికోణాల ఆగమం షట్కోణం.

ఈ రెండు త్రికోణాల వల్ల ఏర్పడ్డ షట్కోణాలు షణ్ముఖాలకు ప్రతీకలు. దీనివల్ల ఉత్పన్నమయ్యే శక్తి అమోఘం. దివ్యాతి దివ్యం. అందుకే ఈ దివ్య సంకేతాన్ని అనేక ప్రాచీన ఇతరమతాలు కూడా గ్రహించి, ఉపాసించాయి. యూదులు ఉపాసనా చిహ్నంగా దీనిని గ్రహించారు. ఈ విషయంబట్టి భారతీయ మతంయొక్క ప్రభావం ఎటువంటిదో తెలుసుకోవచ్చు. అమోఘమైన శివశక్తిని గురించిన తత్త్వం కనుక శక్తిధరుడు అన్నారు.

కుమార జననంలోనే అనేక తాత్త్విక మర్మాలు ద్యోతకమౌతాయి. పరతత్వం-అవ్యక్తం నుండి జగద్రూపం తీసుకొనే పరిణామక్రమం కుమారజననంలో కనబడు

తుంది. అమోఘ శివతేజాన్ని పృధ్వి, అగ్ని, జలం (గంగ) నక్షత్రశక్తి (షట్కృత్తికలు) ధరించి చివరకు బ్రహ్మతపోనిర్మితమైన అలౌకిక మహాగ్ని శరవణం (గొప్ప అగ్నిమయమైన రెల్లుతుప్ప) లో రూపుదిద్దుకుంది. శరవణభవుడు–సుబ్రహ్మణ్యుడు.

**కాలస్వరూపం :** వేదాలలో షణ్ముఖీనమైన సంవత్సరాగ్ని స్వరూపంగా స్వామిని వర్ణించారు. కాలాగ్ని స్వరూపమే ఇది. కాలాగ్నిరుద్రుడైన శివుని తేజమే ఈ సంవత్సరాగ్ని. ఆరుముఖాలు, ఆరు రుతువులు. పన్నెండు చేతులు, పన్నెండు మాసాలు. ఇదీ సంవత్సరాగ్ని రూపం. ఈ రూపం 'చిత్రాగ్ని'అనే నెమలిపై ఆసీనమయ్యింది. వివిధ వర్ణాలను వెదజల్లే కాంతి పుంజమే ఈ నెమలి.

**జ్ఞానస్వరూపుడు :** జ్ఞానశక్తి మూర్తిమత్వం సుబ్రహ్మణ్య తత్వం. సునిశితమైన మేధాశక్తి ప్రతీక ఆయన చేతిలో శక్తిహస్తం. (బల్లెం). శివజ్ఞానప్రదాయిని అయిన అమ్మవారు ప్రసాదించిన దివ్యాయుధమిది. ఇదే అజ్ఞానమనే తారకాసురుని సంహరించిన జ్ఞానశక్త్యా యుధం. "జ్ఞానశక్త్యాత్మా" అనేది సుబ్రహ్మణ్యనామం. **ఇచ్ఛా జ్ఞానక్రియారూప మహాశక్తిధరం భజే । శివశక్తి జ్ఞానయోగం. జ్ఞానశక్తి స్వరూపకమ్॥ (శివపురాణం)** ఇచ్ఛా, జ్ఞాన, క్రియా అనేమూడు శక్తుల మయమైన శక్తిని ధరించిన జ్ఞానశక్తి స్వరూపుడు, జ్ఞానయోగంలో సాక్షాత్కరించే శివశక్త్యాత్మకతేజః పుంజం–కుమారస్వామి. ఆరుకోణాల చక్రం–బహుముఖీనమైన ప్రజ్ఞకు సంకేతం కనుక కవిత్వానికీ, ప్రతిభకీ ఆధారశక్తిగా కూడా కుమారస్వామి ఉపాసన చెప్పబడింది. "షణ్ముఖీ ప్రతిభ"ను ప్రసాదించే ఈ కార్తికేయుని 'కవి'గా పేర్కొన్నాయి శాస్త్రాలు.

**"పుట్టన్ బుట్ట, శరంబునన్ మొలువ"** అనే పద్యంలో పోతన గారు... "కావ్య రచనా సామర్ధ్యానికి నేను వాల్మీకిని కాను (పుట్టన్‌బుట్ట) శరవణభవుణ్ణి కాను (శరంబునన్ మొలువ)" అంటూ ప్రార్థించారు. ఈ మాటలో కూడా కవితాశక్తి నిధిగా స్కందుడు గోచరిస్తున్నాడు. శివతేజం స్కన్నమై వచ్చి రూపుకట్టిన దైవం కనుక ఈయన స్కందుడు. రామాయణంలో యాగరక్షణకు విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో వెళుతుండగా, మార్గమధ్యంలో సుబ్రహ్మణ్యుని గాథను వర్ణిస్తాడు.

కార్తికేయభక్తులు ఇహలోకంలో ఆయుష్మంతులై పుత్రపౌత్రులతో వర్ధిల్లి అంత్యమున స్కందసాలోక్యాన్ని పొందుతారు. ఓరామా! ఈ కుమారసంభవం ధన్యపుణ్యగాథ" అని విశ్వామిత్రుని మాట (వాల్మీకి రామాయణం –బాలకాండ)

**ఏషతే రామ గంగాయా విస్తరోమయా ।**
**కుమారసంభవశ్చైవధన్యం పుణ్యస్తథైవచ॥**
**భక్తశ్చయఃకార్తికేయే కాకుత్స్థ భువిమానవాః।**
**ఆయుష్మాన్పుత్రపౌత్రైశ్చస్కందసాలోక్యతాం వ్రజేత్॥**



మహాభారతంలో కూడా ప్రత్యేకించి సుబ్రహ్మణ్య జననగాథ, తారకాసుర సంహారం అద్భుతంగా వర్ణించాడు వ్యాసదేవుడు. కుమారస్వామి జనన నిమిత్తం శివపార్వతుల కళ్యాణం. వారి ఏకత్వమే కుమారుని సంభవం. అందుకే – ఆ కళ్యాణ గాథను 'కుమారసంభవం' అనే గొప్పకావ్యంగా తీర్చి దిద్దాడు కాళిదాస మహాకవి. వాల్మీకులవారి "కుమారసంభవం" అనే మాటను కాళిదాసు తన కావ్యనామంగా గ్రహించారు.

అష్టాదశ పురాణాలలో గణ్యమైన 'స్కాందపురాణం' శివుని నుండి స్కందుడు విన్నది. కనుక ఆయన (స్కంద) పేరునే ఈ పురాణం పేరు పొందింది. తంత్రశాస్త్రంలో కూడా వివిధ సుబ్రహ్మణ్య స్వరూపాలు చెప్పబడ్డాయి.

బాలసుబ్రహ్మణ్యుడు, షణ్ముఖ సుబ్రహ్మణ్యుడు, వల్లీదేవసేనాసమేతుడు... ఇలా అనేక రూపాలు! ఉత్థిత కుండలినీ శక్తికి ప్రతీకగా సుబ్రహ్మణ్యుని 'సర్ప' రూపాన ఆరాధిస్తారు. సుబ్రహ్మణ్యుని శక్తులు–కుండలినీశక్తి చలనానికి, ఆగమనంలో ప్రాకే నాదశక్తికి ప్రతీక 'వల్లీ' (తీగ). ఇంద్రియశక్తులే "దేవసేన" ఈమె ఇంద్రకుమార్తె, ఈ రెండూ చైతన్యానికి పత్నీస్థానాలు. ఈవిధంగా సుబ్రహ్మణ్యస్వామిని పరబ్రహ్మగా ఉపాసించారు.

"నీవంటి దైవము షడానన ! నేనెందుకు కాననురా! మారకోటులందు గల శృంగారము, ఇందుముఖా! నీ కొనగోటను బోలునే!"– అని స్కందుని కీర్తించారు నాదబ్రహ్మ త్యాగరాజస్వామి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు సుబ్రహ్మణ్య సాక్షాత్కారం (తిరుత్తణి క్షేత్రంలో) పొందిన సిద్ధపురుషుడు. కుమారస్వామి గురురూపంగా కనిపించి, కలకండను తినిపించి దీక్షితులను అనుగ్రహించాడు. ఆ స్వామి ప్రసాదంచేతనే సంగీత, సాహిత్య, మంత్రశాస్త్ర, నాదరహస్యాలు కలబోసిన దివ్యకృతుల్ని రచించారు శ్రీ ముత్తుస్వామి.

ప్రతికీర్తన సుబ్రహ్మణ్యుని పేరుపైననే ఆయన నామాలలో ఒకటైన "గురుగుహ నామంతో ముద్రాంకితం చేశారు. "శ్రీగురుగుహ! తారయాశు మాం శరవణభవ! శ్రీ గురుగుహ! తారయాశుమాం" "స్వామినాథ! పరిపాలయాశుమాం స్వప్రకాశ! వల్లీశ! గురుగుహ! దేవసేనేశ!" ఇలా ఎన్నెన్నో కీర్తనలను ప్రత్యేకించి స్వామిపై రచించారు. "స్వామి"అనే నామం సుబ్రహ్మణ్యునకు సిద్ధమైన నామం. అరుణగిరి నాధుడు– వంటి మహాభక్తులు సుబ్రహ్మణ్యోపాసనలో సిద్ధులు. వేగంగా అనుగ్రహించే కరుణాళువు. శివశక్తుల సమైక్యమూర్తి, అమోఘ మేధాప్రదాత, వంశవర్ధనుడు పరబ్రహ్మ సుబ్రహ్మణ్యస్వామి. (ఋషిపీఠం వారి సౌజన్యంతో)

---

## తొలి ఏకాదశి



1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : తెలుపు
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకుఉపయోగపడు వస్తువులు- శుభ్రం చేసి పటములకు గంధము, కుంకుమ వుంచాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : తెలుపు
8. కలశముపై వస్త్రము రంగు : తెలుపు
9. పూజించవలసిన ఫోటో : విష్ణుమూర్తి
10. పూజించవలసిన ప్రతిమ : విష్ణుమూర్తి
11. పూజించవలసిన దైవము : విష్ణుమూర్తి
12. తయారు చేయవలసిన అక్షతలు : పసుపు
13. పూజకు కావలసిన పువ్వులు : తామర పువ్వులు, తులసిదళములు
14. అలంకరణకు వాడవలసినపూలు : జాజి మాల
15. నివేదన చేయవలసిననైవేద్యం : పాయసం
16. సమర్పించవలసిన పిండివంటలు : తీపి పదార్థములు
17. నివేదించవలసిన పండ్లు : ఆకుపచ్చపండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : విష్ణు అష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : నారాయణ కవచము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : శ్రీమన్నారాయణ హృదయం
21. పారాయణచేయవలసిన సహస్రాలు : విష్ణు సహస్రనామము
22. పారాయణ చేయవలసినగ్రంథం : విష్ణు పురాణం
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : దశఅవతారములు
24. దర్శించవలసిన దేవాలయాలు : విష్ణు, వేంకటేశ్వర
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : శ్రీకాకుళం, కృష్ణాజిల్లా
26. చేయవలసిన ధ్యానములు : విష్ణు ధ్యానశ్లోకములు



27. చేయించవలసిన పూజలు : విష్ణు సహస్రనామపూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : విష్ణు అష్టోత్తర పూజ
29. ఆచరించవలసిన వ్రతము : సత్యనారాయణ వ్రతము
30. ఉపవాసము నియమము : ఉన్నది
31. జాగరణ నియమము : ఉన్నది (రాత్రి నిద్రపోరాదు)
32. సేకరించవలసిన పుస్తకములు : విష్ణు నిత్యపూజ, విష్ణు సహస్రనామ స్తోత్రములు, విష్ణుపురాణం
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : విష్ణు సహస్రనామ స్తోత్రములు, విష్ణుపురాణం
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి: సత్యనారాయణవ్రత పుస్తకములు
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : బ్రహ్మోత్సవ దర్శనం
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : లక్షతులసి పూజ
37. పర్వదిన నక్షత్రము : ---
38. పర్వదిన తిథి : ఏకాదశి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శనివారం
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : మ॥12 నుండి2గ॥వరకు
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : ఎర్రటి ప్రమిదలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : రెండు
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5
44. వెలిగించవలసిన వత్తులు : తామర వత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : కొబ్బరి నూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచ హారతి
47. ధరించవలసిన తోరము : పసుపు రంగు
48. నుదుటన ధరించవలసినది : తిరునామము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం నమోనారాయణాయ
50. జపమునకు వాడవలసిన మాల : తులసిమాల
51. మెడలో ధరించవలసిన మాల : తులసిమాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : విష్ణుమూర్తి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతముతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : తూర్పు దిక్కు

---

మోహన్ వారి శ్రీ విష్ణు నిత్యపూజ, వెల : 6/- తప్పక చదవండి.

## తొలిఏకాదశి

**శాంతాకారం భుజగశయనం, పద్మనాభం, సురేశం**
**విశ్వాకారం, గగన సదృశం మేఘవర్ణం శుభాంగం**
**లక్ష్మీకాంతం, కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యం**
**వందే విష్ణుం, భవభయహరం సర్వలోకైక నాథం.**

అని విష్ణుస్తోత్రం గావించుకుని 'తొలిఏకాదశి'ని గూర్చి సమీక్షగా తెలుసుకుందాం! ప్రతీసంవత్సరం ఆషాఢ శుద్ధ ఏకాదశిని 'తొలిఏకాదశి'గా అంటారు. ఎందుచేతనంటే! పూర్వకాలమందు ఈ తొలిఏకాదశితోనే, సంవత్సర ప్రారంభంగా కూడ చూచేవారట! ఈ రోజును 'శయన ఏకాదశి' అనికూడా పిలుస్తారు ఎందువల్ల ననగా; శ్రీమహావిష్ణువు ఆరోజునుండి కార్తీకశుద్ధ ఏకాదశి వరకు యోగనిద్రలో ఉంటాడని, నాటినుండి శ్రీహరిభక్తులు కామక్రోధాధులు వర్జించి ప్రయాణాలు చేయకుండా ఒకేచోట ఉండి శ్రీహరిని అర్చిస్తూ తిరిగి కార్తీకశుద్ధ ఏకాదశి 'ఉత్థాన ఏకాదశి' వరకు ఆ నాలుగు మాసములు చాతుర్మాస్య వ్రతం చేయుట కూడా మన భారతీయ సంప్రదాయములలో ఒకటి. ఆరోజు 'శ్రీహరి' శేషతల్పం పైనుండి మేల్కొంటాడు. ఈ చాతుర్మాస్య దీక్షను సన్యాసులు మాత్రమేకాదు. సంసారులు, వయో, లింగబేధము లేకుండా భక్తులందరూ దీనిని ఆచరిస్తూ ఉంటారు.

ఈ 'తొలి ఏకాదశి' నాడు "గోపద్మ వ్రతం" చేయుట ఎంతో విశిష్టమైనదిగా చెప్తారు. ఇంతకీ గోవును పూజించుటలో గల ఆంతర్యమేమిటో కూడా ఈ సందర్భంగా కొద్దిగా తెలుసుకుందాం!

ఈ గోమాత పూర్తిగా విరాట్ పురుషుని రూపంతో పోల్చబడింది. గోవునకు ముఖమునందు వేదాలు, కొమ్ములయందు హరిహరులు, కొమ్ముల చివర ఇంద్రుడు, లలాటమున ఈశ్వరుడు, కర్ణములందు అశ్వనీదేవతలు నేత్రములందు సూర్య చంద్రులు, దంతములయందు గరుడుడు, జిహ్వాయందు సరస్వతి, ఉదరమునందు





స్కందుడు, రోమకూపములందు ఋషులు, పూర్వభాగమునందు యముడు, పశ్చిమ భాగమునందు అగ్ని, దక్షిణభాగమున వరుణ కుబేరులు, వామభాగము నందు యక్షులు, ముఖమునందు గంధర్వులు, నాసాగ్రమందు పన్నగలు, అపానంబున సరస్వతి, గంగాతీర్థంబులు, గోమయంబున లక్ష్మి, పాదాగ్రంబున ఖేచరులును, అంబా అంటూ అరచే అరుపులో ప్రజాపతి, స్థనములందు చతుస్సాగరములు ఉన్నట్లుగా వర్ణింపబడెను. కావున గోవును పూజిస్తే! సమస్త దేవతలను పూజించి నట్లేనని, సమస్త తీర్థములలో పుణ్యస్నానంచేసిన పుణ్యఫలం లభిస్తుందని 'గోమాతకు' ఇంత పూజ్యస్తానమిస్తూ, అధర్వణ వేదంలో బ్రహ్మాండపురాణంలో, మహాభారతంలో, పద్మపురాణంలో ఇలా ఎన్నో గాథలు ఉన్నాయి.

అట్టి గోమాత నివశించే గోశాలను ఈ 'తొలిఏకాదశి' దినమందు మరింతగా శుభ్రముచేసి అలికి ముత్యాల ముగ్గులతో రంగవల్లికలను తీర్చిదిద్ది గోశాల మధ్యభాగమందు బియ్యపు పిండితో ముప్పైమూడు పద్మాల ముగ్గులు పెట్టి, శ్రీమహాలక్ష్మి సమేత శ్రీమహావిష్ణువు ప్రతిమను ఆపద్మములపైనుంచి, వారిని విధివిధానంగా పూజించి, పద్మానికి ఒక్కొక్క "అప్పడాన్ని" వాటిపై ఉంచి ఆ అప్పడాలను, వాయనాలను, దక్షిణ తాంబూలాదులలో బ్రాహ్మణుని సంతుష్టిని గావించి, గోమాతను పూజించువార్కి సకలలాభీష్టములు తప్పక నెరవేరుతాయని చెప్పబడినది. అలా, గోపద్మవ్రతం చెయ్యాలి.

ఇంత పుణ్యప్రదమైన తొలిఏకాదశి పర్వదినం శుభప్రదముగా జరుపుకుని పునీతులౌదాము.

## ఇంకొక కథ

యుధిష్ఠిరుడు "వాసుదేవా! ఆషాఢమాస కృష్ణ పక్షమున వచ్చు ఏకాదశీ నామమేమి? దాని విధి విధానమెట్టిది? దాని మాహాత్మ్యమును వర్ణించి చెప్పు"దని కోరెను.

శ్రీకృష్ణ భగవానుడు "నృపశ్రేష్ఠా! ఆషాఢమాస కృష్ణపక్ష ఏకాదశీ నామము "యోగిని". ఇది సమస్త పాతకములను నశింపజేయును. సంసార సాగర మందు మునుగు ప్రాణులకిది సనాతన నౌకవంటిది. త్రిలోకము లందిది సారభూతమైన వ్రతము.

రాజాధిరాజు కుబేరుడు అలకాపురమందుండెను. ఇతడు శివభక్తుడు. ఇతనిని హేమమాలియను యక్షుడు సేవించుచుండెను. ఇతడు పూజకు పుష్పములు తెచ్చుచుండెడివాడు. హేమమాలిని భార్య విశాలక్షి. ఈమె అందమైనది. హేమమాలి సదా భార్యయందు ఆసక్తి గలిగియుండువాడు. ఒక దినము హేమమాలి మానస

సరోవరమందు పుష్పములు తీసికొని తన గృహమున కెళ్ళి భార్యతో క్రీడించుచు కుబేరుని చెంతకు వెళ్ళలేదు. కుబేరుడు శివపూజ యందుండెను. మధ్యాహ్న సమయమయ్యెను. పుష్పములు రాలేదు. యక్షరాజు కోపముతో "హేమమాలి ఎందులకు రాలేదో విచారింపు"డని సేవకుల నాదేశించెను.

సేవకులు "రాజా! అతడు కామాసక్తుడై గృహమందే క్రీడించుచుండె"నని చెప్పిరి.

వారి మాటలు వినిన కుబేరుడు కోపోద్రిక్తుడై హేమమాలిని పిలిపించెను. అతనిని చూచిన కుబేరుడు ఉగ్రుడై "ఓ పాపీ! దురాచారీ! నీవు శివ భగవానుని అవహేళన చేసితివి. అందుచేత నీవు కుష్ఠు వ్యాధిగ్రస్తుడవై భార్యా వియోగముతో స్థాన భ్రష్ఠుడవై తిరుగు చుందువని శపించెను.

శివపూజ ప్రభావమున ఇతని స్మరణశక్తి నశించలేదు. ఇతడు తిరుగుచూ మేరుగిరి శిఖరముపైకి వెళ్ళెను. అచట ఇతనికి మార్కండేయముని దర్శనము గలిగెను. ఇతడు దూరముగ నుండి ముని చరణములకు ప్రణామములు చేసెను. మార్కండేయ ముని ఇతనిని చెంతకు పిలచి "ఈ రోగమెట్లు కలిగెను? ఇంత నిందనీయుడ వెట్లయితివి? అని అడిగెను.

యక్షుడు "నేను కుబేరుని అనుచరుడను. నాపేరు హేమమాలి. నేను ప్రతి దినము మానససరోవరము నుండి పుష్పములను తెచ్చి శివపూజా సమయమునకు కుబేరునకు ఇచ్చుచుంటిని. ఒక దినము నా భార్యతో సుఖించుచూ గుర్తురాక, పూజా సమయము మించిపోయినది. అందుకు కుబేరుడు కోపముతో నన్నీ విధముగ కమ్మని శపించెను. ఏ శుభకర్మ ప్రభావము చేతనో నేనీనాడు మిమ్ము దర్శించితిని.నా అపరాధమును మన్నించి కర్తవ్యమును ఉపదేశింపుడు" అని ప్రార్థించెను.

మార్కండేయ ముని "నీవు అసత్యము పలుకక సత్యమునే పలికితివి. అందుచేత నీకు శుభము చేకూర్చు వ్రతము నుపదేశించెదను. నీవు ఆషాఢ కృష్ణపక్ష మందొచ్చు "యోగిని" ఏకాదశి వ్రతము చేయుము. ఈ వ్రత పుణ్య ప్రభావముచే నీ వ్యాధి తొలగిపోవు"నని చెప్పెను.

ఈ మాటలు వినినంతనే హేమమాలి ముని చరణములపై బడెను. ముని వానిని పైకి లేపెను. మార్కండేయ ముని ఉపదేశానుసారము హేమమాలి యోగిని ఏకాదశి వ్రతమును చేసెను. వెనువెంటనే అతని వ్యాధి తొలగిపోయెను.

88 మంది బ్రాహ్మణులకు భోజనము పెట్టిన ఎట్టి ఫలము లభించునో ఈ వ్రతము చేసిన అట్టి ఫలము లభించును. ఇది మహాపుణ్య ప్రదమైనది. దీనిని చదివిననూ, వినిననూ సమస్త పాపములు తొలగిపోవును" అని చెప్పెను.





## రాఖీ పండుగ

ప్రతీ సంవత్సరం శ్రావణమాసంలోవచ్చే పూర్ణిమను "శ్రావణపూర్ణిమ లేక జంధ్యాల పూర్ణిమ" మరియు రాఖీ లేక రక్షాబంధన్ పండుగ అని పిలుస్తూ ఉంటారు. జంధ్యాలు ధరించే వారందరూ ఈరోజున నూతన జంధ్యాలు ధరిస్తారు.

ఈరోజు బ్రాహ్మణులు నూతన యజ్ఞోపవీతధారణలు చేసి విద్యార్థులకు వేదపఠనం ప్రాంభిస్తారు. వేదపండితులు వేదాలను వల్లెవేయడం అంటే; ఆ వృత్తి చెయ్యడం ఈ రోజునుండే ప్రారంభిస్తారు. ఆ విధంగా వీరు ఈరోజు వేదాలన్నింటిని ప్రారంభ ఋక్కును, చివరి ఋక్కును పఠిస్తారు.

కాలక్రమంలో ఈ రోజు "రక్షాబంధన్ లేక రాఖీ" పండుగగా ప్రాచుర్యం పొందసాగింది. ఈ రక్షాబంధనము ఈ దిగువ మంత్రాన్ని పఠిస్తూ భార్య-భర్తకు సోదరి-సోదరునకు యుద్ధానికి వెళ్ళే వీరునకు విజయప్రాప్తి కోసం ఈ రక్షాబంధనన కడుతూఉంటారు.

**యేన బద్ధో బలీరాజా దానవేంద్రో మహాబలః।**
**తేన త్వామభి బధ్నామి రక్షమాచల మాచల ॥**

శ్రీ మహావిష్ణువు శక్తిచే మహాబలుడు అయిన బలిచక్రవర్తిని బంధించినట్లుగా ఓ రక్షాబంధనమా! నీవు చలించక వీనికి రక్షణ కల్పించుము అని మంత్రార్థం. ఈ -రక్షాబంధన్ ఎలా ప్రారంభమైనది అంటే...! ఈ గాథ మనకు మంచి ప్రామాణిక మవుతుంది.

పూర్వం దేవతలకు-రాక్షసులకు మధ్య పుష్కరకాలం యుద్ధము సాగింది. ఆ యుద్ధములో ఓడిపోయిన దేవతల రాజు దేవేంద్రుడు నిర్వీర్యుడై తన పరివారమంతటిని కూడగట్టుకుని 'అమరావతి' లో తలదాచుకుంటాడు. అట్టి భర్తనిస్సహాయతను గమనించిన ఇంద్రాణి 'శచీదేవి' తగు తరుణోపాయమునకై ఆలోచిస్తూ ఉన్న సమయాన ఆ రాక్షసరాజు చివరకు 'అమరావతి'ని కూడా దిగ్బంధన చేయబోతున్నాడు అని గ్రహించి, భర్త దేవేంద్రునకు 'సమరోత్సాహము' పురికొలిపినది. సరిగా ఆరోజు "శ్రావణ పూర్ణిమ"అగుటచేత 'పార్వతీ పరమేశ్వరులను', లక్ష్మీ నారాయణులను పూజించి ఆ పూజించబడిన "రక్షా" దేవేంద్రుని చేతికి కడుతుంది. అది గమనించిన దేవతలందరు వారు పూజించిన రక్షలు తెచ్చి ఇంద్రునకు కట్టి ఇంద్రుని విజయాత్రకు అండగా నిలచి, తిరిగి 'త్రిలోకాధిపత్యాన్ని' పొందారు. ఆనాడు శచీదేవి ప్రారంభించిన 'ఆ రక్షాబంధనోత్సవం' నేడు అది 'రాఖీ' పండుగ ఆచారమైనది.

ఈ రాఖీకి ఉన్న పవిత్రత ఏమిటంటే భార్య-భర్తకు సోదరి-సోదరులకు కట్టే రాఖీద్వారా వారి వారు తలపెట్టే కార్యములు విజయవంతమై సుఖసంపదలు కలగాలని, వారి మాన మర్యాదలకు వారు బాసటగా ఉండాలని ఆకాంక్షించే సత్ సంప్రదాయమే ఈ 'రాఖీ' విశిష్టత. అలా రాఖీలు కట్టించుకున్న భర్తలు, సోదరులు వార్కి నూతన వస్త్రాలు చిరుకానుకలు సమర్పించి, అందరు కలసి చక్కని విందు సేవిస్తారు.

విదేశీయులు మనదేశాన్ని పాలిస్తున్న రోజులలో మొగాలాయీల దుర్నీతికి దురంతాలకు ఏమాత్రం అడ్డూ ఆపూ అనేది లేకుండా పోయేది. హిందూ జాతి వారి కబంధహస్తాలలో నలిగిపోయేది. స్త్రీలు వారి మాన ప్రాణరక్షణకై వీరులైన యోధులను గుర్తించి వార్కి 'రక్షాబంధనం' కట్టి వారు చూసే సోదర భావముతో, రక్షణ పొందేవారు. ఒకసారి 'రాణి కర్ణావతి' శత్రువులు తన దుర్గాన్ని ముట్టడించినప్పుడు 'ఢిల్లీపాదుషాకు' రాఖీ పంపగా ఆమెను సోదరిగా భావించి శత్రువులను తరిమికొట్టి ఆ సోదరి ఇంట భగినీ హస్తభోజనంచేసి, కానుకలు సమర్పించినట్లు గాథలు ఉన్నాయి.

అట్టి శ్రావణ పూర్ణిమ లేక జంధ్యాల పూర్ణిమ, మరియు రాఖీ లేక రక్షాబంధన్ పండుగ అమితానందంతో జరుపుకుని మన చక్కని భారతీయ సంప్రదాయ విలువలను కాపాడుదాం!



## గురు పౌర్ణమి

| | |
|---|---|
| 1. లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. ధరించవలసిన పట్టుబట్టలు | : పసుపు రంగు |
| 6. పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు-పటములకు గంధము,కుంకుమ వుంచాలి. |
| 7. మందిరంలో పరచవలసిన వస్త్రము | : పసుపు |
| 8. కలశముపై వస్త్రము రంగు | : పసుపు |
| 9. పూజించవలసిన ఫోటో | : దక్షిణామూర్తి |
| 10. పూజించవలసిన ప్రతిమ | : దత్తాత్రేయుడు |
| 11. పూజించవలసిన దైవము | : శ్రీ సాయిబాబా |
| 12. తయారు చేయవలసిన అక్షతలు | : పసుపు |
| 13. పూజకు కావలసిన పువ్వులు | : చామంతి పువ్వులు |
| 14. అలంకరణకు వాడవలసినపూలు | : పసుపురంగు |
| 15. నివేదన చేయవలసిననైవేద్యం | : కేసరిబాత్ |
| 16. సమర్పించవలసిన పిండివంటలు | : పాలకోవా |
| 17. నివేదించవలసిన పండ్లు | : అరటిపండు |
| 18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : శ్రీ సాయిబాబా |
| 19. పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : దత్త స్తోత్రములు |
| 20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : దక్షిణామూర్తి స్తోత్రములు |
| 21. పారాయణచేయవలసిన సహస్రాలు | : శ్రీ సాయిబాబా |
| 22. పారాయణ చేయవలసినగ్రంథం | : శ్రీగురుదత్త శ్రీసాయిసచ్చరిత్ర |
| 23. పారాయణ చేయవలసిన అధ్యాయములు | : గురుపౌర్ణమి ఉత్సవము(శ్రీసాయిచరిత్ర) |
| 24. దర్శించవలసిన దేవాలయాలు | : శ్రీసాయి, శ్రీదత్త |
| 25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : షిరిడి, గాణగాపూర్ |
| 26. చేయవలసిన ధ్యానములు | : శ్రీ గురు ధ్యానశ్లోకములు |
| 27. చేయించవలసిన పూజలు | : గురుపాదపూజ |

28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : శ్రీ సాయిబాబా పాలాభిషేకం
29. ఆచరించవలసిన వ్రతము : శ్రీసాయిసత్యవ్రతం,శ్రీసత్యదత్త వ్రతం
30. ఉపవాసము నియమము : లేవు
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించివలసిన పుస్తకములు : శ్రీసాయిఆరాధన, శ్రీదత్తాత్రేయా రాధన
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : శ్రీ సాయిసచ్చరిత్ర, శ్రీ గురు చరిత్ర
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : శెనగలు (ఉడకబెట్టినవి), శ్రీ సాయిచాలీసా, శ్రీ సాయి సత్యవ్రతం
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : గురుపౌర్ణమి మహోత్సవములు
36. దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : సామూహికంగా శ్రీసాయిసత్యవ్రతం
37. పర్వదిన నక్షత్రము : పునర్వసు
38. పర్వదిన తిథి : పౌర్ణమి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : గురువారం
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : ఉ॥11 నుండి12గ॥వరకు
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : కంచు దీపారాధన కుందులు
42. వెలిగించవలసిన దీపారాధనలు : 5
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5
44. వెలిగించవలసిన వత్తులు : దూది వత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : ఆవునెయ్యి
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : పసుపు రంగు
48. నుదుటన ధరించవలసినది : కుంకుమ+విభూతి
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం శ్రీ సాయిరాం
50. జపమునకు వాడవలసిన మాల : తులసిమాల
51. మెడలో ధరించవలసిన మాల : స్ఫటికమాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : శ్రీ సాయిబాబా
53. చేయవలసిన అభిషేకము : పంచామృతముతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : ఉత్తరం





## గురు పౌర్ణమి

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః**

అనాది కాలంనుంచీ "ఆషాఢ శుద్ధపౌర్ణమిని" "గురుపౌర్ణమి" అంటారు. మరియు దీనినే "వ్యాసపౌర్ణమి" గా పరిగణనలోనికి తీసుకుని ఆ రోజు దేశం నలు మూలలా గురుపూజా మహోత్సవాలు నిర్వహిస్తూ ఉంటారు. ఆ రోజు ముని శ్రేష్ఠుడైన వ్యాసమహాముని జన్మతిథి కావున ఆ భగవానునియొక్క జన్మదినం మానవ చరిత్రలోనే అది ఒక అపూర్వమైన ఆధ్యాత్మికమైన మహాపర్వదినంగా విరాజిల్లుతున్నది.



అసలు ఈ ఆషాఢ శుద్ధపౌర్ణమి యొక్క విశిష్టత ఏమిటో...? ముందు తెలుసు కుందాం. దీనికి ఒక చక్కని ప్రాచీన గాథకలదు. పూర్వం "వారణాశి" లో కడు పేద బ్రాహ్మణ దంపతులు ఉండేవారట! ఆత్రేయసగోత్రము గల ఆ బ్రాహ్మణుని యొక్క పేరు 'వేదనిధి'. వానియొక్క భార్యపేరు 'వేదవతి'. వీరు ఇరువురు ఎల్లప్పుడు చక్కని ఆధ్యాత్మిక చింతనతో భక్తి జ్ఞానము కలిగి జీవించుచుండేవారు. వారు సంతాన భాగ్యము కొరకై ఎన్ని నోములు నోచినా, ఎన్ని వ్రతాలు చేసినా; వారికి మాత్రం సంతానము కలుగలేదు.

ఇలా ఉండగా; ఒకనాడు 'వేదనిధికి' ప్రతిరోజు మధ్యాహ్న సమయమందు వ్యాసభగవానులు రహస్యంగా గంగానదికి స్నానానికై వస్తూ ఉంటారని వార్త తెలుసుకుంటాడు. ఎలా అయినాసరే! వ్యాసమహర్షి దర్శనం పొందాలని ప్రతిరోజూ వేయికళ్ళతో వెతక నారంభిస్తాడు. ఒకరోజు నదీతీరాన ఒక భిక్షువు రూపం ధరించి దండధరుడైన వ్యక్తిని దర్శిస్తాడు. వెనువెంటనే "వేదనిధి" వాని పాదాలను ఆశ్రయిస్తాడు. దానికి ఆ భిక్షువు చీదరించుకుని కసరికొడతాడు. అయినా సరే! పట్టిన పాదాలను మాత్రము విడువకుండా "మహానుభావా! తమరు సాక్షాత్తు వ్యాసభగవానులని" నేను గ్రహించాను. అందుచేతనే, మిమ్మల్ని శరణు పొందగోరు చున్నాను అంటాడు. ఆ మాటలు విన్న ఆ అజ్ఞాత భిక్షువు గంగానది ఒడ్డువైపునకు నలుదిశలా బిత్తరి చూపులు చూస్తూ, ఇంకాతనను ఎవరైనా చూస్తున్నారేమోనని తలచి వెంటనే వేదనిధిని ఆప్యాయంగా చేరదీసి, నాయొక్క రహస్యం మాత్రము ఎవరికి తెలియకూడదు. ఇంతకీ నీకు ఏమికావాలో కోరుకో అంటాడు. మహానుభావా!

రేపు నా తండ్రిగారి పితృకార్యము. దానికి తమరు బ్రాహ్మణార్థమై భోజనానికి మా ఇంటికి తప్పక దయచేయవలసిందిగా నా కోరిక! అనిబదులు చెప్తాడు. అందులకు ఆ మహర్షి ఆతని ఆహ్వానాన్ని అంగీకరిస్తాడు.

అనంతరం ఎంతోసంతోషంగా ఇంటికి చేరుకున్న 'వేదనిధి' తన భార్యామణికి గంగానదీతీరాన జరిగిన వృత్తాంతమంతా వివరిస్తాడు. మరసటిరోజు ఉదయమే ఇచ్చిన మాటప్రకారం వారి గృహానికి విచ్చేసిన ఆ వ్యాస భగవానుని! ఆ దంపతులు సాదరంగా లోనికి ఆహ్వానించి ఉచిత ఆసనముపై కూర్చుండబెట్టి అతిథి సత్కారము లతో వారిని పూజిస్తారు. అనంతరం వారి దేవతార్చనకు 'సాలగ్రామము', తులసీ దళాలు, పూలు మున్నగు పూజాద్రవ్యాలు సిద్ధం చేస్తారు.

వారి పూజ అనంతరం ఎంతోశుచిగా మడిగా సర్వవంటకాలను సిద్ధపరచి శ్రాద్ధవిధులను విధి విధానంగా నిర్వహిస్తారు. అనంతరం ఆ దంపతులు ఆ వ్యాస భగవానునికి సాష్టాంగ దండ ప్రణామం చేస్తారు. వారి ఆతిథ్యానికి ఎంతో సంతుష్టులైన ఆ ముని శ్రేష్ఠుడు. ఓ పుణ్య దంపతులారా! మీకు ఏమి వరంకావాలో కోరుకోండి అంటాడు. అందులకు ఆ దంపతులు ఓ మహానుభావా! మేము ఇంతవరకు నోచని నోములూ లేవు. చేయని వ్రతాలు లేవు అయినా! సంతానభాగ్యము మాత్రము మాకు కలుగలేదు! అని బదులు పలుకుతారు. ఓ ఆదర్శ దంపతులారా! అందులకు మీరు చింతించవలసిన పనిలేదు. త్వరలోనే మీకు తేజోవంతులు, ఐశ్వర్యవంతులు అయిన పదిమంది పుత్రసంతతికలిగి, మీరు చక్కని సుఖజీవనముతో జీవితంలో ఎన్నో సుఖభోగాలను అనుభవిస్తూ; అంత్యమున విష్ణుసాయుజ్యాన్ని పొందగలరు, అని ఆశీర్వదించి తిరుగు ప్రయాణమవుతున్న వ్యాసభగవానునితో ప్రభూ! తిరిగి తమదర్శన భాగ్యము మాకు ఎలా కలుగుతుంది? అని 'వేదనిధి' ప్రశ్నిస్తాడు. అందులకు వ్యాస మహర్షి అంటారు.....!....!...!

**"శృణు విప్రతవేచ్ఛా చేత్ దర్శనార్థం తదాత్వయా**
**పూజనీయో విశేషేణ, కథావాచయితా స్వయం"** అని

అంటే, ఓ భూసురోత్తమా! నన్ను మరల మరల దర్శించుచు ఉండాలని మీరు ఎంతో కోరికతో ఉన్నారని నేను గ్రహించుచున్నాను. అందులకు నన్ను మీరు ఎలాదర్శించగలరో చెప్తాను, వినండి.

ఎవరైనా ఎప్పుడైనా, ఎక్కడైనా సరే ! మన వేద వేదాంగముల యొక్క రహస్యాలను, ఇతిహాసములయొక్క గూడార్థాలు ఉపదేశిస్తూ ఎవరైతే ఉంటారో! అతడే నా యొక్క నిజస్వరూపంగా తెలుసుకుని అట్టి పురాణ కథకుడైన ఆతన్ని సాక్షాత్తు వ్యాసమూర్తిగా భావించి పూజింపవలెను. అట్టి పౌరాణికులందరిలోను నేను ఎల్లప్పుడూ ఉంటాను. అని ! ఆ శ్లోకభావము.





అంతియేకాదు ఎవరైనాసరే! గతకల్పాలలో జరిగిన చరిత్ర; విశ్వంయొక్క పూర్వవృత్తాంతం; పురాణగాథలు మున్నగునవి విప్పి చెప్పాలంటే! వార్కి వ్యాస భగవానుని అనుగ్రహము లేనిదే చెప్పలేరు. కావున అట్టి పౌరాణికుణ్ణి ఎంచి ఆషాఢ శుద్ధపాడ్యమి"నాడు వార్కి "గురుపూజ" చేసి పూజించవలెనని చెప్పారు. నాటినుండి నేటివరకు ఆచారము కొనసాగుచునే ఉన్నద అని మనము గమనిస్తున్నాము గదా!"– మరి.

అది విన్న 'వేదనిధి' మరోమారు వ్యాసభగవానుని ప్రశ్నిస్తాడు. మహాత్మా! తమను ఏయే రోజుల్లో ఏవిధంగా పూజించాలి? సవిస్తరంగా చెప్పవలసింది అంటాడు.

**"మమ జన్మదినే సమ్యక్ పూజనీయః ప్రయత్నతః**
**ఆషాఢ శుక్ల పక్షేతు పూర్ణిమాయాం గురౌతథా**
**పూజనీయో విశేషణ వస్త్రాభరణ ధేనుభిః**
**దక్షిణాభిః సుపుష్పాభిః మత్స్యరూప ప్రపూజయేత్**
**ఏవం కృతే త్వయా విప్రః మత్స్య రూపస్య దర్శనం**
**భవిష్యతి నసందేహోమ యైవోక్తం ద్విజోత్తమ."**

ఓ బ్రాహ్మణోత్తమా! నేను జన్మించిన ఆషాఢశుద్ధ పౌర్ణమినాడు ఈ గురుపూజను ఆరోజు శ్రద్ధాభక్తులతో చేయాలి. ఆ రోజు కనుక 'గురువారము' అయిన ఎడల అది మరింతగా శ్రేష్ఠమైనది. వస్త్ర, ఆభరణ గోదానములతో అర్ఘ్య పాదాలతోటి నా రూపాన్ని పూజించువార్కి నా స్వరూప సాక్షాత్కారం వార్కి లభిస్తుంది; అని సాక్షాత్తు వ్యాస భగవానులు చెప్పిన పై శ్లోకాలే మనకు ప్రామాణికమవుచున్నవి. కావు అట్టి ఆషాఢ పౌర్ణిమ, నేటికినీ, సర్వులకు అత్యంత పుణ్య ప్రదముగా చెప్పబడుచున్నది.

ఈ గాథ పూర్వము నారదుడు వైశంపాయనుడికి "ఈ గురు పౌర్ణమి యొక్క విశిష్టత వివరించినట్లుగా బ్రహ్మాండ పురాణంలోనూ "స్వధర్మసింధూ" అనే గ్రంథము లోను వివరంగా చెప్పబడి యున్నది. దీనిని బట్టి వ్యాసులవారి యొక్క జన్మ ఆషాఢ శుద్ధపాడ్యమి అని విదితమవుచున్నది.

**వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషం**
**పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్**
**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాస రూపాయ విష్ణవే**
**నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః**

అట్టి పరమ పవిత్రమైన "గురుపౌర్ణమి" పుణ్యదినం మనమంతా విశేషంగా జరుపుకుని ముందు తరాలవార్కి మార్గదర్శకుల మౌతూ, పునీతులౌదాము.

## చాతుర్మాస్య దీక్ష

**"ఆషాఢే తు సితే పక్షే ఏకదశ్యా ముపోషితః**
**చాతుర్మాస్యవ్రతంకుర్యా ద్యత్కించి న్నియతో నరః**
**వార్షికాం శ్చతురో మాసా న్వాహ యేత్కేనచి న్నరః**
**ప్రవతేన నోచే దాప్నోతి కిల్బిషం వత్సరోద్భవమ్."**

అట్టి చాతుర్మాస్య దీక్షా ప్రశస్తి గూర్చి స్కాంద, భవిష్యోత్తరాది పురాణములలో విపులంగా వివరించబడినది.

మన హిందూ సంస్కృతిలో "ఏకాదశి తిథి" ఎంతో ప్రాముఖ్యతను సంతరించు కుంది. ఈ తిథి శివకేశవులకు మరింత ప్రీతి పాత్రమైనది. ఇట్టి పుణ్య ప్రదమైన ఏకాదశుల సమ్మేళనముతో నాలుగు మాసములపాటు నిరంతరాయంగా ఆచరించే దీక్షావ్రతమే "ఈ చాతుర్మాస్య దీక్ష"

ఈ వ్రతం "ఆషాఢ శుద్ధఏకాదశి" (శయన-తొలిఏకాదశి) నుండి అనగా శ్రీమహావిష్ణువు యోగసమాధిలోనికి వెళ్ళినదినము నుండి తిరిగి "కార్తీకశుద్ధ ఏకాదశి" ఉత్థానైకాదశి (శ్రీహరి శేషతల్పం పైనుండి మేల్కాంచినదినము) వరకు గల ఈ 4 మాసములు; మనకెంతో పూజ్యనీయులైన భారతదేశమందుగల పలుప్రాంతమందలి పీఠాధిపతులు వారి వారి "ఆరాధ్యదైవపీఠాన్ని" కదపకుండా ఒకే ఆశ్రమంలో ఉండి ఈ దీక్షను ఆచరించుట మన భారతీయ సంస్కృతిలో మహోన్నతమైనది. అలా ఈ "చాతుర్మాస్య దీక్ష" పూర్తిచేసినవార్కి అశ్వమేధయాగఫలం సిద్ధిస్తుందని మన పురాణాలు ఘోషిస్తున్నాయి.



అలాగునే కొందరు గృహస్థులైన శ్రీహరి భక్తులు కూడా కామక్రోధాదులు వర్జించి బ్రహ్మచర్యము పాటిస్తూ, ప్రయాణములు చేయకుండా, ఒంటిపూట భోజనము చేస్తూ, అతిథి అభ్యాగతులను సేవిస్తూ, వర్జనీయ పదార్థాలను విసర్జించి ఎన్నో ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహిస్తూ ఎంతో భక్తి శ్రద్ధలతో "ఈ చాతుర్మాస్య దీక్ష"తో శ్రీహరిని ఆరాధించెదరు.

ఈ విధంగా కొందరు పీఠాధిపతులు, కొందరు గృహస్థులు శ్రీహరి యోగ నిద్రలో యున్నప్పుడు పై నియమాలు పాటిస్తూ తిరిగి శ్రీ మహావిష్ణువు మేల్కాన్చు "కార్తీక శుద్ధ ఏకాదశి" నాడు మేలుకొలుపు సేవచేసి గో, భూ, హిరణ్య దానములు, బ్రాహ్మణ సమారాధనలు కావించి ఉద్యాపనచేస్తారు. అలా "ఈ చాతుర్మాస్యదీక్ష ను భక్తి శ్రద్ధలతో ఆచరించి ఇహలోక కీర్తి ప్రతిష్టలతోపాటు విష్ణుసాయుజ్యము పొందిన ఎందరో మహనీయులు మన పుణ్యభూమియందు ఉన్నారు.

## శ్రావణ మాసం మంగళ వారాలలో మంగళగౌరీ వ్రతం

మన భారతీయ సంస్కృతిలో మహోన్నతమైనది వివాహసంస్కారం. అన్ని ఆశ్రమాలలోను గృహస్థాశ్రమము చాలా శ్రేష్ఠమైనదని మన వేదములు, స్మృతులు ఘోషించుచున్నవి. ఇందు భార్య, భర్త ఇరువురు ఒకరిపై నొకరు ప్రేమానురాగాలతో జీవించుటతోపాటుగా భర్త ఏకపత్నీవ్రతుడుగా భార్య పతివ్రతామ తల్లిగా వెలుగొందుచుందురు. అట్టి గృహము ఎల్లప్పుడు నిత్యకళ్యాణము-పచ్చతోరణముతో విరాజిల్లుతూ ఉంటుంది. ఈ గృహస్థాశ్రమ నిర్వహణకు మన మహర్షులు మంచి సంస్కారములను ఏర్పరచినారు. అలా ఈ గృహస్థాశ్రమ నిర్వహణ ఆచరించుటకూడా ఒక మహాయజ్ఞముతో సమానమైనది అని 'మను' మహర్షియొక్క అభిప్రాయం.

అటువంటి గృహస్థాశ్రమమున సౌశీల్యవతియైన స్త్రీ గృహకృత్యములు, గృహస్థధర్మములు నిర్వర్తించుకుంటూ అనేక రూపాలలో ఇలా గృహస్థునకు తోడ్పడుతూ ఉంటుంది.

**శ్లో॥ కార్యేషు దాసీ కరణేషు మంత్రీ రూపేచ లక్ష్మీ క్షమయాధరిత్రి ।**
**స్నేహేచ(భోజ్యేషు) మాతా శయనేచ రంభా షట్కర్మయుక్తా కులధర్మపత్నీ ॥**

అనగా! గృహకార్య నిర్వహణలో దాసిగా; కుటుంబ వ్యవహారాలలో ఆలోచనందు మంత్రిగా, రూపమందు మహాలక్ష్మీ స్వరూపంగా, స్నేహభావమందు తల్లిగా, శయనమునందు 'రంభను' మరిపించేదిగా; ఈ ఆరు కర్మలయందు భర్తకు సహకరిస్తూ; కుల ధర్మపత్నిగా వెలుగొందుచుండును. అట్టి ఆదర్శవంతమైన మన భారతీయ పుణ్యస్త్రీలు పూర్వీకుల కాలమునుండి చక్కని సదాచారముగా భావించి ఆచరించునదియే "ఈ మంగళ గౌరీవ్రతం". అలాభక్తులు కొలిచే ఆ మంగళగౌరి, ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుటలో ఎట్టి త్యాగానికైనా సిద్ధపడుతుంది అనుటకు ఒక చక్కని గాథను ఈ సందర్భంగా ఒక్కసారి మననం చేసుకుందాం.

**శ్లో॥ వాగర్థవివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే**
**జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ ॥ (రఘువంశం 1/1)**

ఈ సర్వజగత్తునకు తల్లిదండ్రులైన ఆ ఆది దంపతులను వాగార్థములతో పోల్చాడు మహాకవి కాళిదాసు. సగం భాగం తనభార్యకి స్థానమిచ్చి అర్థనారీశ్వరుడని పించుకున్నాడు పరమేశ్వరుడు.

పూర్వము కృతయుగంలో దేవతలు, రాక్షసులు కలిసి 'అమృతం' కొరకై క్షీరసాగరమథనం చేయుసమయాన; అమృతానికి ముందు అగ్నిజ్వాలలు కక్కుతూ కాలకూట విషం పుట్టుకొచ్చింది. దానిని చూచి భయకంపితులైన దేవదానవులు శరణు! శరణు! అంటూ పరమేశ్వరుని పాదాలను ఆశ్రయిస్తారు. ఆ తండ్రి

మందహాసముతో చిరునవ్వు నవ్వి... ఇప్పుడు నేను ఏమి చెయ్యను? అన్నట్టు క్రీగంటితో పార్వతి వైపు చూచాడు.



**మ్రింగెడు వాడు విభుండని మ్రింగెడిది గరళమనియు మేలని ప్రజకున్**
**మ్రింగుమనే సర్వమంగళ మంగళ సూత్రమును నెంతమది నమ్మినదో**

**(ఆంధ్రభారతం)**

ఆ సర్వమంగళ స్వరూపిణియై జగన్మాత, భర్తచూపులోని ఆంతర్యం మేమిటో గ్రహించింది. దేవతులైనా, దానవులైనా, మానవులైనా మనభక్తులేకదా! మన బిడ్డలకు ఆపదకలిగినప్పుడు మనము కాక వేరెవ్వరు రక్షిస్తారు? అని భావించి నిరంతరము స్త్రీల సౌభాగ్య సంపదను కాపాడే ఆ సర్వమంగళ తన మాంగల్య సౌభాగ్యముపై ప్రగాఢ విశ్వాసముంచి; లోకవినాశానికి కారణభూతమైన ఆ భయంకర కాలకూట విషాన్ని తన భర్త మ్రింగుటకు అనుమతిని యిచ్చింది. చూచారా! ఆ మంగళగౌరీ దేవికి తనబిడ్డలపై గల ప్రేమ, మమకారం, "కరుణ" ఎట్టిదో! మరో మారు జ్ఞప్తికి తెచ్చుటకై ఈ గాథను వివరించినాను. అట్టి కరుణాంతరమూర్తి పార్వతీదేవిని "శ్రీలలితా సహస్రనామపారాయణ" ప్రారంభంలోనే ఆ తల్లిని ఇలా ధ్యానిస్తారు.



**అరుణాం కరుణా తరంగితాక్షీం ధృతపాశాంకుశ పుష్పబాణచాపామ్,**
**అణిమాదిభి రావృతాం మయూఖై రహమిత్యేవ విభావయే భవానీమ్.**

అట్టి సర్వమంగళ స్వరూపిణి అయిన భవానీ మాతను నూతనముగా వివాహితులైన స్త్రీలు ఈ "శ్రావణమాసం తొలిమంగళవారంతో" మంగళగౌరీవ్రతాన్ని విధివిధానంగా ప్రారంభించి ఐదు సంవత్సరములు దీక్షగా ఈ వ్రతాన్ని ఆచరించి అనంతరం ఉద్యాపన కార్యక్రమాన్ని చేపడతారు. అలా! ఆచరించిన స్త్రీలపై "శ్రీమంగళగౌరి"కటాక్షముతో వైధవ్యబాధలు లేకుండా వారిజీవితాంతము సర్వసౌఖ్యములతో అలరారుచుందురు. అని చెప్పబడినది. తొల్లి సూతులవారు నైమిశారణ్య ఆశ్రమములో శౌనకాది మునులకు వివిధ పురాణగాథలు వివిధ వ్రతగాథలు వివరిస్తూ ఉండగా, వారి కోరికమేరకు "ఈ మంగళగౌరీవ్రతం" గురించి వివరించగా, నారదమునీంద్రుడు సావిత్రిమాతకు ఉపదేశించినాడు. ఈ వ్రతవిధానాన్ని శ్రీకృష్ణ పరమాత్మ "ద్రౌపదీదేవికి" వివరించి ఆమెచే చేయించినాడు. అటువంటి ఈ మంగళగౌరీవ్రత గాథ సారాంశమును ఒకసారి మననం చేసుకుందాం.

పూర్వం మాహిష్మతీనగరాన్ని జయపాలుడు అనురాజు పాలించేవాడు. ఆతడు ప్రజాభీష్టములను తరచూ తెలుసుకుంటూ ప్రజారంజకముగా పాలనచేస్తూ మన్ననలను పొందేవాడు. అట్టి మహారాజునకు సౌశీల్యవతియైన భార్యలభించింది. వారు ఇరువురు ఎంతో అన్యోన్య అనురాగములతో ఉంటూ అనునిత్యం దైవభక్తి పరాయణులై



ఉండేవారు. కానివార్కి సంతానము తప్ప ఏ కొరత తెలియదు. అందులకై ఎన్నో నోములు వ్రతాలు చేస్తారు. లెక్కలేనన్ని దానధర్మాలు, పుణ్యకార్యాలు చేసేవారు.

అటువంటి పుణ్యదంపతులపై 'పరమేశ్వర' అనుగ్రహంకలిగింది. ఒకవృద్ధ సన్యాసి వేషముదాల్చి, అంతఃపురం బయట ద్వారము చెంతకు రోజూ మధ్యాహ్న సమయమందు వచ్చి 'భవతీభిక్షాం దేహి'అని పిలిచి క్షణకాలమైన ఆగకుండా వెళ్ళిపోవుచుండెడువాడు. ఆ విషయాన్ని మహారాణి జయపాలునకు చెప్పి దుఃఖించ సాగింది. ఓ సద్గుణవతీ! ఇందులో నీవు చింతించవలసిన పనిలేదు. రోజు భిక్షువువచ్చు సమయానికి ముందుగానే ద్వారముచెంత వేచియుండి ఆతనికి తృప్తిగా భిక్షవేయుము అని సూచించెను.

మహారాజు చెప్పినట్లుగా భిక్షువు వచ్చు సమయానికి ముందుగానే ద్వారము చెంతవేచియుండి ఆ తేజోమూర్తియైన ! ఆ భిక్షువును భిక్ష స్వీకరించమని కోరుతుంది. ఆమె ముఖారవిందమును తేరిపార పరికించిన ఆ ఆది భిక్షువు పుత్రపౌత్రులు లేని మీవంటి వారిదగ్గర నేను భిక్ష స్వీకరించను అని నిరాకరించి వెడలిపోవుచున్న భిక్షువును పిలచి మహాత్మా! తేజోగుణసంపన్నులైన మీరు సామాన్యులుకారు దయవుంచి మాకు సంతానభాగ్యము కలుగు తరుణోపాయం సూచించి వెళ్ళమని పరిపరివిధాల వేడుకుంటుంది. ఆమె ఆవేదనను గ్రహించిన ఆ కపటసన్యాసి రూపధారి పరమేశ్వరుడు ఓనారీ శిరోమణీ ! నీవు చింతించవలదు. నే చెప్పిన పలుకులు తుచ తప్పకుండ నీ భర్తకు చెప్పి ఆచరించిన యెడల తప్పక సంతాన భాగ్యము కలుగుతుంది అని చెప్పి అదృశ్యమైనాడు.

మహారాణి ద్వారా విషయమంతా తెలుసుకుని సమీప అరణ్యమందున్న భవాని మాత దేవాలయమును దర్శించి సేవించి పూజిస్తాడు జయపాలుడు. ఆతల్లి ప్రత్యక్షమయి నీకు కోరినంత ధనము కావలెనా లేక సంతానము కావలెనా? అని ప్రశ్నిస్తుంది. తల్లీ, నాకు సంతానభాగ్యము కలిగించమని కోరతాడు. అందులకు ఆమె అచిరకాలమందే వైధవ్యమును పొందు కుమార్తె కావలెనా? లేక సజ్జనసంపన్నుడు అల్పాయుష్మంతుడు అగు కుమారుడు కావలెనా? అని మరల ప్రశ్నిస్తుంది. ఓ జగజ్జననీ! మీ కృపతో కుమారుని ప్రసాదించమని వేడుకుంటాడు. అయిన యెడల ఈ గుడి వెనుక భాగమందుగల చూత వృక్షఫలమును ఒకటికోసి ఇచ్చి నీ భార్యను భుజియింపమను. నీ కోరిక ఫలియించగలదు, అని చెప్పి అంతర్థానమయినది భవానిమాత.

ఆ జయపాలుడు అత్యాశతో చూతఫలములన్ని కోసి మూటగట్టుచున్న రాజును గణపతి చూచి ఓరిమూర్ఖుడా! నీకు పుట్టబోవు కుమారుడు పదునారవ ఏటనే సర్పముకరచి మరణించును అనిశపించెను. చివరకు ఆ మూటలో ఒక

పండు మిగిలినది మిగిలినవి మాయమయ్యెను. ఆ పండును మహారాణికి ఇచ్చి భుజియింపమనెను.

అలా! భవాని అనుగ్రహముతో మహారాణి గర్భముదాల్చి చక్కని తేజోవంతుడైన కుమారునకు జన్మనిస్తుంది. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమాన మగుచు సకలవిద్యలు అభ్యసిస్తాడు. క్రమేపీ ఆకుమారునకు వివాహ వయస్సు సమీపించుచున్నది అని గ్రహించి వివాహము చేసినయెడల తనకుమారు నకు 'ఆయుర్దాయము' పెరగలదని విశ్వసించి భర్తతో ఆ విషయాన్ని చెబుతుంది రాణి. అందులకు మహారాజు అంగీకరించి అయితే మనకుమారుడు 'శివుడు' మేనమామతోకలసి కాశీయాత్ర పూర్తిచేసుకుని వచ్చిన పిదప వివాహము చేద్దాము అని బదులు పలుకుతాడు.

ఇలా ఉండగా! మేనమామతో కలసి కాశీయాత్రకు వెళుతూ 'శివుడు' ప్రతిష్ఠాన పురము ప్రాంతమందు మార్గమధ్యములో బసచేస్తారు. ఇరువురు అచ్చట కొందరు కన్యలు ఆటలు ఆడుచూ పాటలు పాడుచూ చివరకు దెబ్బలాటలకు దిగి ఒకరి నొకరు తిట్టుకుంటూ ఉంటారు. అందులో ఒకపిల్ల 'ముండలు రండలు' అని తిడుతుంది. ఆ పిల్లలలో 'సుశీల' అనుకన్య ఆ పిల్లను వారిస్తుంది ఇదిగో అటువంటి మాటలాడకు. నాతల్లి భవానిమాత భక్తురాలు కావున మా ఇంటిలో 'ముండలు రండలు' ఉండరు అని బదులు పలుకుతుంది. వారి వాదనలు మేనమామ 'శివుడు' వింటూ ఉంటారు.

కొద్దిసేపటికి సుశీల, తండ్రితో కూడి పార్వతి పరమేశ్వరుల దర్శనానికి ఆలయానికివస్తారు. సుశీల తండ్రి ఆవేదనతో తనకుమార్తెకు వివాహ వయస్సు సమీపించినదని, సరియగు వరుని ప్రసాదించమని వేడుకుంటాడు. ఆమాటలు వింటున్న మేనమామ ఆలయము వెనుక భాగానికి ఎవరు చూడకుండా వెళ్ళి అచ్చట నుండి "నీ కుమార్తెకు సరియగు వరుడు 'శివుడు' అను పేరుతో బాటసారిగా ఇచ్చటనే ఉన్నాడు. ఆతడే సుశీలకు తగినభర్త" అని పలుకుతాడు. దానితో ఆతడు "శివుడిని" గుర్తించి దైవ నిర్ణయంగా భావించి తన కుమార్తెకు ఇచ్చి వైభవంగా వివాహం చేస్తారు. ఆ రోజు రాత్రి దంపతులు నిదురిస్తున్న సమయాన నూతనవధువు సుశీల కలలో "మంగళగౌరీ" కనిపించి నీభర్త అల్పాయుష్కుడు; నేటితో ఆతని ఆయువు మూడింది. కొద్ది క్షణాల తర్వాత ఒక కృష్ణసర్పం వచ్చి కాటు వేయబోతుంది. నీవు ఏమాత్రము భయపడకుండా, ఒక పాలకుండను దానిముందు ఉంచు. పాలు త్రాగుతూ అందులో ప్రవేశించగానే దానిపై గుడ్డను వేసి కుండమూతినిగట్టిగా కట్టి మరుసటి రోజు ఉదయమే నీతల్లికి వాయనంగా ఇమ్ము. నీభర్త గండము గట్టెక్కు తుంది" అని సూచిస్తుంది.

చూచితిరా! ఆ తల్లి తన భక్తులను రక్షించుకొనుటకు ఎంత అప్రమత్త





మవుతుందో! ఆ కలకు తొట్రుపాటుతో మెలుకువ తెచ్చుకున్న సుశీల కనులు తెరువగానే! కృష్ణసర్పము భర్తవైపునకు వస్తున్నట్లు చూస్తుంది. ఆ మంగళగౌరీ చెప్పిన విధముగా, దానిని కుండలో బంధిస్తుంది. ఆ రాత్రి కొద్ది సేపటికి భర్తమేల్కొని ఆకలిగా ఉన్నది అంటాడు. సుశీల తన భర్తకు ఆప్యాయంగా అల్పాహారం తినిపిస్తుంది. 'శివుడు' ప్రేమతో తనచేతి ఉంగరాన్ని సుశీలకు తొడిగి మరలా నిదురిస్తాడు. తెల్లవారకుండానే 'శివుడు' మేల్కొని సుశీలను లేపకుండ ఆమెతో చెప్పకుండా తనమేనమామతో కాశీయాత్రకు వెళ్ళిపోతాడు. గౌరిదేవి చెప్పినట్లు ఆకుండను తల్లికి వాయన మీయగా! అందులో ముత్యాలహారము ఉంటుంది. దానిని తిరిగి తల్లి సుశీలకు ఇస్తుంది.

అలా వెళ్ళి భర్తకోసం వేయికనులతో ఎదురుచూస్తూ తన తండ్రిని అచ్చట ఒక సత్రము కట్టించమని కోరి ఆ బాటసారులకు చక్కని ఆతిథ్యమిచ్చి అన్నదానము, వస్త్రదానము, తాంబూలదానము చేస్తూ; కాశీనుండి తనభర్త తిరిగివచ్చి తనను ఏలుకుంటాడని విశ్వాసముతో ఉంటుంది.

ఇలా ఉండగా 'శివుడు' తన మేనమామతో కలసి కాశీనుండి తిరగు ప్రయాణమవుతూ మార్గమధ్యమందు కలగంటాడు. ఆకలలో తాను చనిపోతున్నట్లు, అప్పుడు మంగళగౌరీదేవి ఆ విషయమై యుద్ధమొనర్చినట్లు...కలగంటాడు. చివరకు ప్రతిష్టానపురము నందు 'సుశీల' ఉన్న సత్రమునకు వారు చేరుకుంటారు. సుశీల యధావిధిగా ఆబాట సారులకు పాదప్రక్షాళనచేసి తన భర్త 'శివుడిని' గుర్తిస్తుంది.సుశీలచేతి ఉంగరాన్ని చూచి శివుడు గుర్తించి సుశీలను ఆప్యాయంగ దగ్గరకు తీసుకుంటాడు. అనంతరం సుశీల తల్లి దండ్రులవద్దకు వారిని తీసుకుని వెళుతుంది. ఆ తల్లి దండ్రులు ఆ మంగళగౌరీ దేవిని వేయినోళ్ల కొనియాడుతూ కుమార్తెచే "మంగళగౌరీవ్రతం" చేయించి సంప్రదాయ సిద్ధంగా కుమార్తెను అత్తవారింటికి పంపుతారు.

గండముగల వయస్సులను అధిగమించి వస్తున్న కుమారుని; వెంటవస్తున్న సుశీలనుచూచి! రాజదంపతుల ఆనందానికి అవధులులేవు. మేనమామ ద్వారా మార్గమధ్యమందు జరిగిన సంఘటనలు తెలుసుకుని వారిని తోడ్కొని "భవానిమాత" ఆలయాన్కి వెళ్ళి ఆచల్లని తల్లి దీవనలు అందుకుని కోడలిచేత యధావిధిగా "మంగళగౌరీవ్రతం" చేయించి దేశప్రజలందరకు ఆ వ్రతమహాత్యాన్ని వివరించి వారిచే కూడా ఈ వ్రతాన్ని చేయిస్తారు.

పూర్వకాలమునాటి మాట ఇది ! త్రిపురాసురుని సంహరించుటకు పరమేశ్వరుడు సర్వశక్తి సంపన్నురాలైన ఈ "గౌరీదేవిని" పూజించి విజయుడైనాడు. ఆ తల్లిని పూజించి 'కుజుడు' మంగళవారమునకు అధిపతి అయినాడు. ఈ మంగళగౌరి నూతనముగా వివాహమైన స్త్రీలు తప్పనిసరిగా ఈ వ్రతమాచరించి సర్వసౌభాగ్యములు పొందుదురుగాక!

## నాగ పంచమి

| | |
|---|---|
| 1. లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజామందిరములో, ఇంటిముందు ముగ్గులు |
| 4. చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. ధరించవలసిన పట్టుబట్టలు | : ఎరుపు రంగువి |
| 6. పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ వుంచాలి |
| 7. మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎరుపు వస్త్రము |
| 8. కలశముపై వస్త్రము రంగు | : ఎరుపు వస్త్రము |
| 9. పూజించవలసిన ఫోటో | : నాగేంద్రస్వామి |
| 10. పూజించవలసిన ప్రతిమ | : పాము పడగ |
| 11. పూజించవలసిన దైవము | : నాగేంద్రస్వామి |
| 12. తయారు చేయవలసిన అక్షతలు | : తెల్లనివి |
| 13. పూజకు కావలసిన పువ్వులు | : ఎర్రటి పూలు కనకాంబరములు |
| 14. అలంకరణకు వాడవలసినపూలు | : మాందారమాల |
| 15. నివేదన చేయవలసిననైవేద్యం | : చలిమిడి |
| 16. సమర్పించవలసిన పిండివంటలు | : చిన్నచిన్న ఉండ్రాళ్లు, వడపప్పు |
| 17. నివేదించవలసిన పండ్లు | : అరటిపండ్లు |
| 18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : నాగ అష్టోత్తరము |
| 19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : నాగ స్తోత్రము |
| 20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : నాగస్తుతి |
| 21. పారాయణచేయవలసిన సహస్రాలు | : నాగేంద్ర సహస్రనామము |
| 22. పారాయణ చేయవలసినగ్రంథం | : - |
| 23. పారాయణ చేయవలసిన అధ్యాయములు | : - |
| 24. దర్శించవలసిన దేవాలయాలు | : నాగేంద్రస్వామి |
| 25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : పెదనందిపాడు |
| 26. చేయవలసిన ధ్యానములు | : నాగపంచమి, నాగేంద్ర ధ్యానము |
| 27. చేయించవలసిన పూజలు | : పుట్టలకు పూజ, పుట్టలకు పాలు |



| | |
|---|---|
| 28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : నాగ అష్టోత్తరములు |
| 29. ఆచరించవలసిన వ్రతము | : - |
| 30. ఉపవాసము నియమము | : వున్నది |
| 31. జాగరణ నియమము | : లేదు |
| 32. సేకరించివలసిన పుస్తకములు | : నాగేంద్ర నిత్య పూజ |
| 33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : నాగేంద్ర నిత్యపూజ నాగదోషము-పరిహారము |
| 34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : నాగేంద్ర నిత్యపూజ |
| 35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : నాగేంద్ర సహస్రనామపూజ |
| 36. దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : పుట్టలకు పాలుపోయుటకు ఏర్పాట్లు |
| 37. పర్వదిన నక్షత్రము | : - |
| 38. పర్వదిన తిథి | : పంచమి |
| 39. పర్వదినము యావారము వస్తే చాలామంచిది | : ఆదివారం |
| 40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ॥ 9గం॥లోపుగా |
| 41. వెలిగించవలసిన దీపారాధన కుంది | : 2 ఎర్రటి ప్రమిదలు |
| 42. వెలిగించవలసిన దీపారాధనలు | : ఎర్రటి మట్టి ప్రమిదెలు |
| 43. వెలిగించవలసిన వత్తులసంఖ్య | : దూదితో 7 వత్తులు |
| 44. వెలిగించవలసిన వత్తులు | : ఎర్రటి 7 వత్తులు |
| 45. దీపారాధన వాడవలసిన నూనె | : నువ్వుల నూనె |
| 46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : 7 వత్తులతో |
| 47. ధరించవలసిన తోరము | : ఎర్రటి తోరము |
| 48. నుదుటన ధరించవలసినది | : కుంకుమ |
| 49. 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం నాగరాజాయనమః |
| 50. జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 51. మెడలో ధరించవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 52. మెడలో ధరించవలసినమాలకు ప్రతిమ | : నాగపడగ |
| 53. చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. ఏ దిక్కుకు తిరిగి పూజించాలి | : పడమర దిక్కు. |



## నాగ పంచమి

సాక్షాత్తు పరమేశ్వరుడే ముందుగా ఈ "నాగపంచమి" నాడు భక్తులు ఆచరించాల్సిన విధులను పార్వతీదేవికి వివరించినట్లుగా స్కాందపురాణం పేర్కొనుచున్నది.

**"శ్రావణ మాసే పంచమ్యాం శుక్ల పక్షేతు పార్వతి**
**ద్వారస్యోభయతో లేఖ్యా గోమయేన విషోల్బణాః**
**పూజయే ద్విధివ ద్వీరలాజైః పంచామృతైః స్వహ**
**విశేషతస్తు పంచమ్యాం పయసా పాయసేనచ"**

ఓ పార్వతీ! శ్రావణమాస శుక్లపంచమినాడు ఈ నాగారాధన మిక్కిలి శ్రేష్ఠమైనది. ఆ దినము ద్వారమునకు ఇరువైపుల సర్పచిత్రములను గోమయంతో వ్రాసి పూజించుట ఎంతో శుభప్రదమైనది. చతుర్థి దినమందు ఉపవాసము ఆచరించి పంచమి రోజున బంగారం, వెండి, కర్రతోగాని లేక మట్టితోగాని వారి వారి తాహతును అనుసరించి ఐదుపడగల పామును చేయించవలెను. లేదా పసుపుతోగాని, చందనముతోగాని ఐదులేక ఏడుతలల పాము చిత్రపటములు గీయవలెను. అలా మూర్తీభవించిన పాముురూపానికి పంచామృతములతో విధివిధానంగా మంత్రోప చారములతో జాజి, సంపెంగ, గన్నేరు, మొదలుగా గల పుష్పాలతో అత్యంత భక్తి శ్రద్ధలతో పూజలు గావించి పాలు, పాయసము నివేదనచేయవలెను, అనివివరించెను.

అలాగునే కార్తీకమాసమందు వచ్చు నాగులచవితి, మరియు కుమారస్వామి తారకాసురుని సంహరించి తారకాధిపతివలె ప్రకాశించు మార్గశిర శుక్లషష్ఠి "సుబ్రహ్మషష్ఠి" అత్యంత ఫలప్రదమైనవిగా భావించవలెను. ఈ నాగారాధనలో కొన్ని ప్రాంతములలో స్కందుడుగా, కార్తికేయుడుగా, కుమారస్వామిగా, మురుగన్ వంటి పేర్లతో ఆరాధిస్తారు.

ఈ నాగారాధన చేయుదినములయందు భూమిని దున్నుట, భూమిని తవ్వడం, చెట్టు-పుట్ట కొట్టడం, కూరలు తరుగుట, వంట వార్పు చేయుట నిషేధములని పెద్దలు చెప్తారు.





ఈ విషయమై మనకు ఎన్నో రకాల గాథలు కానవస్తున్నాయి. వాటిలో ఒకగాథను ముచ్చటించుకుందాం!

పూర్వం ఒకరైతు తనపొలమును సాగుచేసుకునే నిమిత్తం ఈ దినముల యందు భూమిని దున్నుచుండగా! ఆతని నాగలి ఒక బొరియనందు లోతుగా దిగబడి పోయినదట! ఆ నాగలిని అతి బలవంతంగా భూమినుండి పెల్లగించి తిరిగి యథాస్థితికి తెచ్చుకుని, యధావిధిగా భూమి అంతయు దున్నుకుని సాయంత్రము ఇంటికిచేరుకొనెనట, ఆనాగటి బొరియలో ఉన్న నాగుపాము పిల్లలు మాత్రము నాగలిచాలు తగిలి రక్తసిక్తములై చనిపోయెనట, పాపం ఆ రైతుకు మాత్రం ఆ విషయం తెలియదు. "కాని తెలిసి చేసిన తెలియకచేసిన పాప-పుణ్యాలు ఎల్లప్పుడు మానవుని వెంటాడుతూనే ఉంటాయి, అని చెప్పుటకు" ఇది ఒక చక్కని ఉదాహరణగా కూడా చెప్పుకోవచ్చు. ఆ పాపమే ఆ రైతుకుటుంబము మొత్తం సర్వనాశమునకు మృత్యుదేవత అయింది.

ఇంతలో మేతకై వెడలిన నాగుపాము తిరిగి రానేవచ్చింది. ఆ నాగటిచాలు బరియలో రక్తపుమడుగులో మరణించి యున్న తన పిల్లలను చూచుకుని ఇందులకు కారణమేమిటాయని వెంటనే పసిగట్టి మిక్కిలి దుఃఖించి వెంటనే ఆ రైతు కుటుంబ ముపై పగబూని మిక్కిలి ఆవేశముతో వాని ఇంటికి చేరుకుని నిదురిస్తున్న ఆ రైతును, మొత్తం కుటుంబ సభ్యులందరను కసిగా కాటుపై కాటువేసి చంపివేసింది. అయినా ఆ నాగుపాము పగచల్లారలేదు. ప్రక్క ఊరిలో ఉన్న ఆ రైతు కుమార్తెను కూడా విచక్షణారహితంగా చంపాలని ఆమె ఇంటికి చేరుకుంది. ఇంతలో ఆ పాము ఆ రైతు కుమార్తె భక్తి ప్రపత్తులకు నిశ్చేష్ఠురాలయింది. సరిగా అదే సమయ మందు ఫణిరాజగు ఆదిశేషుని ప్రతిమను భక్తిశ్రద్ధలతో పూజించి పుట్టలో పాలుపోసి నూపప్పు బెల్లముతో కలిపిన చిమ్మిలిని, బియ్యపు పిండి బెల్లముతో చేసిన చలిమిడిని; మున్నగునవి నివేదనలు గావించి తన్మయత్వముతో నమస్కరించి ధ్యానం నుంచి కళ్ళుతెరిచేసరికి ఎదురుగా పడగవిప్పుకుని యున్న నాగుపామును భక్తితో నమస్కరించింది. ఇటువంటి భక్తురాలి కుటుంబాన్నా.... నేను బలితీసుకున్నది. ఆవేశములో ఎంతటి పాపానికి ఒడికట్టేను అని పశ్చాత్తాపపడి జరిగిన సంగతి అంతా ఆమెకు వివరించినది. ఆమెమిక్కిలి దుఃఖిస్తూ నాగమాతా! మేము, మాకుటుంబ సభ్యులము ఎల్లప్పుడు "నాగారాధనలు" చేసే భక్తులము. మాపై నీకు అంత కాఠిన్యమువలదు. దయతో నాతల్లి తండ్రులను కుటుంబ సభ్యులను బ్రతికించమని; నాతండ్రి తెలియకచేసిన అపరాధాన్ని మన్నించమని వేడుకుంది. ఆ భక్తురాలి ప్రార్ధనతో సంతుష్టురాలై కొంత అమృతం తెచ్చి ఇవ్వగా, ఆ రైతుకుమార్తె దానిని తీసుకుని పుట్టినింటికిపోయి వారిపై చల్లగా, ఆ మృతదేహాలు అన్నియు

నిదురనుంచి మేల్కొంచినట్లు బ్రతికినట్లుగా, ఈ పురాణగాథను బట్టి విశద మవుతోంది.



చూచితిరా! పగపట్టిన పాములలో కూడా "అపకారికి ఉపకారము" అను దయాగుణము ఇక్కడ ప్రతిబించుచున్నది. అదే మానవులలో అయితే...?

**తలనుడి విషము ఫణికిని, వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్**
**తల తోకయనక యుండును ఖలునకు నిలువెల్ల విషము గదరాసుమతీ!**

అట్టి మానవ రూపంలో ఉన్న భయంకరమైన సర్పాలు మనలను కాటు వేయటానికి సిద్ధంగా తిరుగుతూనే ఉన్నా అట్టి వారిని మనం గమనించ లేకపోతు న్నాం.

ఇక యోగసాధకులయితే! ఇలా వివరిస్తారు. మనిషియొక్క మెదడు సర్పపడగ ఆకారంలో ఉంటుందని, ఆలాగునే కుండలినీశక్తిని గూడా సర్పరూపంగా చెప్తారు. అట్టి కుండలినీ శక్తిని ప్రేరేపించి మూలాధారంనుండి బ్రహ్మరంధ్రం వరకు ప్రయాణింపజేయడం యోగసాధనా ప్రక్రియ అని, అలా చేయుటవల్ల ఆశక్తి వారి మనోభావాలపై చక్కని నియంత్రణ చేసి శారీరక, మానసిక రుగ్మతలు నయమవుతా యని; ఆశక్తి కనుక సహస్రారాన్ని చేరుకుంటే సంపూర్ణ జ్ఞానానుభవంతోపాటు మోక్షంకూడా తప్పక లభిస్తుందని దైవజ్ఞులు వారి ప్రవచనాలలో వివరిస్తూ ఉంటారు.

ఇక ఈ నాగారాధనవల్ల స్త్రీలకు గర్భదోషాలు, లైంగిక అసంతృప్తులు, కళ్లకు, చెవులకు, చర్మానికి సంబంధించిన వ్యాధులు కూడా నయమవుతాయని మరియు వంశాభివృద్ధి జరుగుతుందని భవిష్యపురాణంలో చెప్పబడింది.

**"సర్పాసర్ప! భద్రం తే దూరం గచ్ఛ మహావిష ।**
**జనమేజయ యాగాంతే ఆస్తీక వచనం స్మర !**
**అనంతాయ నమస్తుభ్యం నాగానాం పతయే నమః**
**అనంతో వాసుకిః శేషః పద్మనాభశ్చ కంబళః**
**శంఖపాలో ధార్తరాష్ట్రః తక్షకః కాళీయ స్తథా**
**సంతేషాం నవనామాని నాగానాంచ మహాత్మనామ్**
**సాయం కాలే పఠేనిత్యం ప్రాతఃకాలే విశేషతః**
**విషాత్తస్య భయంనాస్తి సర్వత్ర విజయీభవేత్॥"**

అని ప్రతినిత్యము పఠించు వార్కి సర్పభీతి, విషభయములు ఉండవని దైవజ్ఞులు చెప్తారు. అట్టి పుణ్యప్రదమైన ఈ "నాగపంచమి" పర్వదినమును భక్తి శ్రద్ధలతో జరుపుకుని ఆ "కార్తికేయుని" అనుగ్రహ పాత్రులౌదాము.



## వరలక్ష్మీ వ్రతము

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లు మరియు ఇంటిబయట శుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసిన అలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : తెలుపు రంగువి |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ ఉంచాలి |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : తెలుపు వస్త్రము |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : తెలుపు వస్త్రము |
| 9. | పూజించవలసిన ఫోటో | : శ్రీలక్ష్మీదేవి (ఆకుపచ్చనిచీరతో) |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : శ్రీలక్ష్మీదేవి (వెండిది) |
| 11. | పూజించవలసిన దైవము | : కూర్చున్న లక్ష్మీదేవి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : ఎర్రటివి |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : గులాబి పువ్వులు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : పద్మములు, ఎర్ర కలువపూలు |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : బొంబాయిరవ్వతో కేసరిబాత్ |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : రవ్వలడ్డులు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : జామకాయలు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : లక్ష్మీ అష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : మహాలక్ష్మీ అష్టకము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : కనకధారాస్తవము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : శ్రీలక్ష్మీ సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : వరలక్ష్మీ వ్రత కథ |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : వరలక్ష్మీ వ్రత కథ |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : అష్టలక్ష్మీ దేవాలయములు |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : లక్ష్మీదేవాలయములు |
| 26. | చేయవలసిన ధ్యానములు | : మహాలక్ష్మీ ధ్యానము |
| 27. | చేయించవలసిన పూజలు | : శ్రీలక్ష్మీకుంకుమ పూజ |

| | | |
|---|---|---|
| 28. | దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : శ్రీలక్ష్మి అష్టోత్తరనామపూజ |
| 29. | ఆచరించవలసిన వ్రతము | : వరలక్ష్మీవ్రతము |
| 30. | ఉపవాసము నియమము | : వున్నది |
| 31. | జాగరణ నియమము | : లేదు |
| 32. | సేకరించవలసిన పుస్తకములు | : వరలక్ష్మి వ్రతము |
| 33. | సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : వరలక్ష్మి వ్రతము |
| 34. | స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : వరలక్ష్మి వ్రతము |
| 35. | దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : శ్రీలక్ష్మి కోటికుంకుమార్చన |
| 36. | దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : శ్రీలక్ష్మిసహస్రనామ పారాయణ |
| 37. | పర్వదిన నక్షత్రము | : – |
| 38. | పర్వదిన తిథి | : శ్రావణపౌర్ణమి |
| 39. | పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : శుక్రవారం |
| 40. | పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : సా॥ 6గం॥ నుండి |
| 41. | వెలిగించవలసిన దీపారాధన కుంది | : 2 వెండివి |
| 42. | వెలిగించవలసిన దీపారాధనలు | : 2 దీపారాధనలు |
| 43. | వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 6+6 |
| 44. | వెలిగించవలసిన వత్తులు | : తామర వత్తులు |
| 45. | దీపారాధన వాడవలసిన నూనె | : కొబ్బరినూనె |
| 46. | వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : పంచహారతి |
| 47. | ధరించవలసిన తోరము | : ఎర్రటి తోరము |
| 48. | నుదుటన ధరించవలసినది | : కుంకుమ |
| 49. | 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం మహాలక్ష్మీదేవ్యై నమః |
| 50. | జపమునకు వాడవలసిన మాల | : తామర మాల |
| 51. | మెడలో ధరించవలసిన మాల | : తామర మాల |
| 52. | మెడలో ధరించవలసినమాలకు ప్రతిమ | : శ్రీ లక్ష్మీదేవి |
| 53. | చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. | ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : ఈశాన్యము |







## శ్రీ వరలక్ష్మీవ్రతం

**సుమనస వందిత, సుందరి, మాధవి చంద్రసహోదరి హేమమయే**
**మునిగణ మండిత, మోక్షప్రదాయని మంజుల భాషిణి, వేదనుతే**
**పంకజవాసిని, దేవసుపూజిత సద్గుణ వర్షిణి, శాంతియుతే,**
**జయ జయ, హేమధుసూదన కామిని ఆదిలక్ష్మీ జయపాలయమాం ॥**

అని తొలుత ఆ ఆదిలక్ష్మీదేవికి ధ్యానము చేసుకుని, ఈ 'వరలక్ష్మీవ్రతం' అనేది మనకు ఎప్పుడు వస్తుంది? దానిని ఎలా ఆచరించాలి? వ్రత విధానం ఏమిటి? ఈవరలక్ష్మీ వ్రతమహాత్మ్యం? వీటిపై మన పౌరాణికులు మనకు అందించియున్న విషయాలను ఈ సందర్భంగా ఒక్కసారి మననం చేసుకుందాం!

పేరులోనే ఉన్నది పెన్నిధి, అన్నట్టు ఈతల్లి వరాలను 'వర్షం' లా కురిపిస్తుంది కనుక, "శ్రీవరలక్ష్మీ" నామధేయముతో ఈమెను భక్తులు పూజిస్తూ ఉంటారు. ప్రతి సంవత్సరం శ్రావణమాస పూర్ణిమకు ముందు వచ్చేడి 'శుక్రవారం' ఈ వరలక్ష్మీవ్రతం చేయుట మంచిది అని చెప్పబడియున్నది.

ఆ రోజు సూర్యోదయానికి పూర్వమే నిద్రలేచి, కాలకృత్యాలు పూర్తిచేసుకుని అభ్యంగన స్నానమాచరించి నూతన వస్త్రధారణచేసి, పూజకు నిర్దేశించుకున్న ప్రదేశమందు గోమయముతో అలికి పద్మం ముగ్గుతో రంగవల్లికలను తీర్చి దిద్దాలి. దానిపై పసుపురాసి ముగ్గులు బొట్లుపెట్టుకున్న పీటను ఉంచి ఆ పీటపై నూతన వస్త్రము పరచి అందు యధాశక్తి బియ్యము పోసి దానిపై అలంకరించిన కలశచెంబును ఉంచాలి. ఒక కొబ్బరికాయను తీసుకుని దానికి "శ్రీ వరలక్ష్మీ" రూపు ప్రతిబింబించేటట్లు పసుపుముద్దతో కనులు, ముక్కు, చెవులు మున్నగునవి తీర్చిదిద్ది, కుంకుమ, కనులకు కాటుకలను, అమర్చి,ఆ రూపును కలశపై ఉంచుకోవాలి. ఆ విధంగా రూపుదిద్దుకున్న అమ్మవారిని 'శ్రీవరలక్ష్మీ'దేవిగా ఆహ్వానించి సద్ బ్రాహ్మణోత్తమునిచే కల్పోక్త ప్రకారం విధి విధానంగా పూజించాలి. సాయంత్ర సమయమందు ఇరుగు పొరుగు ముత్తైదువులను పిలుచుకుని దక్షిణ తాంబూలాలు ఇచ్చుకోవాలి. ఒకవేళ ఏ కారణముచేతనైన స్త్రీలకు అభ్యంతరము ఏర్పడిన యెడల ఆ నెలలో వచ్చే ఏ శుక్రవారం అయినా దీనిని ఆచరించవచ్చు అనికూడా చెప్పబడినది.

అలా ఈ వ్రతాన్ని తొలుత పార్వతి, పరమేశ్వరునిచే ఉపదేశము పొంది ఈ వ్రత ఫలితంగా 'షణ్ముఖుణ్ణి' సంతానముగా పొందినట్లు, అంతేగాక చరిత్రలో

ప్రసిద్ధిగాంచిన నందుడు, విక్రమార్కుడు ఈ వ్రత మాచరించి సింహాసనాధికారము పొందినట్లు గాధలు కలవు.

ఇట్టి మహిమాన్వితమైన ఈ వ్రత కథను సూతపౌరాణికుడు నైమిశారణ్య మందు శౌనకాది మహర్షులకు చెప్పిన గాథ ఏమిటో తెలుసుకుందాం !

ఒకసారి కైలాస పర్వతమందు వజ్ర వైఢూర్యాది మణులతో పొదగబడిన సింహాసనముపై పార్వతి పరమేశ్వరులు సుఖాసీనులై ఉన్న సమయాన; 'పార్వతి' పరమేశ్వరునితో ఓ ప్రాణనాథా! లోకంబున స్త్రీలు ఏవ్రతమాచరించిన సర్వసౌభాగ్యం బులును, పుత్రపౌత్రాదులతో సుఖంబుగా నుందురో అట్టి వ్రతమును సవిస్తరముగా వివరించవలసిందిగా ప్రార్థిస్తుంది.

అందులకు పరమశివుడు ఎంతగానో సంతసించి ప్రజాహితము కోరి నీవడిగిన సంశయమును తీర్చెదను, వినుము. స్త్రీలను పుత్రపౌత్రాది సర్వసంపత్తులను ఒసగే 'శ్రీవరలక్ష్మీ' వ్రతము అనునది ఒకటి కలదు. దానిని శ్రావణమాస శుక్లపక్ష పూర్ణిమకు ముందుగా వచ్చెడి 'శుక్రవారం' నాడు ఈ వ్రతాన్ని శ్రద్ధాభక్తులతో ఆచరించవలెను. అటులైన 'లోకారాధ్యా!' తమరు ఆనతిచ్చే ఆ వ్రతవిధానము ఏమిటో వివరంగా సెలవీయండి అని పార్వతి కోరుతుంది.



ఓ 'మనోహరీ' ! పూర్వము మగధదేశమున 'కుండినంబు' అను పట్టణము కలదు. ఆ పట్టణమంతయు బంగారు ప్రాకారములతో బంగారు గోడలతో నిర్మించబడియున్నది. ఆ పట్టణములో నారీ శిరోమణి అయిన 'చారుమతి' అను మహా పతివ్రతయైన బ్రాహ్మణస్త్రీ కలదు. ఆమె అనుదినము గృహస్థ ధర్మాన్ని ఆదర్శవంతంగా నిర్వహిస్తూ భర్తను, అత్తమామలను సేవిస్తూ ఉండేది. అట్టి పతివ్రతామతల్లిపై 'శ్రీవరలక్ష్మీ'కి అనుగ్రహము కలిగి ఒకనాడు స్వప్నమందు ప్రత్యక్షమయి ఓ చారుమతీ! "నేను వరలక్ష్మీదేవిని. నీసత్ ప్రవర్తన చూచి నీపై నాకు అనుగ్రహము కలిగినది. నీవు వచ్చేశ్రావణమాస శుక్లపక్ష పూర్ణిమకు ముందువచ్చెడి 'శుక్రవారం' నాడు నన్ను పూజించిన యెడల నీవు కోరిన వరంబు లిచ్చెదను–అనిపలికెను. అంత ఆ చారుమతి స్వప్నంబునందే ఆ దేవదేవిని "నమస్తే సర్వలోకానాం జననై పుణ్యమూర్తయే శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్ష స్థలాలయే" అని అనేక విధములు స్తోత్రయుచేసి, ఓ లోకపావనీ! నీదర్శన భాగ్యముచేతనే మనుజులు ధన్యులుగాను, సకలసంపన్నులుగా, విద్వాంసులు అయ్యెదరు. నా జన్మాంతర సుకృతాన్నిబట్టి మీ దర్శనము నాకు లభించింది అని సంతసించుచూ, దిగ్గున నిదుర లేచి నలుదిశలా పరిశీలించి చూడగా ఓహో! నేను ఇది అంతాకలగన్నానా; అతి తలచి ఆ స్వప్న వృత్తాంతాన్ని ముందు భర్తకు, అనంతరం అత్తమామలకు, తరువాత ఇరుగుపొరుగు వారలకు ఎంతో సంతోషంగా చెబుతుంది.



నాటినుండి స్త్రీలందరూ ఆ వరలక్ష్మీదేవి చెప్పిన "శ్రావణమాస శుక్లపక్ష పూర్ణిమకు ముందువచ్చే శుక్రవారం" ఎప్పుడెప్పుడా! అని ఎదురుచూచు చూడగానే! ఆ పుణ్యదినం రానేవచ్చింది.

ఆ రోజు "చారుమతి" మున్నగు స్త్రీలందరు వారి వారి ఇండ్లను "ముత్యాల ముగ్గు"లతో, పచ్చనితోరణాలతో అలంకరించుకొని, ఒక బ్రాహ్మణోత్తముని ఆహ్వానించి షోడశోపచారములతో ఆ "వరలక్ష్మీ"దేవిని చారుమతితో గూడి పూజించి నానావిధ భక్ష్య భోజ్యములను ఆ తల్లికి నివేదనచేసి, ఆ తల్లికి వారంతా ఒక్క ప్రదక్షణ చేయగానే! కాలి అందియెలు ఘల్లు ఘల్లుమని శబ్దము వినిపించసాగెను. అంతవారు వారికాళ్ళను చూచుకోగా! చారుమతితో సహా వారి అందరికాళ్ళకు గజ్జెలు కనిపించినవి. వారంతా మనకు ఆ వరలక్ష్మీ కటాక్షము కలిగినదని! సంతసించుచూ రెండవ ప్రదక్షణ చేయగా; వారి హస్తములకు నవరత్న ఖచితమైన కంకణములు కనుగొనిరి. ఇక మూడవ ప్రదక్షణ పూర్తికాగానే స్త్రీలందరూ ధన,కనక, వస్తు వాహనములతో నిండియుండిరి. అనంతరం కల్పోక్త ప్రకారం విధి విధానంగా పూజచేయించిన ఆ బ్రాహ్మణోత్తముని కూడా పూజించి, కుడుములు మున్నగు వాయనములు, తగురీతిగా దక్షిణ తాంబూలమును ఇచ్చి సత్కరించి వాని ఆశీస్సులు వారంతా పొంది తరువాత భోజనములు చేయుచూ, 'చారుమతి అను పుణ్యస్త్రీ' వలన కదా! మనకు ఈ భోగభాగ్యములు కలిగినవి అని ఆమెను పొగడచూ! ఇండ్లకు పోయి ప్రతిసంవత్సరము క్రమము తప్పకుండా ఈ "వరలక్ష్మీవ్రతము"ను ఆచరిస్తూ పుత్రపౌత్రాదులతో సుఖంబుగా జీవించుచుండిరి. కావున ఓ పార్వతీ! యీ యుత్తమమైన ఈ వరలక్ష్మీవ్రతమును బ్రాహ్మణాది నాలుగు జాతుల వారును చేయవచ్చును. అట్లు ఒనర్చిన స్త్రీలకు అయిదోతనము, సౌభాగ్యం, సంతానప్రాప్తి, మున్నగు సర్వశుభములు కలుగుతాయి. కన్నెముత్తైదువులు ఆచరించిన వార్కి మంచి భవిష్యత్తు లభిస్తుంది. ఈ కథను వినువారలకు, చదువు వారలకు వరలక్ష్మీ దేవి అనుగ్రహముకలిగి సకలకార్యములు సిద్ధించును. అని పరమేశ్వరుడు ఈ వృత్తాంతము పార్వతీదేవికి చెప్పినట్లుగా శౌనకాది మునులకు సూతముని శ్రేష్ఠుడు నైమిశారణ్యమందు ఈ పురాణగాథను చెప్పి వారి సంసయమును తీర్చినాడు.

**శ్లో॥ లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం। శ్రీరంగధామేశ్వరీం**
**దాసీభూత సమస్త దేవ వనితాం। లోకైక దీపాంకురాం ।**
**శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవః । బ్రహ్మేంద్ర గంగాధరం ।**
**త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందేముకుందప్రియామ్॥**

ఇట్టి మహిమాన్వితమైన 'శ్రీవరలక్ష్మీవ్రత పుణ్యదినం' విశేషంగాజరుపుకుని ఆ తల్లి కృపకు పాత్రులౌదాము.

## కృష్ణాష్టమి



1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలకు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు వేయాలి
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : పసుపు రంగువి
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకు ఉపయోగపడు వస్తువులు, పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : పసుపు రంగు
8. కలశముపై వస్త్రము రంగు : పసుపు రంగు
9. పూజించవలసిన ఫోటో : శ్రీకృష్ణుడు రాధతో
10. పూజించవలసిన ప్రతిమ : శ్రీకృష్ణుడు
11. పూజించవలసిన దైవము : శ్రీకృష్ణుడు
12. తయారు చేయవలసిన అక్షతలు : పసుపు రంగు
13. పూజకు కావలసిన పువ్వులు : కదంబ పుష్పములు
14. అలంకరణకు వాడవలసినపూలు : సన్నజాజులతో మాల
15. నివేదన చేయవలసిననైవేద్యం : పానకం
16. సమర్పించవలసిన పిండివంటలు : వడపప్పు
17. నివేదించవలసిన పండ్లు : కమలాకాయలు
18. పారాయణ చేయవలసిన అష్టోత్తరం : శ్రీకృష్ణ అష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : శ్రీకృష్ణాష్టకం
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : బాలకృష్ణా స్తోత్రమ్
21. పారాయణచేయవలసిన సహస్రాలు : శ్రీకృష్ణ సహస్రనామములు
22. పారాయణ చేయవలసినగ్రంథం : శ్రీమద్భాగవతము
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : దశమ,ఏకాదశ స్కంధములు
24. దర్శించవలసిన దేవాలయాలు : శ్రీకృష్ణదేవాలయము
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : గౌడీయమఠములు
26. చేయవలసిన ధ్యానములు : కృష్ణ ధ్యానశ్లోకములు





27. చేయించవలసిన పూజలు : కృష్ణ అష్టోత్తర పూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : కృష్ణ సహస్రనామపూజ
29. ఆచరించవలసిన వ్రతములు : –
30. ఉపవాసము నియమము : –
31. జాగరణ నియమము : –
32. సేకరించివలసిన పుస్తకములు : భాగవతము
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : శ్రీకృష్ణ నిత్యపూజ
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : శ్రీకృష్ణ నిత్యపూజ
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : శ్రీకృష్ణ లీలలు (నాటిక)
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : శ్రీకృష్ణ చరిత్ర (ఉపన్యాసములు)
37. పర్వదిన నక్షత్రము : –
38. పర్వదిన తిథి : అష్టమి
39. పర్వదినము యావారము వస్తే చాలామంచిది : ఆదివారం
40. పర్వదినము రోజున పూజ చేయవలసిన సమయము : మ॥ 12 గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : కంచుదీపం
42. వెలిగించవలసిన దీపారాధనలు : 2
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5
44. వెలిగించవలసిన వత్తులు : దూదితో
45. దీపారాధనకు వాడవలసిన నూనె : కొబ్బరి నూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : సింధూరము
48. నుదుటన ధరించవలసినది : సింధూరము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః
50. జపమునకు వాడవలసిన మాల : తులసి మాల
51. మెడలో ధరించవలసిన మాల : తులసి మాల
52. మెడలో ధరించవలసిన మాలకు ప్రతిమ : శ్రీకృష్ణ
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏ దిక్కుకు తిరిగి పూజించాలి : తూర్పుదిక్కు

## శ్రీకృష్ణ జన్మాష్టమి

**వసుదేవసుతం దేవం కంసచాణూర మర్థనం ।**
**దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

నేటి మన సమాజానికి యుగయుగాల చరిత్ర కలిగియుంది. అట్టి ఈ సమాజం ఎల్లప్పుడు కులాతీత, మతాతీత, వర్ణాతీతంగా ఉంటూ, సహజీవనాన్ని కోరుకుంటూ వస్తూఉంది. అందు ఉన్న ఈ జనులంతా వార్కి జన్మతహావస్తున్న ఆచారాలను అనుసరిస్తూ! వీరంతా పొట్టకూటికోసం వివిధ వృత్తులను చేపడుతూ ఉంటారు. చేసే పనులు వేరు అయినా; పూలదండలో దారంవలె "ధర్మం"మాత్రం వీరందరికీ ఒకటే ఉంటుంది. అన్ని యుగాల్లోను, అన్ని కాలాల్లోను చెక్కు చెదరకుండా ఉండేది "ధర్మమార్గం" ఒక్కటే అని సర్వులూ అంగీకరిస్తున్న విషయం.

ఈ కాలగమన ప్రయాణంలో జనజీవనానికి అప్పుడప్పుడు ఎన్నో ఆటంకాలు ఏర్పడుతూ, శృతి మించి రాగానికి వస్తూ వుంటాయి. అట్టి మానవ మనుగడకే ముప్పు వాటిల్లే పరిస్థితివచ్చినపుడు.

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ గీ.4-7**

అని శ్రీకృష్ణభగవానుడు ! ఓ అర్జునా! ధర్మమునకు హాని కలిగినప్పుడు అధర్మము పెచ్చుపెరిగినప్పుడును నన్ను నేను సృజించుకొందును. అనగా సాకార రూపముతో లోకమున నేను అవతరింతును, అని చెప్పియున్నాడు. ఈ భారతావనిలో శ్రీకృష్ణుడు అంటే తెలియని వారుండరు. ఆయనే ఈ నవభారత నిర్మాణానికి సూత్రధారుడు, కాని మనకు మనష్యులను పూజించడమే తెలుసుగాని, అర్థం చేసుకోవడం తెలియటంలేదు. శ్రీకృష్ణుని భగవంతుని అవతారంగా, మానవ రూపంలో, జన్మించిన దేవునిగా ఆరాధించామేగాని మానవుడిగా పుట్టిన ఆ దేవదేవుని మానవునిగాక; వారి లీలలను మానవ మనుగడతో సరిపోల్చుకుంటూ అర్థం చేసుకోవడం కూడా అంతే ముఖ్యంగా తెలుసుకోవాలి.





అలాభగవానుడు సామాన్య జనులమధ్య సామాన్య మానవుడి రూపంలో జన్మించి నివురుగప్పిన నిప్పులా దినదినాభివృద్ధి చెందుతూ ధర్మానికి ఆటంకం కలిగించే శక్తులను తనలో ఉన్న మధ్యాహ్న సూర్యకాంతితో ఒక మండించే శక్తిలా; ఆ దుష్టశక్తులను నశిపంచేస్తూ సామాన్య జనులకు ఊరట కలిగిస్తూ మానవులందరు తిరిగి ఎలాకలిసి మెలసి జీవించాలో జ్ఞానబోధను చేస్తూ ముందుకు సాగిపోతుంటాడు.

అట్టి "శ్రీకృష్ణావతార జన్మదినం" మనకు చాలా పవిత్రమైన పుణ్యదినంగా ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుంటూ, వారి జన్మవృత్తాంత విశేషాలను పరమ భాగవతోత్తములు అందించినవి ఏమిటో... ఒక్కసారి సమీక్షించుకుందాం!

శ్రీముఖనామ సంవత్సర దక్షిణాయన వర్షఋతువు శ్రావణ బహుళ అష్టమి రోహిణి నక్షత్రం నాల్గవపాదం బుధవారం నాడు అర్థరాత్రి యదువంశంలో దేవకీదేవి, వసుదేవుల పుత్రునిగా "శ్రీకృష్ణుడు" జన్మించాడు. అంటే! (క్రీస్తు పూర్వం 3228సం॥)



**జయతు జయతు దేవో దేవకీ నందనోయం**
**జయతు జయతు కృష్ణో వృష్ణి వంశ ప్రదీపః**
**జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో**
**జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః॥**

తా॥ ఓ దేవకీనందనా! ఓ వృష్ణివంశ మంగళ దీపమా! సుకుమార శరీరుడా! మేఘశ్యామ! భూభారనాశక ముకుందా! నీకు సర్వదా జయమగుగాక!

ఆ బాలకృష్ణుడు దినదిన ప్రవర్థమాన మగుచూ తన లీలావినోదాదులచే బాల్యమునుండే, అడుగడుగునా భక్తులకు జ్ఞానోపదేశం చేస్తూ వచ్చినాడు. ఈ బాలకృష్ణుడు ఇంటింటా తన స్నేహితులతో వెన్నముద్దలు దొంగిలిస్తూ వెన్నదొంగగా ముద్రవేసుకున్నాడు. అలా వెన్నముద్దల దొంగతనంలో కూడా మానవులకు అందని దేవరహస్యం ఉందిట! వెన్న జ్ఞానానికి సంకేతంగా చెప్తారు. పెరుగును మధించగా మధించగా కాని వెన్న లభ్యంకాదు కదా! అట్టి తెల్లని వెన్నను తాను తింటూ, ఆ అజ్ఞానమనే నల్లటి కుండను బద్దలుకొట్టి మానవులలో జ్ఞానజ్యోతిని వెలిగించడమే కృష్ణ సందేశంగా భావించాలి అని చెప్తూ ఉంటారు.

ఆలాగునే మరోచిన్నారి చేష్టలలో మరో సందేశాన్ని చెప్తారు. గోపికలు కుండలలో ఇండ్లకు నీళ్లను యమునానదిలో నుండి తీసుకుని వెళుతూఉంటే, రాళ్లను విసిరిచిల్లుపెట్టేవాడట, అలా ఆకుండ మానవశరీరము అనుకుంటే ఆకుండ లోని నీరు 'అహంకారం' ఆ అహంకారం కారిపోతేనేగాని జీవికి ముక్తి లభించదని ఇలా వారి లీలలోని ఆంతర్యాన్ని భాగవతోత్తములు వివరిస్తూ ఉంటారు.

ఇక చిన్న తనమునుండే అనేకమంది రాక్షసులను సంహరిస్తూ దుష్టశిష్టరక్షణ కావిస్తూ కురుపాండవ సంగ్రామములో అర్జునునకు రధసారధియై అర్జునిలో ఏర్పడిన అజ్ఞానాంధకారాన్ని తొలగించుటకు "విశ్వరూపాన్ని" చూపించి గీతను బోధించి, తద్వారా మానవాళికి జ్ఞానామృతాన్ని ప్రసాదించాడు. ఇలా కృష్ణతత్వాన్ని కొనియాడి చెప్పుటకు వేయితలలు కలిగిన ఆదిశేషునకే సాధ్యముకాదని చెప్పగా! ఇక మానవ మాత్రులము...మనమెంతో చెప్పండి? అట్టి శ్రీకృష్ణ భగవానుని జ్ఞానబోధతో అందించిన 'గీతామృతం' మనకు ఆదర్శప్రాయం.

ఇంకా, ప్రముఖ భాగవతోత్తములు మనకు అందించే సమాచారాన్ని బట్టి యిప్పటికి సుమారు 30వ శతాబ్దములకు పూర్వం అంటే క్రీస్తు పూర్వం 3122లో ద్వారకా పట్టణమందు కృష్ణభగవానుడు నిర్యాణము చెందినట్లు తెలియుచున్నది. నాటినుండే కలి ప్రవేశముతో "కలియుగం" ఆరంభమైనదని చెప్తారు.

అట్టి "గీతాచార్యుడు" కృష్ణపరమాత్మ జన్మాష్టమినాడు సూర్యోదయమునకు పూర్వమే కాలకృత్యాలను తీర్చుకుని చల్లని నీటిలో "తులసీదళము" లను ఉంచి స్నానమాచరించిన సమస్త పుణ్య తీర్థములలోను స్నానమాచరించిన పుణ్యఫలాన్ని పొందుతారని, ఆరోజు సర్వులు వారి వారి గృహాలను ముత్యాల ముగ్గులతో, పచ్చని తోరణాలతో కృష్ణపాదాలను రంగవల్లికలతో తీర్చిదిద్ది ఆ కృష్ణ పరమాత్మను ఆహ్వానం పలుకుతూ, ఊయలలో ఓ చిన్ని కృష్ణుని ప్రతిమను ఉంచి, రకరకాల పూవులతో గంధాక్షతలతో యధావిధిగా పూజించి, ధూపదీప నైవేద్యములతో ఆ స్వామిని ఆరాధించి భక్తులకు తీర్థ ప్రసాదములు దక్షిణ తాంబూలములు సమర్పించుకొనుట ఎంతో మంచిదో చెప్పబడినది. ఇంతేకాక చాలా చోట్ల కృష్ణ పరమాత్మ లీలల్లో ఒక లీలగా ఉట్టికుండ కొట్టే కార్యక్రమంకూడా నిర్వహిస్తూ ఉంటారు.

**కృష్ణ! త్వదీయ పదపంకజ పంజరాంతం**
**అద్యైవమే విశతు మానసరాజహంసః॥**

**ప్రాణ ప్రయాణసమయే కఫవాత పిత్తై**
**కంఠావరోధనవిధే స్మరణం కుతస్తే ॥**

ఓ కృష్ణా! మరణసమయాన నిన్ను స్మరించుచూ నీలో ఐక్యమవ్వాలని కోరిక ఉన్నది కాని! ఆ వేళ కఫవాత పైత్యములచే కంఠము మూతపడిపోయి నిన్ను స్మరించగలనో! లేనో? అని తలచి ఇప్పుడే నా 'మానస రాజహంస'ను శత్రుఅభేద్యమైన "నీపాద పద్మ వజ్రపంజర" మందు ఉంచుతున్నాను తండ్రీ...!

ఇట్టి పరమ పుణ్యదినమైన ఈ శ్రీకృష్ణ జన్మాష్టమినాడు విశేషార్చనలు జరిపించుకుని కృష్ణభగవానుని ఆశీస్సులతో పునీతులమవుదాము.





## వరాహ జయంతి

అనంత భగవానుడు ప్రళయకాలమందు జలమున మునిగిపోయిన పృథ్విని ఉద్ధరించుటకు వరాహ రూపము ధరించెను. ఒక దినము స్వాయంభువ మనువు వినయముగ చేతులు జోడించి తన తండ్రి అయిన బ్రహ్మ దేవునితో ఇట్లనెను. "తండ్రీ! మీరు సమస్త జీవులకు జన్మదాతలు. జీవము నొసగువారు. మీకు నా నమస్కారములు. నేను మిమ్ములను ఏవిధముగ సేవింపవలెనో ఆజ్ఞ ఇండు.

మనువు మాటలు వినిన బ్రహ్మ, "పుత్రా! నీకు శుభమగుగాక. నిన్నుగాంచి నేను ప్రసన్నుడనైతిని, నీవు నా ఆజ్ఞను కోరితివి. ఆత్మ సమర్పణము గావించితివి. పుత్రులు తమ తండ్రిని ఈ విధముగనే పూజింపవలెను. వారు తమ తండ్రి ఆజ్ఞను ఆదరముతో పాలించవలెను. నీవు ధర్మ పూర్వకముగ పృథ్విని పాలించుము. యజ్ఞములతో శ్రీహరిని ఆరాధింపుము. ప్రజలను పాలించుటయే నన్ను సేవించినట్లగును" అని చెప్పగా మనువు ఇట్లనెను.

"పూజ్యపాదా! మీ ఆజ్ఞను అవశ్యము పాలించెదను. ఐనను సర్వజీవులకు నివాసస్థానము అయిన భూమి ప్రళయ జలమందు మునిగియున్నది. కావున నేనెట్లు భూమిని పాలింపగలను" అని అడుగగా!

బ్రహ్మ, పృథ్విని గురించి చింతించుచూ, దానిని ఉద్ధరించుటకు గాను ఆలోచింప సాగెను. అప్పుడు అకస్మాత్తుగ ముక్కునుండి బొటనవ్రేలు ఆకారమంత ఒక వరాహ శిశువు వెలువడెను. చూచుచుండగనే అది పర్వతాకారము దాల్చి గర్జించసాగెను. బ్రహ్మదేవుడు భగవానుని ఘురఘురలు విని వానిని స్తుతించసాగెను. బ్రహ్మ స్తుతించుచుండ వరహ భగవానుడు ప్రసన్నుడయ్యెను.

వరాహ భగవానుడు జగత్కళ్యాణము కొరకు జలమందు ప్రవేశించెను. జలమందు మునిగియున్న పృథ్విని తన కోరలపై తీసికొని రసాతలము నుండి పైకి వచ్చు చుండగా పరాక్రమవంతుడైన హిరణ్యాక్షుడు జలమందే గదతో వరాహ భగవానునితో తలపడెను. సింహము, ఏనుగును వధించినట్లు వరాహ భగవానుడు క్రోధముతో హిరణ్యాక్షుని వధించెను.

జలము నుండి వెలుపలకు వచ్చుచున్న భగవానుని బ్రహ్మాది దేవతలుగాంచి, చేతులు జోడించి స్తుతించసాగిరి. ప్రసన్నుడైన వరాహ భగవానుడు తన గిట్టలతో జలమును అడ్డగించి దానిపై పృథ్విని స్థాపించెను.

## కల్కి జయంతి

మన ధర్మ శాస్త్రములందు కల్కి భగవానుని అవతారము దశావతారముగ చెప్పబడినది. ఘోర కలియుగము ఎప్పుడైతే వచ్చునో అప్పుడు ధర్మము, సత్యము పవిత్రత, క్షమ, దయ, ఆయువు, బలములు, నశించును. కలియుగమందు ఎవరి చెంత ధనముండునో వారినే కులీనులు, సదాచారులు, సద్గుణవంతులుగా తలచెదరు. వీరు మోసము, కపటముగ వ్యవహరించిననూ మంచిగనే భావిచెదరు. బ్రాహ్మణుల స్వభావము కూడా మారిపోవును. వీరి యజ్ఞోపవీతమును చూచి బ్రాహ్మణులను కొనెదరు. వీరు అధిక దర్పముతో మూర్ఖులై యుందురు.

కలియుగమున ధర్మము కీర్తికొరకు చేయుదురు. సమస్త పృథ్వి దుష్టులతో నిండిపోవును. రాజగుట యేనియమములు అవసరము లేకుండును. బ్రాహ్మణులు గాని, క్షత్రియులుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని, ఎవరు బలవంతులైనవారే రాజులగుదురు. కలియుగమున రాజులు అతి నిర్దయములుగను, క్రూరులుగను నుందురు. వీరికి భయపడి ప్రజలు పర్వతములకు, అడవులకు పారిపోవుదురు. ఈ సమయమున భయంకరమైన కరువు సంభవించును. జనులు ఆకలి దప్పులతోను, నానాబాధలతో దుఃఖితులగుదురు. అప్పుడు వీరు ఆకులు తిని కడుపు నింపుకొనెదరు. మనుష్యులు దొంగతనము, హింసాది కుకర్మలతో కలము గడుపుదురు. కలికాల దోషమున మానవుల శరీర నిర్మాణము చిన్నదగును. నాలుగు వర్ణములవారు శూద్రులతో సమానమగుదురు. గోవులు మేకలవలె కొంచెము పాలను ఇచ్చును. వానప్రస్థులు, సన్యాసులు గృహస్థులవలె వ్యవహరించెదరు. ధర్మశాస్త్రములను, వేదపురాణములను నిందించెదరు. పూజ, పఠనాదులను బూటకమనెదరు. కలియుగాంతమున పృథ్విపై హింస, జాతీయ సంఘర్షణలు పెచ్చు పెరుగును. ఇట్టి సమయమున ధర్మమును రక్షించుటకు స్వయముగ భగవానుడు అవతరించును.

కలియుగాంతమున శంభల గ్రామమందు విష్ణుయశుడును ఒక బ్రాహ్మణు డుండును. ఇతడు గొప్ప ఉదారుడు. పరమభక్తుడు. ఇతని భార్య సుమతి గర్భమున వైశాఖమాస శుక్ల ద్వాదశీ దినమున కల్కి భగవానుడు అవతరించును. ఇతడు దేవదత్త నామము గల అశ్వముపై నెక్కి, దుష్టులను ఖడ్గముతో ఖండించును. పృథ్వీపై పునఃధర్మమును స్థాపించును. కల్కి భగవానుని అవతరణ సమయమున సత్యయుగము ప్రారంభమగును. ప్రజలు సుఖశాంతులతో జీవించెదరు.



## వినాయక చవితి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు వేయవలెను |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఆకుపచ్చరంగుపట్టు వస్త్రాలు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు-పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : - |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఆకుపచ్చ రంగు |
| 9. | పూజించవలసిన ఫోటో | : వినాయకుడు |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : శ్వేతార్క గణపతి |
| 11. | పూజించవలసిన దైవము | : వినాయకుడు |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : పసుపు రంగు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : కలువపువ్వులు, బంతి పువ్వులు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలమాల | : చామంతిమాల |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : ఉండ్రాళ్ళు |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : బూరెలు, గారెలు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : వెలక్కాయ |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : గణపతి అష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : సంకటనాశన గణేశస్తోత్రం |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : ఋణవిమోచక గణపతిస్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : గణపతి సహస్రనామం |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : శ్రీ గణేశారాధన |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : గణపతి జననం |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : గణపతి |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : కాణిపాకం, అయినవిల్లి |

| | |
|---|---|
| 26. చేయవలసిన ధ్యానములు | : గణపతి ధ్యానశ్లోకం |
| 27. చేయించవలసిన పూజలు | : 108ఉండ్రాళ్ళతో పూజ |
| 28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : గరికెతో గణపతి గకార అష్టోత్తరం |
| 29. ఆచరించవలసిన వ్రతము | : వినాయక వ్రతము |
| 30. ఉపవాసము నియమము | : లేవు |
| 31. జాగరణ నియమము | : లేదు |
| 32. సేకరించివలసిన పుస్తకములు | : శ్రీగణేశారాధన, శ్రీగణేశోపాసన కాణిపాక క్షేత్రమహత్యం |
| 33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : గణపతి స్తోత్రమాల |
| 34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : గరికెతో గణపతిపూజ |
| 35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : గణేశ నవరాత్రి ఉత్సవములు |
| 36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : గరికెతో గణపతిపూజలు |
| 37. పర్వదిన నక్షత్రము | : హస్త |
| 38. పర్వదిన తిథి | : భాద్రపద శుద్ధ చవితి |
| 39. పర్వదినము యేవారము వస్తే చాలామంచిది | : బుధవారం |
| 40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ॥9 నుండి 12 గం॥ లోపుగా |
| 41. వెలిగించవలసిన దీపారాధన కుంది | : కంచుదీపారాధనలు |
| 42. వెలిగించవలసిన దీపారాధనలు | : 2 |
| 43. వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 7 |
| 44. వెలిగించవలసిన వత్తులు | : జిల్లేడు వత్తులు |
| 45. దీపారాధన వాడవలసిన నూనె | : కొబ్బరి నూనె |
| 46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : పంచహారతి |
| 47. ధరించవలసిన తోరము | : పసుపురంగు తోరములో పువ్వులు+ఆకులు |
| 48. నుదుటన ధరించవలసినది | : విభూది |
| 49. 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం గం గణపతయే నమః |
| 50. జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 51. మెడలో ధరించవలసిన మాల | : స్ఫటిక మాల |
| 52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : గణపతి |
| 53. చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : ఉత్తరం |





## వినాయక చవితి

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే ॥

మన పండుగలు మన భారతీయ సంస్కృతికి అద్దంపడుతూ! అవి ఆణిముత్యాలతో గూడిన ముత్యాల హారంవలె ప్రకాశించుచూ, మన సంస్కృతిని ప్రతిబింబింప చేస్తూ ఉంటాయి.

అటువంటి పండుగలలో విశిష్టమైనది "వినాయకచవితి". తొలుత ఏ పని ప్రారంభించాలన్నా, గణపతి పూజతో ప్రారంభిస్తాం. పిన్నలనుండి పెద్దలవరకూ ఎంతో భక్తి శ్రద్ధలతో ఎంతో వేడుకగా చేసుకునేది ఈ చవితి పండుగ. భాద్రపద శుద్ధ చవితి రోజున విశేషంగా గణపతి పుట్టిన రోజు అయిన ఈ రోజు జరుపుకుంటూ ఉంటాము.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతా గణాలందరికీ విఘ్నేశ్వరుడు ప్రభువు. అంటే! హిందువుల యొక్క సకలదేవతా గణాలకు ఆయనే ప్రభువన్నమాట. బ్రహ్మ తొలుత ఈ సృష్టి కార్యాన్ని ప్రారంభించేముందు గణపతిని పూజించినట్లు ఋగ్వేదం చెబుతోంది మనకు. బ్రహ్మవైవర్తన పురాణమందు 'గణ' శబ్దానికి 'గ'అంటే, విజ్ఞానమని 'ణ' అంటే మోక్షమని అర్థం చెప్పబడియున్నది. ఈ సృష్టి అంతా గణాలతో కూడుకుని యున్నది. అటువంటి గణాలు అన్నీకలిస్తేనే ఈ ప్రపంచం! అట్టి ప్రపంచాన్ని అహంకారానికి గుర్తు అయిన "మూషికాన్ని" అధిరోహించి పాలించే ప్రభువు ఈ మహాగణపతి.

ఇట్టి గణపతిని ఆరు రూపాలుగా పూజలు జరుపుతూంటారు. 1. మహా గణపతి, 2. హరిద్రాగణపతి 3. స్వర్ణగణపతి 4. ఉచ్ఛిష్ట గణపతి 5. సంతాన గణపతి 6. నవనీతగణపతి అని; అలాగే ప్రపంచం అంతటా వారివారి ప్రాంతీయతను బట్టి వివిధనామాలతో ఆరాధిస్తూ ఉంటారు. ఈ జ్యేష్టరాజునకు సిద్ధి, బుద్ధి అను ఇద్దరు కుమార్తెలను విశ్వరూప ప్రజాపతి వివాహం చెయ్యగా! వారికి క్షేముడు, లాభుడు అనే కుమారులు కలిగినారు. అందువల్ల ఈయన ఆరాధనవల్ల క్షేమం, లాభం కలుగుతుందని ప్రతీతి.

ఇక శ్రీ మదఖిలాండ్రకోటి బ్రహ్మాండ నాయకుడైన వినాయకుని జన్మ వృత్తాంతం సమీక్షను తెలుసుకుందాం! పూర్వం గజముఖుడైన అసురుడు పరమేశ్వరుని మెప్పించి కోరరాని వరముకోరి, తను అజేయుడుగా, ఎవరూ వధించరాని విధంగా! ఉండుటకై పరమశివుని తన ఉదరమందు నివశించాలని వరము పొందినాడు.

అది విన్న పార్వతీదేవి కలతచెంది శ్రీ మహావిష్ణువు ప్రార్థించగా! నందీశ్వరుని గంగిరెద్దుగా, తాను గంగిరెద్దువానిగా వేషము ధరించి గంగిరెద్దును ఆడించి గజా

సురుని మెప్పించి ఉదర కుహరమందున్న పరమశివుని కోరినాడు. అంత విష్ణు మాయను గ్రహించి, తనకు చేటుకాలము దాపురించినదని తలచి, శివుని ఉద్దేశించి, ప్రభూ! శ్రీహరి ప్రభావముచే నా జీవితము ముగియనున్నది. నా యనంతరం నా శిరస్సు త్రిలోకములు పూజించునట్లు, నా చర్మమును నిరంతరము నీవు ధరించునట్లు వరము నిమ్మని తన శరీరమును నందీశ్వరునకు వశము చేసి శివునకు ఉదర కుహరము నుండి విముక్తి కలిగించాడు.

ఆ శుభవర్తమానము తెలిసిన పార్వతి అభ్యంగన స్నానమాచరించి భర్తను స్వాగతించాలని ! తలచి నలుగుపిండితో ఒక బాలుని బొమ్మను చేసి దానికి ప్రాణ ప్రతిష్ఠచేసి స్నానవాకిట ముందు కాపలాగా ఉంచినది. అంత పరమశివుడు సంతోష ముతో పార్వతి చెంతచేరాలని వస్తున్న పరమేశ్వరుని గాంచిన ఆ బాలుడు అభ్యంతర మందిరము నందు నిలువరించగా! ఆ బాలునికి శిరచ్ఛేదము చేసినాడు. అది చూచిన మహేశ్వరి దుఃఖమును తీర్చుటకై తన వద్దనున్న ఆ గజశిరమును ఆ బాలునకు అతికించి ప్రాణ ప్రతిష్టచేసి, "ఆ గజాననునికి, తన రెండవ కొడుకైన కుమారస్వామికి మధ్య భూప్రదక్షిణ పోటీ పెట్టి త్రిలోకపూజితుడుగా గణాధిపత్యము ఆ బాలునికి కలిగించినాడు.

ముల్లోకములందు పూజలందుకుంటూ కైలాసము చేరుకునే వింత స్వరూపు డైన వినాయకుని చూచి! చంద్రుడు విరగబడి నవ్వినాడు. అంత వినాయకుడు కోపించి ఓరి "చవితి చంద్రుడా! ఈ రోజునుండి నిన్ను చూసిన వారందరు నీలాప నిందలు పాలవుదురు గాక! అనిశపించెను. అంత చంద్రుడు తన తప్పిదాన్ని మన్నించమని పరిపరివిధాల ప్రార్థించగా, "భాద్రపద శుద్ధ చవితి"నాడు నా జన్మ వృత్తాంతము నా జన్మదినమున విని నన్ను పూజించి సేవించి నాకథాక్షతలు శిరస్సున ధరించిన వారికి నీలాపనిందలు కలుగవని శాపవిమోచన అనుగ్రహించాడు.

తొలుత ఈ వినాయక చవితి వ్రత మాహాత్మ్యమును పరమశివుడు కుమార స్వామికి తెలియజేయగా! అట్టి ఈ వ్రత కథను నైమిశారణ్యమందు సూతమహర్షి శౌనకాది మునులకు చెప్పుసమయాన వనవాసము చేస్తున్న ధర్మరాజు కూడా విని ఈ వ్రతమాచరించి తిరిగి రాజ్య సంపదను పొందెను. దమయంతి యీ వ్రత మాచరించి నలమహారాజును పొందెను. శ్రీకృష్ణుడంతటివాడు పాలపాత్రయందు చవితి చంద్రుని చూచి నీలాపనిందలపాలై ! ఈ వ్రతమాచరించి, అటు శమంతక మణితోపాటుగా జాంబవతి, సత్యభామ అను ఇద్దరు కాంతామణులను పొంద గలిగినాడు.

మానవులు అట్టి ఈ వ్రతమును చేయుట వల్ల సమస్త సిరిసంపదలు పుత్రపౌత్రాభివృద్ధి పొంది సమస్త కోరికలు తీరి సుఖ సౌభాగ్యములు పొందుతారని సూత మునిశ్రేష్ఠుడు వివరించినాడు. ఇట్టి మాహాత్మ్యముగల ఈ సిద్ధి వినాయక వ్రతము మనమంతా భక్తి ప్రపత్తులతో ఆచరించి పునీతులమౌదాము.





## వామన జయంతి

ఒకానొక సమయమున యుద్ధమున దైత్యరాజు బలి, ఇంద్రుని వలన పరా జయము పొంది గురువైన శుక్రాచార్యుని శరణువేడెను. కొంతకాలము గడచిన తరువాత గురుకృప వలన బలి స్వర్గముపై అధికారము సంపాదించెను. భగవానుని మహిమ విచిత్రముగ నుండును. నిన్నటి దేవరాజు ఇంద్రుడు, నేడు బికారి అయ్యెను. ఇతడు తన తల్లి అదితిని శరణు వేడెను. ఇంద్రుని దశను గాంచిన తల్లి దుఃఖించి పయోవ్రతానుష్ఠానమును చేసెను.

వ్రత అంతిమ దినమున భగవానుడు ప్రత్యక్షమై అదితితో "దేవీ! చింతించ కుము. నేను నీకు పుత్రునిగ జన్మించి ఇంద్రునికి చిన్న తమ్మునిగ నుండి వానికి శుభము చేకూర్చెదను" అని పలికి అంతర్ధానమయ్యెను.

ఆ శుభఘడియ సమీపించెను. అదితి గర్భమున భగవానుడు వామన రూపమున జన్మించెను. భగవానుని పుత్రునిగా పొందిన అదితి సంతోషమునకు అంతులేదు. భగవానుని వామనుడగు బ్రహ్మచారి రూపమున దర్శించిన మహర్షులు, దేవతలు ఎంతో ఆనందించిరి. భగవానునకు ఉపనయన సంస్కారములు గావించిరి.



బలి చక్రవర్తి భృగుకచ్ఛమను చోట అశ్వమేధ యజ్ఞము చేయుచున్నాడని వామన భగవానుడు విని అచ్చటికి వెళ్లెను. వామన భగవానుడు నడుమునకు ఒక విధమైన రెల్లుగడ్డితో మొలత్రాడును, యజ్ఞోపవీతమును ధరించి యుండెను. శరీర ముపై మృగచర్మముండెను. శిరస్సున జడలు ధరించి యుండెను. ఇట్టి మాయా మయ బ్రహ్మచారి బ్రాహ్మణ రూపమున, బలి యజ్ఞమంటప మందు ప్రవేశించెను.

వీనిని చూచిన బలి హృదయము గద్గద మయ్యెను. వామనుని ఉత్తమ ఆసనముపై కూర్చొండబెట్టి పూజించెను. ఆ తరువాత బలి, వామనుని "ఏదైనా కోరుకొమ్మ"నెను. వామనుడు "మూడు పాదముల భూమిని" అడిగెను.

శుక్రాచార్యుడు భగవానుని లీలనుగ్రహించెను. 'దానము వద్దని' చెప్పెను. ఐననూ బలి వినలేదు. దానమొసగుటకు సంకల్పము చేయ జలపాత్రను ఎత్తెను. శుక్రాచార్యుడు తన శిష్యుని మేలుకోరి జలపాత్ర మందు ప్రవేశించి జలము వచ్చు దారిని ఆపెను. వామన భగవానుడు ఒక దర్భను తీసికొని పాత్రలో నీరు వచ్చు దారిని ఛేదించెను. దానితో శుక్రాచార్యునకు ఒక కన్ను పోయెను.

సంకల్పము పూర్తి అయిన వెంటనే వామన భగవానుడు ఒక పాదముతో పృథ్విని, రెండవ పాదముతో స్వర్గలోకమును కొలిచెను. మూడవ పాదమునకు బలి తనకు తానే సమర్పితుడయ్యెను. బలి సమర్పణ భావమునకు భగవానుడు ప్రసన్నుడై బలికి సుతలలోక రాజ్యము నిచ్చెను. ఇంద్రునకు ఇంద్రపదవి నొసగెను.

## సకల శుభములు చేకూర్చే అనంతపద్మనాభ చతుర్దశి

ప్రతీ సంవత్సరము భాద్రపద మాసమందు పూర్ణిమతో కూడియున్న చతుర్దశి నాడు ఈ "అనంత పద్మనాభవ్రతము"ను చేయుట ఎంతోమంచిది అని మనకు భవిష్య పురాణము నిర్దేశించి చెప్పుచున్నది. కావున ఈ చతుర్దశి అనంత పద్మనాభ చతుర్దశి అయినది. ఇంతకీ అసలు ఈ అనంతుడు ఎవరు? ఎందులకు ఈవ్రతమాచరించాలి? లోగడ ఈవ్రతమాచరించి సత్ఫలితములు పొందినవారు ఎవరైనా ఉన్నారా? అని వెంటనే మనకు కలిగే సందేహాలను నివృత్తిచేసుకునే ప్రయత్నం ఒక్కసారి చేద్దాం...!

పూర్వం జూదంలో ఓడిపోయి వనవాసము చేస్తూ ఎన్నో ఈతిబాధలు అనుభవిస్తూ దిక్కుతోచని స్థితిలో ఉన్న పాండవ అగ్రజుడు ధర్మరాజు శ్రీకృష్ణుని చూచి "ఓ జగద్రక్షకా! మేము అనుభవించుచున్న ఈ మనఃక్లేశములనుండి దూరమై సుఖానందములు పొందుటకు ఏదైనా మార్గము సెలవీయ"మని ప్రార్థించగా! అందులకు కృష్ణుడు భాద్రపద శుక్ల చతుర్దశినాడు అనుష్ఠించదగిన "అనంత పద్మనాభ వ్రతము అనునది ఒకటి కలదు. ఆ వ్రతము శ్రద్ధాభక్తులతో ఆచరించిన యెడల మీరు కష్టదూరులై సుఖభోగములను తిరిగి తప్పక పొందగలరు, అని కృష్ణుడు తెలిపెను. అందులకు ధర్మరాజుకు వెంటనే ముందుగా మనకు కలిగిన సందేహాలలో ....ఇంతకీ ఈ అనంతుడు ఎవరు? బ్రహ్మయా? తక్షుడా? శేషుడా? పరమాత్మయా? అని వరుసగా ప్రశ్నించసాగెను.

**"అనంత ఇత్యహం పార్థ మమ రూపం నిబోధత,**
**ఆదిత్యాదిగ్రహాత్మాసౌయః కాల ఇతి కథ్యతే**
**కాలా కాష్ఠా ముహూర్తాది దివారాత్ర శరీరవాన్,**
**పక్షమాసర్తు వర్షాదియుగకాల వ్యవస్థయా,**
**యోయం కాలో మహాన్ ఖ్యాతః సో ఽనంత ఇతికీర్త్యతే"**

ఆ అనంతుడు అంటే మరి ఎవరోకాదు... నేనే, వానిని నారూపముగానే గ్రహించుకొనుము. సకల గ్రహాత్మకుడు మరియు ఆదిత్యుడు నేనే, పక్ష, మాస, ఋతువులుగా వ్యవహరింపబడే ఆ కాలపురుషుడు నేనే, కాలమే 'అనంతుడు'. అని కృష్ణపరమాత్మ బదులుపలికినాడు. మరి మున్నెవరైనా ఈ వ్రతమాచరించినారా? సవిస్తరముగా వివరించగోరుచున్నాను, అని ధర్మరాజు కోరగా! ఈ గాథను వివరించినాడు. పూర్వం కృతయుగమందు సుమంతుడు, దీక్ష అను బ్రాహ్మణ దంపతులు కలరు. వార్కి ఈ మహావిష్ణువు అనుగ్రహముతో ఒక కుమార్తె కలుగగా ఆ బాలికకు 'శీల' యను నామకరణముచేసి అల్లారుముద్దుగా పెంచుకోసాగినారు. కొంత కాలమునకు సుమంతుని భార్య 'దీక్ష' అనారోగ్యముతో మరణించగా వేరొక స్త్రీని వివాహమాడెను.



ఇలా ఉండగా రూపలావణ్యవతియైన 'శీల'ను కౌండిన్య మహర్షి వివాహమాడ దలచి సుమంతుని అంగీకారముతో ఆమెను వివాహమాడెను. అనంతరం శీలతో కలసి ఎడ్లబండిపై తిరుగు ప్రయాణమగుచు, మార్గమధ్యమున ఒక చెట్టునీడయందు బండిని ఆపి విశ్రాంతి తీసుకోసాగెను. ఇంతలో 'శీల' ఆ సమీపనదీతీరమందు కొందరు సువాసినులు ఏదో పూజలు చేయుటగాంచి వారివద్దకు చేరి మీరు చేయుచున్న ఈ పూజలు ఏమిటి? అని ప్రశ్నించగా! వారు ఓ పుణ్యవతీ! ఇది "అనంత పద్మనాభవ్రతం" ఈ రోజు కనుక విధి విధానంగా ఆ నారాయణుని ఆరాధించి, ఆ ఆరాధనలో ఉంచిన పదునాలుగు ముళ్ళుకలిగిన పట్టుత్రాడు తోరము భర్త భార్య ఎడమచేతికి, భార్య భర్తకుడి చేతికి కట్టుకుని ధరించిన యెడల అష్టైశ్వర్యములతో సుఖభోగములొందగలరు అని ఆ వ్రతమహాత్మ్యము వివరించగా, వారు ఇచ్చిన తోరము ధరించి కౌండిన్య మహర్షి వద్దకు రాగానే, మహర్షి ఆమె చేతినిఉన్న తోరమును చూచి మిక్కిలి ఆగ్రహించి నన్ను వశీకరించు కొనుటకై ఈ తోరముకట్టు కొనియున్నావా? అని కేకలు వేయుచు ఆమెచేతిని ఉన్న తోరమును త్రెంచి నిప్పులవైపునకు విసరివేస్తూ "ఆమె ఇది అనంత పద్మనాభుని యొక్క వ్రత తోరము" అని బ్రతిమాలినా! పెడచెవిని పెట్టి విసవిస అచ్చట నుండి కదు ఆగ్రహంతో వెడలిపోయినాడు. శీల ఆ తోరము పాలలో వేసి భద్రపరచెను.

ఆ క్షణమునుండి కౌండిన్యుడు సకల సంపదలను కోల్పోయి నిర్ధనుడాయెను. తిరిగి పశ్చాత్తాప మనస్కుడై దీనికి మార్గమేమి? అని భార్యనడుగగా, మీరు ఒనర్చిన "అనంతవ్రతాక్షేపణ దుష్ఫలమే" యిది. తిరిగి వారి అనుగ్రహపాత్రులమవుతేగాని ఈ క్లేశములు మనలను వీడవు అని హితవు చెప్పెను.

అందులకు కౌండిన్యుడు అనంతుని సంతోష పెట్టుటకై అరణ్యమున కేగి తపమాచరిస్తూ, ఆ అనంత పద్మనాభునికై పశ్చాత్తప్తుడై వెదకనారంభించి, చెట్టనక పుట్టనక, వాగనక వంకనక, పశువులనక, పక్షులనక ఆ పరమాత్మజాడ తెలుపమని ప్రశ్నిస్తూ వేయికనులతో నిరీక్షిస్తున్న ఆ కౌండిన్యుపై దయార్ద్రహృదయముకిలిగిన శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమవగానే!

**సశంఖచక్రం సకిరీటకుణ్డలం సపీత వస్త్రం సరసీరు హేక్షణమ్,**
**సహారవక్షస్థలశోభి కౌస్తుభం నమామి విష్ణుం శిరసాచతుర్భుజమ్.**

అని శ్రీ మహావిష్ణువుని స్తోత్రముచేసి సాగిలపడి తనయపరాధములను మన్నింపమని వేడుకొనెను. అందులకు అనంతుడు అనుగ్రహించి, ఓ బ్రాహ్మణోత్తమా! నీవు చింతించవలదు. వెంటనే నీ గృహమునకేగి పిదప పదునాలుగు సంవత్సరములు అనంత చతుర్దశీ వ్రతమాచరింపుము. ఆ రోజు ధరించిన తోరము సకల శుభములను చేకూర్చుచూ అష్టైశ్వర్యములు ప్రసాదించును అని అనుగ్రహించెను. అట్టి అనంతపద్మానాభ చతుర్దశి వ్రతమాచరించి సర్వులమూ పునీతుల మౌదాము.

## చంద్రోదయ ఉమావ్రతం "అట్లతద్ది"

ప్రతీ సంవత్సరం ఆశ్వీయుజ బహుళ తదియనాడు అత్యంత భక్తిశ్రద్ధలతో జరుపుకునే ఈ "చంద్రోదయ ఉమావ్రతం - అట్లతద్ది" స్త్రీలకు చక్కని ఆనందాన్ని జీవితంలో చక్కని విచిత్రానుభూతులను కలిగిస్తూ ఉంటుంది. ఈ పండుగలో ఒక విశేషం ఉన్నది. కొన్ని వ్రతాలైతే వివాహితులైన స్త్రీలు మాత్రమే నిర్వహిస్తారు. కానీ, ఈ పండుగ పిన్నలు, పెద్దలు కూడా కలసి వయోభేదం లేకుండా ఆచరిస్తారు. పిల్లలతోబాటు తల్లులు కూడా 20 సం॥ వెనకకి పోయి బాల్యజీవితంలోకి వెళ్ళి ఆనందం పొందుతారు. ఇక మూడుకాళ్ల ముదుసలి అయిన బామ్మగారు కూడా! వారి ఆటపాటలనుచూచి మురిసిపోతూ...ఆమెకూడా ఒక్కసారి తన చిన్ననాటి జ్ఞాపకాలలోకి వెళ్లిపోయి ఆటలాడుకుంటున్న వారినందరని తన దగ్గరకు రప్పించుకుని అమ్మాయిలూ...చూచారా...నా చిన్నప్పుడూ! అంటూ, వారి చిన్ననాటి జ్ఞాపకాలు, అనుభవాలు, కథలు కథలుగా చెప్పుకువస్తూ! వారిచేత పులి-మేక, అష్ట-చమ్మ మున్నగు ఆటలు వారితో కలసి ఆడుకుంటూ ఉంటారు. అటువంటి వృద్ధులలో నవయవ్వనం తొణికిసలాడేది ఈ పండుగలోనే. ఇట్టి ఆటపాటలు కనువిందుచెయ్యాలి అంటే పల్లెసీమలే పట్టుకొమ్మలు.

ఈపండుగను పల్లెలలో అయితే ఊయల పండుగ అంటూ, మరికొందరు గోరింటాకు పండుగ అంటూ, ఇలా ఈ "చంద్రోదయ ఉమావ్రతం-అట్లతద్ది" పండుగను వివిధ నామాలతో పిలుచుకుంటూ ఉంటారు. స్త్రీలకు ఇటు చక్కని ఆనందాన్ని అటు సకల సౌభాగ్యాలను ఒసగే ఈ పండుగలోని మరికొన్ని విశేషాలను ఆ ముగ్గురమ్మలతల్లి, కల్పతరువు, కామధేనువు వంటి ఆ "ఉమాదేవిని" ఒక్కసారి ఇలా ప్రార్థించి మరలా ముచ్చటించుకుందాం!



శ్లో॥ ఓం హ్రీం కాలాభ్రాం భాం కటాక్షై రరికుల
భయదాం మౌళిబద్ధేందురేఖాం
శంఖచక్రం కృపాణం త్రిశిఖమపి
కరైరుద్వహంతీ త్రినేత్రామ్
సింహస్కంధాధిరూఢాం త్రిభువన మఖిలం
తేజసా పూరయంతీం
ధ్యాయేత్ దుర్గాం జయాఖ్యాం
త్రిదశపరివృతాం సేవితాం సిద్ధికామైః ॥

ఇక, ఈ పండుగ ముందు రోజు భోగి అంటారు. ఈ రోజు స్త్రీలు, పిన్నలు, పెద్దలు చేతులకు పాదాలకు గోరింటాకు పెట్టుకుని, ఎవరిచేయి బాగా పండితే వారు అంత అదృష్టవంతులై వారి అభీష్టాలు అన్ని నెరవేరుతాయని విశ్వసిస్తూ ఉంటారు. తరువాత ఒకరిచేతులు ఒకరికి చూపించుకుంటూ నాచేయి బాగా పండింది అంటే! నా చేయి బాగా పండింది అంటూ సంబరపడిపోతూ ఉంటారు. ఈ పండుగ కోసం ప్రతి ఇంటా వారి పెరటిలో ఊయల కట్టుకుంటారు.



మరుసటి రోజు ఆశ్వీయుజ బహుళ తదియనాడు (అట్లతద్ది) తెల్లవారు ఝామునే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని, "చద్దిఅన్నం గోంగూరపచ్చడి పెరుగు అన్నం" తో కడుపార భుజించి, ఇరుగు పొరుగువారి నందరిని లేపుతూ....

అట్లతద్దోయ్ ఆరట్లోయ్ ముద్దపప్పోయ్ మూడట్లోయ్....అంటూ!

పాటలు పాడుతూ ఇరుగు పొరుగువారిని లేపి వారిని తోడ్కొనివచ్చి వివిధ రీతుల ఆటలు ఆడుచూ, పాటలు పాడుచూ, ఊయల ఊగుటలో ఒకరిపై ఒకరు పోటీపడుచూ పల్లెవాసులందరికీ మరింతగా కనువిందు చేస్తారు.

ఇక ఆరోజు "చంద్రోదయము"అయ్యేవరకు భక్తి శ్రద్ధలతో ఉపవాసముండి, చంద్రోదయముకాగానే స్నానమాచరించి మడిగా అట్లు వేసుకుని నివేదనకు సిద్ధం చేసుకుంటారు. అనంతరం షోడశోపచారములతో 'ఉమాశంకరులను' పూజించి అట్లతద్ది వ్రత కథను చెప్పుకుని, ఆకథాక్షతలను శిరస్సులపై ఉంచుకుని ముత్తైదువులతో కలిసి భుజిస్తారు.

ఇలా ఆచరిస్తే, కన్నెపిల్లలకు నవయవ్వనవంతుడైన అందమైన భర్త లభిస్తాడని, వివాహితులకైతే ఆ ఉమాదేవి అనుగ్రహముతో మంచి సౌభాగ్యముకలిగి సర్వసౌఖ్యములను అనుభవిస్తూ పిల్లాపాపలతో సుఖమైన ఆనందమైన జీవితం అనుభవిస్తారని ఈ వ్రతాన్ని ఆచరిస్తారు.

ఈ వ్రతం పై కూడా, ఒక గాథ ఉన్నది. పూర్వం ఒక మహారాజుకు రూప లావణ్యవతి అయిన కూతురు ఉండేది ఆమెపేరు "కావేరి". ఆమె తల్లి వలన ఈ

వ్రతమహాత్మ్యమును తెలుసుకుని తన రాజ్యమందుగల ఆమె స్నేహితురాళ్ళు మంత్రి కూతురు, సేనాపతి కూతురు, పురోహితుని కూతురుతో కలసి "ఈ చంద్రోదయ ఉమావ్రతాన్ని" అత్యంత భక్తిశ్రద్ధలతో ఆచరించింది. కాని! తోటి మంత్రికూతురికి, సేనాపతి కూతురికి, పురోహితుని కూతురుకి వివాహ వయస్సు రాగానే నవయవ్వన వంతులైన అందమైన భర్తలతో వివాహము జరిగింది. అంత మహారాజు! అమ్మాయి స్నేహితు రాండ్రకు వివాహములు జరిగిపోవుచున్నవి అని తలచి తనకుమార్తెకు వివాహ ప్రయత్నములు చేయనారంభించగా! కురూపులు, వృద్ధులైన పెండ్లికుమారులే తారసపడసాగిరి. మహారాజు ప్రయత్నములన్నీ విఫలములగుట చూచిన రాకుమార్తె కావేరి! ఎంతో కలతచెంది ఎక్కడ ఆ వృద్ధులైనవార్కి, కురుపులైన వార్కి ఇచ్చి చివరకు తన తండ్రి వివాహము చేయునేమో అనిభయముచెంది, ఆ రాజ్యమునకు సమీప అరణ్యమునకు పోయి ఘోరమైన తపస్సు చేయసాగింది.

ఒకరోజు పార్వతీ పరమేశ్వరులు లోక సంచారముచేస్తూ ఘోరమైన తపమాచరిస్తున్న ఆ ముక్కు పచ్చలారని రాకుమార్తెపై అనుగ్రమము కలిగి ప్రత్యక్షమై ఓ కన్యాకుమారీ! ఎందులకై ఈ ఘోరమైన తపమాచరించుచున్నావు? నీకు ఏ వరం కావాలో కోరుకో! మనగా ఓ ఆది దంపతులారా! నేను నా స్నేహితురాండ్రము కలసి నా తల్లి ద్వారా తెలుసుకున్న "చంద్రోదయ ఉమావ్రతం అట్లతద్ది వ్రతాన్ని భక్తిశ్రద్ధలతో ఆచరించగా! వార్కి మంచి మంచి భర్తలు లభించుట ఏమిటి? నా తండ్రిగారు చేయు ప్రయత్నములు ఏమియు ఫలించక కురూపులు, వృద్ధులు అయిన వారు లభించుట ఏమిటి? ఇందులో నాదోష మేమిటి? అని దుఃఖించసాగెను.

ఓ సౌభాగ్యవతి! ఇందులో నీ దోషము ఏ మాత్రము లేదు. నీవు ఆ నోము నోచుసమయాన నీవు ఉపవాస దీక్షను తాళలేక సొమ్మసిల్లి పడిపోగా; విషయమంతా నీతల్లి ద్వారా నీ సోదరులు తెలుసుకుని ఒక ఇంద్రజాల విద్యను ప్రదర్శించి అద్దముగుండా నీకు చంద్రుని చూపించినారు. దానితో నీవు ఉపవాస దీక్ష విరమించి నావు. ఆ వ్రత భంగమేఇది. నీ సోదరులకు నీ పై గలవాత్సల్యముతో అలా చేసినారు. అయినా! ఇందులో నీవు దుఃఖించవలసిన పనిలేదు, రేపువచ్చే ఆశ్వీయుజ బహుళ తదియనాడు విధివిధానంగా వ్రతమాచరించు. నీ మనోభీష్టము తప్పక నెరవేరుతుంది అని "కావేరి"ని ఆశీర్వదించి అంతర్ధానమైనారు.

అలా ఆ రాకుమార్తె తిరిగి శ్రద్ధాభక్తులతో వ్రతమాచరించి మంచి అందమైనవాడు, తనమనసెరిగినవాడు, చక్కని శౌర్యపరాక్రమములు కలిగిన నవ యవ్వన రాకుమారునితో వివాహమై నిరంతరము 'ఉమాశంకరు'లను సేవిస్తూ సమస్త సుఖభోగములను అనుభవించ సాగినది.

అట్టి పుణ్య ప్రదమైన "ఈ చంద్రోదయ ఉమావ్రతం "అట్లతద్ది" భక్తిశ్రద్ధలతో ఈ వ్రతమాచరించి ఉమాశంకరుల అనుగ్రహపాత్రులౌదురుగాక.



## మహాలయ పక్షము - ప్రాశస్త్యమ్

మహాలయమనగా! మహన్-ఆత్యంతి కోలయో యత్ర=మహాలయః అని వ్యుత్పత్తి. అట్టి మహాలయము ఎందుకు ఆచరించాలి? దాని ప్రాశస్త్యము ఏమిటి? అన్న విషయాలు ముందుగా తెలుసుకుందాం!

**"ఆషాఢీ మవధిం కృత్వా పంచమంపక్ష మాశ్రితాః**
**కాంక్షంతి పితరః క్లిష్టాః అన్న మప్యన్వహం జలమ్."**

అనగా ! మన పితృదేవతలు 'ఆషాఢమాసము రెండు పక్షములు మొదలు తిరిగి భాద్రపద కృష్ణ పక్షము' వరకు గల ఐదుపక్షములు మన పితృదేవతలు ఎన్నో ఇక్కట్లు పొలగుచుందురట! అందులకుగల కారణం సూర్యుడు కన్యా తులారాసుల నుండి వృశ్చికరాశి వచ్చువరకు ప్రేతపురి శూన్యముగా నుండునని; అందువల్ల ఆ కాలమందు మన పితృదేవతలు అన్నోదకములు కాంక్షిస్తూ భూలోకమున వారివారి గృహములచుట్టు ఆత్రంగా తిరుగుచుందురు అనియు భారతము పేర్కొనుచున్నది.

అందువల్లనే మరణాంతరము నిర్వర్తించే ఈ కర్మలకు అంతటి ప్రాధాన్యత కలిగియున్నది కాబట్టి, అంత్యకాలమందు 'కర్ణుడు' కృష్ణ పరమాత్మను చివరిగా ఒక కోరిక కోరినాడట. కృష్ణా ! "నా జన్మవృత్తాంత రహస్యము దయతో ధర్మరాజుకు సవిస్తరముగా వివరించి వానిచే తనకు పిండప్రదానములు గావించమని" కోరి నాడుట! వానికోరికను పరమాత్మ అంగీకరించి ధర్మరాజుచే ఆకార్యక్రమము చేయించినాడుట! అలా ధర్మరాజు 77 వేలమందికి పిండప్రదానాదులు గావించి వార్కి సద్గతులు కల్పించినాడు. కావున ఈ శ్రాద్ధకర్మలు నిర్వర్తించుట అనునది మానవులయొక్క విధి. ఇందు ప్రతిఫలం ఆశించరాదు. నూరు యజ్ఞాలు చేయడం కన్న, మన వంశ వృక్షానికి కారకులయిన పితృదేవతల తర్పణాలే ! ఎంతో ముఖ్యమైన విగా చెప్పబడినవి. ఈ విషయమందు అలక్ష్య భావన ఎంతమాత్రము కూడదు అని దైవజ్ఞులు చెప్తారు. ఇంకా, వారు వారి ప్రవచనాలలో ఇలా చెప్తారు. విశ్వదేవతలు పదమూడు మంది అని వారు 1. క్రతు 2. దక్ష 3. సత్య 4. వసు 5. ధూళి 6. రోచన 7. పురూరవ 8. ఆర్ద్రన 9. కాల 10.కామ 11. ధనురుచి 12. రుద్ర 13. విలోచన. ఏకోదిష్ట-హేమ-పార్వణ సిద్ధాంతములలో ఏదో ఒక్కపద్ధతిలో ఈ పితృకార్యములు చేయుట ఎంతో శ్రేష్టమని చెప్తారు.

ఇక ఉత్తరాయణము దేవతల కాలము గనుక ఉత్తమ కాలమనియు, దక్షిణాయణము పితృదేవతల కాలము గనుక అశుభకాలమని మన పూర్వీకుల విశ్వాసము. మహాలయమంటే! భాద్రపద బహుళ పాడ్యమి మొదలుకొని అమావాస్య వరకు ఉన్న పదిహేను రోజులు. దీన్ని పితృపక్షంగా మహాలయంగా చెప్తారు. ఇందులో మరీ ముఖ్యమైన తిథి త్రయోదశి, ఇక్కడొక స్మృతి కారిక,

**యత్కించిన్మధునా మిశ్రం ప్రదద్యాత్తు త్రయోదశీమ్ ।**
**తదప్య క్షయమేవస్యాత్ వర్షాసుచ మఘాసుచ ॥**

అనగా వర్షఋతువునందు భాద్రపద కృష్ణత్రయోదశి మఘా నక్షత్రంతో కూడి వున్నప్పుడు దేనితో కూడిన ఏ పదార్థంతో శ్రాద్ధం చేసిన అది పితృదేవతలకు అక్షయ తృప్తిని ఇస్తుందట...! అంతటి విశిష్ఠత గాంచిన ఈ మహాలయ పక్షమందు అన్నివర్ణముల వారు వారిశక్తిని బట్టి 'చతుర్దశి' తిథిని విడువకుండా పదిహేనురోజులు ఆచరించెదరు. అలాశక్తిని లేనివారు తమపెద్దలు మరణించిన తిథినిబట్టి ఆయాతిథులలో తర్పణ శ్రాద్ధ కర్మలు ఆచరించెదరు. గతించినవారి తిథి గుర్తులేనప్పుడు "మహాలయ అమా వాస్యే" నిర్ణయింపదగినది. మరియు ఋతుదోషము వల్లగాని, కాలదోషము వల్లగాని, జాతామృతశౌతమ అస్పర్శ గలిగినప్పుడు కూడా ఈ అమావాస్యయే పితృకర్మ లన్నింటికీ ప్రామాణిక దినము.

ఈ పితృకార్య నిర్వహణలో కొందరయితే! ఆ...! మేము ఎంతో శ్రద్ధగా పితృదేవతల కర్మలు చేస్తున్న మాకు ఏ పితృదేవతలు ఏమి సహాయపడ్డారు కనుక! మా కుటుంబం అంతా ఆర్థికంగా చితికిపోయినా వారి ఆస్తులు ఏమీ రాలేదు కాని వారి పితృకర్మలు మాత్రం మాకు తప్పటంల్లేదు అని కొందరు అంటూ ఉంటే ... మరికొందరు అయితే అదేమివింతో! మనం ఇక్కడ పెట్టే శ్రాద్ధం అక్కడి పితృదేవతలకు ఎలా చేరుకుంటుంది? అని వితండవాదం చేసేవారు నేటి సమాజంలో కూడా లేకపోలేదు. పోనీ.... వారి బాటలోనే ఒకసారి ఆలోచిద్దాం..!

మనభారతీయ సంస్కృతిలో వైదికమార్గాన్ని, ఋషివాక్యాన్ని విశ్వసించే మతం మనది. అంతటి పుణ్యపురుషులైన వారు కూడా వీటిని గుడ్డిగా నమ్మమని చెప్పలేదు. అలా అని భావితరాలవార్ని తప్పుడు మార్గంవైపు నడిపించే అగత్యం వార్కిలేదు. అందువల్లనే మనపూర్వీకుల నుండి నేటివరకు "ఆర్షధర్మం" మీద విశ్వాసముంచు కున్నవారు ఎన్నడూ చెడిపోలేదు అని పెద్దలు చెప్తారు.

మరోవిషయం ఆలోచిద్దాం! ఎక్కడో సుదూర ప్రాంతమందుగల "ఢిల్లీ ఆకాశవాణి" కేంద్రంనుండి వెలువడే మాటలు, పాటలు, మన కంటికి ఏ మాత్రమూ కనిపించని రీతిలో "శబ్దగ్రాహకములైన కొన్ని అణువుల సముదాయముతో వాయు తరంగాలై మోసుకునివచ్చిన మాటలు పాటలు వినగలుగుతున్నామంటే"! ఆలాగునే మనం ఇక్కడ పెట్టి శ్రాద్ధ ద్రవ్యంలోని ఆహారసారాన్ని మన పితృదేవతలు అందుకుంటారు అని ! జ్ఞానధనులైన మనపెద్దలకు అంతటి విశ్వాసము వున్నది కాబట్టే, అట్టి సంప్రదాయాన్ని మనం కొనసాగించుట ఉత్తమ మార్గంగా గ్రహించవలెను. అంతేకాని, మనకు ఎంతో పూజనీయులైన మహర్షుల వాక్యంపైనా, పెద్దలపైనా విశ్వాసముపైన అప్రమాణబుద్ధితో చూచుటకూడా మరి దోషమేకదా...

కావున పితృకార్యములు చేయుటకు అర్హత పొందినవారు అంతా విధిగా మహాలయ పక్షాలను ఆచరించి, వారి వారి వారి వంశవృక్షమూలకారకులైన పితృదేవతల శుభాశీస్సులతోపాటుగా, ఆచంద్ర తారార్కమూ వంశాభివృద్ధితోపాటు సర్వశుభములు పొందుదురు గాక!





## దుర్గాష్టమి (దేవీ నవరాత్రులు)

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గపడకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు పెట్టాలి |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఎర్రటి పట్టు వస్త్రములు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు – పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎర్రటి వస్త్రము |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఎర్రటి రంగు |
| 9. | పూజించవలసిన ఫోటో | : దుర్గాదేవి (సింహవాహిని) |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : దుర్గాదేవి |
| 11. | పూజించవలసిన దైవము | : దుర్గాదేవి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : ఎర్రటి |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : ఎర్రటి పువ్వులు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : పోగడ పువ్వులు |
| 15. | నివేదన చేయవలసిన నైవేద్యం | : పొంగలి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : పులిహోర |
| 17. | నివేదించవలసిన పండ్లు | : దానిమ్మపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : దుర్గాదేవి అష్టోత్తరం |
| 19. | పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : దుర్గాద్వాదశత్రిశంనన్నామాలు అర్జునకృత దుర్గాస్తోత్రము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : ధర్మరాజుకృత దుర్గాస్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : దుర్గా సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : దేవీ భాగవతము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : మహిషాసుర సంహారము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : దుర్గాదేవి |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : విజయవాడ,అష్టాదశశక్తిపీఠములు |
| 26. | చేయవలసిన ధ్యానములు | : దుర్గాదేవి ధ్యానము |

| | |
|---|---|
| 27. చేయించవలసిన పూజలు | : దుర్గాదేవి అష్టోత్తర పూజ |
| 28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : కుంకుమార్చన |
| 29. ఆచరించవలసిన వ్రతము | : నవరాత్ర వ్రతము |
| 30. ఉపవాసము నియమము | : ఉన్నది |
| 31. జాగరణ నియమము | : లేదు |
| 32. సేకరించవలసిన పుస్తకములు | : రాహుకాలంలో, దుర్గాపూజ, దేవి-లీలామృతం, దేవీ స్తోత్రమాల |
| 33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : ప్రతి శుక్రవారం దుర్గాదేవి నిత్యపూజ |
| 34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : దేవిభక్తిపాటలు(మాల) పుస్తకములు |
| 35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : నవరాత్రి ఉత్సవములు |
| 36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : కోటికుంకుమార్చన |
| 37. పర్వదిన నక్షత్రము | : - |
| 38. పర్వదిన తిథి | : ఆశ్వయుజ అష్టమి |
| 39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : శుక్రవారము |
| 40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : సా॥గం॥ 6 నుండి నవరాత్రి 9గం॥ వరకు |
| 41. వెలిగించవలసిన దీపారాధన కుంది | : ప్రమిదెనందు |
| 42. వెలిగించవలసిన దీపారాధనలు | : 2 |
| 43. వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 5+4=9 |
| 44. వెలిగించవలసిన వత్తులు | : దూదితో (ఎర్రటివత్తులు) |
| 45. దీపారాధన వాడవలసిన నూనె | : ఆవునెయ్యి |
| 46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : 9 వత్తులతో |
| 47. ధరించవలసిన తోరము | : ఎర్రటి |
| 48. నుదుటన ధరించవలసినది | : కుంకుమ |
| 49. 108 మార్లు జపించవలసిన మంత్రం | : శ్రీ మాత్రేనమః |
| 50. జపమునకు వాడవలసిన మాల | : తామర మాల |
| 51. మెడలో ధరించవలసిన మాల | : తామర మాల |
| 52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : దుర్గదేవి |
| 53. చేయవలసిన అభిషేకము | : పంచామృతముతో |
| 54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : ఆగ్నేయము |





## (దేవీ నవరాత్రులు) దుర్గాష్టమి

ఆశ్వయుజమాసం వచ్చింది అంటే! ప్రజలంతా ఎంతో ఆనందాన్ని పొందుతారు. ఆ ఆనందానికి గలకారణం "అమ్మ" గుర్తుకు రావటమే! అమ్మ అంటే! మరి ఎవరోకాదు ఆజగన్మాత, ముగ్గురమ్మలతల్లి, అమ్మలగన్నఅమ్మ, ఆ నవదుర్గాస్వరూపిణి.

ఎందరో మహాయోగులు నిరూపిస్తూ వస్తున్నట్లు ఈ సృష్టి యందుగల చరాచర వస్తువులన్నిటియందు మానవాతీతమైన, అనిర్వచనీయమైన, అవ్యక్తమైన, చైతన్యవంతమైన, ఏదో తెలియని ఒక మహా అద్భుత శక్తి ఒకటి దాగిఉంది. ఈ సృష్టి యందుగల జ్యోతిర్మండలాలు, గాలి, నిప్పు, నీరు, భూమి ఇవన్నీ మానవ నిర్మితాలు మాత్రము కావు అన్నది రూఢిగా అందురూ ఆమోదించే విషయం. ఆశక్తినే మహేశ్వరీ శక్తిగాను, పరాశక్తిగాను, జగన్మాత శక్తిగాను పలురూపాల్లో పిలుస్తూ ఉపాసిస్తూ ఉంటారు. ఈ నవరాత్రుల పుణ్య దినాలలో ఏనోట విన్నా ఈ దుర్గాసప్తశతి శ్లోకం వింటూ ఉంటాము.

**శ్లో॥ సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే,**
**శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే.**

ఈశక్తే కనుక లేకుంటే! శివుడైనా ఏమి చెయ్యలేడని శివునియొక్క శక్తి రూపమే "దుర్గ" యని ఆదిశంకరాచార్యుల వారు వారి అమృతవాక్కులో పేర్కొన్నారు. ఈ దేవదేవి రాత్రిరూపం గలది అని పరమేశ్వరుడు పగలు రూపం గలవాడు అని ఈ దేవిని రాత్రి సమయాల్లో అర్చిస్తే! సర్వపాపాలు నాశనమౌతాయని సమస్త కోరికలు సిద్ధిస్తాయని మత్స్యపురాణం మనకు తెలియచెప్తోంది.

దేవతలు భండాసురుడనే రాక్షసుని బారినుండి రక్షించుటకుకొనుటకు ! ఆ ఆదిపరాశక్తి తప్ప వేరేమార్గములేదని తలచి ఆ మహాశక్తి కోసం ఒక మహాయజ్ఞాన్ని నిర్వహించి ఆ యజ్ఞగుండమందు వారి వారి శరీర భాగాలను ఖండించుకుని ఆహుతి చెయ్యగా! ఆ జగన్మాత సంతసించి కోటి సూర్య కాంతులతో ప్రత్యక్షమయి వారికి అభయమిచ్చి భండాసురుని సంహరించి వారి అభీష్టము నెరవేర్చింది.

ఆ దేవి పాడ్యమి మొదలు నవమి వరకు ఒక్కోరోజు ఒక్కో రాక్షసుని వధించసాగింది. ఆ ఆది శక్తి నుండి ప్రకటితమైన వివిధ శక్తులు నవదుర్గలుగా 1. శైలపుత్రి 2. బ్రహ్మచారిణి 3. చంద్రఘంట 4. కూష్మాండ 5. స్కందమాత 6. కాత్యాయనీ 7. కాళరాత్రి 8. మహాగౌరి 9. సిద్ధిధాత్రి అను రూపాలతో ఆ దేవి ఆరాధనలు అందుకోసాగింది.

తొలుత ఈ దేవదేవి "శ్రీ కృష్ణ పరమాత్మ" చే గోకులం, బృందావనంలలో పూజలందుకుంది. "బ్రహ్మ" కైటభుల బారి నుండి రక్షణకై ఈమెను స్తుతించి విముక్తి పొందినాడు. "పరమేశ్వరుడు" త్రిపురాసుర సంహార సమయమందు ఈ జగన్మాతను ఆరాధించి విజయం పొందినాడు. "దేవేంద్రుడు" దూర్వాసుని శాపంవల్ల సంపదలన్నీ సముద్రములో కలసిపోగా ఈ పరాశక్తిని సేవించి తిరిగి సంపదల్ని పొందకలిగినాడు.

ఇలా మహామునులు, దేవతలు, సిద్ధులు, మనువు వల్ల ఏర్పడిన ఈ మానవులు ఎంతగానో ఆరాధించి ఆ దేవీ కటాక్ష పాత్రులవుతున్నారు.



ఆశ్వీయుజ మాసంలో శుక్లపక్షంలో పాడ్యమి, హస్తా నక్షత్రముతో కూడియున్న శుభదినాన ఈ దేవీపూజ ప్రారంభించుటకు చాలా మంచిదని మార్కండేయ పురాణం చెప్తోంది. అందువల్ల ఆ రోజునుండి ఈ నవరాత్రులు ప్రారంభిస్తారు. అందు మొదటి మూడు రోజులు దుర్గారూపాన్ని ఆరాధించి అరిషడ్వర్గాలను, తదుపరి మూడు రోజులు లక్ష్మీరూపాన్ని ఆరాధించి సిరిసంపదలను, చివరి మూడు రోజులలో సరస్వతి రూపాన్ని ఆరాధనతో జ్ఞానాన్ని పొందాలి అని పెద్దలు చెప్తారు.

ఈ నవరాత్రి ఉత్సవములలో దేవి నవాంశల పూజలు నిర్వహిస్తూ ఉంటారు. రెండు సంవత్సరాల బాలిక నుండి పది సంవత్సరాల బాలిక వరకు అనేక రూపాల్లో వారిని షోడశోపచారాలతో పూజిస్తారు. ఈ కుమారి పూజలోని ఔచిత్యాన్ని ఎరిగిన అగస్త్యుని భార్య లోపాముద్ర ఈ పూజను చేసిందట! ఈ దేవి యొక్క అష్టాదశ (18) శక్తిపీఠాలు దేశమంతటా ఉన్నాయి. ఇందు దసరా ఉత్సవాలు అత్యంత వైభవంగా నిర్వహిస్తూ ఉంటారు. ఇక దేవీ ఉపాసకులైతే ఈ నవరాత్రులు అంటే, ఎంతో ప్రీతికరమైనవిగా భావిస్తారు.



ఇలా అందరూ నవరాత్రులు జరుపుకుని ఒక విజయదశమిరోజు సాయంత్రం నక్షత్ర దర్శన విజయ సమయాన శమీవృక్షం (జమ్మిచెట్టు) వద్దగల అపరాజితాదేవిని పూజించి ఈ శ్లోకంతో !

**శ్లో॥ శమీ శమయతే పాపం శమీశత్రువినాశినీ ।**
**అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ ॥**

అను శ్లోకమును స్మరిస్తూ ప్రదక్షిణ చేసి ఆ శ్లోకం వ్రాసుకున్న చీటీలు ఆ చెట్టు కొమ్మలకు తగిలిస్తారు. ఇలా చేయుటవల్ల అమ్మవారి కృపతో పాటుగా శనిదోష నివారణ కూడా పొందుతారని ప్రతీతి. ఇలా ఈ జగన్మాత మానవులను మానవులుగా తీర్చిదిద్ది మ=మాయ, న=లేకుండా, వ=వర్తింప చేసి తల్లిగా లాలించి, తండ్రిగా పోషించి, గురువుగా ప్రపంచ విలువలను చాటి చెప్పే శక్తి ఆ జగన్మాతకే సాధ్యం.

శ్రీరామచంద్రుడు విజయదశమి, విజయ కాలమందు ఈ శమీపూజను గావించి లంకపై జైత్రయాత్ర ఆరంభించుటవల్ల ఆ శమీవృక్షము, "రామస్య ప్రియదర్శిని" అయినది అని అంటారు. అందువలన భారతీయులంతా దీనిని విజయ ముహూర్తంగా పరిగణిస్తారు.

ఇలా అసాధ్యాలను సుసాధ్యాలుగా చేయాలన్నా? మనకు ఏర్పడిన సర్వ దుఃఖాలు ఉపసమనం పొందాలన్నా? దారిద్ర్యం తొలగి ఆయురారోగ్య ఐశ్వర్యములతో ఇహలోక పరలోక సుఖాలను పొందుటకై ఈదేవి నవరాత్రుల యందు ఆ దేవదేవికి పూజలతోపాటు శ్రీలలితా సహస్రనామ పారాయణలు నిత్యమూ గావించి ఆ జగన్మాత కృపాకటాక్ష వీక్షణలు మనమంతా పొందుదాము.





## మహర్నవమి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసిన అలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఎర్రటి పట్టుబట్టలు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎర్రటి వస్త్రము |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఎర్రటి రంగు |
| 9. | పూజించవలసిన ఫోటో | : మహిషాసుర మర్ధినీ |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : దుర్గాదేవి |
| 11. | పూజించవలసిన దైవము | : దుర్గాదేవి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : ఎర్రటి |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : ఎర్రటి పువ్వులు, జమ్మిపూలు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : కనకాంబరములు |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : పొంగలి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : పులిహోర |
| 17. | నివేదించవలసిన పండ్లు | : అరటి పండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : మహిషాసు మర్ధినీ |
| 19. | పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : మహిషాసుర మర్ధినీ |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : కకారకాళికాదేవి అష్టోత్తరము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : మహిషాసుర మర్ధనీ |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : దేవీ భాగవతము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : మహిషాసుర సంహారము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : దుర్గాదేవి |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : పిఠాపురం |
| 26. | చేయవలసిన ధ్యానములు | : మహిషాసుర మర్ధినీ ధ్యానము |

27. చేయించవలసిన పూజలు : మహిషాసుర మర్ధిని అష్టోత్తర పూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : లలితాసహస్రనామము కుంకుమార్చన
29. ఆచరించవలసిన వ్రతము : నవరాత్ర వ్రతము
30. ఉపవాసము నియమము : ఉన్నది
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : శ్రీదేవీ లీలామృతం
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు: మహిషాసుర మర్ధినీ నిత్యపూజ
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి: దేవీభక్తిమాల
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : శరన్నవరాత్రి ఉత్సవములు
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : కోటికుంకుమార్చన
37. పర్వదిన నక్షత్రము : –
38. పర్వదిన తిథి : నవమి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శుక్రవారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : సా॥గం॥ 6 నుండి(నవరాత్రి) 9 గం॥ వరకు
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : 3 ప్రమిదెలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : 5+4 = 9
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 9 ఎర్రటివత్తులు
44. వెలిగించవలసిన వత్తులు : 9 వత్తులు
45. దీపారాధనకు వాడవలసిన నూనె : నువ్వులనూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : 9 వత్తులతో
47. ధరించవలసిన తోరము : ఎర్రటి
48. నుదుటన ధరించవలసినది : కుంకుమ
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : శ్రీ మాత్రేనమః
50. జపమునకు వాడవలసిన మాల : తామర మాల
51. మెడలో ధరించవలసిన మాల : తామర మాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ: దుర్గదేవి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : ఆగ్నేయము







## మహర్నవమి మాహాత్మ్యం

మన పండుగలు, నోములు ఒక సాంఘిక ప్రయోజనాన్ని ఆశించి నిర్ణయింప బడ్డవే. అదీకాక ఈ పండుగలలో కొన్నింటిని ఒక లబ్ధికోసం ఆధునికులు ఉపయోగించారు. వినాయకచవితిని తిలక్ మహాశయుడు ప్రజలను స్వాతంత్రోన్ముఖు ల్నిగా చేయడానికి ఉపయోగించాడు.

ఆ తరువాత "విజయదశమి" తరతమ భేదాలు మరచి అందరూ సమాన మేనన్న సాంఘిక ప్రయోజనాన్ని ప్రచారం చేయడానికి ఉపయోగిస్తున్నారు. ఈ విధమైన లక్ష్యాన్ని సాధించటంకోసం విజయదశమి పండుగ చేసుకోవటం అనాదిగా వస్తున్న ఆచారం. ఇప్పుడు రాజకీయ ప్రయోజనం లేకపోయినప్పటికీ సామూహిక పూజావిధానం ఒక సంప్రదాయంగా ఈనాటికీ అమలులో ఉంది.

అశ్వనీ నక్షత్రంతో కూడిన పౌర్ణమికల మాసం ఆశ్వీయుజమాసం. శరద్రుతువు ఈ నెలతో ప్రారంభం అవుతుంది. ఆశ్వయుజశుద్ధ పాడ్యమి మొదలు దశమి వరకు ఈ దసరా ఉత్సవాలు జరుగుతాయి. ఈ ఉత్సవాలు దేశమంతటా భిన్నభిన్న పద్ధతుల్లో జరుగుతాయి. తొమ్మిదిరోజులు దేవిని పూజిస్తారు. అందువల్ల ఇది దేవీనవరాత్రులుగా వ్యవహారంలోకి వచ్చింది. అలాగే శరద్రుతువులో జరుపుకుంటారు గనుక శరన్నవ రాత్రులని కూడా అంటారు. ఈ పండుగలలో రామభక్తిభావం ఉత్తుంగతరంగంగా దేశాన్నంతటిని ముంచెత్తుతుంది. ఉత్తరభారతంలో పల్లెలు, పట్టణాలలో "రామలీల"

ఉత్సవాలు నెలరోజులు ముందుగానే ప్రారంభం అవుతాయి. చివరిరోజైన దశమి (విజయదశమి) నాడు "రావణవధ" మహాకోలాహలంగా జరుగుతుంది. అంటే చెడును జయించి మంచికి పట్టంకట్టటమన్నమాట. ఆ విధంగా విజయాన్ని చేకూరుస్తుంది కనుక దీనిని విజయదశమిగా వ్యవహరిస్తారు. అదీకాక జ్యోతిషశాస్త్ర ప్రకారం కూడా ఈ దశమిని విజయయాత్రకు అంటే సాఫల్యతకు ముహూర్తంగా నిర్ణయిస్తారు. కొన్ని ప్రాంతాలలో విజయదశమి "అపరాజితాదశమి" అనికూడా వ్యవహరిస్తారు. కారణం ఈ రోజున ప్రారంభించిన పనులు ఎప్పుడూ విజయవంతం కావటమే. లౌకికమైన పూజలతో ఈ విజయదశమికి శాస్త్రీయవిధి కూడా వుంది. ఈ రోజున శమీవృక్ష పూజచేస్తాం. అజ్ఞాతవాసారంభంలో అర్జునుని గాండీవంతో పాటు పాండవుల ఆయుధాలన్నీ ఈ శమీవృక్షంలోనే దాచుటమే! అందుకు కారణం. రామచంద్రుడు కూడా తాను విజయ యాత్రకు బయలుదేరేముందు శమీవృక్షపూజ చేశాడు అని పురాణాలు చెప్తున్నాయి.

**శమీ శమయతేపాపం శమీ లోహిత కంటకా ।**
**ధారిణనర్జునబాణానాం రామస్య ప్రియవాదినీ ॥**
**కరిష్యమాణ యాత్రాయాం యథాకాలం సుఖంమమ ।**
**తత్రనిర్విఘ్న కర్త్రీత్వం భవశ్రీ రాజపూజితే ॥**

ఈ మంత్రాన్ని జపిస్తూ శమీపూజ చేస్తాం. ఆనాడు "జమ్మి" ఆకును "బంగారం"లా! భావించి ఒకరికొకరు శుభాకాంక్షలు చెప్పుకుంటూ ఇచ్చుకుంటారు.

ఆశ్వయుజ మాసంలో శుక్లపక్ష దశమి తిథిరోజున సంధ్యాసమయంలో నక్షత్రాలు ఆకాశంలో కనబడినప్పుడు సరిగ్గా ఆ సమయంలో "విజయ" అనే ముహూర్తం ప్రారంభం అవుతుందని జ్యోతిష్కులు చెప్తారు. ఈ ముహూర్తంలో మొదలుపెట్టిన ప్రతిపని విజయవంతం అవుతంది.

**ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయే ।**
**సకాలో విజయోజ్ఞేయః సర్వకార్యార్థసిద్ధయే ॥**

ఈ విషయాన్ని శంకరుడు పార్వతికి చెప్పినట్లు మన గ్రంథాలు తెలియ జేస్తున్నాయి. మూలానక్షత్రం సప్తమినాడు సరస్వతిపూజ, అష్టమినాడు దుర్గాదేవిపూజ (దుర్గాష్టమి), నవమినాడు ఆయుధపూజ (పరిశ్రమలలో యంత్రాలకు పూజలుచేసి బలులు ఇస్తారు), దశమినాడు విజయదశమి జరుపుకుంటూ శమీపూజ చేస్తారు, పలుప్రాంతాలలో దశావతారాలతో పూజలు చేస్తారు.

**గర్జంతి శైలశిఖరేషు విలంబి బింబా మేఘావియుక్త వనితా హృదయానుకారాః**
**ఏషాం రవేణ సహసోత్పతి తైర్మయూరైః ఖలవీజ్యతే మణిమయైరివ తాలవృంతైః**





అని ప్రథమావతారంతో ప్రారంభం అవుతుంది, దశావతారాల అలంకారం. దీనికి మన తెలుగునాట మరో విశిష్టమైన ప్రయోజనంకూడా ఉంది. పాఠశాల ఉపాధ్యాయులు పిల్లలను తీసుకొని వారి వారి ఇండ్లకు వెడతారు. అక్కడ పిల్లలకు పప్పు బెల్లాలు పంచిపెడతారు. ఉపాధ్యాయులకు దక్షిణాదులిస్తారు. ఇందువల్ల పల్లెల్లో కలుపుకోరుతనము పెరుగుతుంది. ఒకరికొకరు పెద్దలు పరిచయం చేసుకుంటారు. ఇది ఒకనాటి సంప్రదాయం.

అయ్యవారికి చాలు అయిదు వరహాలు పిల్లలకు చాలు పప్పుబెల్లాలు అని పిల్లలు పాటలు పాడుకుంటూ ఇంటింటికీ తిరుగుతారు. అయ్యవార్లు పిల్లలచేత "మహర్నవమిగడలు" అని కట్టిస్తారు. అందులో ఏడుకులాలదారాలను ఒకదానిపక్కన ఒకటిగా గాలిపటాల ఆకారంలో కట్టి ఇంటింటికి తిరుగుతారు. "కులము" అంటే రంగు అనిఅర్థము. దీనివల్ల పల్లెల్లో "కలర్‌బ్రైన్" ఏర్పడుతుంది. ఏ రంగు పక్కన ఏ రంగు బాగుంటుందో అన్నది విశదంగా తెలుస్తుంది. ఈ సందర్భముగా పోతనామాత్యుడు రచించిన నారాయణ శతకంలోని "ధరసింహాసనమై" అన్న పద్యాన్ని పిల్లలచేత కంఠస్థం చేయించి, చదివిస్తూ తిరుగుతారు. ఈ పద్యం మన కళ్లముందు ఓ భూగోళాన్ని చూపిస్తుంది.

ఈ ఉత్సవాలతోపాటు దేవీ నవరాత్రిపూజలు (వ్రతాలు) జరుగుతాయి. రామాయణ కాలం నాటికే శ్రీదేవీ నవరాత్రిపూజలు జరుపుకోవడం ఆచారంగా ఉండి రావణుడు సీతా మహాసాధ్విని అపహరించుకొని పోయినప్పుడు శ్రీరాముడు దుఃఖసాగరంలో మునిగిపోయాడు. అప్పుడు శ్రీదేవీ నవరాత్రి వ్రతాన్ని ఆచరించ వలసిందిగా నారదమహర్షి శ్రీరామచంద్రునికి ఉపదేశించాడు (శ్రీదేవీ భాగవతం–3స్కం) వ్యాసభగవానుడు.

"....నవరాత్రి వ్రతం శుభం/శరత్కాలే విశేషణాకర్తవ్యం విధిపూర్వకం..." అని కాలప్రాశస్త్యాన్ని చెప్పాడు. ఈ వ్రతాన్ని తొమ్మిదిరోజులు "దేవీనవరాత్రి వ్రతంగా" ఆచరించి విజయదశమిరోజున వ్రతసమాప్తి చేస్తారు. ఈ విధంగా దసరాఉత్సవాలు సాంఘిక ప్రయోజనాలను, కాలనియమాలను తెలియజేస్తాయి.

## విజయదశమి

1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు.
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : ఎర్రటి పట్టుబట్టలు
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : ఎర్రటి వస్త్రము
8. కలశముపై వస్త్రము రంగు : ఎర్రటి రంగు
9. పూజించవలసిన ఫోటో : రాజరాజేశ్వరి
10. పూజించవలసిన ప్రతిమ : దుర్గాదేవి
11. పూజించవలసిన దైవము : దుర్గాదేవి
12. తయారు చేయవలసిన అక్షతలు : ఎర్రటి
13. పూజకు కావలసిన పువ్వులు : ఎర్రటి పువ్వులు
14. అలంకరణకు వాడవలసినపూలు : కనకాంబరములు, నల్ల కలువపూలు
15. నివేదన చేయవలసిననైవేద్యం : పొంగలి
16. సమర్పించవలసిన పిండివంటలు : పులిహోర
17. నివేదించవలసిన పండ్లు : అరటి పండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : రాజరాజేశ్వరీ
19. పారాయణ చేయవలసిని స్తోత్రాలు : రాజరాజేశ్వరీ
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : రాజరాజేశ్వరీ అష్టకం
21. పారాయణచేయవలసిన సహస్రాలు : రాజరాజేశ్వరీ
22. పారాయణ చేయవలసినగ్రంథం : దేవీ భాగవతము
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : మహిషాసుర సంహారము
24. దర్శించవలసిన దేవాలయాలు : దుర్గాదేవి
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : శ్రీశైలం
26. చేయవలసిన ధ్యానములు : రాజరాజేశ్వరీ ధ్యానము





27. చేయించవలసిన పూజలు : రాజరాజేశ్వరీ అష్టోత్తరపూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : లలితాసహస్రనామము
29. ఆచరించవలసిన వ్రతము : నవరాత్ర వ్రతము
30. ఉపవాసము నియమము : ఉన్నది
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : శ్రీదేవీ లీలామృతం
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : రాజరాజేశ్వరీ నిత్యపూజ
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : దేవిభక్తిమాల
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : నవరాత్రి ఉత్సవములు
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : కోటికుంకుమార్చన
37. పర్వదిన నక్షత్రము : –
38. పర్వదిన తిథి : దశమి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శుక్రవారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : సా॥గం॥6నుండి (నవరాత్రి) 9గం॥ వరకు
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : 3 ప్రమిదెలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : 5+4=9
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 9 వత్తులు
44. వెలిగించవలసిన వత్తులు : 9 ఎర్రటి వత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : నువ్వుల నూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : 9 వత్తులు
47. ధరించవలసిన తోరము : ఎర్రటి
48. నుదుటన ధరించవలసినది : కుంకుమ
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : శ్రీ మాత్రేనమః
50. జపమునకు వాడవలసిన మాల : తామర మాల
51. మెడలో ధరించవలసిన మాల : తామర మాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : దుర్గదేవి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : ఆగ్నేయము

## దసరా వైభవం

దసరా అంటే దస్ + హరా అని; అంటే శ్రీరామచంద్రమూర్తి సీతాపహరణ గావించిన రావణాసురుని పదితలలు నరకి సంహరించిన సందర్భంగా జరుపుకునే విజయోత్సవంగా కూడా దీనిని వ్యవహరిస్తూ ఉంటారు. సరిగా వానిని ఆశ్వీయుజమాసం నవమి తిథినాడు సంహరించినాడు. అందువల్ల దీనిని "దసరా వైభవం"గా దశమినాడు జరుపుతూ ఉంటారు.

ఇక దేవినవరాత్ర పూజలు చేయుట, అనునది అనాదికాలంగా వస్తున్న శాస్త్రవిధి. "అశ్వనీ" నక్షత్రంలో కలసివచ్చిన పూర్ణిమమాసమే "ఆశ్వీయుజమాసం" అవుతుంది. ఈ మాసమందు 'దేవీనవరాత్రులు' శరన్నవరాత్రులని పిలుస్తూ శుద్ధపాఢ్యమి తిథితో ప్రారంభించి తొమ్మిది రోజులు ఈ నవరాత్రులు వైభవంగా చేస్తారు.

**ప్రథమాశైలపుత్రి, ద్వితీయా బ్రహ్మచారిణీ**
**తృతీయాచంద్రఘంటీతి, కూష్మాండేతి చతుర్థికీ**
**పంచమా స్కందమాతేతి షష్టాకాత్యాయనేతి చ**
**సప్తమా కాళరాత్రిచ అష్టమాచాతి భైరవీ**
**నవమా సర్వసిద్ధిశ్చాత్ నవదుర్గా ప్రకీర్తితా.**

మూర్తులు వేరైనా మూలపుటమ్మ ఒక్కరే! అలంకారాలు వేరైనా అమ్మ దయ అందిరపట్ల ఒక్కటే! హిందువులు అత్యంత ప్రీతిపాత్రంగా ఎంతో వైభవంగా నిర్వహించే పండుగలలో ఈ "దసరావైభవం" ఒకటి. ఇది పదిరోజులు పండుగ అయినప్పటికి దేవిని రోజుకో అవతారంగా అలంకరించి అమ్మవార్కి అర్చనలుచేసి, నవవిధ పిండివంటలతో నివేదనలుచేస్తూ విశేష పూజలతో పాటు శ్రీలలితా సహస్రనామ పారాయణ నిత్యము గావిస్తూ "శరన్నవరాత్రులు" గా వ్యవహరిస్తారు. శ్రవణానక్షత్రయుక్త 'దశమి' తిథిన విజయదశమితో ఈ దసరావైభవాలు పూర్తిచేస్తారు.





దసరాకు మరోపేరు "దశహరా" అంటే! పది పాపాలను హరించేది అని అర్థం చెప్తారు దైవజ్ఞులు.

ఈ దేవి నవరాత్ర్యుత్సవాలు జరపడంల్లోకూడా మంచి అంతరార్థం ఉన్నదట! శరదృతువుకు ముందు వర్షరుతువు ఉంటుంది. బహుళంగా కురిసిన వానలవల్ల, చీమలు, దోమలు, కీటకాలు పెరుగుతాయి. ఈ ఋతువులో ప్రజలు రోగబాధలతో మరింతగా బాధపడుతూ ఉంటారు. వీటికి "యమదంష్ట్రము"లనిపేరు. దేవి మహిషాదిజంతువులను జయించడంల్లో అంతరార్థమిదే అని దేవీభాగవతం చెప్తోంది. కావున ఆరోగ్య ప్రాప్తికి ఈ రెండు ఋతువులలోను నవరాత్ర్యుత్సవం జరుపవలెనని పేర్కొంది.

ఈ సందర్భంగా ఒక్కసారి ఆ దేవీ ఆవిర్భావ విశేషంగూర్చి కొద్దిగా సమీక్షించుకుందాం! పూర్వం మధుకైటభులనే రాక్షసులను వధించడానికి బ్రహ్మదేవుని కోరికపై మహామాయ విష్ణువును నిద్రలేపింది. యోగనిద్రనుంచి మేల్కొన్న విష్ణువు, మధుకైటభులతో పదివేల సంవత్సరాలు పోరాడినా; వారిని జయించలేక పోతాడు. ఆ పరిస్థితిని గమనిస్తున్న మహామాయ ఆ మధుకైటభులను మోహపూరితుల్ని చేస్తుంది. దానితో వారు అంతకాలంగా తమతో పోరాడినందులకు శ్రీ మహావిష్ణువును మెచ్చుకుని నీకు ఏ వరంకావాలి అని ప్రశ్నిస్తారు? దానితో శ్రీహరి వారి మరణాన్ని వరంగా ఈయమని కోరుకుంటాడు. దానితోవారు తమకు ఇకమరణము తప్పదని నిర్ణయించుకుని తమను నీరులేనిచోట చంపమనికోరతారు. అంత శ్రీహరి వారిని పైకెత్తి భూఅంతరాళంలో సంహరించు సమయాన; మహామాయ పదితలలతో, పదికాళ్ళతో, నల్లనిరూపుతో "మహకాళి" గా ఆవిర్భవించి శ్రీమహావిష్ణువునకు సహాయపడుతుంది.

అనంతరం 'సింహవాహినిగా' మహిషాసురుని మహామాయ మహాసరస్వతి రూపిణిగా శుంభ,నిశుంభులను వధించింది. చండ, ముండలను సంహరించి చాముండి అని పేరు తెచ్చుకుంది. కంస సంహారమునకు సహాయపడుటకై "నంద" అను పేరుతో నందుని ఇంట ఆవిర్భవించి శ్రీకృష్ణునికి సహాయపడింది. తరువాత ఐదవ అవతారంలో ఒక రాక్షసంహారసమయాల్లో ఆమె దంతాలు రక్తసిక్తమవడంవల్ల "రక్తదంతి" అయినది. లోకాలు అన్ని కరువు కాటకములతో ప్రజలు పడుతున్న బాధలను చూడలేక "శాకంబరి"గా వార్కి శాకాలు, ఫలాలను ఇచ్చి ఆ తల్లి బిడ్డలను అక్కున చేర్చుకుంది. దుర్గుడను అను రాక్షసుని సంహరించి "దుర్గ"అను పేరుగాంచింది."మాతంగి" గా రూపుదాల్చి అంటరానితనాన్ని, తొమ్మిదవ అవతారంలో అరుణుడు అను రాక్షసుని తుమ్మెదల సాయంతో హతమార్చి "భ్రామరి" అను పేరు తెచ్చుకుంది. అందువల్ల ఈ దేవిని "నవవిధ రూపాలతో" అర్చించాలి అని చెప్పబడినది. ఆ విధంగా; క్రూరులైన రాక్షసులను సంహరించి ఇటు యోగులకు అటుదేవతలకు ఆనందాన్ని అందించింది.

ఆ సందర్భములో ఈ దేవి నవదుర్గలుగా అవతరించింది అనగా 1. శైలపుత్రి 2. బ్రహ్మచారిణీ 3. చండ (ఛన్న) ఘంటా 4. కూష్మాండా 5. స్కందమాత 6.కాత్యాయని 7. కాళరాత్రి 8. మహాగౌరీ 9. సిద్ధిదాత్రి అనుపేర్లతో ఆవిర్భవించినది. ఈ నవదుర్గలను దేవతలు, భక్తులు స్తోత్రము చేసినారు.

ఈ పరాశక్తి ప్రకృతి. ఈమె సనాతన పురుషునితో కలసి విశ్వసృష్టి చేస్తుంది. ఈమె సకలదేవతా స్వరూపిణి, సృష్టికారిణి. అందుచేతనే ఈమె మహామాయ. జగదుత్పత్తి; స్థితిలయకారిణి. శత్రుభయకారిణి ముక్తిదాయని అయినది.

ఇక దేవీ ఉపాసకులైతే ఈ నవరాత్రులు అంటే ఎంతో ప్రీతిపాత్రమైనవిగా భావిస్తారు. "కాత్యాయనాయ విద్మహే, కన్యకుమారి ధీమహి తన్నో దుర్గి ప్రచోదయాత్" ఆశ్వీయుజమాసంలో పాడ్యమినాడు కలశస్థాపనచేసి దీక్షవహించి కలశంలోకి దేవి మూర్తిని ఆవాహనం చేస్తారు. నవమివరకు అలాపూజిస్తే దీక్ష సమాప్తమవుతుంది. దశమినాటి ఉదయాన దేవీ ప్రస్థానం చేస్తారు.

ఈ నవరాత్రి ఉత్సవములలో దేవి నవాంశల పూజలు నిర్వహిస్తూంటారు. రెండు సంవత్సరాల బాలికనుండి పది సంవత్సరాల బాలిక వరకు అనేక రూపాల్లో వారిని షోడశోపచారాలతో పూజిస్తారు. ఈకుమారి పూజలోని ఔచిత్యాన్ని ఎరిగిన అగస్త్యుని భార్య లోపాముద్ర ఈ పూజచేసిందట! ఈ దేవియొక్క అష్టాదశ (18)శక్తి పీఠాలు దేశము నలుమూలలా ఉన్నాయి. ఇందు భక్తులు ఎంతో భక్తిప్రపత్తులతో "దసరావైభవాలు" నిర్వహిస్తూ ఉంటారు. ఈ దేవీ పూజలందు అత్యంత విశేషమైనవి దుర్గాష్టమి,మహర్నవమి, విజయదశమి అని చెప్పబడినది.

**దుర్గాష్టమి :–** దుర్గాదేవి "లోహుడు" అనే రాక్షసునివధిస్తే లోహంపుట్టిందని అందు వల్ల లోహ పరికరాలను పూజించే ఆనవాయతి వచ్చింది అని చెప్తారు. ఇక దుర్గ అంటే? దుర్గమైనది దుర్గ. దుర్గతులను తొలగించేది దుర్గ. ఆమె దుర్గేయురాలు కనుక దుర్గ అయింది. దుర్గలోని 'దుర్'అంటే దుఃఖం, దుర్భిక్షం, దుర్వ్యసనం, దారిద్ర్యం మొదలైనవి. ఇక 'గ'అంటే నశింపచేసేది అని దైవజ్ఞులు వివరణ చెప్తూ ఉంటారు. ఈమె ఆరాధనవల్ల దుష్టశక్తులు, భూత, ప్రేత, పిశాచ, రక్కసుల బాధలు దరిచేరవు చేరలేవు. అందువల్లనే ఈ దేవిని మొదటి మూడు రోజులు దుర్గారూపాన్ని ఆరాధించి అరిషడ్వార్గలను; తదుపరి మూడురోజులు లక్ష్మీరూపాన్ని ఆరాధించి సిరిసంపదలను; చివరి మూడురోజులు సరస్వతి రూపాన్ని ఆరాధించి జ్ఞానాన్ని ఆ క్రమంలో ఈ నవరాత్రులలో ఆ తల్లిని ఆరాధించి తగు ఫలితాలు పొందవచ్చునని పెద్దలు చెప్తూఉంటారు. ఈ రోజు దుర్గాపూజను దుర్గాసహస్రనామ పారాయణము 'దుం'అను బీజాక్షరముతో కలిపి దుర్గాదేవిని పూజిస్తారు. ఈ దుర్గాష్టమి మంగళ వారంతో కలిసిన మరింత శ్రేష్ఠము అని చెప్తూ ఉంటారు.





**మహార్ణవమి :–** మానవకోటిని పునీతులను చేయుటకు భగీరదుడు గంగను భువినుండి దివికి తెచ్చినది ఈనాడే. ఇక ఈ నవరాత్ర దీక్షలో అతి ముఖ్యమైనదిగా ఈ నవమి తిధిని గూర్చి చెప్పుటలో ఆంతర్యం ఈ తొమ్మిదవ రోజు మంత్ర సిద్ధి కలుగను కావున 'సిద్ధదా'అని నవమికి పేరు. దేవి ఉపాసకులు అంతవరకు వారు చేసిన జపసంఖ్య ఆధారంగా హోమాలు చేస్తూ ఉంటారు. అలా వ్రతసమాప్తి గావించిన వార్కి సర్వసిద్ధుల నిచ్చి సర్వాభీష్ట సంసిద్ధిని కలుగజేయును. ఇక క్షత్రియులు, కార్మికులు, వాహన యజమానులు, ఇతర కుల వృత్తులువారు అందరూ ఆయుధపూజ నిర్వ హిస్తారు.

**విజయదశమి :–** దేవదానవులు పాల సముద్రమును మధించినప్పుడు అమృతం జనించిన శుభముహూర్త దినం ఈ విజయదశమి రోజునే అని తెలియజేయబడింది. "శ్రవణా"నక్షత్రంతో కలసిన ఆశ్వీయుజ దశమికి "విజయా" అనే సంకేతము ఉన్నది. అందుకనే దీనికి "విజయదశమి" అను పేరు వచ్చినది. ఏ పనినైనా తిథి, వారము, వర్జ్యము, తారాబలము, గ్రహబలము, ముహూర్తము మున్నగునవి విచారించకుండా; విజయదశమినాడు చేపట్టిన ఏకార్యము అయినా విజయముతథ్యము అని 'చతుర్వర్గ చింతామణి' అనే ఉద్గ్రంథము ఆశ్వీయుజ శుక్ల దశమినాటి నక్షత్రోదయ వేళనే 'విజయం' అని తెలిపియున్నది. ఆ పవిత్ర సమయము సకల వాంఛితార్థ సాధకమైనదని గురువాక్యము.



తెలంగాణాలో ఈ పండుగ దినాలలో "బతుకమ్మ పండుగ" అత్యంత వైభవంగా నిర్వహిస్తారు. దీనిని వారు పువ్వుల పండుగగా వర్ణిస్తారు. స్త్రీలు ఆకర్షణీయ మైన రంగు రంగుల దుస్తులు ధరించి, ముంగిట పచ్చని తోరణాలతో, వాకిట ఇంద్ర ధనస్సును తలపించే విధంగా రంగవల్లికలనుబెట్టి, పసుపు, కుంకుమ, పూలు నివేదనలు సిద్ధపరచుకుని ఎంతో నేర్పరితనంగా 'పిరమిడ్' ఆకారంలో పూలను పేర్చి, ఆ శిఖరమందు బతుకమ్మ (గౌరమ్మతల్లి) ని ఉంచి స్త్రీలు, పిల్లలుచేరి చప్పట్లు చరుస్తూ పాటలు పాడుతూ ప్రదక్షణలుచేసి, నివేదనచేసి, ఆ పూవుల బతుకమ్మను సమీప నదిలోగాని చెరువనందుగాని ఉద్వాసన చేస్తారు.

ఈ విజయదశమినాడు స్త్రీలు ఎంతో సుందరంగా బొమ్మల కొలువు తీర్చిదిద్ది ముత్తైదువులను పిలుచుకుని పేరంటం పెట్టుకుని వార్కి వాయినాలతో సత్కరించి వారి ఆశీస్సులు పొందుతూ ఉంటారు. పూర్వం 'ఉపాధ్యాయులు' ఈ పండుగ దినాలలో పిల్లలచేత రంగు రంగు కాగితాలు చుట్టిన విల్లంబులుచేయించి బాణం చివరిభాగాన పూమడతలో బుక్కాపూలు ఉంచి వారిని వారి వారి ఇండ్లకు తోడ్కొని వెళుతూ! బుక్కాలుచల్లిస్తూ అయ్యవారికి చాలు ఐదువరహాలు పిల్లవారికి చాలు పప్పు బెల్లాలు....అంటు పాటలు పాడిస్తూ వారు ఇచ్చే చిరుకానుకలు ఆనందంగా స్వీకరిస్తూ ఉండేవారు. అట్టి వేడుకలు నేడు కనుమరుగైనాయి.

ఈ దసరా ఉత్సవాలలో నేటికి ఆచరించుచున్నది "రామలీల ఉత్సవాలు". పెద్దపెద్ద రావణ కుంభకర్ణుల బొమ్మలను తయారుచేసి వాటిని ఒక విశాలమైన మైదానము వరకు దసరావేషాలు ధరించిన కళాకారులతో ఊరేగింపుగా తీసుకుని వెళ్ళి "రాక్షస పీడ వదిలిందని" భావిస్తూ బాణాసంచాలతో వారి బొమ్మలను తగుల పెడతారు.

ఈ రోజు మరింత ముఖ్యమైనది "శమీపూజ". శమీవృక్షమంటే "జమ్మిచెట్టు". అజ్ఞాతవాసమందున్న పాండవులు వారి వారి ఆయుధములను వస్త్రములను ఈ శమీవృక్షముపై దాచారు. తిరిగి అజ్ఞాతవాసము పూర్తిఅవగానే ఆ వృక్షమును పూజించి ప్రార్థించి తిరిగి ఆయుధములను వస్త్రములను పొంది ఆ శమీవృక్షరూపమున ఉన్న "అపరాజితా"దేవి ఆశీస్సులు పొంది కౌరవులపై విజయము సాధించినారు. శ్రీరాముడు ఈ విజయదశమి రోజున ఈ 'అపరాజితా'దేవిని పూజించి రావణుని సంహరించి విజయము పొందినాడు. తెలంగాణా ప్రాంతమందు శమీపూజ అనంతరం 'పాలపిట్ట'ను చూచే ఆచారంకూడా ఉన్నది.

ఇలా అందరూ నవరాత్రులు జరుపుకుని విజయదశమిరోజు సాయంత్రం నక్షత్ర దర్శన విజయ సమయాన శమీవృక్షం (జమ్మిచెట్టు) వద్దగల అపరాజితాదేవిని పూజించి ఈ శ్లోకంతో;

**శ్లో॥ శమీ శమయతే పాపం శమీశత్రు నివారిణీ ।**
**అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ ॥**

అని ఆ చెట్టుకు ప్రదక్షణలుచేస్తూ పై శ్లోకము స్మరిస్తూ ఆ శ్లోకములు వ్రాసుకున్న చీటీలు అందరూ ఆ చెట్టు కొమ్మలకు తగిలిస్తారు. ఇలా చేయుటవల్ల అమ్మవారి కృపతో పాటుగ, శనిదోష నివారణ కూడా జరుగుతుందని ప్రతీతి.

ఇలా మానవులు అసాధ్యాలను సుసాధ్యాలను చేయాలన్నా మనకు ఏర్పడిన దారిద్ర్యం తొలగిపోవాలన్నా ఆయురారోగ్య ఐశ్వర్యములతో ఇహలోక పరలోక సుఖాలను పొందుటకై;

ఈ "శరన్నవరాత్ర" దసరావైభవంలో పాలుపంచుకుని సర్వులూ పునీతులు అవుదురుగాక!





## (విజయదశమి తిథి మరునాడు) శ్రీ సాయి పూజ్యతిథి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసిన అలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు పెట్టాలి. |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : పసుపు రంగు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు– పటములకు గంధము,కుంకుమ |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : పసుపు |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : పసుపు |
| 9. | పూజించవలసిన ఫోటో | : శ్రీ సాయిబాబా |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : శ్రీ సాయినాధుడు |
| 11. | పూజించవలసిన దైవము | : శ్రీ సాయిదేవుడు |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : పసుపు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : పసుపు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : బంతిపూలు, తులసిమాలతో |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : కేసరీబాత్ |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : పాలకోవా |
| 17. | నివేదించవలసిన పండ్లు | : అరటిపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : శ్రీ సాయిబాబా |
| 19. | పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : శ్రీ సాయి పంచరత్న స్తోత్రము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : శ్రీ సాయి మహిమ్నాస్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : శ్రీ సాయిబాబా |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : శ్రీ సాయిసచ్చరిత్ర |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : శ్రీ సాయిమహాసమాధి |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : శ్రీ సాయిబాబా |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : షిరిడి |
| 26. | చేయవలసిన ధ్యానములు | : శ్రీసాయి ధ్యానములు |

27. చేయించవలసిన పూజలు : శ్రీ సాయి అష్టోత్తర పూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : శ్రీ సాయిసత్యవ్రతం
29. ఆచరించవలసిన వ్రతము : శ్రీ సాయిసత్యవ్రతం
30. ఉపవాసము నియమము : ఉన్నది
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : శ్రీ సాయిఆరాధన
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు: శ్రీసాయిసచ్చరిత్ర
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి: శ్రీసాయినాథ స్తోత్రమంజరి
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : శ్రీసాయి సచ్చరిత్ర పారాయణ
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : శ్రీ సాయిబాబా మహసమాధి, ఉత్సవములు
37. పర్వదిన నక్షత్రము : –
38. పర్వదిన తిథి : ఏకాదశి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : గురువారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : మ॥ 2 గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : కంచు దీపారాధన
42. వెలిగించవలసిన దీపారాధనలు : 5
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5
44. వెలిగించవలసిన వత్తులు : పంచహారతి
45. దీపారాధన వాడవలసిన నూనె : ఆవునెయ్యి
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : పసుపు
48. నుదుటన ధరించవలసినది : విభూది
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం శ్రీసాయిరాం
50. జపమునకు వాడవలసిన మాల : స్ఫటిక మాల
51. మెడలో ధరించవలసిన మాల : స్ఫటిక మాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : శ్రీ సాయిబాబా
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : ఉత్తరం





## శ్రీ సాయి పుణ్యతిథి

ఈ కలియుగములో ధర్మ సంరక్షణ చేయుటకు జ్ఞానబోధ ఒక్కటే చాలదు. యాంత్రిక జీవితమును గడుపుచు, కామక్రోధ లోభ మోహములతో జీవించుచు, ఆహార, ధనసంపాదనల కొరకు శ్రమించు మానవులను సన్మార్గులుగా చేయుటకు, సమైక్యపరచుటకు, భగవంతుడు మానవరూపములో దేహధారిగా మానవుల మధ్య సంచరించుట అవసరమని తలంచి పరిపూర్ణ పరబ్రహ్మము మానవ రూపధారియై సాయినాథుడగా మానవుల మధ్య సం,రించుచు సత్కర్మలనాచరించినాడు. భక్తులకు తన తత్త్వమును అందింప చేయుచు, భగవంతుడు సాకారుడు కాడనియు, నిరాకార స్వరూపుడనియు నిరూపించి, తన దేహమును త్యజించినను సర్వగతుడై తన అవతార కార్యమును కొనసాగించుచునే యున్నారు సాయి. ఈ కలియుగములో షోడశకళా ప్రపూర్ణావతారము సాయి. వారి దేహత్యాగములో కూడ ప్రత్యేకత యున్నది. వారి దేహత్యాగము, అభయ ప్రదానముల గురించి తెలుసుకొందాము.

బాబాకు అన్ని యోగములు తెలుసు. మసీదుకు చాలా దూరమున గల మర్రిచెట్టు వద్ద నున్న బావి వద్దకు మూడు రోజులకు ఒకసారి బాబా వెళ్ళి ముఖ ప్రక్షాళనము, స్నానము చేసెడివారు. బాబా స్నానము చేయునప్పుడు తన శరీరమును ఎవరిని తాకనిచ్చేవారుకాదు. కొంత కాలము తరువాత బాబాస్నానానికి భక్తులు రెండు బక్కెట్లతో వేడినీళ్ళు మసీదులో పెట్టేవారు. బాబా మసీదులో స్నానము చేయునప్పుడు తెరలు వేసేవారు. సుమారు గంటన్నర కాలము బాబా స్నానము పట్టేది. స్నానము అయిన తరువాత బాబా ధుని వద్ద నిలబడగా భక్తులు తుడిచేవారు.

బాబా "ధౌతి" యోగము చేసెడివారు. ధౌతి యోగమనగా 3 అంగుళముల వెడల్పు 22 1/2 అంగుళముల పొడవు గల గుడ్డను మ్రింగి కడుపులో అరగంట వరకు ఉండనిచ్చిన పిమ్మట తీయుట. కాని బాబా విధానము దీనికంటె ప్రత్యేకమయినది. ఒకరోజు బాబా తన యూపిరితిత్తులను బయటకు క్రక్కి ఆ యూపిరితిత్తులను నీటితో శుభ్రపరచి నేరేడు చెట్టుపై ఆఱవేయుట కొందఱు చూచినారు.

బాబాకు శరీర భాగములను విడదీసి వేఱు వేఱు ప్రదేశములలో పెట్టు ఖండయోగము కూడ తెలుసు. ఒకనానొక పెద్ద మనిషి (షిరిడీ నివాసి అప్పాభిల్)

బాబా తన శరీరావయవములన్నియు వేరుచేసి మసీదు నందు వేరు వేరు స్థలములలో విడిచి పెట్టుటను చూచి బాబాను ఎవరో ఖూనీ చేసిరని భయపడి యీ సంగతి తాను చెప్పిన తననే అనుమానించెదరని ఊరకుండి, మరసటి రోజు ఉదయము అతడు మసీదుకు వెళ్ళగా బాబా హాయిగా కూర్చొని ఉండుట చూచి ఆశ్చర్యపడెను.

సాయిబాబా భక్త మహాల్సాపతితో "నా శరీరమును మూడు రోజుల వఱకు కాపాడుము. నేను తిరిగి వచ్చినట్లయిన సరే. లేనియెడల నా శరీరమును ఎదురుగా నున్న ఖాళీస్థలములో పాతిపెట్టి, దానిపై గుర్తుగా రెండు జండాలు పాతుము" అని చెప్పి 1886 మార్గశిర పూర్ణిమరోజు రాత్రి గం. 10-00 ల నుండి మహాల్సాపతి తొడపై పరుండి బాబా సమాధిలోనికి వెళ్ళిరి. అనగా దేహము నుండి శ్వాస వదలి నిర్జీవులైరి. మరల మూడవరోజు తెల్లవారుజామున గం॥ 3-00లకు బాబా శరీరములోనికి ప్రాణమువచ్చి చైతన్యము పొందిరి. ఇది అపూర్వ సంఘటన. పరబ్రహ్మమైన సాయికి తప్ప మానవులకు సాధ్యముకాదు. భక్త మహాల్సాపతి నిద్రాహారములుమాని బాబా నిర్జీవదేహమును బాబా 72 గంటలు సమాధిలోకి వెళ్ళిన సమయమున తన తొడపైననే పెట్టుకొని యుండెను. కొందరు బాబా చనిపోయినారని చెప్పినను వినక కంటికి రెప్పవలె కాపాడి, సాయిని మనకందించారు. ఈ సంఘటన జరిగిన తరువాత 1886 నుండి సాయి లీలలు ఎక్కువగుట, భక్తులు ఎక్కువగా వచ్చుట జరిగినది. నానాసాహెబు చాందోర్కర్ ప్రచారము వలనను, దాసగణు మహారాజు హరికథల ద్వారా జరిపిన ప్రచారము వలనను షిరిడీవచ్చు భక్తుల సంఖ్య పెరిగింది.

బాబా నిర్యాణమునకు రెండు సంవత్సరముల ముందు జరిగిన సంఘటన, 1916 విజయదశమి రోజున సీమోల్లంఘనము చేసి (పారువేట, గ్రామము సరిహద్దు దాటుట) తిరిగి రాగానే బాబా హఠాత్తుగా కోపోద్రిక్తులై తమ తల గుడ్డ, కఫ్నీ, లంగోటి ఊడతీసి వానిని చించి ధునిలో వేసి దిగంబరుడై నిలిచి ఎఱ్ఱగామండుచున్న కన్నులతో "ఇప్పుడు సరిగా గమనించి నేను హిందువునో, మహమ్మదీయుడనో చెప్పుడు అని బిగ్గరగా అరచిరి. కుష్టురోగి భాగోజి షిండే ధైర్యముతో బాబా దగ్గఱకు పోయి లంగోటి కట్టి "బాబా! సీమోల్లంఘనము నాడు ఇదంతయు నేమి? యనెను. దానికి జవాబుగా "ఇది నా సీమోల్లంఘనము" అనుచు బాబా తన సటకాతో నేలపై కొట్టెను. ఒక గంట తరువాత బాబా మామూలు స్థితికి వచ్చిరి. బాబా తన నిర్యాణమునకు రెండు సంవత్సరములకు ముందే అదే రోజున తన నిర్యాణము జరుగునని, సూచన చేసినను అది యెవరికీ అర్థము కాలేదు.

బాబా భౌతిక దేహమును విడచుటకు కొన్ని దినములకు ముందు, బాబా రాత్రుల యందు తలక్రింద పెట్టుకొనెడి యిటుకరాయి బాబా మసీదులో లేనప్పుడు, మసీదు శుభ్రము చేయు మాధవు ఫస్లే అను బాలుని చేతి నుండి జారి క్రిందపడి





రెండు ముక్కలైనది. ఈ సంగతి బాబాకు తెలియగనే "ఇటుకరాయి కాదు, నా యదృష్టమే ముక్కలు - ముక్కలుగా విఱిగిపోయినది. అది నా జీవితపు తోడు - నీడ" అని అన్నారు. దాసగణుతో "దీనికి నా గురువుయొక్క పాదస్పర్శయున్నది. కనుక దీనిని నా తల క్రింద నుంచుకొను చున్నాను. ప్రతిరోజు తెల్లవారగానే మీరందరు వచ్చి నా కాళ్ళమీద పడుదురు, మీ నమస్కారములన్నియు నేను నా గురువునకు సమర్పించుచుందును" అని బాబా చెప్పిరి.

1918 సెప్టెంబరు 28వ తేదీన బాబాకు కొంచెము జ్వరము తగిలినది. రెండు మూడు రోజుల వరకు జ్వరముండెను. బాబా భోజనము మానిరి. అందుచే క్రమముగా బలహీనులగుచుండిరి. మానవులు దేహత్యాగము చేయుటకు ముందు ఆధ్యాత్మిక చింతనతో గడుపవలెనని చెప్పుటకు బాబా నిర్యాణమునకు ముందు "వాఝె" అను భక్తునిచే 'రామ విజయము' చదివించి వినిరి. 1918 అక్టోబరు 15వతేదీన మంగళవారము మధ్యాహ్నము గం॥ 2-30 లకు దశమి వెళ్ళగా ఏకాదశి ఘడియలలో "తనకు ఆ స్థలము (మసీదు) బాగాగాలేదని బూటీ వాడకు తీసికొని పోయినచో అచట బాగుండునని చివరిసారిగా పలుకుచు బాయాజీ శరీరముపై ఒరిగి తుది శ్వాస విడచిరి. ప్రాణములు విడచుటకు ముందు మాధవ ఫస్లే నడిగి "పాన్" తీసుకొన్నారు బాబా. పాన్ వేసుకొని నీళ్ళుత్రాగారు. కాని కొన్ని నీళ్ళు మాత్రమే లోనికి వెళ్ళినవి. ప్రాణములు విడచిన తరువాత నానా సాహెబు నిమోన్కర్ నీళ్ళు తెచ్చి బాబా నోటిలో పోసెను. అవి బయటకు వచ్చుటచే బిగ్గరగా "ఓ దేవా" యని నిమోన్కర్ అరచెను. బాబా కన్నులు తెరచి మెల్లగా "ఆహా"యనెను. అంతే, బాబా భౌతికశరీరము నుండి పంచ ప్రాణములు అనంత వాయువులలో లీనమయినవి. బూటి వాడ నుండి పరుగున వచ్చిన డాక్టరు పిళ్ళే నాడి పరీక్షించి కంటనీరు పెట్టారు. ఈ సమయములో లక్ష్మీభాయి షిండే, భాగోజి షిండే, బాయాజీ, లక్ష్మన్ బాలాషింపి, నానా సాహెబు నిమోన్కర్ అక్కడ ఉండిరి. చివరిసారిగా బాబా అబ్దుల్లాను రమ్మనమని కబురు చేశారు. కాని అబ్దుల్లా వెంటనే రాలేదు. అతడు వచ్చునప్పటికి బాబా దేహత్యాగము చేయుట చూచి తన దురదృష్టమునకు దుఃఖించాడు అబ్దుల్లా. భక్తులతోపాటు పురజనులందఱు దుఃఖిస్తూ మసీదు చేరారు.

బాయాజీబాయి తనకు చేసిన సేవకు ఆమె కుమారుడైన తాత్యాను మరణము నుండి రక్షించుట కొఱకు బాబా దేహత్యాగము చేసిరని భక్తులు భావించిరి. దానికి ఈ క్రింది కారణము కనిపించుచున్నది. రామచంద్ర పాటీలు తీవ్రముగా జబ్బు పడినప్పుడు "నేను ఎప్పుడు మరణింతునో చెప్పు"మని బాబాను రామచంద్ర పాటీలు కోరగా "నీ చావు తప్పినది, త్వరలో బాగుపడెదవు. కాని తాత్యాకోతే పాటీలు 1918 విజయదశమినాడు మరణించును. ఈ విషయము వానికిని, ఎవరికిని తెలియనీయ కుము" అని బాబా రామచంద్ర పాటీలతో చెప్పెను. బాబా చెప్పినట్లే

1918 ఆశ్వయుజములో తాత్యాకు జబ్బు చేసి విజయదశమి నాటికి ఎక్కువ అయినది. బాబా దేహత్యాగము చేయుటతో తాత్యాకు కలిగిన జబ్బు తగ్గినది.

1916లో సాయిబాబాకు తీవ్రముగా జ్వరము వచ్చినది. సాయి పరిస్థితి విషమించుచుండగా నానాసాహెబు చాందోర్కర్ వంటి సన్నిహిత భక్తులు షిరిడీ వచ్చి బాబా ఆరోగ్యము కొరకు అభిషేకములు చేయించిరి. బాబా పరమపదించినచో అంత్యక్రియలు ఏ విధముగ చేయాలో చెప్పుమని నానా సాహెబు చాందోర్కర్‌ను భక్తులు అడిగినారు. కాని నానా ధైర్యము చేయలేదు. సాయి నానాకు కబురుచేసి "నేను నిర్యాణము చెందుటలేదు. అట్టి ఆలోచనవద్దు. ఆ సమయము వచ్చినప్పుడు ఏర్పాట్లన్నియు నేనే స్వయముగా చేయగల"నని చెప్పిరి.

ఒకసారి భక్త మహల్సాపతితో "అరె భగత్! నేను ముందు పోవుచున్నాను. నీ వింకను నాలుగు సంవత్సరములు ద్వారకామాయికి వచ్చుచుండుము" అని తన నిర్యాణమును గురించి, తన భక్తుడగు మహల్సాపతి నిర్యాణమును గురించి బాబా చెప్పిరి. 1918లో కొద్దినెలలు గడచిన తరువాత షిరిడీ దర్శించిన ఉద్దవేశీబువా మరియు శ్రీమతి చంద్రాబాయి బోర్కర్‌లతో ఒకరోజు "ఇక నుండి మీరు శ్రమపడి తఱచు షిరిడీ రానక్కఱలేదని" బాబా అన్నారు. సమాధి చెందుటకు కొంత కాలము ముందు ఒకరోజున హేమాడ్ పంతుకు బాబా ఒక గిన్నెడు మజ్జిగ త్రాగుమని యిచ్చి "దానినంతయు త్రాగుము. నీకిక మీదట ఇట్టి అవకాశము దొరకదు" అని చెప్పిరి. అతడు తన కడుపు నిండుగ నున్నప్పటికి అమృతము వంటి ఆ మజ్జిగను త్రాగెను.

ఇట్లే రఘువీర్ పురందరేకు "నేను ముందు వెళ్ళుచున్నాను. మీరు తరువాత వస్తారు" అని చెప్పి అతనికి సెలవిచ్చుచు, "నా సమాధి మాటాడును; నా నామము పలుకును; నా మట్టి సమాధానమిచ్చును" అని బాబా అతనితో అన్నారు. కనుక బాబా వాక్కుకు తిరుగులేదు.

విజయదశమికి నాలుగు రోజుల ముందుగానే "నందు మార్వాడి" భార్యతో "ద్వారకామాయిలోను, చావడిలోను ఉండుటకు విసుగు పుట్టినది. నేను బూటివాడకు పోతాను. అక్కడ నాకు పెద్ద పెద్దవారు సేవలు చేస్తూ ఉంటారు" అని సాయి చెప్పినారు.

బాబా శరీరాన్ని భక్తులు సందర్శించి నమస్కరించుకొనుటకు వీలుగా మసీదులో కూర్చుండ పెట్టిరి. పిమ్మట బాబా నిర్జీవదేహమును షిరిడీలో ఊరేగించి, బూటి నిర్మించిన మందిరములో మురళీధరుని ప్రతిష్ఠించుటకు నిర్ణయించిన చోట 17వ తేదీన సమాధి చేసిరి. ఇదే ప్రస్తుతము భక్తులు దర్శించు సమాధి మందిరము. బాబా ఎల్లప్పుడు రాత్రులందు తలగడ క్రింద పెట్టుకొను ఇటుకరాయి క్రిందపడి





విరిగిన రెండు ముక్కలను కలిపి తీగతో కట్టి సమాధిలో బాబా తలక్రింద నుంచిరి. బాబా తన దగ్గఱ నుంచుకొనెడి మూటలోని కాశీరాం ఏనాడో కుట్టి యిచ్చిన ఒక ఆకుపచ్చ కఫ్నీ, ఆకుపచ్చ టోపికూడ సమాధిలో నుంచిరి. బాబా దేహత్యాగము చేసిన పిమ్మట, 36 గంటలు గడచిన తరువాత గాని సమాధి జరుగలేదు. 36 గంటలు గడచినను బాబా నిర్జీవదేహము బిగిసికొనిపోలేదు. అవయవములన్నియు సాగుచునే యుండెను. వారు ధరించియున్న కఫ్నీ చింపక సులభముగానే ఈ నిర్జీవదేహము నుండి తీయగలిగిరి. కారణజన్ములు సాయి. వారిది స్వచ్ఛంద దేహ త్యాగము. పంచ భూతములను శాసించు సాయి యొక్క పాంచభౌతికమైన, దేహము బిగిసిపోవుట జరుగునా?



బాబా ఉత్తరక్రియలు (మానవుడుగా దేహము ధరించిరి కనుక) బాలా సాహెబు బాటే ఉపాసనీ బాబాలు నెరవేర్చిరి. విరివిగా అన్నసంతర్పణలు చేయ బడినవి. యం. డబ్ల్యు ప్రధాన్ వదినెగారికి బాబా కలలో "మీ సంచిలో నున్న పీతాంబ రము నా సమాధిపై కప్పడానికి షిరిడీ పంపండి" అని చెప్పిన ప్రకారము ఆమె పంపిన పీతాంబరమే 1923 దాక సమాధిమీద కప్పినారు.

బాబా దేహత్యాగము చేసిన మఱురోజు అనగా బుధవారము ఉదయము శ్యామాకు మేనమామ యగు లక్ష్మణమామా జోషికి బాబా స్వప్నములో గాన్పించి, చేయిపట్టి లాగి "త్వరగా లెమ్ము, బాపు సాహెబు నేను మరణించితి ననుకొను చున్నాడు" అందుచే నతడు రాడు. నీవు పూజ చేసి కాకడహారతిని ఇమ్ము" అని చెప్పిరి. సనాతనాచారపరుడైన లక్ష్మణమామా జోషి పూజాద్రవ్యముల పళ్ళెము చేత ధరించి మౌల్వీలు ఆటంకపఱచుచున్నను లెక్కించక బాబా స్వప్నములో చెప్పిన ప్రకారము ఆ నిర్జీవ దేహమునకు కాకడ హారతి యిచ్చినాడు. మధ్యాహ్న హారతికి మాత్రము బాపు సాహెబు జోగ్ అందరితో మామూలుగా వచ్చి హారతి యిచ్చిరి.

అటులనే దాసగణుకు బాబా కలలో చెప్పి ఆ నిర్జీవ దేహమునకు పూలచే కప్పి అలంకరింప చేయించుకొన్నారు. ఇప్పుడు కూడ షిరిడీలో నాలుగు వేళల హారతులు ఇచ్చుట, ప్రతి హారతి సమయములోను బాబా విగ్రహమునకు సమాధికి వస్త్రములచే, పూలచే అలంకరించుట జరుగుచున్నది. భక్తులు కూడ ఈ నాలుగు వేళలలో జరుగుహారతులలో పాల్గొనుట, పూలదండలతో, పూలగుత్తులతో, నూతన వస్త్రములతో బాబా సమాధిని, విగ్రహమును అలంకరింప జేయుట జరుగుచున్నది. మాతృశ్రీ పూలమ్మగారు ఎప్పుడును సాయిని "పాపం! ముసలాయన" అని సంబోధించునట్లు, అభిషేక సమయములో ముసలాయనగా కనిపించు సాయి, వస్త్రముల, పూల అలంకరణతో రాజాధిరాజుగా దర్శనమిచ్చు బాబాను భక్తులు వారి వారి మనోభావముల ప్రకారము ఇప్పుడు షిరిడీలో దర్శించుచున్నారు.

## దీపావళి

1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : తెలుపువి
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకు ఉపయోగపడు వస్తువులు– పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : తెలుపుది
8. కలశముపై వస్త్రము రంగు : తెలుపుది
9. పూజించవలసిన ఫోటో : శ్రీలక్ష్మీదేవి (ఆకుపచ్చనిరంగు)
10. పూజించవలసిన ప్రతిమ : శ్రీలక్ష్మీదేవి (వెండిది)
11. పూజించవలసిన దైవము : కూర్చున్న లక్ష్మీదేవి
12. తయారు చేయవలసిన అక్షతలు : ఎర్రటి
13. పూజకు కావలసిన పువ్వులు : ఎర్ర పద్మములు, తెల్ల కలువపువ్వులు
14. అలంకరణకు వాడవలసినపూలు : గులాబిపువ్వులు
15. నివేదన చేయవలసిననైవేద్యం : కేసరీబాత్
16. సమర్పించవలసిన పిండివంటలు : రవ్వలడ్డులు
17. నివేదించవలసిన పండ్లు : జామకాయలు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : శ్రీ లక్ష్మీఅష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : శ్రీ మహాలక్ష్మి అష్టకం
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : కనకధారాస్తవము, శ్రీ సూక్తము
21. పారాయణచేయవలసిన సహస్రాలు : శ్రీ లక్ష్మీసహస్రనామము
22. పారాయణ చేయవలసినగ్రంథం : భాగవతము
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : నరకాసుర వధ
24. దర్శించవలసిన దేవాలయాలు : అష్టలక్ష్మీదేవాలయం
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : కొల్హాపూర్, విశాఖ కనకమహాలక్ష్మీదేవి
26. చేయవలసిన ధ్యానములు : మహాలక్ష్మి ధ్యానములు
27. చేయించవలసిన పూజలు : శ్రీ లక్ష్మి కుంకుమపూజ



28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : శ్రీ లక్ష్మీఅష్టోత్తర నామపూజ
29. ఆచరించవలసిన వ్రతము : వైభవలక్ష్మి , లక్ష్మీకుబేర వ్రతము
30. ఉపవాసము నియమము : లేదు
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : మీ అప్పులుతీరాలా? శ్రీలక్ష్మీనిత్యపూజ, శ్రీ ధనలక్ష్మీనిత్యపూజ
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : శ్రీ లక్ష్మీస్తోత్రములు
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి: శ్రీలక్ష్మీ కుబేర వ్రతము
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : శ్రీమహాక్ష్మికి 108 కలువపువ్వులతోపూజ
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : శ్రీ మహాలక్ష్మి కోటి కుంకుమార్చన.
37. పర్వదిన నక్షత్రము : అశ్వనీ నక్షత్రము
38. పర్వదిన తిథి : ఆశ్వీయుజ బహుళ అమావాస్య
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శుక్రవారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : సా॥ 6 గం॥ నుండి
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : వెండివి.
42. వెలిగించవలసిన దీపారాధనలు : 2
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5 వత్తులు
44. వెలిగించవలసిన వత్తులు : తామర వత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : ఆవునెయ్యి
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : ఎర్రటి
48. నుదుటన ధరించవలసినది : కుంకుమ
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం మహాలక్ష్మీదేవ్యై నమః
50. జపమునకు వాడవలసిన మాల : తామర మాల
51. మెడలో ధరించవలసిన మాల : తామర మాల (స్త్రీలు)
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : శ్రీలక్ష్మీదేవి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : ఈశాన్యము.

## దీపావళి

మన భారతీయ సంస్కృతికి అద్దం పట్టే విధంగా అత్యంత వైభవంగా జరుపుకునే పండుగలలో 'దీపావళి' ఒకటి. దీనిని రెంబు రోజుల పండుగగా జరుపు కుంటూ ఉంటారు.

ఆశ్వీయుజ మాస బహుళ చతుర్దశి నరక చతుర్దశిగాను, అమావాస్యను దీపావళి పుణ్యదినంగాను భావించి ఆరోజు శ్రీ మహాలక్ష్మీపూజ జరిపి, రాక్షసుల బాధలు తొలగిన ఆనందాన్ని వ్యక్తపరచుటకై దీపాలంకరణలు చేసి బాణాసంచా కాలుస్తారు.

**దీపం జ్యోతిః పరంబ్రహ్మ దీపం సర్వతమోపహమ్।**
**దీపేన సాధ్యతే సర్వమ్ సంధ్యా దీప న్నమోస్తుతే॥**

ఈ జ్యోతిని పరబ్రహ్మ స్వరూపంగా, మనోవికాసానికి, ఆనందానికి, నవ్వులకు, సజ్జనత్వానికి, సద్గుణ సంపత్తికి నిదర్శనంగా భావిస్తారు. ఈ రోజున మహాలక్ష్మీపూజ జరపుకొనుటకు ఓ విశిష్టత గలదు.

పూర్వం దూర్వాస మహర్షి ఒకమారు దేవేంద్రుని ఆతిధ్యానికి సంతసించిన వాడై; ఒక మహిమాన్వితమైన ఒక హారాన్ని ప్రసాదించాడు. ఇంద్రుడు దానిని తిరస్కార భావముతో, తనవద్దనున్న ఐరావతము అను ఏనుగు మెడలో వేయగా అది ఆ హారాన్ని కాలితో తొక్కివేస్తుంది. అది చూచిన దుర్వాసుడు ఆగ్రహంచెంది దేవేంద్రుని శపిస్తాడు. తత్ఫలితంగా రాజ్యాధిపత్యంకోల్పోయి, సర్వసంపదలు పోగొట్టుకుని దిక్కుతోచక శ్రీహరిని ప్రార్థిస్తాడు. ఈ పరిస్థితిని గమనించిన శ్రీ మహావిష్ణువు దేవేంద్రుని ఒక జ్యోతిని వెలిగించి దానిని శ్రీమహాలక్ష్మీ స్వరూపంగా తలచి పూజించమని సూచిస్తాడు. దానికి తృప్తిచెందిన లక్ష్మీ అనుగ్రహంతో తిరిగి త్రిలోకాధిపత్యాన్ని, సర్వసంపదలను పొంది దూర్వాసుని పాదాలపై పడతాడు. అనంతరం మహాలక్ష్మీతో! తల్లీ నీవు కేవలం శ్రీహరి వద్దనే ఉండుట న్యాయమా! నీ భక్తులను కరిణించవా? అంటాడు. అంత ఆ మాత, త్రిలోకాధిపతీ! నీవు అనుకున్నట్లు నా శ్రీహరి అంత సంకుచిత మనస్కుడు మాత్రం కాదు. నన్ను త్రికరణ





శుద్ధిగా ఆరాధించే భక్తులకు వారి వారి అభీష్టాలకు అనుగుణంగా మహర్షులకు మోక్షలక్ష్మీ రూపంగా, విజయాన్ని కోరేవార్కి విజయలక్ష్మీగా, విద్యార్థులు నన్ను ఆరాధిస్తే విద్యాలక్ష్మీగా, ఐశ్వర్యాన్ని కోరి ఆరాధించేవార్కి ధనలక్ష్మీగా, వారి సమస్త కోరికలు నెరవేర్చే వరలక్ష్మీగా వార్కి ప్రసన్నురాలనౌతానని దేవేంద్రుని సమాధాన పరచింది, దానికి త్రిలోకాధిపతి కృతజ్ఞతాంజలి సమర్పించుకున్నాడు.

ఇక ఈ దీపావళి పండుగను దేవదానవులు పాల సముద్రాన్ని మధించి నప్పుడు వచ్చిన దివ్యజ్యోతి ఈ జీవకోటికి వెలుగును ప్రసాదించిన విశిష్టమైన రోజుగా!

శ్రీరామచంద్రుడు రావణ సంహారము గావించి సీతాదేవితో అయోధ్యకు చేరి పట్టాభిషిక్తుడైన శుభసందర్భంగా! శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై లోక కంటకుడైన నరకాసురుని వధించినందుకు సంబరంగా! ఇలా ఈ దివ్య దీపావళిని దేదీప్యమైన దివ్యకాంతుల దీపాలను అలంకరించి బాణాసంచా కాలుస్తూ! అందరూ వారి వారి ఆనందాలను వ్యక్త పరుస్తూ ఉంటారు.

ఇక ప్రకృతి పరంగా ఆలోచిస్తే! ఈ కాలమందు సర్వ జీవులను వ్యాధిగ్రస్తులను చేసే కీటకాలు, పంటలను నాశనము చేసే క్రిమికీటకాలు అధికంగా ఉద్భవిస్తాయి. కనుక ఈ బాణాసంచా కాల్పులవల్ల కీటక సంహారం కలిగి ప్రజలకు అన్ని విధాల మేలు జరుగుటకే ఈ ఆచారం పెట్టి ఉంటారని పెద్దలు చెప్తూ ఉంటారు.

ఏ ఇంటియందు దీపాలు సమృద్ధిగా వెలుగుతాయో! ఆ ఇంట శ్రీమహాలక్ష్మీ ప్రవేశిస్తుందని మనకు ఋగ్వేదం చెప్తోంది. అటువంటి పుణ్య దిన సాయం సంధ్యా కాలమందు లక్ష్మీస్వరూపమైన తులసికోట ముందు తొలుత దీపాలు వెలిగించి శ్రీమహాలక్ష్మీ అష్టోత్తర శతనామాలతో అందు వర్ణించిన విధంగాపూజ గావించి నివేదన చేసి

**చతుర్భుజాం చంద్రరూపా మిందిరా మిందు శీతలామ్**
**ఆహ్లాద జననీం పుష్టిం శివాం శివకరీం సతీమ్ ॥**

అని ధ్యానించి, ఈ సర్వప్రాణ కోటికి హృదయ తాపాలను పోగొట్టు సర్వ సంపన్న శక్తి వంతురాలుగా భావించి, పూజానంతరం గృహమంతా దీపాలంకృతం చేయుటవల్ల కాలిఅందియలు ఘల్లుఘల్లు మన అన్నట్లు ఆ మహాలక్ష్మి ప్రసన్న మౌతుందట!

ఇట్టి రెండు రోజుల పండుగ నరక చతుర్దశి, దీపావళిలను విశేషంగా జరుపుకుని, శ్రీమహాలక్ష్మిని మన ముంగిటకు ఆహ్వానిద్దాము.

## నాగుల చవితి



| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఎరుపురంగువి |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు– పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎరుపు వస్త్రము |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఎరుపు వస్త్రము |
| 9. | పూజించవలసిన ఫోటో | : నాగేంద్రస్వామి |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : పాముపడగ |
| 11. | పూజించవలసిన దైవము | : నాగేంద్రస్వామి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : తెల్లవి |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : ఎర్రటిపువ్వులు కనకాంబరములు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : మందార పూలమాల |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : చలిమిడి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : చిన్నచిన్న ఉండ్రాళ్ళు, వడపప్పు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : అరటిపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : నాగేంద్ర అష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : నాగేంద్ర స్తోత్రము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : నాగస్తుతిః |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : నాగేంద్ర సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : – |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : – |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : నాగేంద్రస్వామి పుట్టలు |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : మోపిదేవి |
| 26. | చేయవలసిన ధ్యానములు | : నాగేంద్రస్వామి ధ్యానములు |
| 27. | చేయించవలసిన పూజలు | : పుట్టపూజ, (పాలుపోయుట) |





| | | |
|---|---|---|
| 28. | దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : నాగేంద్ర అష్టోత్తరపూజ |
| 29. | ఆచరించవలసిన వ్రతము | : – |
| 30. | ఉపవాసము నియమము | : వున్నది |
| 31. | జాగరణ నియమము | : లేదు |
| 32. | సేకరించవలసిన పుస్తకములు | : నాగేంద్రస్వామి నిత్యపూజ |
| 33. | సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : నాగేంద్రస్వామి నిత్యపూజ |
| 34. | స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : నాగేంద్రస్వామి నిత్యపూజ |
| 35. | దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : నాగేంద్ర సహస్రనామపూజ |
| 36. | దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : పుట్టలకుపాలు పోయుటకు ఏర్పాట్లు |
| 37. | పర్వదిన నక్షత్రము | : – |
| 38. | పర్వదిన తిథి | : చవితి |
| 39. | పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : ఆదివారము |
| 40. | పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ॥ 9 గం॥ లోపుగా |
| 41. | వెలిగించవలసిన దీపారాధన కుంది | : 2 మట్టి ప్రమిదలు |
| 42. | వెలిగించవలసిన దీపారాధనలు | : ఎర్రటి ప్రమిదెలు |
| 43. | వెలిగించవలసిన వత్తులసంఖ్య | : దూదిలో 7 వత్తులు |
| 44. | వెలిగించవలసిన వత్తులు | : ఎర్రటి 7 వత్తులు |
| 45. | దీపారాధనకు వాడవలసిన నూనె | : నువ్వులనూనె |
| 46. | వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : 7 వత్తులతో |
| 47. | ధరించవలసిన తోరము | : ఎరుపురంగు |
| 48. | నుదుటన ధరించవలసినది | : కుంకుమ |
| 49. | 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం నాగేంద్రస్వామినే నమః |
| 50. | జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 51. | మెడలో ధరించవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 52. | మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : నాగేంద్రస్వామి |
| 53. | చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. | ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : పడమరదిక్కు |

88





## నాగుల చవితి

**ఉ. పాముని చూడగా బెదిరి పాకిన చోటన మంత్ర అక్షతల్**
**భూమిని చల్లగా విషము పోవును లొంగును భక్తికిన్ మరిం**
**పాములు దుష్ట జంతువని భావము మాత్రమే కాని తప్పదే**
**కామిత సంతతిచ్చురయగా అవిదేముడే ! కొల్వుడీప్రజల్.**

దీపావళీ అమావాస్య తరువాత వచ్చే కార్తీక శుద్ధ చవితిని "నాగులచవితి" పండుగ అంటారు. ఇంతకీ, ఈ విషనాగులను మనం పూజించుట మేమిటి? అన్నప్రశ్న వెంటనే తలెత్తుతుంది చాలామందిలో. ఈ పండుగలోని ఆంతర్యమేమిటో ఒక్కసారి పరిశీలిద్దాము.



ప్రకృతికి-జీవికి మధ్య మనకు ఎంతో అవినావ భావ సంబంధము కనిపిస్తూ ఉంటుంది. మనం నిశితంగా పరిశీలించ గలిగితే ప్రకృతినుండి మానవుడు తనకు కావలసింది పొందుతూ తిరిగి ఆ ప్రకృతిని సంరక్షించుకునే బాధ్యతను కూడా నాటి ఆటవిక స్థాయినుండి,నేటి నాగరిక సమాజం వరకూ ఆ ప్రకృతిని దైవ స్వరూపంగా మానవులు భావించి సంరక్షించుకుంటూ ఉన్నంతకాలం సమస్త మానవ కోటికి మరియు జీవకోటి మనుగడకు ముప్పుమాత్రం వాటిల్లదు. ఆ ప్రకృతిని మానవుడు చేజేతులారా కనుక నాశనం చేసుకుంటే ఇటు మానవకోటికి అటు జీవకోటికి తప్పక వినాశానికి దారితీస్తుందను భావముతో నేడు "ప్రకృతి-పర్యావరణ రక్షణ" అంటూ పలుకార్యక్రమాలు చేబడుతోంది నేటి సమాజం.

అలా 'ప్రకృతి' మానవ మనుగడకు జీవనాధారమైనది కనుక దానిని దైవస్వరూపంగా భావించి ఆనాటి నుండి నేటివరకూ చెట్టును, పుట్టను, రాయిని, రప్పను, కొండను, కోనను, నదిని, పర్వతాన్ని- ఇలా సమస్త ప్రాణికోటిని దైవ స్వరూపంగా చూచుకుంటూ! పూజిస్తూ వస్తున్నారు. అదే మనభారతీయ సంస్కృతి లోని విశిష్టత. నిశితంగా మనంపరిశీలిస్తే... అందులో భాగంగానే 'పాము'ను కూడా నాగరాజుగా, నాగదేవతగా, పూజిస్తూ వస్తున్నారు.

ఈ పాములు భూమి అంతర్భాభాగమందు నివసిస్తూ భూసారాన్ని కాపాడే ప్రాణులుగా సమస్త జీవకోటికి "నీటిని" ప్రసాదించే దేవతలుగా తలచేవారు. ఇవి పంటలను నాశనంచేసే క్రిమికీటకాదులను తింటూ, పరోక్షంగా 'రైతుకు' పంటనష్టం





కలుగకుండా చేస్తాయిట! అలా ప్రకృతి పరంగా అవి మనకు ఎంతో సహాయపడుతూ ఉంటాయి.

పైన చెప్పిన విధంగా సర్పం పేరు చెపితేనే బెదరిపోతూ ఉంటాము. కాని అంతకంటే భయంకరమైన మానవులు మనలోనే ఉన్నారు.

తలనుండు విషము ఫణికిని, వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్

తలతోకయనక యుండు ఖలునకు నిలువెల్ల విషము గదరాసుమతీ! అని చెప్పినట్లు...!

అలా! మనచుట్టూ మానవరూపంలో ఉంటే మానవులు; సర్పజాతి మనసు కంటే; నికృష్టమైన (అంటే! అవి మనంవాటి జోలికి వెళితేనే ప్రమాదకరమవుతాయి.) కాని వాటికంటే భయంకరమైన మానవ సర్పాలు మనచుట్టూ తిరుగుతున్నా గమనించలేక పోతున్నాం! అని గ్రహించుకోవలసి ఉంది.

అలా మనకంటికి కనబడే విషనాగుపాముకంటే మానవ శరీరమనేపుట్టలో నిదురిస్తున్న నాగుపాము మరింత ప్రమాదకరమని చెప్తారు. ఈ మానవ శరీరమనే పుట్టకు తొమ్మిది రంధ్రాలు ఉంటాయి. వాటినే (నవరంధ్రాలు) అంటూ ఉంటారు. మానవశరీరంలో నాడులతో నిండివున్న వెన్నెముకను "వెన్నుబాము" అంటారు. అందు కుండలినీశక్తి మూలాధారచక్రంలో 'పాము' ఆకారమువలెనే వుంటుందని 'యోగశాస్త్రం' చెబుతోంది. ఇది మానవ శరీరంలో నిదురిస్తున్నట్లు నటిస్తూ! కామ, క్రోధ, లోభ,మోహ, మద, మాత్సర్యాలనే విషాల్ని గ్రక్కుతూ, మానవునిలో 'సత్వగుణ' సంపత్తిని హరించి వేస్తూ ఉంటుంది. అలా 'నాగులచవితి రోజున ప్రత్యక్షంగా విషసర్పపుట్టను ఆరాధించి పుట్టలోపాలు పోస్తే; మానవుని లో ఉన్న "విషసర్పం కూడా" శ్వేతత్వం పొంది, మన అందరి హృదయాలలో నివశించే "శ్రీమహావిష్ణువు" నకు తెల్లని ఆదిశేషువుగా మారి "శేషపాన్పుగా" మారాలని కోరికతో చేసేదే ! ఈ నాగుపాము పుట్టలో పాలు పోయుటలోగల ఆంతర్యమని చెప్తారు.

దీనినే జ్యోతిష్య పరంగా చూస్తే! కుజ, రాహు దోషాలున్నవారు, సాంసారిక బాధలున్నవారు, ఈ కార్తీకమాసములో వచ్చే షష్ఠీ, చతుర్దశిలలో మంగళవారము నాడుగాని, చతుర్దశి బుధవారం కలసివచ్చే రోజుకాని దినమంతా ఉపవాసము ఉండి ఈ దిగువ మంత్రాన్ని స్మరిస్తూ!

**పాహి పాహి సర్పరూప నాగదేవ దయామయ**
**సత్సంతాన సంపత్తిం దేహిమే శంకర ప్రియ !**
**అనంతాది మహానాగ రూపాయ వరదాయచ**
**తుభ్యం నమామి భుజగేంద్ర సౌభాగ్యం దేహిమే సదా !**

అలా! ఆవు పాలు పుట్టలో పోసి నాగపూజచేసి చలిమిడి, చిమ్మిలి, అరటిపళ్ళు మున్నగునవి నివేదన చేస్తారు. ఆ సందర్భంగా పుట్టవద్ద 'దీపావళి నాటి మిగిలిన మతాబులు, కాకరపువ్వొత్తులు టపాసులు చిన్నారులు ఎంతో సంతోషంగా కూడా కాలుస్తారు. ఇలా స్త్రీలు ఆరాధిస్తే శుభప్రదమైన సుఖసంతానము; అదే కన్నె పిల్లలు ఆరాధిస్తే! మంచి భర్త లభించునని పలువురి విశ్వాసము.

ఈ విధమైన నాగుల ఆరాధన ఈనాటిదికాదు. యుగాలనాటిది. సౌభాగ్యానికి, సంతానప్రాప్తికి సర్పపూజ చేయుట అనేది లక్షల శరత్తులనాడే ఉన్నట్లు మన పురాణాలలో ఎన్నో గాథలు కానవస్తున్నాయి. దేశమంతట పలు దేవాలయాల్లో మెలికలతో ఉన్న నాగేంద్రుని విగ్రహాలు కనిపిస్తూ ఉంటాయి. ఈ "నాగులచవితి" నాడు నాగేంద్రుని శివభావముతో అర్చిస్తే సర్వరోగాలు పటాపంచలై సౌభాగ్యవంతు లవుతారని ఋషివచనం.

నాగేంద్రా! మేము మా వంశములో వారము నిన్ను ఆరాధిస్తున్నాము. పొరపాటున "తోకతొక్కితే తొలగిపో. నడుంతొక్కితే నా వాడనుకో! పడగ త్రొక్కితే కస్సుబుస్సుమని మమ్ములను భయపెట్టకు తండ్రీ! అంటూ పుట్టకు ప్రదక్షిణ నమస్కారాలు చేయాలని పెద్దలు చెప్తూ ఉంటారు.

ఈ నాగులచవితిరోజున ఈ క్రింది శ్లోకాన్ని పఠిస్తే కలిదోష నివారణ అవుతుందని శాస్త్రాలు పేర్కొంటున్నాయి.

**"కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ ।**
**ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్ ॥**

ఈ సర్పారాధనకు తామరపూలు, కర్పూరంపూలు, లడ్డు మున్నగునవి ప్రీతికరమని చెప్తారు. సర్పారాధనచేసే వారి వంశం 'తామరతంపరగా' వర్ధిల్లు తుందని భవిష్య పురాణం చెప్తోంది. మన భారతీయుల ఇళ్లల్లో ఇలవేల్పు సుబ్రహ్మణేశ్వరుడే! ఆయన అందరికీ ఆరాధ్య దైవంకాబట్టి వారి పేరును చాలామంది నాగరాజు, ఫణి, సుబ్బారావు వగైరా పేర్లు పెట్టుకుంటూ ఉంటారు.

నాగర్‌కోయిల అనే ఊరిలో నాగుపాము విగ్రహం ఉందిట! దాని సమీపంలో 6నెలలు తెల్లని ఇసుక 6 నెలలు నల్లని ఇసుక భూమిలో నుండి ఉబికి పైకివస్తుందని భక్తులు చెప్తూ ఉంటారు. నాగుపాము కుబుసానికి కూడా మంచి ఆయుర్వేద గుణాలు ఉన్నాయని, గరళాన్ని ఆయుర్వేద మందులలో తగుమోతాదలలో ఉపయోగిస్తారని ఆయుర్వేదశాస్త్రం చెబుతుంది. ఇలా ప్రకృతిలో "నాగు పాములకు, మానవ మనుగడలకు అవినాభావ సంబంధం కలదని విదితమవుతోంది.

ఇట్టి ఈ "నాగులచవితి" పండుగను విశేషంగా జరుపుకుని పునీతుల మవుదాము.







## కార్తీక పౌర్ణమి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు. |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : తెలుపు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : తెలుపు |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : తెలుపు |
| 9. | పూజించవలసిన ఫోటో | : శివపార్వతులు |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : శివలింగము |
| 11. | పూజించవలసిన దైవము | : శివుడు |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : పసుపు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : తెల్లటి పువ్వులు పారిజాత పువ్వులు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : తెల్లపూలమాల తుమ్మ పువ్వులు |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : బూరెలు+గారెలు |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : వడపప్పు+పానకం |
| 17. | నివేదించవలసిన పండ్లు | : అన్నిఫలాలు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : శివఅష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : లింగాష్టకం |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : శివపంచాక్షరీ స్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : శివ సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : శివపురాణము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : లింగోద్భవ అధ్యాయము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : శివాలయములు |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : శ్రీశైలం శ్రీకాళహస్తి |
| 26. | చేయవలసిన ధ్యానములు | : శివ ధ్యానములు |
| 27. | చేయించవలసిన పూజలు | : మహన్యాసక పూర్వక రుద్రాభిషేకం |

| | | |
|---|---|---|
| 28. | దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : ఏకాదశరుద్రాభిషేకం |
| 29. | ఆచరించవలసిన వ్రతము | : కేదారేశ్వరవ్రతము |
| 30. | ఉపవాసము నియమము | : వున్నది |
| 31. | జాగరణ నియమము | : లేదు |
| 32. | సేకరించివలసిన పుస్తకములు | : కార్తీకపురాణము |
| 33. | సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : కార్తీకపురాణము |
| 34. | స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : కార్తీకపురాణము |
| 35. | దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : సహస్ర లింగార్చన |
| 36. | దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : మహాలింగార్చన |
| 37. | పర్వదిన నక్షత్రము | : – |
| 38. | పర్వదిన తిథి | : పౌర్ణమి |
| 39. | పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : సోమవారము |
| 40. | పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : సా॥6గం॥నుండి 9గం॥ |
| 41. | వెలిగించవలసిన దీపారాధన కుంది | : మట్టి ప్రమిదలు |
| 42. | వెలిగించవలసిన దీపారాధనలు | : 108 |
| 43. | వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 1008 |
| 44. | వెలిగించవలసిన వత్తులు | : దూదితో |
| 45. | దీపారాధన వాడవలసిన నూనె | : నువ్వులనూనె |
| 46. | వెలిగించవలసిన అవునేతితోహారతి | : నక్షత్రహారతి |
| 47. | ధరించవలసిన తోరము | : నల్లటితోరము |
| 48. | నుదుటన ధరించవలసినది | : విభూది |
| 49. | 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం నమఃశివాయ |
| 50. | జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 51. | మెడలో ధరించవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 52. | మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : శివలింగము |
| 53. | చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. | ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : పడమర. |





## కార్తీకమాస మాహాత్మ్యము

మన భారతీయ సంస్కృతిలో ఈ కార్తీకమాసం వచ్చింది అంటే! ఆ నెల రోజులు మనకందరకు పండుగదినాలే! అందులోను ఈ కార్తీకమాసం ఈశ్వరారాధనకు చాలాముఖ్యమైనది. దేశం నలుమూలలా ఉన్న వివిధ ఆలయాలలో! రుద్రాభిషేకాలు, రుద్రపూజ, లక్షబిల్వదళాలతో పూజలు, అమ్మవారికి లక్షకుంకుమార్చనలు, విశేషంగా జరుపుతూ ఉంటారు. అలా విశేషార్చనలు జరిపే భక్తులకు సదాశివుడు ప్రసన్నుడై కొంగుబంగారంలా సంతోషం కలిగిస్తాడు. కావున ఆస్వామికి "ఆశు తోషుడు" అను బిరుదు కలిగింది.

**"హరిః ఓం నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వ రాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్ని రుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః**

అంటూ! మన భారతావనిలో ప్రతిఈశ్వరాలయాల్లో ఆ రుద్ర నమకం మంత్రభాగము మారుమోగిపోతూ! మరింతగా ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. మన హిందువుల గృహాలలో "ఆదిత్యమంబికా విష్ణు గణనాధం మహేశ్వరం" అనే పంచాయతన దేవతలను విశేషంగా ఆరాధిస్తారు.

ఇక ఈ కార్తీక మాసమహాత్మ్యమునుగూర్చి పూర్వం నైమిశారణ్య ఆశ్రమములో శౌనకాది మహామునుల కందరకు సూతమహాముని ఎన్నో విష్ణుభక్తుల చరిత్రములు విష్ణు మహిమలను వినిపించుసమయాన, ఓ సూతముని శ్రేష్ఠా! కలియుగమందు ప్రజలు సంసార సాగరమునుండి తరింపలేక; అరిషడ్వర్గములకు దాసులై ! సుఖమగు మోక్షమార్గము తెలియక ఎన్నో ఈతిబాధలు అనుభవిస్తున్న ఈ మానవులకు ధర్మములన్నింటిలో ఉత్తమ ధర్మమేది? దేవతలు అందరిలోనూ ముక్తి నొసంగు ఉత్తమ దైవమెవరు? మానవునికి ఆవరించియున్న ఈ అజ్ఞానమును రూపుమాపి పుణ్యఫలమిచ్చు కార్యమేది? ప్రతిక్షణము మృత్యువుచే వెంబడించబడు ఈ మానవులకు మోక్షము కలిగించు చక్కని ఉపాయము చెప్పమని కోరినారు.

ఆ ప్రశ్నలను ఆలకించిన సూతమహాశయుడు ఓ ముని పుంగవులారా! మీకు కలిగిన సంశయములు లోకోపకారమైనవి. క్షణికకమైన సుఖభోగాల కోసం పరితపించుచూ! మందబుద్ధులగుచున్న మానవులకు "ఈకార్తీకమాస వ్రతము" హరిహరాదులకు అత్యంత ప్రీతికరమైనది. దీనిని ఆచరించుట వల్ల జన్మజన్మలనుండి వారలకున్న సకల పాపములు హరింపబడి మరుజన్మలేక పరంధామము పొందగలరు. పుణ్యాత్ములకు మాత్రమే ఈ కార్తీకమాస వ్రతమాచరించాలని కోరికను కలుగజేస్తాడు. ఆ పరమాత్మ! దుష్టులకు దుర్మార్గులకు వారి కర్మలు పరిపక్వమయ్యేవరకు వార్కి ఏవగింపు కలిగిస్తాడు.

---

స్కంద పురాణమున 'ఈకార్తీకమాస' ప్రాముఖ్యమిట్లు చెప్పబడియున్నది.

**"న కార్తీక సమో మాసః న దేవః కేశాత్పరమ్**
**న చ వేదసమం శాస్త్రం, న తీర్థం, గంగాయాన్యమమ్."**

కార్తీకమాసమునకు సమానమైనది. విష్ణు దేవుని కంటే సమానమైన దేవుడు, వేదలముకు సమానమైన శాస్త్రములు, గంగ కంటే పుణ్యప్రదమైన తీర్థము లేనేలేవు అన్నది పురాణవచనం.

ఈ మాసమందు వచ్చు సోమవారములు చవితి ఏకాదశి, ద్వాదశి, పౌర్ణమి, అత్యంత పుణ్యప్రదమైనవి. నెలఅంతయు సాధ్యపడని భక్తులు కనీసము ఆయా దినములయందైన పవిత్రపుణ్య నదీ స్నానమాచరించి; ఉపవాస దీక్షలు చేస్తూ మహన్యాస పూర్వక మహారుద్రాభిషేకములు, లక్షబిల్వార్చనలు, లక్షకుంకుమార్చనలు, లలిత, విష్ణు సహస్రనామ పారాయణలు, ప్రతినిత్యము ఉభయ సంధ్యలలో దీపారాధన చేయువార్కి విశేష పుణ్య ఫలం లభిస్తుందని అలా ఈ కార్తీకమాస ముప్పది దినములు ఆచరించినవార్కి అనంతకోటి పుణ్యఫలం లభిస్తుందని చెప్పబడినది.



ఇందు అత్యంత మహిమాన్వితమైన కాలం "ప్రదోషకాలం". సూర్యాస్తమయ మయ్యాక మూడు గడియలు (ఒకగంట) "ప్రదోషోరజనీముఖమ్" రాత్రికి ఆరంభ కాలమే ఈ ప్రదోష సమయం. ఇలా ప్రతినిత్యము వచ్చు ప్రదోషాన్ని నిత్య ప్రదోషంగా చెప్తారు. ఈ ప్రదోషం నాలుగు విధాలుగా మహాత్ములు వివరిస్తూ ఉంటారు. 1. నిత్య ప్రదోషం 2. పక్షప్రదోషం 3. మాస ప్రదోషం 4. మహాప్రదోషం అని చెప్తారు.

కొందరు నిష్టాపరులు ఈ కార్తీకమాసమంతయు పుణ్యనదీస్నానమాచరిస్తూ ప్రతినిత్యము హరిహరాదులను పూజిస్తూ పగలు అపక్వాహారం అంటే వండని ఆహారం. పాలు, పండ్లు స్వీకరించి సాయంత్రం భక్తితో కార్తీక దీపారాధనలు, పూజలు కావించి నివేదించిన అన్నాన్ని రాత్రి భుజిస్తూ ఉంటారు. ఇలా ఈ "కార్తీక నక్తవ్రతాన్ని" నిత్యం ఆచరిస్తారు.

ఇక ఈ ప్రదోషకాలంలో పరమేశ్వరుడు ఏకకాలంలో రెండు రూపాల్ని ప్రదర్శిస్తూ ఎడమభాగాన పార్వతి రెండవ భాగమున పరమేశ్వరరూపంగా "అర్ధనారీశ్వరుడుగా" దర్శనమిచ్చేకాలం ఈ ప్రదోషకాలం అని చెప్పబడినది. ఆ సమయమందు:

**కైలాస శైల భవనే త్రిజగజ్జనిత్రీం గౌరీం నివేశ్యకన కాంచిత రత్న పీఠే ।**
**నృత్య విధాతు మభివాంఛతి శూలపాణే దేవాః ప్రదోషసమయేను భజంతి సర్వే॥**

అలా ! ఆ ముగ్గురమ్మల తల్లి స్వర్ణరత్న సింహాసనంపై ఆ ప్రదోష సమయాల్లో ఆ తల్లి "అధ్యక్షురాలు"గా అధిరోహించియుండగా! పరమేశ్వరుడు పరవశించి





తాండవం చేస్తూ ఉంటాడు. ఆ నృత్యాన్ని దర్శించటానికి దేవతలందరూ అక్కడ కొలువుతీరి ఉంటారుట! ఆ సమయంలో ఆ తాండవ నృత్యానికి అనుగుణంగా సరస్వతి దేవి వీణవాయిస్తూ ఉంటే బ్రహ్మ తాళం వేస్తాడట. శ్రీమహాలక్ష్మి గానంచేస్తూ ఉంటే! శ్రీహరి మృదంగం వాయిస్తాడుట. ఇక ఇంద్రుడు వేణునాదంతో పులకింపచేస్తూ ఉంటాడుట! అట్టి ప్రదోష సమయాల్లో దేవగంధర్వ మహర్షి సిద్ధులందరూ, అట్టి పరమాత్మ స్వరూపాన్ని కొలుస్తూ ఉంటారుట.

కనుక ప్రదోష సమయాల్లో ఇతర దేవతలసాన్నిధ్యం కొరకు వేరే ఆలయాలకు పోనక్కరలేదు. కావున అట్టి సమయమందు శివుని ఆరాధిస్తే ! మనకు శివుని ఆశీస్సులతోపాటు మిగతాదేవతల ఆశీస్సులు కూడా ఏకకాలంలో మనం పొంద గలుగుతామవి చెప్పబడినది. ఇంకా మనకు ఆ "అర్ధనారీశ్వర" స్వరూపాన్ని ధ్యానిస్తే! రెండు ప్రయోజనాలు లభిస్తాయట, "కామం" అంటే కోర్కెలను నియంత్రించేశక్తి మరియు 'కాలాన్ని' అంటే మరణాన్ని జయించేశక్తిని ప్రసాదిస్తాడుట! అందువల్లనే పరమేశ్వ రుడు కాల సంహారమూర్తిగా, కామ సంహారమూర్తిగా బిరుదులు పొందినాడుట! ఇంకా ఈ ప్రదోష దర్శనం సర్వశుభాలను కలుగజేసి, సర్వదారిద్ర్య బాధలను తొలగించి సర్వసంపత్తులు అనుగ్రహిస్తుంది అని చెప్పబడినది.

ఈ కార్తీకమాసమందు అత్యంత విశేషమైనది "ఉత్థానైకాదశి"అంటే శ్రీమహావిష్ణువు పాలకడలిలో ఆదిశేషుని పాన్పుపైన ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు తనయోగనిద్రను ప్రారంభించి-తిరిగి కార్తీక శుద్ధ ఏకాదశి నాడు కనులు విప్పి యోగ నిద్రనుంచి మేల్కొన్న రోజుకే! "ఉత్థాన ఏకాదశి" అను పేరు. ఆ మరుసటి రోజు ద్వాదశినాడు ముప్పది ముగ్గురు దేవతలలో శ్రీమహాలక్ష్మీసమేతుడై తులసీ ధాత్రివనమందు ఉంటాడని చెప్తారు.

ఈ ద్వాదశిని "క్షీరాబ్ధి ద్వాదశి" అంటారు అంటే, పూర్వం కృతయుగంలో దేవదానవులు పాలసముద్ర మథనము చేసిన రోజు. కనుక దీనికి "క్షీరాబ్ధి ద్వాదశి"అను పేరు వచ్చినది. మరియు పాలసముద్రమును చిలికినారు కావున "చిల్కు ద్వాదశి" అని కూడా పిలుస్తూ ఉంటారు. కావున స్త్రీలు ఈ రోజు వారి సౌభాగ్య సంపదలకోసం తులసీ ధాత్రి వనమందు (తులసికోట) వద్ద విశేష దీపారాధనలు గావించి షోడశోపచారములతో తులసీధాత్రి లక్ష్మీనారాయణులను పూజిస్తారు. ఆ రోజు దేశము నలుమూలలా గల ఆలయాలలోని "లక్ష్మీనారాయణ మూర్తులను" మిరుమిట్లు గొలిపే విద్యుత్ దీపకాంతితో, బాణసంచాలతో సమీప నదీజలాలలో 'తెప్పోత్సవం' నిర్వహిస్తూ ఉంటారు. కార్తీక పూర్ణిమనాడు వరిగడ్డిని వెంటిగాచుట్టి దానిని రెండు స్తంభములకుకట్టి ఆ వెంటిని మూడుమార్లు కాగడాలతో వెలిగిస్తూ వాటిక్రింద పార్వతీపరమేశ్వరుల ప్రతిమలను పల్లకిలో ఉంచి ముమ్మారు త్రిప్పి "జ్వాలాతోరణ" వేడుకను నిర్వహిస్తారు. అలా హరి హరాదులకు ప్రత్యేక

ఉత్సవ వేడుకలు నిర్వహిస్తూ ఉంటారు. ఈ మాసమందు నాగులచవితికి పుట్టలో పాలు పోయుట, కార్తీకపౌర్ణమికి కార్తీక చలివిళ్ళ నోము నోస్తూ వుంటారు. ఇలా ఈ కార్తీకమాస విశేషాలను కొనియాడి చెప్పుటకు సహస్రముఖములు కలిగిన ఆదిశేషుడు; చతుర్ముఖుడైన బ్రహ్మకే సాధ్యము కాదని చెప్పగా; ఇక మానవ మాత్రులమైన మనమెంత? అని సూతమహాముని చెప్పుకుని వస్తూ; దీపదాన విశేషాలను కూడా సమీక్షించి చెప్పియున్నారు.

ఇక మన భారతీయ సంస్కృతిలో ఈ దీపారాధన అనేది ప్రధానంశం. ఈ దీపదానం చేయుటవల్ల స్త్రీ పురుషులు ఇరువురు పుట్టినది మొదలు వివిధ దశలలో వారు చేసిన పాపాలు అన్నియు ఈ దీపదానముతో అగ్నిలోపడిన మిడుతలవలె పటాపంచలవుతాయని చెప్పబడినది.

ఈ దీపదానమందు ఆవునెయ్యి ఉత్తమోత్తమమైనది. మంచి నూనె మధ్యమము, ఇప్పనూనె అధమము, ఇతరములైన అడవియందు పుట్టిన నూనెలు అధమాతి అధములు. గేదెనేతితో దీపము వెలిగించిన పూర్వ పుణ్యము కూడా నశించి పోతుంది. అదే స్వల్పముగా ఆవునేయి కలిపి వెలిగించిన దోషములేదని, అలా! ఒకటి మొదలు వేయి వరకు దీపములు వెలిగించుట ఎంతో శుభప్రదమని వాటి సంఖ్యనుబట్టి వివిధ ఫలితాలు అందిస్తుందని, దీపదాన మాహాత్మ్యములో చెప్పియున్నారు. అట్టి దీపారాధన పూజామందిరమందు, దేవాలయములలో గృహప్రాంగణములలో, తులసీ బృందావనమందు, మారేడు, రావి వంటి దేవతా వృక్షాలవద్ద, పుణ్య నదీతీరములందు వెలిగించుట అత్యంత పుణ్యప్రదమని మనపురాణాలు వర్ణించి చెబుతున్నాయి.

ఈ మాసమందు సోదరి చేతివంట 'భగినీహస్తభోజనము' చేసి యధాశక్తి వార్కి కానుకలు సమర్పించుటతోపాటు, సమీప ఉసిరిచెట్టుగల వనమందు బంధువులు, స్నేహితులతోకూడి ఉసిరిచెట్టును పూజించి, మనస్సుకు ఆనందం కలిగించే ఆటపాటలతో కాలక్షేపం చేస్తూ! సాత్విక ఆహారముతో "వనభోజనములు" చేస్తూ ఉండుట మంచిది. అందువల్ల మన జీవన గమనంలో మంచి ఆహ్లాదముతోపాటు 'అన్నదాన' ఫలితముకూడా లభిస్తుంది.

అట్టి మహిమాన్వితమైన ఈ కార్తీకమాసమందు నియమనిష్టలతో హరిహరాదులను అనునిత్యము ఆరాధిస్తూ "కార్తీకపురాణ" పఠనము గావించిన యెడల అనంతకోటి పుణ్యఫలం లభిస్తుందని, ఈ పవిత్ర పుణ్యదినములందు అలసత్వము వహించకుండా యథాశక్తి దీపదానము, వస్త్ర, ఫల, పుష్ప, సువర్ణ దానములు మొదలైనవి చేయుటవల్ల ఇహమందు సర్వసుఖములు అనుభవించుటయే కాకుండా; జన్మాంతరమందు జన్మరాహిత్యాన్ని పొందగలరని ఈ "కార్తీకమాస వ్రతమాహాత్మ్యము" ను గూర్చి సూతమహాముని శౌనకాది మునులకు వివరించినాడు.





సంవత్సరంలో వచ్చే అన్ని మాసాలలో అతిపవిత్రమైనది కార్తీకమాసం. దైవ సంబంధికమైన వ్రతాలకు, నోములకు ఉపవాసాలకు ఇత్యాది శుభకార్యములకు ఈ మాసం అనువైనది. ఎందుచేతనంటే మే, జూన్‌లలో ఉండే అధిక ఎండలుగాని, డిశంబర్, జనవరిలో ఉండే అధిక చలిగాని ఈ మాసంలో ఉండవు. ఈ మాసంలో వాతావరణం ప్రశాంతంగా, నిర్మలంగా ఉంటుంది. ఈ కాలంలో నదీస్నానములు చెప్పుకోతగ్గవి. నదులలోని నీరు ఉదయం సూర్యరశ్మివల్ల వేడెక్కి, రాత్రి సమయంలో చంద్రుని కిరణాలవల్ల చల్లబడుతుంది. ఇదే కాకుండా అడవులలోని ఔషధమొక్కలు నదీ ప్రవాహంలో కలియుటవల్ల నీరు స్వచ్ఛంగా ఉంటుంది. అందుచేత నదులలో స్నానం చేయుటవల్ల ఆరోగ్యం చక్కగా ఉండడమే కాకుండా మనసు ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది.

## కార్తీకమాసం – విశిష్టత

ఆయా మాసాలలో చంద్రుడు పూర్ణుడై ఏ నక్షత్రంలో ఉంటాడో ఆ నక్షత్రం పేరే ఆ మాసానికి వస్తుంది. కృత్తికా నక్షత్రంపై చంద్రుడు పూర్ణుడై ఉండటంవల్ల ఈ మాసానికి కార్తీకమాసమని పేరు. ఈ మాసంలో కృత్తిక నక్షత్రానికి, దీపారాధనకు, సోమవారాలకు ప్రాధాన్యత ఉంది. ఈ విషయాలను గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

**కృత్తికా నక్షత్రం :-**

ఈ కృత్తికానక్షత్రంనకు నక్షత్రాలలో మంచి ప్రాముఖ్యత వుంది. దేవతలలో ప్రథముడైన అగ్నిదేవుడు ఈ నక్షత్రానికి అధిపతి. అగ్ని నక్షత్రాలైన కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢలలో మొదటిది కృత్తికయే. వేదకాలంలో సంవత్సరం కృత్తికా నక్షత్రంతోనే ఆరంభమయ్యేది. ఈ నక్షత్రాన్ని 'అగ్నినక్షత్రమని' అంటారు. అగ్ని ఆరు ముఖాలు కలవాడు. కృత్తికలు కూడా ఆరు నక్షత్రాలు. ఈ కృత్తికలకు ఒక విశిష్టత ఉంది. అదేమిటంటే కుమారస్వామిని షణ్ముఖుడు అంటారు. అంటే ఆరు ముఖములు కలవాడని అర్థం. ఆకాశంలోని ఆరు కృత్తికా నక్షత్రములు మాతృమూర్తులై పాలు యివ్వగా కుమారస్వామి ఆరు ముఖాలతోపాలు త్రాగాడు. ఈ విధంగా కృత్తికలచే పెంచబడుటచే కుమారస్వామికి 'కార్తికేయుడని' పేరు వచ్చినది. ఈ కారణాలవల్ల కృత్తికలకు ప్రాముఖ్యం కలిగినది.

**కార్తీక దీపాలు :-**

ఈ మాసంలో చెప్పుకోతగ్గ మరో అంశం దీపారాధన. ఈ మాస ప్రారంభం నుండి సూర్యోదయానికి పూర్వమే లేచి నదీస్నానమాచరించి శుచియై, పొడిబట్టలు

ధరించి దీపారాధన చేయవలెను. ఈ మాసాన భక్తులు తండోపతండాలుగా నెయ్యి తీసుకుని అరుణాచలకొండ(తమిళనాడులోని) మీద జ్యోతిని వెలిగిస్తారు. ఈ జ్యోతి చాలా రోజుల వరకు వెలుగుతూ పరిసర ప్రాంతాలన్నింటికీ కనబడుతూ ఉంటుంది. ఈ మాసంలోనే జ్వాలా తోరణాన్ని కొన్ని చోట్ల వెలిగిస్తారు. ఈ కాలమంతా దేవాలయాలన్నీ దీపాలచే అలంకరించబడి ప్రజలను ఉత్తేజపరుస్తూ శోభాయమానంగా ఉంటాయి. ప్రతి ఇంటి ముంగిట ఈ మాసాంతం వరకు దీపం వెలుగుతూ ఉంటుంది. ఈ కార్తీకమాసంలో స్త్రీలు నదులలో, కోనేటిలో దీపాలు వదులుతారు. ఈ దీపాలు ఆకాశంలోని చుక్కలవలె ప్రకాశవంతంగా వెలుగుతూ అమితానందాన్ని చేకూరుస్తూ కన్నులపండుగను కలుగజేస్తాయి. ఈ మాసంలో స్త్రీలు దీపాన్ని దానంగా ఇస్తారు. దీనివల్ల వారికి ఎనలేని కీర్తిసౌభాగ్యాలు కలుగుతాయని భావిస్తారు. ఈవిధంగా ఈ మాసమంతా నిత్యదీపారాధనతో వెలుగుతో నిండి ఉంటుంది. ఈ దీపాలు మనిషిలోని అజ్ఞానమనే చీకటిని తొలగించి జ్ఞానమనే వెలుగును నింపుతాయి.

**కార్తీక సోమవారాలు :-**



ఈ మాసవారాలలో సోమవారానికి ప్రత్యేకత ఉంది. సోమవారానికి చంద్రుడు అధిపతి. దేవతలలో ప్రథముడైన అగ్నినక్షత్రాలలో మొదటిదైన కృత్తికకు అధిపతిగా ఉండటం, చంద్రుడు పూర్ణుడై ఈ నక్షత్రం మీద ఉండటం చేత మాసంలోని సోమవారాలకు విశిష్ఠత కలిగినది. చంద్రుని వారమైన ఈ సోమవారం శివునికి ఎంతో ప్రీతికరమైనది. శైవభక్తులు ఈ మాసంలో ముఖ్యంగా సోమవారాలలో భక్తిశ్రద్ధలతో నియమనిష్టలతో శివుణ్ని ఆరాధిస్తారు. ఈ మాసకాలంలో సూర్యోదయ పూర్వమే బ్రహ్మ ముహూర్తమున నదీ స్నానమాచరించి 'హరహరశంభో' అంటూ శివుణ్ణి స్తుతిస్తూ హిందూ ప్రజలంతా భక్తిప్రపంచంలో మునిగిపోతారు. ముఖ్యంగా శైవభక్తులు ఈ మాసమంతా ఉపవాసముండి శివుడిని పూజిస్తారు. శివప్రీతికరమైన సోమవారమున భానోదయం ముందు లేచి స్నానాదికార్యక్రమాలు ముగించుకుని, పొడి బట్టలు ధరించి మొదటగా దీపారాధన చేయాలి. అనంతరం శివుడికి రుద్రాభిషేకం చేయించి శివవ్రత నియమాలను పాటించవలెను. ఈవిధంగా చేయడంవల్ల నిత్యమూ సిరిసంపదలతో, సుఖసౌఖ్యాలతో, ఆనందోత్సాహాలతో వర్ధిల్లుతారని ప్రజల నమ్మకం.

ఈ కార్తీక సోమవారాలలో వనభోజనం చేస్తారు. ఉసిరిక చెట్టుకింద భోజన చేయడంవల్ల శుభప్రదమని ప్రతీతి. ఈ సోమవారాలలో శివుడిని అర్చించి అనంతరం అన్నదానమును నిర్వహించి, అతిథి సత్కారాల తరువాత దీక్షవహించిన వ్యక్తి భుజించవలెను. ఈ నియమాలను పాటించడంవల్ల శివానుగ్రహం కలిగి సర్వపాపములు నశించును.





**తులాసంస్థే దినకరే కార్తికే మాసి యో నరః ।**
**స్నానం దానం పితృశ్రాద్ధ మర్చనం శుద్ధమానసః**
**తదక్షయ్యఫలప్రాహుర్యత్కరోతి నరేశ్వర ।**
**సక్రమం వా సమారభ్య మాసమేకం నిరంతరమ్॥**

**మానస్య ప్రతిపద్యాం వా ప్రారభేత్కార్తికవ్రతమ్ ।**
**నిర్విఘ్నం కురు మే దేవ దామోదర నమోస్తుతే**
**ఇతి సంకల్ప్య విధిత త్పశ్చాత్స్నానం సమాచరేత్ ।**

ఏ మనుష్యుడైనను తులారాశియందు సూర్యుడుండగా కార్తీకమాసమందు సూర్యోదయ కాలమునకు లేచి కాలకృత్యంబుల నిర్వర్తించి, నదీస్నాన మొనరించి, జపము, దేవపూజ, తీర్థవిధి మొదలగు కార్యములను జేసినచో గొప్ప ఫలంబు సంప్రాప్తించునని యందురు. సూర్యుడు తులారాశి యందు ప్రవేశించిన నాటినుండి గాని, కార్తీక మాసారంభదినమగు శుద్ధపాడ్యమి మొదలుకొనిగాని వ్రతారంభమును చేయవలయును. అట్లు ప్రారంభించు సమయమున "ఓ కార్తీక దామోదరా! నీకు వందనములు. నాచే నారంభింపబడు కార్తీక వ్రతంబును విఘ్నము లేకుండ జరుగునట్లు చేయుము, అని పిమ్మట స్నానము చేయవలెను.

ఆ విధముగ జీవనదికిబోయి గంగకును, శ్రీమన్నారాయణునకును, భైరవునకును నమస్కరించి భైరవాజ్ఞను తలదాల్చి మొలలోతు నీటిలో నిలువబడి మొదట సంకల్పము జెప్పికొని సూక్తములను జదివి, మార్జన మంత్రముతోడను, అఘమర్షణ మంత్రముతోడను, గంగోదకమును శిరస్సున జల్లుకొని అఘమర్ష స్నానమాచరింపవలెను. పిదప సూర్యున కర్ఘ్య ప్రదానమొసంగి దేవతలకును, ఋషులకును, పితృదేవతలకును క్రమప్రకారముగ తర్పణంబు లొనర్పవలెను. అపుడది సుస్నానమగును. స్నానము చేసిన పిమ్మట నదీతీరము జేరి మూడు దోసిళ్ళ నీరు గట్టుపైన పోయవలెను. కార్తీకమాసంబున గంగా గోదావరి కావేరీ తుంగభద్రాదినదులందు స్నానమొనర్చిన నత్యుత్తమము, గంగానది కార్తీకమాసము నందు నదులన్నిటియందు ద్రవరూప సన్నిహితయై యుండును. శ్రీ ఆదినారాయణుండు గోష్పద మాత్ర ప్రదేశమందున్న జలమునందు సన్నిహితుడై యుండునని వేదములు, శ్రుతీస్మృతులు చెప్పుచున్నవి కావున సముద్రకామియగు నదీ స్నానము మిగుల పవిత్రమైనది. నదీ స్నానావకాశము లభింపనిచో! కులువ యందుగాని, చెరువు నందుగాని, కూపము కడగాని సూర్యోదయము స్నానము చేయవలెను. ఇది బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీ పురుషులకు ముఖ్యము. పిదప నారవేసిన వస్త్రముతో శరీరమును దుడిచికొని, మడిబట్టలను ధరించి ముందుగ భగవంతుని స్మరింపవలెను. తదుపరి భస్మమును త్రిపుండ్రముగా నుదుట ధరింపవలెను. లేక గోపీచందనమునైన

నుదుట నూర్ధ్వపుండ్రముగా నుంచుకొనవలెను. అనంతరము సంధ్యావందనము, బ్రహ్మ యజ్ఞమును ముగించి, నిత్యాగ్నిహోత్రమును గావించుకొని దేవతార్చనమును జేయవలెను. దేవపూజకు తన యింటిదొడ్డిలోగాని, తోటలోగాని లభించిన పుష్పము లనే స్వయముగ తెచ్చి ఉపయోగించుట ప్రధాన ధర్మము, స్నానతీర్థమునందే కార్తీక పురాణ శ్రవణమును గావించుకొని, స్వగృహంబునకుబోయి, అతిథిపూజ, వైశ్వదేవము మొదలగు నిత్యకర్మలను జేసి, తృప్తిదీర భుజించి, రెండుమారు లాచనమనము జేసిన శుద్ధుడగును. పిదప పురాణమును స్వయముగా జదువుటయో, లేక ఇతరులవలన వినుటయో చేయవలెను. సూర్యుడస్తమించు కాలమున సాయం సంధ్యను పూర్తి జేసికొని శివాలయమునగాని, విష్ణ్వాలయమునగాని దీపారాధన జేయవలెను. షోడశోపచార పూజావిధానమున హరిహరులను బూజించి షడ్ర సోపేతమై, భక్ష్యభోజ్యాదులతోగూడిన నైవేద్యము నిడవలయును,అటు పిమ్మట మౌనముదాల్చి, చేతులు మోడ్చి మంత్రములచేగాని, స్తోత్రములచేగాని, గీతములచే గాని, అష్టపదులచేగాని హరిహరులను స్తుతిచేయవలెను. ఈ రీతిగా కార్తీకశుద్ధ ప్రతిపత్తు మొదలు అమవస తుదివరకు నెలదినములు నక్త వ్రతము చేసినచో కార్తీకమాస వ్రతము పూర్తగును. మరునాడు శక్తిననుసరించి మృష్టాన్నముతో భూతతృప్తి గావించవలెను. ఇట్లు వ్రతమాచరించిన స్త్రీలు,పురుషులకు ఈ జన్మమునందును, పూర్వజన్మమునందును నొనరించిన పాపంబులు పటాపంచలై, పవిత్ర వంతులై మోక్షార్హులగుదురు. ఇందు సందియ మించుకయులేదు. మరియు నిట్లు చేయనవకాశములేక వారితోగూడి సంతసించినను వారితో సమానమగు ఫలితము నందుదురు.

కార్తీకమాస మహత్త్యమును, అందు మిగుల ముఖ్యముగ సోమవార వ్రతమహిమను దెల్పుచున్నాను. సావధానముతో వినుము. కార్తీక మాసమహాత్త్య మును వినువారికి పాపములు బాయుటయేగాక మిగుల పుణ్యముగూడ లభించును. కార్తీక మాసమున సోమవారమున శివప్రీతికై సోమవారవ్రతము నొనర్చినవారికి కైలాసమున శివుని సన్నిధానమున నుండుట ప్రాప్తించును. కార్తీక సోమవారమున పై అధ్యాయమున వచించిన నదులలో దేనియందైనను స్నానమునుజేసి యధాశక్తిగ దానధర్మముల నాచరించినవారికి, వేయి అశ్వమేధయాగంబులు చేసిన ఫలితము లభించును. సోమవారవ్రత విధాన మెట్టిదన-సోమవారమున నదీస్నాన మొనర్చి సంపూర్ణముగ నుపవసించి శివునకభిషేకమొనర్చి రాత్రి మొదటి యామమున భుజింపవలెను. ఆ దినమున నితరుల వలననే పదార్థమును గ్రహింపరాదు. తిలదాన మొనర్చినందువలన పాపములన్నియు నశించును గాన తిలదానమును చేయవలెను. ఇంకను నత్యంత నిష్ఠతోను, భక్తితోను నాచరింప నవకాశమున్నవారు ఆ దినమున రాత్రిగూడ నిద్రింపక పురాణాది పఠనంబువలన జాగరణమొనర్చి, మరునాడు శక్తికొలదిగ బ్రాహ్మణులకు సంతర్పణమును చేసి పిదప భుజింపవలయును. ఈ పై రెండును జేయలేనివారు సోమవారమున నపరాహ్ణము వరకుండి భుజించవలెను. అదియును జేయశక్తిలేనిచో బ్రాహ్మణులతోగూడ మధ్యాహ్నకాలమున భుజించవలెను. దానికిని అవకాశములేనప్పుడాదినమున నితరుల నుండి అదియు గ్రహింపక తన కీశ్వరుడిచ్చినదాని ననుభవించి ఆ దినమంతయు శివుని ధ్యానింపుచుండవలయును. కార్తీక సోమవారమున తిలదానము సేయుట సమకూడినను, సమకూడకున్నను, మిగిలిన యైదింటిలో ఏదేని యొకదానిని తప్పక నాచరింపవలెను. ఇందేది జేయుటకు శక్తిలేనిచో నదీస్నానమును గావించుకొని భగవంతుని ధ్యానించవలెను. శక్తియు, అవకాశమును కలిగియుండియు నీయైదింటిలో నేయొక దానినైనను కార్తీక సోమవారమున చేయనివాడు కుంభీపాకంబను నరకమున గూలును. భర్తలేని వితంతువు కార్తీక సోమవారమున నుపవాసముచేసి శివుని ధ్యానించినచో శివలోకవాసము లభించును. విష్ణుధ్యాన మొనర్చిన వైకుంఠవాసము ప్రాప్తించును. సోమవారమున స్త్రీగాని, పురుషుడుగాని నక్షత్ర దర్శనమగువఱ కుపవసించి పిమ్మట భుజించిన వారి పాపములు అగ్నిలోబడిన దూదివలె నాశనమగును. మరియు నా దినమున శివుని కభిషేకమొనర్చి బిల్వదళంబులచే సహస్రనామార్చనము నొనర్చినను, ఇతరులచే చేయించినను, శివపంచాక్షరీ మంత్రమును జపించినను, వారిని శివుడనుగ్రహించి సర్వసంపదలను, సమస్త శుభంబులను చేకూర్చును.



**కార్తీకమునందలి పర్వతిథులు :-**

కార్తీక శుద్ధపాడ్యమి తిథిని గోక్రీడన ప్రతిపత్తని వ్యవహరింతురు. ఈ దినంబున గోవుల నలంకరించియు, మేపియు, ఊరిబయటకు గొంపోయి వాటితో నాదు కొనుటయు సంప్రదాయ బద్ధమైయున్నయది. ఈ దివసంబున గోపూజ గావింప వలయును.

కార్తీక శుద్ధ విదియను యమ ద్వితీయ యనియును, భ్రాతృద్వితీయ యనియును వ్యవహరింతురు. ఈ తిథియందు యముని సోదరియగు యమున తన సోదరిని పూజించి భోజనమిడి తృప్తిపరచి బహుమతులను పొందియుండుటం జేసి, యీ దినంబున కాయా నామ ధేయంబులు ప్రసిద్ధములయ్యెను.

కార్తీక శుద్ధ చతుర్థికి నాగచతుర్థియనియును, నాగుల చవితి యనియును వ్యవహరింతురు. ఈ దినంబున ఉపవాసముండి నాగేంద్రునకు పాలను నివేదింతురు. కొందరు పాముల పుట్టలలో పాలుపోసి నాగపూజ యొనర్తురు. అట్లుచేసిన వారలకు సర్పబాధ కలుగనేరదు. కొందరు గణపతిని బూజింతురు. ఇంకను కొందరు శ్రావణ శుద్ధ చతుర్థిని నాగచతుర్థియని నాగపూజ సల్పెదరు.

కార్తీక శుద్ధపంచమి, శ్రావణ శుద్ధ పంచమి నాగపంచము లనబడును. ఈ దినములయందు నాగపూజ యొనరింతురు. కొందరు శ్రావణ శుద్ధ పంచమిని గరుడపంచమి యని గరుడపూజ గావించుచుందురు. ఒకే దినమునందు చతుర్థి, పంచమి, షష్ఠి తిథులు కొద్దిగనో, గొప్పగనో ఉదయా రుదయములోపన నడచు నరువది ఘటికలయందు సంభవించు కలిసిన యెడల నాదినమున నధిక పవిత్రవంతమగు పర్వదినముగ నెంచెదరు.

కార్తీక శుద్ధ షష్ఠి సుబ్రహ్మణ్య షష్ఠి యగును. దక్షిణ దేశమున, అందు ముఖ్యముగ మళయాళమున సుబ్రహ్మణ్యపూజ లొనరింతురు. పళనిక్షేత్రమున సుబ్రహ్మణ్యపూజ లధికముగ జరుపబడుచుండును. కార్తీకశుద్ధ అష్టమిని గోష్టాష్టమి యని వ్యవహరింతురు. కార్తీకశుద్ధ నవమిని అక్షయనవమియనియు, కూష్మాండ నవమి యనియు వ్యవహరింతురు. ఈ దివసంబున విష్ణుభగవానుడు కూష్మాండుడను రక్కసుని హతమార్చెను. దానంజేసియూ దినంబున విష్ణుదేవుని యారాధించి పూజింతురు. ఇంకను కొందరు గుమ్మడికాయ (కూష్మాండము) నీ దినమునందు దానము గావించుటయును గలదు. ఈ దినము నుండి మూడు రోజులు తులసీయుతుడైన నారాయణుని స్వర్ణ ప్రతిమను పూజించెదరు.

కార్తీక శుద్ధ ఏకాదశిని బోధన ఏకాదశి, మేల్కొల్పు ఏకాదశి, ఉత్థానైకాదశియను పేర్లతో వ్యవహరించు చుందురు. విష్ణుదేవుండది వరకు నిద్రించుచుండ శంఖునిబాధల మేల్కొంచుటచే నాయా పేరులు ప్రసిద్ధములయ్యెను. ఈ దినమునందు పవసించి జాగరణము చేయవలయును.

కార్తికశుద్ధ ద్వాదశిని యోగీశ్వర ద్వాదశియనియును క్షీరాబ్దిద్వాదశి యనియును చిలుకు ద్వాదశి యని వ్యవహరింతురు. మందరగిరిని వాసుకి నాగపాశముచే విష్ణుదేవుని కూర్మావతారమును పరికరములుగ దేవాసురలు పాలసముద్రమును మథించగా సంద్రమున హాలాహలమునంబడు విషము, ఉచ్ఛైశ్రవము ఐరావతము, కల్పవృక్షము, అప్సరోగణము, చంద్రుడు శ్రీదేవి, అమృత కలశమును ధరించిన ధన్వంతరి జనించిరి. ఈ క్షీరాబ్ధీ మధన మాదిని పవిత్ర దినమగుటంజేసి క్షీరాబ్ధి ద్వాదశియను ప్రసిద్ధమయ్యెను. బృందానామధేయురాలగు తులసిని మెచ్చి శ్రీకృష్ణపరమాత్మ బృందావనంబున కరిగి నను్రగహించి పరిగ్రహించిన దినంబున యగుటంజేసి తులసీదేవి సహిత సలక్ష్మీనారాయణ దివసంబున స్త్రీలు పూజించుచుందురు. యీ దినంబునకు పదునైదవ దివసంబున గలుగు బహుళ ద్వాదశిని గోవత్సద్వాదశియని, వ్యవహరించి కార్తీక శుద్ధ చతుర్దశిని పాషాణ చతుర్దశి యని వైకుంఠ చతుర్దశి అని వ్యవహరింతురు. మన దేశీయులీ దివసంబున కదళీవ్రతము నాచరింతురు. ఈ దివసంబుననే వారణాసియందలి విశ్వేశ్వరుని ప్రతిష్ఠి జరిగినది. కార్తిక వ్రతోద్యాపన మీదినంబున చేయబడును.



దీనిని త్రిపురదహనము, జ్వాలా తోరణము, పౌర్ణమియని వ్యవహరింతురు. భక్తేశ్వరవ్రతము నాచరింతురు. కేదారేశ్వర వ్రతమును యుపవసించి మట్టియాకుల యూడలదెచ్చి పూజ చెంతనుంచి వివిధ రకముల పిండి వంటలతో సూర్యోదయా నంతరము సదాశివుని పూజించి కేదారేశ్వరుని సూర్యాస్తమయా నంతరము సదాశివుని పూజించి కేదారేశ్వర వ్రతకథను చదివి నివేదించిన వంటకముల నారగింతురు. పీఠము చెంత నివేదించిన పిండివంటల నితరులకొసంగరు. అర్చన కుంకుమను సహితము ఇంటి యాడపడుచులకు నొసంగరు. అటుల యిచ్చిన వారలనేక కష్టముల పాలగుచుండుట యనుభవసిద్ధము. ఈ వ్రతమును కొందరు పౌర్ణమి దినమునందు చేయుటకు మారుగ సోమవారముల యందును చేయు సంప్రదాయము గన్పట్టుచున్నది. సోమవారం శివ ప్రీతికరమగు దివసంబగుటచేత నాదినంబున ప్రదోషకాలము పవిత్రమైనదను ప్రమాణములు పెక్కు లభ్యమగు చున్నయవి.

ఈ దివసంబున లక్ష్మీవ్రతము గావింతురు. ఈ దినము సోమవారము సంభవించెనేని "అమా సోమవార వ్రత" మొనర్చుదురు. ఇయ్యది సూర్యగ్రహణ తుల్యముగా పవిత్రవంతమని చెప్పబడియున్నది. అమావాస్య దివసంబున తెల్లవారు జామున దీపములు అరటి దొన్నెయందు వెలిగించి ప్రవాహములయందు విడువ వలయును. ప్రవాహములు లభ్యముకానిచో నొక పెద్ద పాత్రయందు జలముంచి దానియందే విడువవచ్చును.

కార్తికము శివునకును, విష్ణుభగవానునకును ప్రీతికరమగు మాసమైయున్నది. శివకేశవులకు భేదములేదు. భేదభావం గలవారు నీచజన్మముల పొందవలయునని పురాణములు ఘోషించుచున్నవి. దానంజేసియే మనము సంధ్యావందనము చేయునపుడు శివకేశవ భేదస్మరణమును శివాయ-విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే-శివస్యహృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయగ్ం శివః అని చెప్పుచుందుము. దానంజేసి యీ మాసమున మన మనసులు మెచ్చిన ఇచ్చగించిన యారామములకేగి దైవమును పూజించుట శ్రేయము. యీ మాసమునందు చేయంబడు అభిషేకములు, సహస్రనామాది షోడశోపచార పూజలు మొదలగునవెల్ల విశేష ఫలితముల నొసంగును. గాక యథాశక్తి నాచరించి ధన్యులగుటయును పూర్వజన్మ సుకృత విశేషముచేతనే ప్రాప్తించుచుండును. అయినను మానవ ప్రయత్నమవసరమని పెద్దలు పలుకుచుందురు. నిష్కామకర్మల నొనరించు వారలకెట్టి స్వప్రయత్నమును అవసరములేదని వేరుగా జెప్పంబనిలేదు. శివానుగ్రహమే సర్వసంపదలకూ మూలము.



## తులసి పూజ - తులసి ప్రాశస్త్యమ్

**శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతా**
**య దగ్రే సర్వవేదశ్చ తులసీం త్వా నమామ్యహమ్ ॥**

శ్రీ మహాలక్ష్మి నారాయణ స్వరూపిణియైన "తులసి"యొక్క మూలంలో సర్వతీర్థాలు, మధ్యభాగమందు సమస్త దేవతలు, తులసిమొక్క పైభాగమున సర్వవేదాలతో కొలువైవున్న తులసి మాతకు ముందుగా నమస్కరించుకుని, అంతటి పూజ్యనీయమైన ఆ తులసి ఆవిర్భావ చరిత్ర-తులసి ప్రాశస్త్యమును గూర్చి, మన పురాణములలో ఎన్నో కథలు కానవస్తున్నాయి. వాటిలో ఒకగాథను సమీక్షించు కుందాం!

"బ్రహ్మవైవర్తపురాణ" మందు గల తులసి వృత్తాంతము ఇలా ఉన్నది. ధర్మధ్వజుడు, మాధవి అను దంపతులకు అతిలోక సౌందర్యవతియైన కుమార్తె కలిగినది. వారు ఆ బిడ్డకు "బృంద" అను నామకరణము చేసుకుని అల్లారు ముద్దుగా పెంచుకోసాగిరి. ఆమెకు వివాహవయస్సురాగనే శ్రీహరిని వివాహమాడతలచి బదరికాశ్రమము జేరి బ్రహ్మనుగూర్చి ఘోరముగ తపమాచరించినది. బ్రహ్మదర్శన మిచ్చి నీ కోరిక ఏమిటో చెప్పుమనగా "నేను రాధాశాపముతో నున్న రుక్మిణిని, నాకు శ్రీకృష్ణుడే భర్తగా పొందుటకు"- వరమీయమని ప్రార్థించినది.

అందులకు బ్రహ్మ ! నీ కోరిక తప్పక నెరవేరగలదు. కాని! ముందుగా గోలోకనివాసి సుదాముడే ముందుగా నీకుభర్త కాగలడు, అనంతరమే నీవు కోరిన వాడే నీకు పతియగును అని వరమిచ్చి అంతర్థానమయ్యెను.

ఇలా ఉండగా బ్రహ్మదేవుడు చెప్పిన సుదాముడు పుష్కరకాలము శాపకారణ ముగా భూలోకమున శంఖచూడుడై జన్మించి తపమాచరించసాగెను. ఆతని తపస్సు నకు మెచ్చి బ్రహ్మ ఏమివరము కావాలో కోరుకోమన్నాడు. అంత శంఖ చూడుచు "లక్ష్మిభూలోకమున పుట్టినదట! నాకామెతో వివాహము చేయించమని వేడుకొనెను" బ్రహ్మ 'తథాస్తు' అని పలికి ఆమె బదరికాశ్రమమున నున్నది. ఆమె నీకు తప్పక లభ్యముకాగలదు అని యంతర్థానమందెను. అనంతరము శంఖ చూడుడు- బృందవాద ప్రతి వాదములను గమనించి అప్పుడు వార్కి మరల బ్రహ్మ ప్రత్యక్షమై వారి వారి అభీష్టములు నెరవేరుటకు వార్కి వైభవముగా వివాహము గావించెను.







ఇక శంఖచూడునకు లక్ష్మియంశతో నున్న భార్య లభ్యమగుసరికి! అష్టైశ్వర్యము లతో తులతూగుచూ అతిసమయము పెంచుకుని స్వర్గాధిపత్యము పొందగోరి దేవరాజ్యమును కొల్లగొట్టి; దేవతలను పలు ఇక్కట్లు పాలు చేయుటయే కాకుండా; పరమేశ్వరుని చెంతకేగి, శివా! నీ భార్య సుందరాంగి. ఆమెను నాకు వశ్యురాలును చేయుము లేనిచో యుద్ధమునకు తలపడమని ఘోరముగా శివునితో యుద్ధము చేయసాగెను. వెంటనే శ్రీహరి వారిని సమీపించి "శివా! వీడు అజేయుడు అగుటకు కారణం! ఈతని భార్య మహాపతివ్రత. ఆమె పాతివ్రత్య భంగము నేనాచరించదును. నీవు వీనిని వధించుము." యని యుక్తి చెప్పెను.

అనంతరము మాయా శంఖచూడుని వేషము ధరించి యున్న శ్రీహరిని చూచి బృంద తన భర్తే వచ్చినాడని భ్రమించి! ఆతనికి సర్వోపచారములుచేసి శ్రీహరి చెంతకు చేరగానే! ఆమె పాతివ్రత్యము భగ్నమగుట గ్రహించి శివుడు శంఖచూడుని సంహరించగా! నాతడు దేహమును విడచి "సుదాముడై" గోలోకమునకు పోయెను. బృంద తన ఎదుట ఉన్నది మాయా శంఖచూడుడని గ్రహించి శ్రీహరిని "శిలారూప మందుదువుగాక" యని శపించగా! తిరిగి ఆమెను నీవు "వృక్షమగుదువుగాక" యని శపించెను. ఆవిధంగా శ్రీహరి గండకీనదిలో సాలగ్రామ శిలగాపుట్టి; బృంద తులసీ వృక్షమై పోయి ఇద్దరూ ప్రపంచముచే పూజనీయస్వరూపములు పొందినట్లుగా బ్రహ్మవైవర్త పురాణగాథ ద్వార విదతమగుచున్నది.

ఒకసారి పరమేశ్వరుడు కుమారుడైన కుమారస్వామిని చెంతకు చేర్చుకుని; పుత్రా!

**"పుత్రా! సకల వృక్షములలోన తులసియొక్కటయే**
**పూజ్యమైక క్ష్మారుహంబు దాని పత్రములును దాని**
**పుష్పములును బ్రాణ సమములగును అచ్యుతునకు."**

మరియు వృక్షాలన్నిటియందు తులసి శ్రేష్ఠమైనది, శ్రీహరికి ఇది అత్యంత ప్రీతిపాత్రమైనది. "తులసిపూజ" తులసీ స్తోత్రం చదవడం, తులసి మొక్కలో పోసిన నీటిని శిరస్సున జల్లుకోవడం, తులసీవనమును పెంచి వాటి మాలలు శ్రీహరికి సమర్పించుట ఎంతో! పుణ్యప్రదమైనవి. గోదాదేవి తులసీవనంలోనే అయోనిజగా విష్ణుచిత్తునింట వెలసి శ్రీరంగనాథుని ఇల్లాలయింది.

**శ్లో॥ వశిష్ఠాది ముస్తోత్రైః పూజితో తులసీవనే**
**తదా ప్రభృతి యద్విష్ణుః బ్రతిజ్ఞాం కృతవాన్ ప్రభుః**
**తస్మిన్ తులస్యాంతు యః పూజాంకురు తేనరః**
**సర్వపాప వినిర్ముక్తః మమసాయుజ్య మాప్నుయాత్.**

వశిష్ఠాది మునిగణముచే ఎన్నో విధములుగా స్తోత్రపూర్వకముగా శ్రీహరి తులసీ వనమందు పూజలందుకొని నన్ను "కార్తీక శుద్ధద్వాదశి" నాడు విశేషించి

ఎవరు బూజచేయుదురో! అట్టివారి సమస్తయొక్క పాపములు అగ్నిలోపడిన మిడుతలు వలె భస్మమయి వారు తప్పక నా సాన్నిధ్యమును పొందుదురని ప్రతిజ్ఞ చేసెనట!



**శ్లో॥ తులసీవ్రత మహాత్మ్యం శ్రోతవ్యం పుణ్యవాంఛ్ఛినః**
**యదిచ్ఛేద్విష్ణు సాయుజ్యం శ్రోతవ్యం బ్రాహ్మణైస్సహ**
**విష్ణోః ప్రీతిశ్చ కర్తవ్యా శ్రోత వ్యాతులసీకథా**
**ద్వాదశ్యాం శ్రవణాత్తస్యాః పునర్జన్మ న విద్యతే.**

విష్ణు సాన్నిధ్యముగోరి విష్ణుదేవునకు యేమాత్రమైన ప్రీతి జేయవలయుననని తలచేవారు తులసీ వ్రతమహాత్మ్యము తప్పక వినవలయును. అందునా! ఆ వ్రత కథను "క్షీరాబ్ధిద్వాదశి" రోజున తులసి కథ వినువార్కి, చదువువార్కి, పూర్వజన్మ కృతమైన దుఃఖములన్నియు తొలగిపోయి విష్ణులోకమును పొందుదురు, అని శంకరు నిచే "తులసి" కొనియాడబడినట్లు చెప్పబడినది. అట్టి తులసీ బృందావన మందు ఉసిరిమొక్కతో కలిపి "తులసీధాత్రీ సమేత శ్రీమన్నారాయణుని" ఈ కార్తీక ద్వాదశి నాడు పూజించుట ఎంతో విశిష్టమైనదిగా పేర్కొనబడినది. మరియు అట్టి తులసీ దళములకు "నిర్మాల్యదోషం" పూజలో ఉండదని కూడా చెప్పబడినది.

కావున! మన హిందూమతంలో "తులసి" ఆధ్యాత్మిక దృష్టిలో విశిష్టమైన స్థానాన్ని పొందింది. తులసిమొక్క హిందువులకు పూజనీయమైనది. కావున హిందువులు ప్రతిఇంటా తులసిమొక్కను కోటలో పెంచి పూజించుట మనం చూస్తూ ఉంటాము. ఇక పట్టణవాసులైతే అంతలో కొంత జాగా ఏర్పరచుకుని, చిన్నచిన్న కుండీల్లోనో, డబ్బాల్లోనో పెంచి పూజిస్తూ ఉంటారు. కావున 'తులసి' ఉన్న ఇల్లు నిత్యకళ్యాణము పచ్చతోరణంతో శోభిల్లుతూ ఉంటుంది.

ఇక ఈ తులసిని వైద్యపరంగా కూడా చూస్తే! ఆయుర్వేద శాస్త్రంలో 'సప్తతులసి–భరతవాసి' అంటూ తులసిని ఏడువిధాలుగా వివరించబడినది. అవి: 1. కృష్ణ తులసి 2. లక్ష్మీతులసి 3. రామతులసి 4. నేల తులసి 5. అడవి తులసి 6. మరువ తులసి 7. రుద్రజడ తులసిగా వివరిస్తారు. వైద్యపరంగా వాటి అన్నిటికి ఎన్నో అమోఘమైన ఔషధగుణాలతో కూడి ఉంటాయని ఆయుర్వేద శాస్త్రం కొనియాడుతోంది. ప్రతిరోజు ఉదయం రెండు తులసి ఆకులు (కోటలోవికాదు) విడిగా పెంచుకున్న మొక్కలనుండి నమలి మింగితే వార్కి బుద్ధిశక్తి, జ్ఞాపకశక్తి పెరుగుతుంది. మరియు అనేక మానసిక రుగ్మతలు నయమవుతాయని; ఇలా ఎన్నో విశేష గుణాలను చెప్తారు. ఇక దాని కాండముతో తయారుచేయబడ (తులసిమాల)కు ఇటు ఆధ్యాత్మికపరంగా అటు ఆరోగ్యపరంగా ఎన్నో లాభాలు ఉన్నాయిట !

కావున ఈ "క్షీరాబ్ధిద్వాదశి" వ్రతాన్ని ఆచరించి ఇటు ఆధ్యాత్మిక సంపదతో పాటు ఆరోగ్య భాగ్యాన్ని సర్వులమూ పొందుదాం!





## కేదారేశ్వర వ్రతము

కార్తీకమాసంలో కొన్ని ప్రాంతాలలో నవగ్రహ దీపాల నోమును కూడా నోస్తారు. ఈ నోములో నవగ్రహాలదే ప్రధాన తాంబూలం. కార్తీక మాసంలో మూడు రోజులపాటు ఈ నోమును యజ్ఞభావనతో చేస్తారు. ముందుగా గణపతి ఆరాధన చేసి, తరువాయి శివలింగార్చనచేసి, నవధాన్యాలను కొద్దికొద్దిగా తీసి వాటిపై దీప ప్రమిదలనుంచి ఓం నమఃశ్శివాయ మంత్రాన్ని నూట ఎనిమిది సార్లు స్మరిస్తారు. తరువాత అమ్మవారికి సంబంధించిన స్తోత్ర పారాయణ చేసి తొమ్మండుగురు బ్రాహ్మణులకు ఆ దీపాలను దానం ఇస్తారు. దానం చేసేటప్పుడు యథాశక్తి దక్షిణను మాత్రం నిండు మనసుతో సమర్పించాలి. ఈ నోము శుభతిథులలో సాయం వేళలలో మాత్రమే జరగాలి. నోము అనంతరం అక్షతలను గృహం ఈశాన్య భాగంలో కొద్దిగా చల్లి, కుటుంబంలో అందరూ శిరస్సుపై చల్లుకోవాలి.....ఈ నోము తరతరాలుగా అనేక ప్రాంతాలలో జరుగుతోంది. ఇది సర్వ రక్షాకరంగా కుటుంబాన్ని కాపాడుతుందని భారతీయుల ప్రగాఢ విశ్వాసం. ఈ నోము ఫలితాలు కార్తీక మహా పురాణంలో వివరంగా కన్పిస్తాయి.

మరో ముఖ్య విశేషమేమంటే....కార్తీక మాసంలో శ్రీ రమాసహిత సత్యనారాయణ స్వామి వారి పుణ్య వ్రతాన్ని లక్షలాది కుటుంబాల్లో తప్పనిసరిగా జరిపిస్తారు. ఈ పుణ్యదినాలలో ఈ వ్రతం ఆచరించడంవల్ల సర్వ భోగభాగ్యాలు

శ్రీసత్యనారాయణ స్వామి కటాక్షంగా లభిస్తాయని హిందువుల ప్రగాఢ విశ్వాసం. ఆంధ్ర ప్రాంతీయులకంటే తెలంగాణా ప్రాంతంలో ఈ వ్రతాచరణ ఒక విధి విధానమవ్వడం, ఆచరించే విధానంలో వుండే పద్ధతులు ఆశ్చర్యపరుస్తాయి. కొన్ని ప్రాంతాలలో శ్రీ కేదారశ్వరస్వామి వారి వ్రతాన్ని ఈ మాసంలోనే జరపడం మరో విశేషం. ఉత్తర భారతదేశంలో ఈ మాసంలో బిల్వపత్ర వ్రతాన్ని జరిపిస్తారు. ఇంటింటా లక్షలాది మారేడు దళాలతో ఈ మాసం పవిత్రమౌతుంది. శక్తిఉన్నవారు స్వర్ణ బిల్వపత్రాలను చేయించి తొమ్మిది రోజులు శివసన్నిధిలో ఉంచి బ్రాహ్మణోత్తములకు లేదా వృద్ధ ముత్తయిదువులకు దానమిచ్చి బిల్వాష్టకమును పారాయణ చేస్తారు.

ఏ ఏ ప్రాంతాలలో ఏ ఏ దానాలు చేసినా, వ్రతాలు చేసినా కార్తీక వైభోగం కార్తీక వైభోగమే ! 'ఒక్క బిల్వాన్ని శివుడికి అర్పిస్తే చాలు! జన్మ ధన్యమౌతుంది' ఒక్క పొద్దు ఉపవాసముంటే చాలు! కైలాసవాసం ప్రాప్తిస్తుంది. ఒక్క దీపాన్ని దానమిస్తే చాలు! జీవితం ఐశ్వర్యమయమౌతుంది'.... ఇలా అనేక నమ్మకాలతో మనస్సు పవిత్రమయంగా పరమేశ్వర సేవలో లగ్నమౌతుంది.

కొరతలేని జీవనానికి కార్తీకమాసంలో మహేశ్వరుణ్ణి మనసారా ఆరాధించండి. కార్తీకమాస పుణ్యవ్రతాలను మంగళప్రదంగా ఆచరించండి. శివతత్త్వాన్ని గృహంలో ప్రతిష్ఠించండి. కార్తీక పురాణ కథలను పదిమంది ముందు పఠించండి. భక్తికి ప్రాధాన్యత ఇస్తూ అర్ధనారీశ్వర చైతన్యాన్ని హృదయంలో నింపుకోండి. ఆ ప్రార్థనా శక్తి ఆవిర్భవింపచేసే మహాతేజస్సు శివం...శివం....అంటూ హృదయాన్ని ప్రకాశింపచేస్తుంది. ఆ వెలుగును వర్ణించడానికి మాటలు అందవు. అది అఖండం...అపూర్వం....అమోఘం....

ఇదే వ్రతం ఫలం....జన్మజన్మాల పుణ్యఫలం...





## సుబ్రహ్మణ్య షష్ఠి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఎరుపు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు-పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎరుపు వస్త్రము |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఎర్రటిరంగు |
| 9. | పూజించవలసిన ఫోటో | : సుబ్రహ్మణ్య స్వామి |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : ఆరుముఖాల షణ్ముఖుడు |
| 11. | పూజించవలసిన దైవము | : కుమారస్వామి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : తెల్లటి అక్షతలు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : ఎర్రటి పువ్వులు, మందారపువ్వులు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : ఎర్రటి చామంతి పువ్వులు |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : కందిపప్పు నానబెట్టినవి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : కందిపప్పుతో వంటకాలు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : దానిమ్మపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : సుబ్రహ్మణ్యస్వామి |
| 19. | పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : సుబ్రహ్మణ్య అష్టకము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : సుబ్రహ్మణ్య షోడశనామస్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : సుబ్రహ్మణ్య సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : సుబ్రహ్మణ్య చరిత్రము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : కుమారసంభవము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : సుబ్రహ్మణ్యస్వామి |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : మోపిదేవి |
| 26. | చేయవలసిన ధ్యానములు | : సుబ్రహ్మణ్య ధ్యానములు |
| 27. | చేయించవలసిన పూజలు | : సుబ్రహ్మణ్యస్వామి సహస్రనామ పూజ |

| | |
|---|---|
| 28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : పుట్ట పూజలు, పుట్టలకు పాలు, సుబ్రహ్మణ్య కళ్యాణము |
| 29. ఆచరించవలసిన వ్రతము | : సుబ్రహ్మణ్య వ్రతము |
| 30. ఉపవాసము నియమము | : ఉదయంనుండి మరుసటిదినము ఉదయం వరకు |
| 31. జాగరణ నియమము | : లేదు |
| 32. సేకరించవలసిన పుస్తకములు | : సుబ్రహ్మణ్య నిత్యపూజ, కుమారస్వామి స్తోత్రమాల |
| 33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : సుబ్రహ్మణ్య నిత్యపూజ |
| 34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : కుమారస్వామి స్తోత్రమాల |
| 35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : సుబ్రహ్మణ్య కళ్యాణము |
| 36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : సుబ్రహ్మణ్యవ్రతము |
| 37. పర్వదిన నక్షత్రము | : మృగశిరా |
| 38. పర్వదిన తిథి | : మార్గశిర శుద్ధ షష్ఠి |
| 39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : మంగళవారము |
| 40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ॥9గం॥లోపుగా |
| 41. వెలిగించవలసిన దీపారాధన కుంది | : 2 ఎర్రటి మట్టి ప్రమిదలు |
| 42. వెలిగించవలసిన దీపారాధనలు | : ఎర్రటి ప్రమిదెలు |
| 43. వెలిగించవలసిన వత్తులసంఖ్య | : దూదితో 7 వత్తులు (ఎరుపురంగు) |
| 44. వెలిగించవలసిన వత్తులు | : 7 వత్తులు (దూదితో) |
| 45. దీపారాధన వాడవలసిన నూనె | : నువ్వులనూనె |
| 46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : 7వత్తులతో హారతి |
| 47. ధరించవలసిన తోరము | : ఎర్రటితోరము |
| 48. నుదుటన ధరించవలసినది | : కుంకుమ |
| 49. 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం హ్రీం శరవణభవాయ నమః |
| 50. జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 51. మెడలో ధరించవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : సుబ్రహ్మణ్యంస్వామి |
| 53. చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : పడమరదిక్కు. |





## శ్రీ సుబ్రహ్మణ్య షష్ఠి

దేవేంద్రుడు మార్గశిర శుద్ధ షష్టినాడు దేవసేనతో "శ్రీ సుబ్రహ్మణ్యశ్వర స్వామి" వారికి అత్యంత వైభవంగా వివాహము జరిపించిన ఈ రోజును "శ్రీ సుబ్రహ్మణ్య షష్ఠి"గా పరిగణిస్తారు. ఈ స్వామివారి జన్మవృత్తాంత విశిష్టత సమీక్షగా తెలుసుకుందాము!

పూర్వం మూడులోకాలను భయభ్రాంతులను చేస్తూ బాధిస్తున్న "తారకాసురుడు" అను రాక్షసుని బారి నుండి రక్షణ పొందుటకై! దేవతలు బ్రహ్మదేవుని శరణువేడినారు. దానికి బ్రహ్మ వారికి ఒక సూచన చేసినారు. ఈ తారకాసురుడు అమిత తపోబలసంపన్నుడు, అమితబలశాలి, వీనికి ఈశ్వర తేజాంశ సంభవుని వల్లకాని వానికి మరణములేదు. కావున! మీరు సతివియోగ దుఃఖముతో ఉన్న ఈశ్వరునకు ఆ సతీదేవియే మరుజన్మయందు గిరిరాజు హిమవంతునకు పుత్రికగా అవతరించిన! ఆ పార్వతీదేవికి వివాహం జరిపించండి. వారికి కలుగు పుత్రుడే తారకాసురుని సంహరించగల సమర్థుడు అవుతాడు అని తరుణోపాయంశెలవిచ్చారు.

అప్పటికే తపోదీక్షలో ఉన్న పరమశివునకు సేవలు చేస్తున్న ఆ జగన్మాత పార్వతికి, శివునకు అన్యోన్యత చేకూర్చే వాతావరణాన్ని కల్పించేందుకు! దేవతలు మన్మథుని ఆశ్రయిస్తారు. మొత్తం మీద మన్మథుని పూలబాణాలతో ఈశ్వరుని చలింపచేసి తాను ఈశ్వరుని ఆగ్రహానికి గురి అయినా! పార్వతి పరమేశ్వరుల కళ్యాణానికి మన్మథుడు కారణ భూతుడవుతాడు. కళ్యాణం అనంతరం దేవతల అభ్యర్థనమేరకు పునర్జీవింపబడతాడు.

ఇలా ఉండగా! పార్వతీ పరమేశ్వరులు ఏకాంత ప్రణయానందసమయాన అగ్నిదేవుడు పావురం రూపంల్లో వారి ఏకాంత మందిరంలోకి ప్రవేశిస్తాడు. అది గ్రహించిన పరమ శివుడు తన దివ్య తేజస్సును ఆ అగ్నిహోత్రునిలోకి ప్రవేశ పెడతాడు. దానిని భరించలేక ఆ దివ్య తేజమును గంగానదిలో విడచి పెడతాడు. ఆ తేజము ఆ సమయమందు ఆ నదిలో స్నానమాడుచున్న షట్కృత్తికల దేవతల గర్భానప్రవేశిస్తుంది. ఆ రుద్రతేజమును వారు భరించలేక రెల్లుపొదలో విసర్జిస్తారు. అంత ఆ ఆరుతేజస్సులు కలసి ఆరుముఖలతో ఒక దివ్యమైన బాలుడుగా ఉద్భవిస్తాడు. ఇది తెలిసిన పార్వతీ పరమేశ్వరులు రుద్రాంశ సంభూతినిగా ఆ షణ్ముఖుని అక్కున చేర్చుకుని కైలాసం తీసుకుని వెళతారు.

ఆ బాలుడు గంగాగర్భంలో తేజోరూపంలో ఉన్నందుకు గాంగేయుడని, షట్‌కృత్తికలు వానిని పెంచి పెద్దచేసిన కారణం వల్ల మరియు ఆరుముఖాలు కలవాడు అగుటవల్ల షణ్ముఖుడని, కార్తికేయుడని, అతడు గౌరీశంకరుల పుత్రుడగుటచే కుమారస్వామి అనియు, సుబ్రహ్మణ్యస్వామి అనియు నామాలతో పిలువసాగిరి.

ఇక ఈ "శ్రీ సుబ్రహ్మణ్యస్వామి" వారిని సర్పరూపము కలవాడని కొందరు. మరికొందరు ఈ స్వామి ఆరుముఖాలు పన్నెండు చేతులు కలిసిన నిర్గుణ పరబ్రహ్మ తత్వముతో బాలుని రూపంగా అవతరించారని కొందరు అంటూ ఉంటారు. ఈ రెండూ వాస్తవమేనట!

కారణజన్ముడైన ఈ స్వామి పార్వతి పరమేశ్వరులు, దేవతలు కోరిక మేరకు కుమారస్వామిగా చేసి, వానిని దేవతల సర్వసైన్యాధ్యక్షునిగా నియమించి పరమేశ్వరుడు "శూలం" మొదలైన ఆయుధాలను ఇవ్వగా, ఆ జగన్మాత పార్వతి కుమారుని దీవించి "శక్తి" అను ఆయుధాలను ఇచ్చి సర్వశక్తివంతుడ్నిచేసి, తారకాసురు నిపై యుద్ధ శంఖరావాన్ని మ్రోగిస్తారు. అంత ఆ స్వామి నెమలి వాహనారూఢుడై ఆరుముఖాలు పన్నెండు చేతులతో ఉగ్రరూపందాల్చి ఆరు చేతులతో ధనస్సులను మనో ఆరు చేతులతో బాణాలు ధరించి కొన్ని అక్షౌహిణులను సంహరించి, రాక్షస సేనను ఒకేసారి సంహరించాలని తలచి "సర్పరూపం" దాల్చి వారిని ఉక్కిరి బిక్కిరి చేసి, భీకర యుద్ధము చేసి తారకాసురుని సంహరించి విజయుడైనాడు.

సర్వశక్తి స్వరూపుడైన ఈ స్వామికి దేవేంద్రుడు దేవసేనతో వివాహము జరిపిన ఈరోజును "శ్రీ సుబ్రహ్మణ్యషష్ఠి"గా పరిగణిస్తారని, సర్వులకు పూజ్యనీయు లైన శ్రీ వేదవ్యాసులవారు దీని విశిష్టతను వివరిస్తారు.

ఈ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వార్కి గ్రామాలు, పట్టణాలు అనుభేదము లేకుండా దేశం నలుమూలలా దేవాలయాలు కలవు. ఈ రోజున "శ్రీవల్లి దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి" వారికి భక్తులు కళ్యాణోత్సవములు, సహస్రనామ పూజలు తీర్థములు అత్యంత వైభవంగా జరుపుతూ ఉంటారు.

ఈ స్వామి ఆరాధనవల్ల నేత్రరోగాలు, చర్మవ్యాధులు తగ్గుతాయని; పెళ్లికాని వారికి వివాహం జరిగి సత్‌సంతాన సౌభాగ్యం కలిగి ఆయురారోగ్య ఐశ్వర్యములతో వర్ధిల్లు తారని ప్రజల విశ్వాసం. అలా సంతానం కలిగినవారు శ్రీ స్వామివారి సహస్రనామాలలో ఇష్టమైన పేరును వారి బిడ్డలకు పెట్టుకుంటారు. ఈ పుణ్యదినాన శ్రీ స్వామికి పాలు, పండ్లు, వెండి, పూలు పడగలు, వెండి కళ్ళు మొదలైన మొక్కుబడులు సమర్పించుకుంటూ ఉంటారు.

ఇటువంటి పుణ్యప్రదమైన "శ్రీ సుబ్రహ్మణ్యషష్ఠి" నాడు మనమంతా శ్రీ స్వామి విశేష పూజలు గావించి శ్రీ స్వామివారి కృపాకటాక్ష వీక్షణలు పొందుదాము.







## దత్త జయంతి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : పసుపు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు-పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : పసుపు రంగు |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : పసుపు రంగు |
| 9. | పూజించవలసిన ఫోటో | : దత్తాత్రేయుడు కూర్చున్న ఫోటో |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : దత్తాత్రేయుడు నిల్చున్నప్రతిమ |
| 11. | పూజించవలసిన దైవము | : దత్తాత్రేయుడు |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : పసుపు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : పసుపు పువ్వులు తెల్లనవి |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : చామంతి (పసుపురంగు) |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : లడ్డూలు |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : కేసరీబాత్ |
| 17. | నివేదించవలసిన పండ్లు | : అరటిపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : దత్త అష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : దత్తస్తవము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : దత్తాత్రేయసహస్రనామావళి(15) |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : దత్త సహస్రనామావళి |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : శ్రీదత్త చరిత్ర (శ్రీదత్తలీలామృతం) శ్రీ గురుచరిత్ర |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : శ్రీ దత్త జననము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : శ్రీ దత్త దేవాలయము |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : గాణుగాపూర్ |
| 26. | చేయవలసిన ధ్యానములు | : శ్రీ దత్త ధ్యానము |

| | | |
|---|---|---|
| 27. చేయించవలసిన పూజలు | : | శ్రీ దత్త ప్రదక్షిణాపద్ధతి |
| 28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : | దత్త అష్టోత్తర పూజ |
| 29. ఆచరించవలసిన వ్రతము | : | శ్రీ సత్యదత్త వ్రతము |
| 30. ఉపవాసము నియమము | : | ఉదయం నుండి సాయంత్రంవరకు |
| 31. జాగరణ నియమము | : | లేదు |
| 32. సేకరించివలసిన పుస్తకములు | : | శ్రీ గురుచరిత్ర, శ్రీదత్తాత్రేయ నిత్యపూజ, శ్రీ దత్త చరిత్ర |
| 33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : | శ్రీ గురుచరిత్ర |
| 34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : | శ్రీ దత్తాత్రేయ నిత్యపూజ |
| 35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : | దత్త జయంతి ఉత్సవములు |
| 36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : | శ్రీ సత్యదత్తవ్రతము |
| 37. పర్వదిన నక్షత్రము | : | – |
| 38. పర్వదిన తిథి | : | మార్గశిర పౌర్ణమి |
| 39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : | గురువారము |
| 40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : | ఉ॥6గం॥నుండి 9గం॥ |
| 41. వెలిగించవలసిన దీపారాధన కుంది | : | కంచుతోవున్న కుందులు |
| 42. వెలిగించవలసిన దీపారాధనలు | : | 2 (రెండు) |
| 43. వెలిగించవలసిన వత్తులసంఖ్య | : | 5 (ఐదు) |
| 44. వెలిగించవలసిన వత్తులు | : | దూదితో |
| 45. దీపారాధన వాడవలసిన నూనె | : | నువ్వులనూనె |
| 46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : | పంచహారతి |
| 47. ధరించవలసిన తోరము | : | పసుపు తోరము |
| 48. నుదుటన ధరించవలసినది | : | కుంకుమ |
| 49. 108 మార్లు జపించవలసిన మంత్రం | : | ఓం ద్రాం దత్తాత్రేయాయ నమః |
| 50. జపమునకు వాడవలసిన మాల | : | తులసి మాల |
| 51. మెడలో ధరించవలసిన మాల | : | తులసి మాల |
| 52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : | దత్తునిది |
| 53. చేయవలసిన అభిషేకము | : | గంధాభిషేకము |
| 54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : | ఉత్తరం |







## శ్రీ దత్తాత్రేయ స్వామి జయంతి

**దత్తాత్రేయ శివం శాంత మింద్రనీల నిభం ప్రభుమ్ ।**
**ఆత్మ మాయారతం దేవమవధూతం దిగంబరమ్ ॥**

**భస్మోద్ధూళిత సర్వాంగం జటాజూటం ధరం విభుమ్ ।**
**చతుర్బాహు ముదారాంగం దత్తాత్రేయం నమామ్యహమ్ ॥**

ఒకసారి లోకకళ్యాణార్థం నారదుడు ఆడిన చతురోక్తికిలోనైన లక్ష్మీ, సర్వస్వతి, పార్వతిమాతలు, మహాపతివ్రత అయిన అనసూయపై ఈర్ష్య అసూయ ద్వేషాలను పెంచుకున్నారు. ఈ ఈర్ష్య అసూయ ద్వేషమనే దుర్గుణాలకు లోనయితే! దేవతలకైనా అనేక దుఃఖాలు కలుగుతాయని సర్వులకు తెలియచెప్పుటకో; లేక శ్రీదత్తుని అవతారానికి నాంది పలుకుటకో! మరి నారదుని ఆంతర్యమేమిటో?

ఏది అయితేనేమి! ఈ గుణాలు వారి మనస్సునిండా దావానలంలా వ్యాపించి ముగ్గరమ్మల గుండెలు భగ్గుమన్నాయి. వారి వారి పత్నులను తక్షణం ఆ అనసూయ ఆశ్రమానికి వెళ్ళి ఆమె పాతివ్రత్యాన్ని భగ్నం చేయమని ప్రార్థించారు. త్రిమూర్తులు ఎంతవారించినా, పెడచెవిని పెట్టారు ససేమిరా! అన్నారు. దానికి తోడు ఆ ముగ్గురమ్మలకు ఇంద్రాది దేవతల భార్యలు కూడా వంతపాడారు. ఇక చేయునది లేక సన్యాస వేషములు ధరించి అత్రి అనసూయ ఆశ్రమ ప్రాంతమందు భూమిపై పాదం మోపారు. వారి పాదస్పర్శకు భూదేవి పులకించింది, వృక్షాలు వారికి వింజామరలు వీస్తున్నట్లుగా తలలాడిస్తూ వారి పాదలచెంత పుష్పాలు పండ్లు నేలకురాల్చాయి.

నెమలి పురివిప్పి నాట్యం చేయసాగింది. లేడిపిల్లలు చెంగు చెంగున గంతులు వేస్తూ వారి వద్దకు వస్తున్నాయి. కుందేటి పిల్లలు వారి పాదాలు స్పృశించి పునీతమవ్వాలని ఏమిటో? అడుగడుగునా పాదాలకు అడ్డుపడుతున్నాయి. వన్య ప్రాణులకేరింతలతో ఆ ఆశ్రమ వాతావరణం అంతా ఆహ్లాదమవుతోంది. ఈ ఆకస్మిక పరిణామ మేమిటో? అని వారిని చూచిన పక్షులు కిలకిలా రావాలు చేయసాగాయి. ఇవికాక ఒక ప్రక్క పవిత్ర జలపాతాల సోయగాలు, మరోప్రక్క ఆశ్రమ బాలకుల వేదమంత్రోచ్చారణ కర్ణామృతంగా వినిపిస్తున్నాయి. ఇంత చక్కని ప్రకృతి అందాలకు ఆలవాలమైన ఈ రమనీయ వాతావరణమందు తేలియాడుతున్న ఈ భూలోకవాసులు ఎంతటి అదృష్టవంతులో మరి! మనం ముగ్గురం కూడా చిన్నారి బాలురవలె ఈ ముని బాలకులతో కలసి ఆడుకుంటే! ఎంతబాగుండునో! అని తన్మయత్వంతో ఆ త్రిమూర్తులు పలుకుతారు.

అలా మైమరపిస్తున్న ఆ ఆశ్రమ వాతావరణం నుంచి ఒక్కసారి తెప్పరిల్లి ఇంతకీ మనం వచ్చిన మాటను మరచి మన భార్యలకు ఇచ్చిన మాటను విస్మరించాం; అని తలచి ఆశ్రమం ముంగిటవైపునకు పయనమయినారు.

మహాతపోబలసంపున్నుడైన కర్దమ మహర్షికి, దేవహూతికి జన్మించిన అనసూయాదేవిని, ముని శ్రేష్ఠుడైన అత్రిమహర్షికి ఇచ్చి వివాహంచేసారు. అప్పటి నుండి ఆమె గృహస్థురాలిగా గృహస్థధర్మాన్ని చక్కగా నిర్వహిస్తూ అత్రిమహర్షికి సేవలు చేస్తూ, అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ తన "పతి సేవతత్ పరతచే" పొందిన పాతివ్రత్య మహిమలతో ముల్లోకాలను అబ్బురపరస్తూ; పంచభూతాలు, అష్టదిక్పాలకులు సహితం అణకువుగా వుండేలా చేస్తున్న ఆ పతివ్రతామతల్లిని, దివ్యతపోతేజోమూర్తి అయిన అత్రిమహర్షిని చూచినంతనే త్రిమూర్తులు ముగ్ధులయ్యారు.

ఆ సాధుపుంగవుల ముమ్మరను చూచిన ఆ పుణ్య దంపతులు, సాదరంగా ఆశ్రమంలోనికి ఆహ్వానించి ఉచిత ఆసనాలు ఇచ్చి స్వాగత సత్కారాలు చేసి, అనంతరం మీరు ముమ్మరు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులవలె వచ్చినట్లుగా వచ్చి మా ఆశ్రమాన్ని పావనం చేశారు, భోజనాలు సిద్ధంచేశాను రండి అంటూ! అనసూయమ్మ ఆహ్వానం పలికింది.

అత్రిమహర్షితో కలిసి ముగ్గురు సాధవులు ఆసీనులయ్యారు. ఇక వడ్డన ప్రారంభించుటకు సమాయత్తమవుతున్న అనసూయతో.... చెవుల వెంట వినరాని అభ్యంతరకరమైన నియమాన్ని వారు ప్రకటించి వడ్డించమని కోరతారు. వారి పలుకులు ఆ పతివ్రతామతల్లికి శిరస్సున పిడుగు పడినట్లు అయింది.





ఒక్కసారి తన ప్రత్యక్షదైవమైన "భర్త"ను మనసారా నమస్కరించుకుంది. "పాతివ్రత్యజ్యోతి" వెలిగింది. ఆమె జ్ఞాననేత్రం తెరచుకుంది. కపట సన్యాసరూపంలో ఉన్నత్రిమూర్తుల గుట్టు రట్టు అయింది. వారి ఆంతర్యమేమిటో గ్రహించింది. పెదవుల వెంట చిరునవ్వు చెక్కు చెదరకుండా! ఏమినా భాగ్యము! ముల్లోకాలను ఏలే సృష్టి, స్థితి, లయకారకులైన వీరు నాముంగిట ముందుకు యాచకులవలె వచ్చినారా? వీరిని కనుక నేను తృప్తిపరిస్తే ముల్లోకాలు కూడా ఆనందింపచేసిన భాగ్యం నాకు కలుగుతుంది కదా; అని ఆలోచిస్తూ!

ఒక ప్రక్క పాతివ్రత్యం! మరోవైపు అతిథిసేవ! ఈ రెండు ధర్మాలను ఏకకాలంల్లో సాధించడమెలా? అనుకుంటూ పతికి నమస్కరించి "ఓం శ్రీపతి దేవాయ నమః" అంటూ కమండలోదకమును ఆ త్రిమూర్తుల శిరస్సున చల్లింది. వెంటనే ఆ ముగ్గురు పసిబాలురయ్యారు! వెనువెంటనే అనసూయలో మాతృత్వం పొంగి స్తన్యం పొంగింది. కొంగుచాటున ఆ ముగ్గురు బాలురకు పాలు ఇచ్చి వారి ఆకలి తీర్చింది. ఇంతలో ఋషి కన్యలు, ఋషిబాలురు కలిసి మెత్తని పూల పాన్పుతో ఊయలవేయగా! వారిని జోలపాడుతూ నిదురపుచ్చింది. "ఇంతటి మహద్భాగ్యం" సృష్టిలో ఏ తల్లికి దక్కుతుందో చెప్పండి...! ఆ వింత దృశ్యాన్ని చూచిన అత్రి మహర్షి ఒకసారి తొట్రుపడి మరలాతేరుకుని, తన దివ్య దృష్టితో జరిగినది, జరగబోతున్నది గ్రహించుకున్నాడు.

ఈ త్రిమూర్తులు "ఈ ఆశ్రమ ప్రవేశ సమయమందే" ఆశ్రమ వాతావరణానికి తన్మయత్వంతో పలికిన పలుకులే! కార్యరూపందాల్చడం బ్రహ్మావాక్కుగా తలచి! ఆ చిన్నారులు బుడి బుడి నడకలతో, ఆడుతూ పాడుతూ గెంతుతూ ఆ ముని బాలకులతో, కలసి వారి కలలను పండించుకోసాగారు. మానవులకు బాల్య, కౌమార, యవ్వన, వార్ధక్యాలలో ఆనందంగా సాగేది ఈ బాల్యదశే కదా మధురాను భూతిని మిగిల్చేది అని మురిసిపోయారు. కనని తల్లి దండ్రులైన అత్రి అనసూయల పుత్ర వాత్సల్య బాంధవ్యం అయోనిజులైన వారికి చాలాకాలం కొనసాగుతోంది.

ఇలా ఉండగా! లక్ష్మీ,సరస్వతి, పార్వతి మాతలకు భర్తల ఆచూకీ తెలియక గుబులు పుట్టింది. అంతలో దేవర్షి నారదునివల్ల అత్రిమహర్షి ఆశ్రమమందు జరిగిన వింత తెలుసుకున్నారు. దానితో అనసూయపై ఏర్పడిన "ఈర్ష, అసూయ– ద్వేషాలు" పటాపంచలు అయ్యాయి. వెంటనే వారి స్వస్వరూపాలతోనే అనసూయ అత్రిముని ఆశ్రమానికి చేరుకున్నారు. వారిని ముని కన్యలు స్వాగతించారు. ఆ సమయాన అనసూయమ్మతల్లి ఆ చిన్నారులకు పాలు ఇచ్చి, ఊయలలో పరుండబెట్టి జోలపాడుతూ ఉంది! అంతలో ఆ ముగ్గురమ్మలను చూచి సాదరంగా ఆహ్వానించి, స్వాగత సత్కారములతో సుఖాసీనులను చేసింది.

పసిబాలుర రూపాల్లో ఉన్న వారి వారి భర్తలను చూచుకొని పతిభిక్ష పెట్టమని కన్నీళ్ళతో అత్రి అనసూయ పాదాలను ఆశ్రయిస్తారు. అయితే! మీ మీ భర్తలను గుర్తించి! తీసుకుని వెళ్ళండి అని అనసూయ హుందాగా చెబుతుంది. ఒకే వయస్సుతో, ఒకేరూపుతో, అమాయకంగా నోట్లో వేలువేసుకుని, నిద్రిస్తున్న ఆ జగన్నాటక సూత్రధారులను ఎవరు? ఎవరో? గుర్తించుకోలేక పోయారు.

తల్లీ! నీ పాతివ్రత్య దీక్షను భగ్నం చెయ్యాలని "ఈర్ష్య, అసూయ, ద్వేషాలతో!" మేము చేసిన తప్పిదాన్ని మన్నించి మా భర్తలకు దయతో స్వస్వరూపాలు ప్రసాదించమని వేడుకుంటారు. ఈ సృష్టి, స్థితి, లయాలను యధావిధిగా సాగేందుకు సహకరించమని ప్రాధేయపడతారు. అంత ఆ అనసూయమాత తిరిగి పతిని తలచుకుని కమండలోదకము తీయు సమయాన! త్రిమూర్తులు సాక్షాత్కరించి, ఈ ఆశ్రమవాస సమయమందు, మీరు కన్న తల్లి దండ్రులకంటే మిన్నగా పుత్రవాత్సల్యాన్ని మాకు పంచిపెట్టారు. మీకు ఏమి వరంకావాలో కోరుకోమన్నారు.

నాయనలారా! ఈ పుత్ర వాత్సల్యభాగ్యాన్ని మాకు! మీరు మీరుగా ఇచ్చినారు. అది మాకు శాశ్వతంగా ఉండేలా అనుగ్రహించండి అని వరం కోరుకున్నారు. పుణ్య దంపతుల్లారా! మీ పుత్ర వాత్సల్యానికి, మీకు మేము ముచ్చరము దత్తమవు తున్నాము. మీకీర్తి ఆ చంద్రతారార్కం కాగలదని వరమిచ్చి అంతర్ధానమయ్యారు. ఊయలలోని ఆ బాలురు అత్రి అనసూయలకు బిడ్డలై కొంతకాలం పెరిగిన తరువాత! బ్రహ్మ, శివుడు వారి వారి అంశలను "దత్తనారాయణు"నికి ఇచ్చినారు. అప్పటి నుండి ఆ స్వామివారు "శ్రీ దత్తాత్రేయ" స్వామిగా అవతార లీలలు ఆరంభించినారు.

ఇట్టి అత్యంత పుణ్యప్రదమైన "శ్రీదత్తజయంతి"నాడు ఆ స్వామికి షోడషోపచార ములతో విశేష పూజలు భక్తులు జరిపి తమ జన్మలు చరితార్థం చేసుకున్నారు.







## WISH YOU A HAPPY NEW YEAR

### విష్‌యు ఎ హేపీ న్యూ ఇయర్

మన భారతీయ ఆచార సంప్రదాయ పండుగలలో దీనిని గూర్చి ఎక్కడా చెప్పబడలేదు. కావున ఈ పండుగపై నిర్దేశించి చెప్పేవి. పాటించాల్సిన ఆచారాలు ప్రత్యేకించి ఏమి కనిపించుటలేదు. కాని! మన భారతీయ సంస్కృతిపై ప్రపంచ దేశాలలో ఒక ప్రముఖస్థానం ఉంది. అది మన భారతీయ సోదరులు వారి వార్కి జన్మతః సంక్రమించిన ఆచార వ్యవహారాలను పండుగలను ఎంతో వైభవంగా జరుపుకుంటూ, వారితో కలసిమెలసి జీవించే వివిధ మతాల, వివిధ కులాల, వివిధ వర్గాలను సోదరభావంతో చూచుకుంటూ, వారి వారి యొక్క మతాచారాలను కూడా గౌరవిస్తూ, సమైక్య భావనతో అభినందించుకుంటూ ఉంటారు. అలా ఆచరించే పండుగలలో ఈ "న్యూ ఇయర్" పండుగ ఒకటి.

ఈ పండుగ ముఖ్యంగా మన క్రిష్టియన్ సోదరులు అత్యంత ప్రీతి పాత్రంగా ఆచరించేది. వీరు ప్రతి సంవత్సరం డిశంబరు నెల 25 వ తేదీ 'క్రిస్మస్' వేడుకలతో ప్రారంభించి డిశంబరు 31వ తేదీ అర్ధరాత్రి వరకు జరుపుకుంటూ సరిగా జనవరి 1 వతేదీ ప్రవేశించు సరికి బాణాసంచాలు కాలుస్తూ, నూతన సంవత్సరానికి శుభారంభం పలుకుతూ, తోటి బంధుమిత్రులతో కలసి "న్యూఇయర్‌కేక్" కట్‌చేసి వాటిని, మిఠాయిలను పంచుకుంటూ ఒకరి నొకరు కరచాలనం చేసుకుంటూ "విష్ యు ఎ హేపీ న్యూఇయర్" ఈ నూతన సంవత్సరం మీజీవితాలకు సర్వ శుభాలను అందివ్వాలి, అని ఆకాంక్షిస్తూ! అభినందించుకుంటారు.

ఈ నూతన సంవత్సర శుభారంభంలో కొందరు విజ్ఞులైనవారు గత సంవత్సరకాంలో వారి మానసిక బలహీనతలవల్ల ద్రొల్లిన తప్పిదాలను సరిదిద్దు కునేందుకు ఈ రోజు కఠినమైన ప్రతిజ్ఞలు చేసి వారి లోపాలను సరిదిద్దుకుంటారు. మరి కొందరు అయితే! వారి ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దుకునేందుకు ఇది ఒక చక్కని "శుభదినంగా" భావించి కొత్త కొత్త పొదుపు మార్గాలను ఈ రోజుతో ప్రారంభించి వారి కుటుంబ భవిష్యత్తుకు చక్కని పూలబాట వేసుకుంటారు.

ఇల్లు పచ్చగా ఉండాలంటే! పొరుగుపచ్చగా ఉండాలి. మరి పొరుగుపచ్చగా ఉండాలి అంటే! అందరు సమైక్యభావన అలవరచుకుని సోదర భావంతో కలసి మెలసి జీవించాలి. ఆనాడు గ్రామాలు, జిల్లాలు, రాష్ట్రాలు; తద్వారా దేశము సుభిక్షంగా ఉంటుంది. ఆ గౌరవమే ప్రపంచ దేశాలలో "భారతదేశము" తన ప్రముఖస్థానం నిలుపుకుంటూ చెరగని ముద్ర వేసుకుంటుంది. అట్టి డిశంబరు 31వతేదీ అర్ధరాత్రితో ఈ సంవత్సరానికి వీడ్కోలు పలుకుతూ నూతన సంవత్సరాన్ని స్వాగతించి; తోటి సోదరులతో కలసి శుభారంభం పలుకుదాం! అదే మన "సాయీశ్వరునకు" నిజంగా సమర్పించే నిజమైన "పుష్పాంజలి"

## అయ్యప్ప - మకర జ్యోతి - సంక్రాంతి

1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : నలుపు రంగువి
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకు ఉపయోగపడు వస్తువులు-పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి.
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : నల్లటి వస్త్రం
8. కలశముపై వస్త్రము రంగు : నల్లటి వస్త్రం
9. పూజించవలసిన ఫోటో : అయ్యప్పస్వామి
10. పూజించవలసిన ప్రతిమ : పంచలోహపు అయ్యప్పస్వామి
11. పూజించవలసిన దైవము : అయ్యప్పస్వామి
12. తయారు చేయవలసిన అక్షతలు : ఎరుపు
13. పూజకు కావలసిన పువ్వులు : అన్నిరకములు
14. అలంకరణకు వాడవలసినపూలు : గజమాలలు
15. నివేదన చేయవలసిననైవేద్యం : పొంగలి
16. సమర్పించవలసిన పిండివంటలు : గారెలు, బూరెలు
17. నివేదించవలసిన పండ్లు : అన్నిఫలాలు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : అయ్యప్ప అష్టోత్తరము
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : అయ్యప్ప స్తోత్రము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : అయ్యప్ప అష్టకము
21. పారాయణచేయవలసిన సహస్రాలు : అయ్యప్ప
22. పారాయణ చేయవలసినగ్రంథం : అయ్యప్ప లీలామృతము
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : అయ్యప్ప జననము
24. దర్శించవలసిన దేవాలయాలు : అయ్యప్ప
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : శబరిమలై
26. చేయవలసిన ధ్యానములు : అయ్యప్ప ధ్యానములు
27. చేయించవలసిన పూజలు : అయ్యప్పస్వామి అష్టోత్తరనామార్చన
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : అయ్యప్పస్వామి అభిషేకం
29. ఆచరించవలసిన వ్రతము : లేవు
30. ఉపవాసము నియమము : లేవు
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించివలసిన పుస్తకములు : అయ్యప్ప లీలామృతం, అయ్యప్ప భజనలు, అయ్యప్ప స్వామిపూజ
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : అయ్యప్ప భజనపాటలు
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : అయ్యప్ప నిత్య పూజ
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : 5మంటపములలో అయ్యప్పభజన
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : 18మెట్లపూజ
37. పర్వదిన నక్షత్రము : ఉత్తరా
38. పర్వదిన తిథి : –
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శనివారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : సా॥5గం॥నుండి 7గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : కంచు దీపారాధనలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : 5 దీపారాధనలు
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5+5+5+5
44. వెలిగించవలసిన వత్తులు : దూదితో
45. దీపారాధన వాడవలసిన నూనె : ఆవునెయ్యి
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి: పంచహారతి
47. ధరించవలసిన తోరము : నల్లటితోరము
48. నుదుటన ధరించవలసినది : గంధము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : స్వామియే శరణం అయ్యప్ప
50. జపమునకు వాడవలసిన మాల : నల్లటి తులసి మాల
51. మెడలో ధరించవలసిన మాల : నల్లటితులసి మాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : అయ్యప్ప
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : దక్షిణము

## మకర సంక్రాంతి

సంక్రాంతి అభ్యుదయ కాముకులను కూడా సంప్రదాయంవైపు మళ్ళిస్తుంది. పండుగలు, పర్వాలు వచ్చినప్పుడల్లా అభ్యుదయ కవులు సైతం సంప్రదాయంవైపు మొగ్గుచూపుతారు. అసలు అదే ఈ పండుగల లక్ష్యంగా కనబడుతుంది. ఈ సంక్రాంతి పల్లీయులకు ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తుంది. ఏటికేడాది కష్టించి పండించిన పంటలు ఇళ్ళకు చేరే సమయం ధాన్యలక్ష్మికి స్వాగతం చెప్పడానికి ఇళ్ళ ముంగిట రంగు రంగుల ముగ్గులు ప్రత్యక్షమవుతాయి. చిన్న పిల్లలనుంచి పెద్దల వరకు ముగ్గుల్లో గొబ్బెమ్మలను పెట్టి పూలతో అలంకరించి పాటలు పాడతారు.

**సుబ్బీ గొబ్బెమ్మా సుఖములియ్యవే తామరపువ్వంటి తమ్ముణ్ణియ్యవే**
**చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యవే మొగలిపువ్వంటి మొగుణ్ణియ్యవే**

అని అంటూ కన్నె పిల్లలు పాటలు పాడుతూ గొబ్బెమ్మలకు పూజలు చేస్తారు. ఈపాట ప్రాచీనజానపదులు పాడుకున్నపాట. నేటికీఆపాట అలాసంప్రదాయంగా సాగు తూనేవస్తోంది. అసలుప్రకృతి పరవశించి పూవులుపూస్తుంది. ఈప్రకృతి చిత్రాన్ని



**బంతి పూవులు లేత నవ్వులతో సంక్రాంతి సుందరి సాగివచ్చింది**
**తెలుగు పల్లెలు నిద్రలేచాయి వెలుగులో కనువిచ్చి చూచాయి సంక్రాంతివేళ**

అని అభ్యుదయ కవి దాశరథి పులకించి పాడాడు. సంక్రాంతికి ముందే నెల పట్టడం అని ముగ్గులు పెట్టడం, గొబ్బెమ్మలతో అలంకరించడం నెలరోజులపాటు సాగుతుంది. చివరి రోజున "రథం" ముగ్గురు వేస్తారు. ఆముగ్గురు ఎవరు ఎంత పొడవుగా వేస్తారు అని పోటీలు పడి వీధుల చివరిదాకా ముగ్గులు వేస్తారు. ఈ పోటీలలో ఒక సరదా, ఒక నేర్పు ఇమిడి ఉన్నాయి. ఈ రోజున కమతాగాళ్ళకు ఏడాదికి సరిపడి ధనధాన్యాలను కొలవడం సంప్రదాయం. ఈనాడు ఈ సంప్రదాయం అంతగా లేకపోయినా పూర్తిగా అంతరించి పోలేదు. ఈ సంక్రాంతి పండుగ జానపదులకు చాల ముఖ్యమైనది. జానపదుల కళలు ఈ సంక్రాంతి పండుగ సందర్భంగా బహిర్గతమవడమే కాకుండా ప్రదర్శింపబడతాయి. వీటిలో చెప్పుకోతగ్గది "గంగిరెద్దుల" ఆట. ఈ సంప్రదాయం నేడు పట్టణ ప్రాంతాలలోనూ కనబడుతూనే ఉంది. ఇది అతి ప్రాచీనమైన కళగా భావిస్తారు.

ఇంక సంక్రాంతి ప్రత్యేకత శాస్త్రపరంగా చాలా ఉంది. నక్షత్రాలు ఇరువది ఏడు. మళ్ళీ ఒక్కొక్క నక్షత్రానికి నాలుగు పాదాలు. మొత్తం 108 పాదాలుగా విభజింపబడినాయి. తిరిగి 108పాదాల్నీ 12 రాశులుగా విభాగించారు. సూర్యుడు నెలకొక రాశిలో ప్రవేశిస్తాడు. సూర్యుడు ఏ రాశిలో ప్రవేశిస్తే ఆ రాశి ఆ సంక్రాంతిగా వ్యవహరింపబడుతుంది. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పుడు ఆ రాశిని







'మకర సంక్రాంతి' అని అంటారు. సూర్యుడు ప్రాణాధారమైనవాడు. సూర్యకాంతితో చంద్రుడు ప్రకాశిస్తాడు. ఒకరు శక్తి మరొకరు పదార్థము. మనస్సుకు కారకుడు చంద్రుడు. చంద్రుడు కర్కాటక రాశ్యాధిపతి. సూర్యుడు మిథున రాశి నుంచి కర్కాటక రాశిలో కర్కాటక సంక్రమణంలో ప్రవేశిస్తాడు. అది దక్షిణాయనం. ఇంద్రుడు తూర్పు దిక్కునకు అధిపతి. పడమరకు అధిపతి వరుణుడు. వీరిద్దరి వాహనాలు ఐరావతము, మకరము. యోగశాస్త్ర ప్రకారం మనశరీరంలోని షట్చక్రములలోని మూలాధారం వద్ద ఏనుగు(ఐరావతం) ఉంటుంది.

**సూర్యుడు ధనూరాశినుంచి మకరరాశిలోకి ప్రవేశించినది మొదలు కర్కాటక రాశిలో ప్రవేశించేవరకు దేవతలకు పగలుగా ఉంటుంది. అలాగే సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశించినది మొదలు ధనూరాశిలో ప్రవేశించేవరకు దేవతలకు రాత్రి.**

ఉత్తరాయణం దేవతలకు పగలుగా ఉంటుంది. కనుకనే దేవతలకు పగటి కాలంలో యజ్ఞయాగాదులు చేసి దేవతల అనుగ్రహాన్ని పొందమని సూచిస్తుంది. మకర సంక్రాంతి. పవిత్రమైన ఉత్తరాయణ పుణ్యకాలం ఉత్తమ లోకప్రాప్తిని కలిగిస్తుంది. అందుకే భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలంలో స్వచ్ఛంద మరణాన్ని కోరుకుంటాడు. రవి ధనురాశిలో ప్రవేశించినప్పటినుంచి ధనుర్మాస వ్రతాన్ని ఆచరిస్తారు. ఈనెల పొడుగునా వాకిళ్ళముందు రంగవల్లులు తీర్చిదిద్దుతారు. ఇలా ముగ్గులు పెట్టడమూ అత్యంత ప్రాచీనమైన సంప్రదాయమే.

**"పూజాస్థాన విశుద్ధ్యర్థం దోమయేవ పూజయేత్**
**తతః పంచవిధై శ్చూర్ణైరంగవల్లీం ప్రకల్పయేత్"** **-స్కాందపురాణం**

అనగా ఈ మకర సంక్రాంతి ఉత్తరాయణ పుణ్యకాలంగా వ్యవహరింప బడుతుంది. అందుకే ఇది అతి పవిత్రమైనది.

హిందువులు అంతా పెద్దలనుండి పిన్నలవరకు అత్యంత ప్రీతిపాత్రంగా ఆచరించే పండుగలలో "సంక్రాంతి" ప్రముఖస్థానం సంపాదించుకుంది. ఇది పుష్యమాసంలో సూర్యుడు "మకరరాశిలో" ప్రవేశించిన పుణ్యదినం.

మనకందరకూ తెలుసు! మన భూగోళమందు కర్కాటకరేఖ, భూమధ్య రేఖ,మకర రేఖలు ఉన్నాయని. సూర్యభగవానుడు సప్తాశ్వాల మహారథం మీద పయనిస్తూ! ప్రతినెలయందు కూడా మేషాదిగా ఉన్న పన్నెండు రాశులయందు ఒక్కొక్కనెల చొప్పున ఉంటూ వస్తాడు. అలా! ఆయారాశులందు "సంక్రమణాలు" వస్తూ ఉంటాయి. ఇలా మకరరాశితో కలసినప్పుడు ఆ రేఖతో సంక్రమణం చెంది సూర్యగమనం ఉత్తరదిశగా మారి "ఉత్తరాయణ-పుణ్యకాలం" మనకు వస్తుంది. అలాగునే; కర్కాటక రేఖతో కర్కాటక రాశిలో ప్రవేశించినప్పుడు సూర్యగమనం దక్షిణదిశగా ప్రారంభమయి "దక్షిణాయణం" వస్తుంది. ఈ రెండు (ఒక్కొక్కటి ఆరుమాసాలు) చొప్పున ఆయనాలు పూర్తి అవుతే! ఒక్క సంవత్సరకాలం పూర్తి

అవుతుందన్నమాట! అందువల్లనే భీష్మపితామహులు దక్షిణాయనంలో అంపశయ్య మీద పడినా; ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చు వరకు నిరీక్షించి తుదిశ్వాస విడిచారు. ఆకారణంగా; దీనిని పితృదేవతల ఆరాధనా పుణ్యకాలంగా కూడా వ్యవహరిస్తారు. ఇలా సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన పుణ్యదినాన్ని "మకరసంక్రమణంగా" "సంక్రాంతి"గా ప్రాధాన్యత పొందింది.

ఈ సంక్రాంతిలో "సం" అంటే మిక్కిలి "క్రాంతి" అంటే అభ్యుదయం. మంచి అభ్యుదయాన్ని ఇచ్చు క్రాంతి కనుక దీనిని "సంక్రాంతి"గా పెద్దలు వివరణ చెబుతూ "మకరం" అంటే! మొసలి. ఇది పట్టుకుంటే వదలదు అని మనకు తెలుసు. కాని మానవుని యొక్క ఆధ్యాత్మిక మార్గానికి అడుగడుగునా అడ్డుతగులుతూ, మోక్ష మార్గానికి అనర్థాని చేయుటలో ఇది అందవేసినచేయి! అందువల్ల ఈ "మకర సంక్రమణం" పుణ్యదినాలలో దీని బారినుండి తప్పించుకునేందుకు ఒకటేమార్గం అది ఎవరికి వారు యధాశక్తి 'లేదు' అనకుండా దానధర్మాలు చేయుటయే మంచిదని, శాస్త్రకోవిదులు చెబుతూ ఉంటారు. అలా! కేవలం అప్పుడే కాకుండా! నిత్య జీవనంలో కూడా దాని బారిని పడకుండా చూచుకుంటూ ఉండాలికదా! మరి. ఇక ఈ పండుగల లోని విశిష్టత ఏమిటో తెలుసుకుందాం!

ఈ "సంక్రాంతి" ఒంటరిగా మాత్రం రాదుట! మహారాణిలా ముందు "భోగిని" వెనుక "కనుమ" ను వెంటబెట్టుకుని చెలికత్తెల మధ్య రాకుమార్తెలా, వస్తుందట!

**సంక్రాంతి :-** ఇది మకర సంక్రాంతి పుణ్యదినం! అందువల్ల ఈ రోజు యధాశక్తి దానధర్మాలు చేయుటవల్ల జన్మజన్మల దారిద్ర్య బాధలు అంటవని! అలాగునే "స్త్రీలు" పూలు, పసుపు, కుంకుమ, పండ్లు మున్నగునవి దానం చేయుటవల్ల సకల సంపదలతో పాటు చక్కని సౌభాగ్యం కలుగుతుందని నమ్మకం. అలాగునే ఈరోజు పితృదేవతారాధన చేయుటవల్ల వారి శుభాశీస్సులతో! వారి వారి వంశాలు వర్ధిల్లుతాయని పండితోత్తములు చెబుతూ ఉంటారు.

**కనుమ :-** ఈ రోజు అంటే రైతన్నలకు అత్యంత ప్రీతిపాత్రమైనది. వారి బిడ్డలకు ఏలోటు లేకుండా! పాడిని అందించే "గోమాతను" వ్యవసాయ పనులలో రైతన్నకు చేదోడు వాదోడుగా ఉంటూ చివరకు "ధాన్యపురాశులను" ఇంటికి చేర్చువరకు! తోడ్పడే "బసవన్న"కు పూజలు జరిపి పసుపుల పండుగ చేస్తారు. ఆ రోజు ఆ ఇంటి యజమాని, యజమానురాలు కళ్ళలోని సంక్రాంతి కాంతి కిరణాలు! అందరకూ కనువిందుచేస్తూ ఉంటాయి.

ఈ రోజున ఇక పెద్దలు, పిన్నలు పోటీపడుతూ, వారి వారికి అనుకూలమైన సైజులలో "ప్రభలను" కట్టి వాటిపై "పార్వతీపరమేశ్వరుల" ప్రతిమల నుంచి ఇరుగు-పొరుగు గ్రామాలవారితో కలసి ఒకచోట చేరి! మేళతాళాలతో అత్యంత





వైభవంగా "ప్రభలతీర్థం" నిర్వహిస్తారు. ఇట్టివి వర్ణింపనలవికావు. గ్రామ సీమలలో చూడవలసిందే!

**ముక్కనుమ :-** పై మూడు పండుగలు గడచిన నాలుగవ రోజున క్రొత్తగా పెండ్లి అయిన ఆడపిల్లలు "సావిత్రి గౌరివ్రతం" అంటే "బొమ్మల నోము" పడతారు. ఈ దేవిని తొమ్మిది రోజులు పూజించి తొమ్మిది పిండివంటలతో రోజూ నివేదన చేసి పిదప ఆ మట్టి బొమ్మలను పుణ్య తీర్థమందు నిమజ్జనం చేస్తారు.

ఇంతటి విశిష్టమైన పండుగ వింతశోభలు తిలకించాలి అంటే; గ్రామసీమలే పట్టుగొమ్మలు. ప్రతి ఇల్లు నూతనంగా వెల్లలు ఇంటా బయటా వేసుకుని, ముత్యాల ముగ్గులతో పచ్చని తోరణాలతో, కళకళలాడుతూ! "సంక్రాంతి" లక్ష్మిని ఆహ్వానిస్తూ ఉంటాయి. ఇక ధనుర్మాసము ప్రారంభమైన నాటినుండి వివిధ ఆలయాలలోని అర్చకస్వాములు "సంక్రాంతి" నెలపట్టి సూర్యోదయానికి పూర్వమే మంగళవాయిద్యా లతో నదీజలాలను "తీర్థంబిందులలో" తోడ్కొని వచ్చి విశేషార్చనలు నిర్వహిస్తారు. ఇంటిముందు కన్నెపిల్లలు కళ్ళాపులు చల్లుతూ! ప్రతిరోజు వివిధ రకాల ముగ్గులతో! సప్తవర్ణాల రంగవల్లికలను తీర్చిదిద్ది "ఇంద్రధనుస్సులను" ముంగిట చూస్తున్నట్లు భ్రమింపచేస్తారు.

ఈ కన్నెముత్తైదువులు ఆ ముగ్గుల నడుమ ఆవుపేడతో చేసిన "గొబ్బెమ్మ"లను బంతి, చేమంతులతో అలంకరించి ఇరుగుపొరుగు కన్నెముత్తైదువులను పిలచుకుని "గొబ్బియల్లో...! గొబ్బియల్లో...! అంటూ వివిధ రంగులలో అలంకరించుకుని వచ్చిన దుస్తులతో! ఆ గొబ్బెమ్మలచుట్టూ తిరుగుతూ పాటలు పాడి పేరంటం పెట్టుకుంటారు.

ఈ పండుగ దినాలలో "కోటివిద్యలు, కోటి వేషాలు కూటికోసమే!" అనునట్లుగా హరిదాసులు హరినామ సంకీర్తనలు చేస్తూ వచ్చి "కృష్ణార్పణం" అంటూ ముంగిట భిక్షను స్వీకరిస్తూ ఉంటారు. ఇక గంగిరెద్దులవారు "బసవన్న"ను ఆడిస్తూ! చిన్నారులను దీవిస్తూ ఉంటారు. ఇలా ! జంగమదేవరలు, బుడబుక్కలవాళ్ళు, కొమ్మదాసరలు, పిట్టలదొరలు, విచిత్ర వేషధారులు మున్నగు కళాకారులంతా! ఈ పండుగ దినాలలో వచ్చి వారివారి కళలను ప్రదర్శిస్తూ! ఎవరికి వారు ఆనందంగా ఇచ్చే కానుకలు స్వీకరిస్తూ! చివరిగా ఒకపాత వస్త్రాన్ని ఇమ్మనికోరి, భుజాన వేసుకుని పోతూ! "సుభోజ్యంగా" ఉండాలమ్మ అంటూ దీవించిపోతూ ఉంటారు. ఇలా ఈ గ్రామ సీమల్లో ఏ కళాకారునీ రిక్తహస్తాలతో పంపకుండా! కలిగినదానిలో కలిగినంత ఇచ్చి పంపుతారు. అది వారి సదాచారం.

ఇంత చక్కని ఆనందాన్ని మనకు అందించే "సంక్రాంతి" పండుగలు మనం జరుపుకుని మహారాణిలావచ్చే ఆ సంక్రాంతి లక్ష్మిని మన ముంగిటలోనికి ఆహ్వానం పలుకుదాం.

## మకర సంక్రాంతికి-మకరజ్యోతి రూపంలో అయ్యప్పస్వామి



ప్రతిసంవత్సర లక్షలాది మంది భక్తులను క్రమబద్ధమైన రీతిలో నల్లని బట్టలు ధరింపజేసి, విలక్షణమైన రీతిలో కఠోరమైన దీక్షలు చేయించి, "స్వామియే శరణం అయ్యప్ప" అని శరణం చెప్పించుకుంటూ! భక్తులను కఠినశిలలపై బాధ తెలియని రీతిలో నడిపించగల మహిమాన్వితుడు; అడుగడుగున ఆదుకునే అభయహస్త స్వామీ! అఖిలాండ కోటి భక్తజనావళికి సదా ఆశీస్సులు అందించే ఆ అయ్యప్పస్వామి వారి జన్మ వృత్తాంతగాథ ఏమిటి? వారిని దర్శించుకోవటమెలా? అనే కుతూహలం మీకు ఉన్నదా?

అయితే గత 18 సంవత్సరాలుగా నిర్విరామంగా "శబరిమలయాత్ర" నిష్ఠగా పూర్తిచేసి, వారు 18వ మెట్టు ఎక్కి అయ్యప్పస్వామిని దర్శించినందుకు గుర్తుగా, వారి వెంట తీసుకుని వెళ్లిన చిన్న కొబ్బరిమొక్కను స్వామి సన్నిధాన ప్రాంగణంలో నాటి దీక్ష పరిపూర్ణం చేసుకువచ్చిన కొందరు భక్తాగ్రేసురులైన గురుస్వాములు ఈ స్వామిని గూర్చి వివరించిన సుదీర్ఘమైన విశేషాలలో కొన్ని సమీక్షగా తెలుసుకుందాం.



అసలు ఆ స్వామి చిన్ముద్రతో పట్టబంధాసనం లో తపస్సులో ఆసీనులైన తీరే! ముందు మనకు కలిగే మొదటి సందేహమవుతుంది. అనంతరం వారి జన్మవృత్తాంతం, దీక్షా విధానాలనుగూర్చి కూడా కొద్దిగా ముచ్చటించు కుందాం!

మానవుల భవబంధాలను త్రెంచి వారినిముక్తి మార్గంలోకి మళ్ళించే సంకేతమే! ఈ చిన్ముద్రరూపంలోని భావం అని భక్తులు భాష్యం చెప్తారు. అలా దివ్యజ్ఞాన జ్యోతిని వెలిగించే ఆ కరుణామూర్తి యొక్క రూపాన్ని నిశితంగా పరిశీలించండి. ఆస్వామి తన బొటన వ్రేలితో చూపుడు వేలినిచేర్చి, చిన్ముద్రభంగిమలో కూర్చున్నాడు. ఇక్కడ బొటనవ్రేలు అంటే! ఆత్మకు సంకేతమైనది. మరి చూపుడు వ్రేలు అంటే! జీవునకు సంకేతమైనది. అలా ఆ స్వామిని వాటిని చేర్చుటలోని భావం! ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి కఠోర నిష్టాపరులై తన దివ్యధామానికి చేరుకున్న భక్తుల 'ఆత్మను' తనలో ఐక్యంచేసుకుంటూ! వారి అజ్ఞానపు చీకట్లను తొలగిస్తాను; అనిచూపే 'అభయహస్తమే' ఆ చిన్ముద్రలోని భావం అనిచెప్తారు. "ఆత్మ పరమాత్మలో ఐక్యం కావడమే ఆత్మసాక్షాత్కారం." అలా తనను భక్తితో దర్శించే భక్తులు ఆత్మానందం పొందాలి అన్నదే! స్వామివారి ఆరాటం.

మరి 'పట్టబంధాసనం'అంటే? తాను తపస్సులో ఉండగా సాక్షాత్తు తల్లిదండ్రులే తన దర్శనార్థమై వచ్చినా! వారిపై గల గౌరవ భావంతో లేచినిలబడి తన తపస్సును భగ్నం చేసుకోకుండా ఉండేందుకే ఈ ప్రక్రియలోని భావం. ఆ విధంగా అయ్యప్ప తత్వాన్ని త్రికరణశుద్ధితో అమలుపరచే భక్తులు తప్పక జీవన్ముక్తులవుతారు అనిచెప్పుట అతిశయోక్తి కాదనుకుంటాను.





ఇక మీరు ఎంతో ఆతృతగా ఎదురుచూస్తున్న స్వామివారి జన్మ వృత్తాంతగాథను పరిశీలిద్దాం! దీనిపై కూడా విభిన్న రీతులలో గాథలు కానవస్తున్నాయి. భూత నాథోపాఖ్యానంలోనూ, బ్రహ్మాండపురాణమందు అయ్యప్పస్వామివారి ప్రస్తావన ఉన్నట్లు భక్తులు చెప్తారు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు భూలోకంలో ధర్మసంస్థాపన కావించాలి అని సంకల్పించి "దత్తాత్రేయుని" సృష్టిస్తారు. వానికి తోడుగా ఉండేందుకు ముగ్గురమ్మలు లక్ష్మి, సరస్వతి, పార్వతీమాతలు వారి శక్తితో "యోగమాయను" "లీలావతిగా" సృష్టిస్తారు. అలా లీలావతి-దత్తస్వామి గృహస్థాశ్రమాన్ని గడుపుచుండగా వారి అన్యోన్య దాంపత్యం మధ్య ఒక అపశృతి దొర్లుతుంది.

అది దత్తస్వామికి తన కర్తవ్యమేమిటో జ్ఞానోదయమై సంసారంపట్ల విముఖతకల్గి వైరాగ్యాన్ని అవలంబించుట, దానితో మిక్కిలి ఆగ్రహించిన లీలావతి దత్తస్వామిని 'మహిషాసురడనే' రాక్షసుడు కమ్మని శపిస్తుంది. అందులకు ప్రతిగా దత్తస్వామి లీలావతిని 'మహిషిగా' మారిపొమ్మని ప్రతిశాపమిస్తాడు. అలా వారు ఇరువురు వారి రాక్షస ప్రవర్తనతో ! లోక కంటకులౌతారు. వారిలో మహిషాసురుని దుర్గాదేవి సంహరిస్తుంది. అందులకు మహిషి తన ప్రాణసఖుని వధించినందులకు ప్రతీకారం తీర్చుకోవాలని బ్రహ్మను గూర్చి ఘోరమైన తపస్సుచేసి; తనకు హరి హరాదులకు కలిగిన బాలుడు తప్ప వేరెవరు తనను వధించకుండా వరమిమ్మని ప్రార్థిస్తుంది. బ్రహ్మ 'తథాస్తు' అని అంతర్థానమౌతాడు.

పాపం ఇక్కడ మహిషి భావన! "హరి హరాదులు ఆలింగనం చేసుకున్నంత మాత్రాన బాలుడు కలుగడని, పోని కలిగినా! తన భయంకర రూపాన్ని చూచి బాలుడు తనను ఏమి చేయలేడని, భావించి ఉండవచ్చు నేమో!మరి.

ఆ వర గర్వంతో, మహిషి దేవలోకాన్ని కొల్లగొట్టి దేవతలందరిని పలు ఇక్కట్లుకు గురి చేస్తుంది. దానితో దేవేంద్రాది దేవతలు "శ్రీహరిని"ప్రార్థిస్తారు. అప్పుడు శ్రీహరికి ఒక ఉపాయము తోచుతుంది. తానులోగడ దేవ-దానవులు అమృతం కొరకు "క్షీరసాగరాన్ని" మథించినప్పుడు అందుండి లభ్యమైన అమృతాన్ని వార్కి పంచే సమయాల్లో తాను ధరించిన "మోహిని అవతారాన్ని" పరమేశ్వరుడు మోహంతో చూచాడు. నేను తిరిగి ఆ అవతారము మరోమారు దాల్చుతే పరమేశ్వరుడు తప్పకవచ్చి నన్ను ఆలింగనం చేసుకుంటాడు అని తలచి...!

తిరిగి జగన్మోహినిగా అవతారముదాల్చి పరమేశ్వరుని దృష్టిపడువిధంగా! వనమందు సంచరించసాగాడు. తాను లోగడ చూచిన మోహిని తిరిగి కనిపించు సరికి శ్రీహరి ఆశించిన విధంగా! 'పరమేశ్వరుడు'వచ్చి ఆలింగనం చేసుకుంటాడు శ్రీమహావిష్ణువును. అలా వారి ఆలింగనలో ఇచ్ఛామాత్రంగానే అయోనిజుడైన బాలుడు కలుగుతాడు. ఆ బాలునకు సకల భూతాలపై ఆధిపత్యం వహించి

భూతనాథుడు కమ్మని పరమేశ్వరుడు ఆశీర్వదించగా, శ్రీ మహావిష్ణువు తన కౌస్తుభమణి సంకేతంగా ఒక మణిహారాన్ని ఆ బాలుని మెడలో వేస్తాడు. బ్రహ్మ ఆబాలుని 'హరిహర పుత్రుడుగా' ఆశీర్వదించి అంతర్ధానమవుతారు.

ఇక్కడ ఒక విషయం గమనించండి, "జగద్రక్షకుడైన ఆ పరమేశ్వరునకు ఇంతటి మోహదృష్టి ఏమిటి? అని శంకించకండి, జగన్నాటక సూత్రధారులైన వారి లీలలు కేవలం లోకకళ్యాణార్థమే తప్ప మనబోటి సామాన్యులకు అవి అర్థంకావు. ముఖ్యంగా వారు ఇరువురు ఆశించేది మొదటిది 'మహిషి' మదమణచడంతో దేవతలకు మానవులకు ఆనందాన్ని ఇవ్వడం. రెండవది అభేదస్వరూపులమైన హరి హరాదుల మధ్య భేదభావంతో చూడకూడదు అని! భక్తులకు తెలియజేయుటయే వారి ఆత్మీయ ఆలింగనలోని భావంగా గ్రహించుకోవాలి.

ఇలా ఉండగా! కేరళ దేశంలో 'పందళరాజ్యము' పాలించే భూపాలుడు 'రాజశేఖర పాండ్యునికి' సంతానప్రాప్తి కరువైంది. అందులకై ఆతడు ఎన్నో యజ్ఞయాగాది క్రతువులు నిర్వహిస్తూ, ఒకసారి వేటకై తన పరివారాన్ని వెంటబెట్టుకుని పంపానదీతీరాన సర్పపడగ నీడన, కేరింతలు కొడుతూ చిరునవ్వులు చిందిస్తూ ఉన్న ఆ బాలుని, కేరింతలువిన్న ఆ మహారాజు ! ఆ బిడ్డను చూచి సాక్షాత్తు ఇది మా నోముల పంటగా! భగవంతుడు వరప్రసాదంగా ఇచ్చిన బిడ్డ అని అక్కున చేర్చుకొని రాజ్యానికి చేరుకుని ఎంతో ఆనందంతో 'మహారాణి'కి అందిస్తాడు. వెంటనే పురోహితులను రప్పించి మణిమాలతో దొరకిన ఆ బాలునకు "మణికంఠుడని" నామకరణంచేసి అల్లారు ముద్దుగా పెంచుకోసాగినారు. అలా మన మణికంఠునిరాక (బిడ్డవచ్చిన వేళ మంచిది) అన్నట్లుగా! మహారాణికి పుత్రసౌభాగ్యం కలుగుతుంది.

అనంతరం మహారాజు మణికంఠుని- సోదరుని గురుకులంతో చేర్పించి విద్యాబుద్ధులు చెప్పిస్తారు. 'మణికంఠుడు' అచిరకాలంలోనే సర్వవిద్యా పారంగతు డౌతాడు. గురుదక్షిణగా, వికలాంగుడైన ఆ గురుపుత్రునికి కంటిచూపును మాటను ప్రసాదించి, తన మహిమను చాటుకుంటాడు. అలా గురుఋణం తీర్చుకున్న ఆ బాలుని చూచి తోటి విద్యార్థులు నిచ్చేష్టులై ఆమణికంఠుని "గురువిన్-గురవే" అని స్తుతించసాగేరు. అంటే గురువుకే గురువయ్యావు అని కీర్తించినారు. అలా విద్యాభ్యాసము పూర్తిచేసుకుని వచ్చిన బాలుడు అనంతరం అస్త్రవిద్యలలోను పారంగతుడౌతాడు. అట్టి బాలుని చూచుకున్న మహారాజుకు 'మణికంఠుని' యువరాజుగా పట్టాభిషేకం చెయ్యాలి అని సంకల్పించి పండితులను రప్పిస్తాడు. అది విన్న దుష్టబుద్ధిగల మంత్రి, మహారాణి బుద్ధిని వక్రీకరించి తనకు శిరోవేదన వచ్చిందని దానికి పులిపాలు తప్ప వేరే వైద్యము లేదని రాజవైద్యులచే చెప్పించి, మహారాణి స్వంతకొడుకును 'యువరాజు'చేసేందుకు కుట్రపన్నుతాడు మహామంత్రి. పాపం మహారాజు ఆ విషయం గమనించడు. తల్లిదండ్రుల ఋణం తీర్చుకొనుటకు ఇదిచక్కని అవకాశముగాభావించి మణికంఠుడుమహారాజు అనుమతి తీసుకుంటాడు.





పందళరాజు యెత్తిన 'ఇరుముడి' తలదాల్చి చేతిలో విల్లమ్ములను ధరించి అడవుల వెంట తిరుగుతూ అప్పుడే "ఈనియున్న" పులికై అన్వేషిస్తూ ఉన్న మణికంఠుని ఇంద్రుడు చూచి! ఆబాలుని జన్మరహస్యాన్ని, కర్తవ్యాన్ని బోధిస్తాడు. అది విన్న మణికంఠుడు తన అవతార ధర్మాన్ని తలచుకుని 'మహిషి' అన్వేషణ ప్రారంభిస్తాడు. మహిషిజాడ తెలుసుకొనుటకై కరిమల శిఖరాగ్రంచేరి పరాశక్తిని ప్రార్థిస్తాడు. పరాశక్తి ప్రత్యక్షమయి మణికంఠునికి మాయావి అయిన 'మహిషి'ని సంహరించాలి అంటే నల్లని వస్త్రాలు ధరించాలి అని, భూతసంహారానికి అవిమంచివని సూచించి, వానిచే ధరింపచేసి తనవెంట మహిషి సంహారం పూర్తి అయ్యేవరకు అండగా ఉంటానని అభయమిస్తుంది. అనంతరం 'అళుదానది' తీరంలో తారసపడిన మహిషితో ఘోరమైన యుద్ధము చేసి వధిస్తాడు. దానితో శాపవిముక్తి చెందిన "లీలావతి" జగన్మోహనా కారుడైన స్వామిని చూచి ఆతని సౌందర్యానికి ముగ్ధురాలై తనను వివాహమాడమని ప్రార్థిస్తుంది. అందులకు స్వామి నిరాకరించి తాను ఆ జన్మబ్రహ్మచారిగా ఉంటూ, సర్వమానవాళికి ఎల్లప్పుడు రక్షకుడై వుంటానని, ఆమెను "మాళికాపురత్తమ్మ"గా వెలుగొంది తన ప్రక్కనే వుండి జనుల పూజలందుకొమ్మని సెలవిస్తాడు.

అనంతరం 'ఇంద్రుడు' తన స్వామికార్యం తీర్చవలసిన బాధ్యత తనకు ఉన్నది కావున! తాను 'పులి'గామారి స్వామిని తనపై కూర్చోమని దేవతలనందరిని పులి పిల్లలుగా మారుస్తాడు. ఆ మణికంఠస్వామి తనపై స్వారిచేస్తున్నందుకు ఇంద్రుడు లోలోన తన జన్మ సాఫల్యమైనందుకు మిక్కిలి సంతోషిస్తాడు. అలా పులిపాలు తెమ్మని పంపిన స్వామి! పులిపై స్వారీచేస్తూ పులిపిల్లలతోకలసి 'పందళరాజ్యము' చేరుసరికి రాజదంపతులు, ప్రజలు నిశ్చేష్టులవుతారు. అలావస్తున్న మణికంఠునిలో సాక్షాత్తు దైవస్వరూపముగాంచిన "మహారాణి" తన కుతాంత్రాలను మన్నించమని కోరుతుంది. మహారాజు ఆస్వామిని ప్రేమతో కౌగలించుకుని ఇకపై రాజ్యభారం స్వీకరించవలసిందిగా కోరతాడు. అందులకు స్వామి నిరాకరిస్తాడు.

దేవతల అనుమతితో మణికంఠుడు తన నిజరూపదర్శన మిచ్చి మహారాజు కోరిక తీర్చలేకపోతున్నందుకు మన్నించమని, తన తమ్మునికి రాజ్యపట్టాభిషేకం చేయమని తాను తపస్సుకై వెడలిపోతున్నానని తల్లి దండ్రులవద్ద తాను అంతవరకు ధరించిన రాజాభరణములు, వారివద్దనే వదలివైచి సెలవు తీసుకుంటున్న స్వామిని చూచి నాయనా! నీవాత్సల్యాన్ని మేము ఆజన్మాంతము మరువలేము. నీవుండే ప్రదేశాన్ని సెలవిమ్ము, అచ్చట గుడికట్టిస్తాను. తిరిగి మాకు నీదర్శనభాగ్యం ఎలా? ఎప్పుడు లభిస్తుందో చెప్పమని వేడుకుంటారు. అందులకు స్వామి అచ్చటనుండే ఒక బాణాన్ని సంధించి దాని మార్గాన్ని వీక్షించేందుకు 'దివ్యదృష్టిని' ప్రసాదించి నా బాణం గుచ్చుకున్న ప్రదేశంలో నేను ఉంటాను. నా దర్శనం మీకు ప్రతి సంవత్సరం "మకర సంక్రాంతికి మకరజ్యోతి" రూపంలో మీకు భక్తులకు లభ్యమవుతుంది. తల్లితండ్రులైన మీరైన, భక్తులైనా సరే నన్ను దర్శించుటకు (41) రోజుల పాటు

కఠోరదీక్షలు బూనిన వారికే నా దర్శనభాగ్యం లభిస్తుందని సెలవుతీసుకుని, అదృశ్యమయి స్వామి తపోదీక్షకు వెడలిపోతారు. ఇదంతా పౌరాణికగాథ.

అలా వెడలిన స్వామి మీకు ముందుగా చెప్పిన రీతిలో "చిన్ముద్రతో పట్టబంధాసనం"తో తపస్సులో ఆసీనులౌతారు. మహిషి సంహారానికి అయ్యప్ప స్వామి నల్లని వస్త్రాలు ధరిస్తారు. కాబట్టి స్వామి భక్తులు వారి దీక్షాకాలంలో తప్పక నల్లని వస్త్రాలు ధరిస్తారు. అట్టి భక్తులకు నేను ఎటువంటి బాధలు, హాని కలుగజేయనని శనీశ్వరుడు స్వామివారి ఆజ్ఞమేరకు అభయమిస్తాడు. అందువల్ల అయ్యప్ప దీక్షవహించువార్కి శనిపీడ, బాధలు ఉండవని విశ్వసిస్తారు.

ఇక దీక్షావిధానంగూర్చి కొద్దిగాముచ్చటించుకుందాం! మనదేశంలో భక్తులు వివిధ రకాల దీక్షలు వహిస్తూ ఉంటారు. శ్రీ షిరిడిసాయిదీక్షలని, శివదీక్ష, శ్రీరామదీక్ష, హనుమద్దీక్ష, భవానిదీక్ష ఇలా ఎన్నో దీక్షలు ఆచరిస్తూ ఉంటారు. అలాగే శబరిమలై స్వామివారిది రాత్రి పొద్దుపండుగ,దీపావళి నుంచి సంక్రాంతి వరకు పగటి పొద్దుపండుగ. మకరసంక్రాంతి నాడు జ్యోతిదర్శనం వరకు ఒక విధంగా చెప్పాలంటే ఇది అయ్యప్పస్వాముల సీజనుగా చెప్పుకోవచ్చు. కొత్తగా దీక్షను ప్రారంభించే 'కన్నెస్వాములు' వారు దీక్ష తీసుకొనుటకు 18సం॥ శబరిమలయాత్రచేసిన శ్రేష్టమైన "గురుస్వాములను" ఎంపికచేసుకుని వారి ఆధ్వర్యంలో ఏదైనా ఆలయంలో "ముద్రమాల" ధరిస్తారు. అందు ఒకటి తులసిమాల విష్ణుప్రీతికి, రుద్రాక్షమాల శివుని ప్రీతికి రెండు రకాలమాలలు హరిహర పుత్రుడైన అయ్యప్పస్వామి దీక్షలో తప్పక ధరిస్తారు. నాటి నుండి దీక్షావస్త్రాలుగా నల్లని వస్త్రాలను ధరించి శరణుఘోష ప్రియుడైన అయ్యప్పస్వామిని "స్వామియే శరణం అయ్యప్ప" అంటూ దీక్షావిధులను 'శబరిమలై' యాత్రపూర్తి అయ్యేవరకు ఎంతో నిష్ఠగా ఆచరిస్తారు. మలై అంటే పర్వతం. మలయాళభాషలో అయ్యప్పవెలసిన శబరికొండను 'శబరిమలై' అంటారు. మహిషిని మట్టు పెట్టిన అనంతరం శాపవిముక్తిచెందిన 'లీలావతి' కోర్కె మేరకు స్వామి ఆకొండపై కొలువు తీరుతాడు.

అయ్యప్పస్వామి దర్శనార్థం వెళ్ళే భక్తులు కనీసం 'మండలకాలం' అంటే (41రోజులు) దీక్ష తీసుకోవటం తప్పనిసరి. మాలధారణ వహించిన భక్తుడు నాటి నుండి 'అయ్యప్పస్వామిగానే' వ్యవహరింపబడతాడు. దేహమే దేవాలయంగా "మానవుడ్ని మాధవుడుగా" మార్చే ఇంతకంటే గొప్ప ప్రక్రియ మరేముంటుందో చెప్పండి!?

ఈ దీక్షాకాలంలో చన్నీటిస్నానం లేదా నదీస్నానం తప్పనిసరిగా చెయ్యాలి. పాదరక్షలు లేకుండా నడవాలి. నేల లేక చాపమీద శయనించాలి. పడిపూజలు, భిక్షలు, కఠిన బ్రహ్మచర్యం వహించాలి. ఆధ్యాత్మిక చింతనే ధ్యేయంగా సుఖభోగాలను దరిచేరనీయకుండా సాధుభరితమైన జీవనం గడపాలి.



పడి అంటే! పద్దెనిమిదిమెట్లు. స్వామికొండ యెక్కగానే స్వామిని దర్శించటానికి పద్దెనిమిదిమెట్లు వుంటాయి. అవి 'సోపానాధిదేవతల'పేరుమీద ప్రాచుర్యంలో ఉన్నాయి. చండిక, అన్నపూర్ణ, భద్రకాళి, భైరవి, సుబ్రహ్మణ్యేశ్వర, గంధర్వ, కార్తవీర్య, తృషనాభాయ, శృతిభేదక, కటుశబ్దక, యుదుంబ, భేతాళ, హరిప్రియ, కర్ణపిశాచి, పుళిందిని, రేణుక, ప్రదీపిక, ప్రత్యంగిరా, అని వ్యవహరిస్తారు. వాటి పేర్లతో 18 మెట్లను పూలు-పళ్ళతో అలంకరించి కర్పూరాది పాలతో స్వామికి పెట్టే మహాహారతే! 'పడి వెలిగించడం'. ఆకాంతి ధారలో స్వాములేకాదు భక్తులంతా తడిసి తరిస్తారు. అదే 'పడిపూజ' ప్రక్రియా విశేషం.

భిక్ష అంటే! భోజనం-ఉపాహారం-రొఖం దీనిని భక్తులు; బంధువులు మున్నగు పవిత్రమైన చోట్లనే ఈ భిక్షలు స్వీకరిస్తారు. ఇలా కఠోరమైన దీక్షలతో మండలదీక్షను పూర్తిఅయిన చివరిగా "మకరసంక్రాంతికి – మకరజ్యోతి రూపంలో అయ్యప్పస్వామి" దర్శనానికి 'గురుస్వామి' ఆశీస్సులతో 'ఇరుముడి'ధరించి శబరిమలై యాత్రకు బయలుదేరుతారు స్వాములు సామూహికంగా.

ఆ మకర సంక్రాంతి దినమందు "స్వామివారు లోగడ వారి తల్లి తండ్రులవద్ద వదలిన "తిరువాభరణాలు" వారి వంశీయులు పందళ రాజధాని నుండి ఊరేగింపుగా రథ,గజ, తురగాది సైన్యములతో మేళతాళాలతో తెచ్చి ఆ రోజు దీపాల వేళకే ఆ నగలను స్వామికి అలంకరిస్తారు. ఆనాటి నుండి ఈనాటి వరకు అంతుపట్టని చిత్రమేమిటంటే ఆ పెట్టెలు స్వామి సన్నిధానికి చేరేవరకు ఆకాశమున 'గరుడపక్షులు' ఎగురుతుంటాయి. శ్రీహరిని సేవించే గరుత్మంతుడే ఈ రూపంల్లో వచ్చినట్టు భ్రమ కలుగుతుంది భక్తులకు. ఆభరణాలు స్వామిసన్నిధికి చేరిన పిదప! ఆలయంచుట్టూ ప్రదక్షణలుచేసి అదృశ్యమవుతాయి.

ఇక ఆభరణాలు అలంకరించి, దీపారాధన సమయంలో గర్భగుడి తలుపులు తెరువగానే శబరికొండకు ఎదురుగా ఉన్న "కాంతిమలై" కొండపై సాక్షాత్తు స్వామి లోగడ తన తల్లి దండ్రులులకు, భక్తులకు ఇచ్చిన మాటప్రకారం ఈనాటి వరకు శ్రీ జ్యోతిస్వరూపుడైన ఆ అయ్యప్పస్వామి "మకరసంక్రాంతికి-మకరజ్యోతి రూపంలో భక్తులందరకు దర్శనమిస్తూ! ఆశీస్సులు అందజేస్తాడు. ఒక్కక్షణం మెరిసే మెరుపు నక్షత్రకాంతిలోని ఆ స్వామిని! దర్శించే వందలవేల సంఖ్యలోని భక్తులు తన్మయత్వంతో "స్వామియే శరణమయ్యప్ప" అనే ఘోష శ్రావ్యంగా నింగినంటేలా చెప్తారు. అది! కొందరు భక్తాగ్రేశ్వరులైన గురుస్వాములు అందించిన సమీక్ష గాథ.

అఖిలాండకోటి భక్త జనావళికి అడుగడుగునా ఆదుకునే "అయ్యప్ప స్వామి" వారు వారి అభయ హస్తముతో సర్వులకు వారి ఆశీస్సులు అందించాలని ప్రార్థిస్తున్నాము.

## త్యాగరాజ ఆరాధన

భారతీయ సంగీతరంగంలో, ఆధ్యాత్మిక రంగంలో ఒక కాంతి మంతమైన తరంగం శ్రీ త్యాగరాజస్వామి. సంగీత సాహిత్యాలలో త్యాగరాజుని ఒరవడి సుప్రసిద్ధం. దక్షిణాపథాన ఆవిర్భవించిన సంగీత మూర్తిత్రయం– శ్రీ త్యాగరాజస్వామి, శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ ముత్తుస్వామి దీక్షితులు, తిరువారూరు క్షేత్రంలోనే జన్మించారు. ఈ క్షేత్రంలోని సదాశివుడే త్యాగరాజేశ్వరుడు.

ఆస్వామి పేరే ఈ వాగ్గేయకారునికి నామకణం చేశారు. తెలుగు వైదిక ములకనాటి బ్రాహ్మణ కుటుంబానికి చెందిన రామబ్రహ్మం, శాంతమ్మ (సీతమ్మ అనికూడా పేర్కొంటారు) దంపతులకు తనయుడైన త్యాగరాజస్వామి పూర్వీకుల నుండి సత్సం ప్రదాయాన్ని తన జీవన విధానంగా మలచుకున్నారు.

త్యాగరాజు మతామహులు శ్రీ గిరిరాజకవి తిరువారూరుకి చెందినవారు. వీరు తంజావూరు ఆస్థానకవిగా ప్రఖ్యాతులు. "కాకర్ల" ఇంటి పేరుగా గల త్యాగరాజు శరభోజీ రాజుగాని ఆస్థాన సంగీత విద్వాంసులైన శ్రీ శొంఠి వెంకటరమణయ్య గారి వద్ద శిష్యరికంచేసారు.

తిరువారూరులో జన్మించిన త్యాగరాజు పంచనద క్షేత్రమైన తిరువయ్యూరులో నివసిస్తూ శ్రీరామతారక మంత్రంలో సిద్ధులయ్యారు. నారదుడు ప్రసాదించిన "స్వరార్ణవ" గ్రంథం ద్వారా ఇంకా రహస్యాలను గ్రహించారు. శ్రీరాముని ధ్యానంలో దర్శించి బాలకకనకమయ చేల...." వంటి కృతులను రచించారు.

శ్రీరాముని తన దైవంగా ఆరాధించడమే కాక, ధాతు (సంగీత రచన) మాతు (సాహిత్యరచన) రచనను అత్యంత ఆశువుగా పలికే సిద్ధిని పొంది, ఆ రచనలలో రామాంకితమైన జీవితాన్ని గడిపారు. సంగీతాన్ని 'నాదోపాసన' గా సాగించిన త్యాగరాజు, ఆ నాదాన్నే రామునిగా ఆరాధించారు.

ఉపాసనా బలం, పవిత్ర జీవనం కలిగిన త్యాగరాజు ఉంఛవృత్తితో జీవితాన్ని గడిపారు. త్యాగరాజు 24,000పైగా కృతులను రచించారని కొన్ని ఆధారాలు చెబుతున్నా, కొన్ని వందల కృతులు మాత్రమే మనకు లభ్యమౌతున్నాయి. లభ్యమయ్యే కృతులన్నీ అమృతభాండారాలు. తెలుగు –సంస్కృతాలలో బహు ముఖాలుగా రచించి వీరి కృతులలో సుమారు రెండు వందల రాగాలలో, ఆరేడు వందల కీర్తనలు లభ్యమౌతున్నాయి. తెలుగుభాషలోని మాధుర్యానికి ఆలవాలం త్యాగయ్యకృతులు. కానీ వీటిని బహుళాదరణతో భద్రపరచి ఆదరించి ఆరాధిస్తున్నది తమిళ సోదరులే. తెలుగువారు వారికి సదా కృతజ్ఞులమై ఉండవలసిందే ఈ విషయంలో.

"హృదయ కవి"గా పేరువడసిన త్యాగరాజస్వామి కృతులన్నింటినీ ఉపనిషత్తులని పేర్కొన్నారు విజ్ఞులు. త్యాగరాజ కృతులలో రామకథ, రామవైభవం, రామతత్వం





ప్రత్యక్షమౌతాయి. మరోవైపు అద్వైత వేదాంత పరిమళాలు గుభాళిస్తాయి. సంగీత రహస్యాలు సాక్షాత్కరిస్తాయి. "మనసా" అంటూ ఆత్మబోధతో కృతులు రచించడం త్యాగరాజు గారి ఆధ్యాత్మిక పరిణతికి తార్కాణం. మామూలు మాటల్లో మహాభావాలు పలికించిన మహాత్ముడాయన.

త్యాగరాజ కీర్తనలలో కొన్ని దైవీయమైన సందర్భాలు ఉన్నాయని కూడా ప్రచారంలో ఉంది. త్యాగరాజు అన్నగారు జప్యేశుడు. ఇతడు లౌకికంగా ఆలోచించి, రాజాదరణలను స్వీకరించమన్నా, త్యాగరాజు వాటిని కాదని నిరాడంబర జీవనాన్నే ఆశ్రయించారనీ, దానితో ఇల్లు విభజింపబడి, తరువాత విగ్రహాలు కావేరిలో పడవేయబడి, అటుపిమ్మట త్యాగరాజుకి లభించాయనీ కొన్ని వృత్తాంతాలు కూడా ప్రసిద్ధంగా ప్రచారంలో ఉన్నాయి.

**నాదయోగి :–** సంగీత పరమైన కీర్తనలు రచించిన త్యాగరాజు వాటిద్వారా ఎన్నో శాస్త్రమర్మాలను పలికించారు. "రజతగిరీశుడు నగజకుతెల్పిన 'స్వరార్ణవ' మర్మములు....వంటి కృతి వాక్యాలలో తాను నారదుని ద్వారా పొందిన సంగీత గ్రంథం 'స్వరార్ణవా'న్ని ప్రస్తావించారు. "నిద్దుర నిరాకరించి, ముద్దుగ తంబుర బట్టి శుద్ధమైన మనసుచే, సుస్వరముతో, బద్ధు తప్పక భజియించు...' అని ఏకాగ్రంగా చేసే సంగీత సాధనను ప్రస్తావించారు. 'సొగసుగా మృదంగ తాళము జతగూర్చి నిను సొక్కజేయు ధీరుడెవ్వడో...' అనే కీర్తన ద్వారా తన సంగీత సాహిత్య రచనలన్నీ రాముని మెప్పించడానికేనని స్పష్టీకరించారు.

"సామగాన"లోలుడైన పరమాత్మకు సమర్పణగా 'నిగమశిరోర్థము కలిగిన నిజవాక్కులతో స్వరశుద్ధముతో–యతి విశ్రమ సద్భక్తి నిరతి–ద్రాక్షసార నవరసయుత కృతిచే" ఆరాధించాలని ప్రతిపాదించారు.

పలికే కృతికి 1. వేదాంత (నిగమశిర) అర్థము ఉండాలి. 2. అది తనదైన హృదయం నుండి పలికినది కావాలి. 3. స్వరశుద్ధము 4. యతి, విశ్రమము, సద్భక్తి, వైరాగ్యం, ద్రాక్ష రసము వంటి లాలిత్యం తేటదనం, నవరసాలు....అనే లక్షణాలుండాలని స్పష్టపరిచారు.

కాంచీపురం పీఠానికి చెందిన ఉపనిషద్ బ్రహ్మయోగి శ్రీముఖం మేరకు అక్కడికి చేరుకున్న త్యాగరాజు యాత్రా సందర్భంగా రచించిన పలుక్షేత్ర దైవతాల కీర్తనలు కూడా ప్రసిద్ధాలు, ఉదా: వరదరాజ నిన్నేకోరి వచ్చితిరా, తెరతీయగరాదా, వినాయకుని వలెను బ్రోవవే.

1759 వైశాఖశుద్ధ షష్ఠి (కొందరు1767 అంటున్నారు) నాడు జన్మించిన త్యాగరాజస్వామి 1847 ప్రభవనామ సంవత్సర పుష్య బహుళ పంచమి (జనవరి

6వతేదీ) నాడు కైవల్యాన్ని పొందారు. అప్పటికి అయిదు రోజుల ముందు శ్రీరాముని సాక్షాత్కారం జరిగి, స్వామి ఆదేశం మేరకు సన్న్యాసాన్ని స్వీకరించారు.



ఆ అయిదు రోజుల విరహాన్ని తన కీర్తనలలో పలికించుతూ, పరితాపము గనియాడిన పలుకుల మరచితివో, సరిలేని సీతతో సరయూమధ్యంబున నా॥ వరమగు బంగరు యోడను మెఱయుచు పదిపూటలపై కరుణించెదననుచు క్రీగనులను త్యాగరాజుని" అని ఆలపించారు.

"గిరిపై నెలకొన్న రామని గురి తప్పకకంటి– వంటి కీర్తనలు రామసాక్షాత్కార సన్నివేశాన్ని తెలియజేస్తాయి. 'నగుమోము గనలేని నాజాలి తెలిసి నన్నుబ్రోవ రాదా' వంటి కీర్తనలలో స్వచ్ఛమైన భక్తిసుధ ప్రవహిస్తుంది. సన్యాసి పరమపదించిన తిథినాడు 'ఆరాధన' జరపడం శాస్త్రసంప్రదాయం. ఆ పద్ధతిలోనే నేటికీ పుష్య బహుళ పంచమినాడు త్యాగరాజ ఆరాధన తిరువయ్యూరులో అత్యద్భుతంగా జరుగుతోంది. ప్రతిస్వరమూ దైవమని ఉపాసించే 'భక్తి' సంగీతానికి అవసరం. అటువంటి సంగీతమే నాదసాధన, ఉపాసన. 'సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే మనసా!' అని సంగీతాన్ని మోక్షవిద్యగా ప్రతిపాదించారు.



ఆహతంగా పలికే సంగీత స్వరాలు అనాహతనాదాన్ని ఆవిష్కరించే యోగసాధనగా మలచుకున్న రహస్యవిదుడు త్యాగరాజు.

"సంగీత శాస్త్రజ్ఞానము సారూప్య సౌఖ్యదమే మనసా! ప్రేమభక్తి సుజనవాత్స ల్యము, శ్రీ మద్రామ వరకటాక్షము, నేను నిష్ఠ యశోదనమొసంగునే నేర్పుగలుగు త్యాగరాజు నేర్చిన" అనే కీర్తన 'మోక్షప్రదమైనదిసంగీతం' అని ధ్రువపరుస్తుంది. "ప్రాణానల సంయోగముచే ప్రణవనాదము సప్తస్వరములై బరగా" అని "అగ్ని వాయువుల" సంయోగమే నాదమనే శాస్త్ర విషయాన్ని ప్రస్తావించారు.

నకారం ప్రణానామేనం దకారమనలం విదుః అని శాస్త్రవాక్యం.

ఆ నాదం ప్రణవమై, అదే సప్త స్వరములుగా ఆవిర్భవించిందని ప్రస్తావిస్తూ– "శోభిల్లు సప్తస్వర సుందరుల భజించవే" అనే కీర్తన ద్వార సప్త స్వర దేవతల ఆరాధనే సంగీతమని ప్రబోధిస్తారు. "నాభిహృత్ కంఠ రసన నాసాదులయందు శోభిల్లు" అని ఆ దేవతల సంచార స్థానాలను తెలియజేశారు. నాద సుధారసమే రామాకృతిగా ఆరాధింపబడుతోందనీ, శ్రీరామునే సంగీత స్వరూపునిగా పూజించారు.

"నాద సుధారసంబిలను నరాకృతాయె...స్వరములారున్నొకటి ఘంటలు, వర రాగము కోదండము, దుర–నయ,దేశ్యము త్రిగుణము, నిరతగతి శరమురా సరస సంగతి సందర్భము... ఇలా కోదండరాముడు సంగీతరాముడై సాక్షాత్క రించాడు. "నాదోపాసనచే శంకర నారాయణ విధులు వెలిసిరి ఓ మనసా!" అని







సృష్టికి మూలమైన నాదశక్తిని ప్రస్తావించి, అది ఎలా యోగమౌతుందో కీర్తనల్లో వివరించారు.

యోగశాస్త్ర మర్మాలనీ, మంత్రశాస్త్ర రహస్యాలనీ, వేదపురాణాది ఆర్ష విజ్ఞాన విషయాలనీ అలవోకగా కృతులలో పలికించారు. "రాగసుధా రసపానము జేసి రాజిల్లవే మనసా! యాగయోగ త్యాగ భోగఫలమొసంగే సదాశివ మయమగు నాద ఓంకార స్వర విదులు జీవన్ముక్తులని త్యాగరాజు దెలియు" "నాదలోలుడై బ్రహ్మానంద మందవే మనసా! స్వాదు ఫలప్రద సప్తస్వర రాగ నిశ్చయ సహిత..." ఇలా పలు కీర్తనల్ని పరిశోధన చేస్తే నాద, సంగీత రహస్యాలు తెలుస్తాయి.

**సాధనా మార్గ సూచికలు :–** ఆధ్యాత్మిక సాధనకు కావలసిన మార్గాలను సూచించే వేదాంత విషయాలెన్నో త్యాగయ్య కృతులలో పల్లవించాయి. ముఖ్యంగా 'ఆత్మపరిశీలన' ఆధ్యాత్మిక సాధకునకు అత్యవసరం. అందుకే "మనసా!" అంటూ ప్రతి బోధనీ ఆత్మను ఉద్దేశించి చేశారు. అదే సకల జనావళికి బోధ అవుతుంది. "నిధి చాల సుఖమా–రాముని సన్నిధి సేవ సుఖమా– నిజముగ బలుకు మనసా!" అని వైరాగ్య భావనని ప్రతిష్ఠించి, "దుర్మార్గ చరాధములను దొరనీవన జాలర! ధర్మాత్మక! ధనధాన్య దైవము నీవై ఉండగ! పలుకుబోటిని సభలోన పతిత మానవుల కొనగు ఖలుల నెచ్చట పొగడని" మనస్తత్వమే సాధకునకు కావాలని ప్రబోధించారు. "మనసు విషయనట విటుల కొసంగితే మా రాముని కృప కల్గునో మనసా!" "గురులేక ఎటువంటి గుణికి తెలియగబోదు" "శాంతము లేక సౌఖ్యములేదు" "బుద్ధి రాదు బుద్ధి రాదు పెద్దల సుద్దులు వినక" "తనువాకచో మనసాకచో తగిన వేషమొకచో నిడి జనుల నేచువారికి జయమౌనే" అంటూ త్రికరణ శుద్ధి లేనివారికి జయము వుండదని తేల్చిచెప్పారు.

"రామ! నీ ఎడ ప్రేమరహితులకు నామరుచి తెలసునా! ఓ సీతారామ! కామినివేషధారికి సాధ్వినడత ఏమైన తెలుసునా ఆ రీతి పులి గోరూపమైన శిశువు పాలు గల్గునా!" ఇలా లెక్కకందని చక్కని ఉపమానాలతో వేదాంత సారాన్నీ, సాధననీ రంగరించారు.

**అభేదం :–** వేదమార్గ గామియైన త్యాగరాజు ఆరాధించిన రాముడు సర్వదేవమయుడైన పరబ్రహ్మ. 'ఎవరిని నిర్ణయించిరి రా....నిన్నెట్లా ఆరాధించిరిరా... .'శివుడనో మాధవుడనో కలమభవుడనో పరబ్రహ్మమనో.... 'శివ మంత్రమునకు 'మ'జీవము మానవమంత్రమునకు 'రా'జీవము ఈవివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద' అంటూ శుద్ధ బ్రహ్మమైన 'తారకరూపుని నిజతత్త్వార్థము తెలిసి రామచింతన'తో కాలం గడిపిన మహాత్ములు త్యాగయ్య.

"నాదతనుమనిశం శంకరం" అనిశివుని నాదస్వరూపునిగా ఆరాధించి "శివశివ యనరాదా" దేవాది దేవ ! సదాశివ! తనపాద భక్తిం దేహి..." వంటి

ఎన్నో కీర్తనలను రచించారు. "ధర్మసంవర్ధిని" "కామాక్షి" వంటి జగదంబిక కీర్తనలను సైతం రచించారు.

"గ్రహబలమేమి శ్రీరామానుగ్రహ బలమే బలము" అని చాటించిన భక్తి గరిమ గల త్యాగరాజు అభేద ప్రతిపత్తితో సాగించిన ఉపాసనమే ఆయనకు కైవల్య కారమయ్యింది.

భక్తిలేని జ్ఞానం వ్యర్థమని చెబుతూ-"భక్తిబిచ్చమీయవే"...అనే కృతిలో "ప్రాణము లేని వానికి బంగారు పాగచుట్టి ఆణి వజ్ర భూషణమురమందు బెట్టురీతి జాణలకు పురాణాగమనశాస్త్ర వేదజప ప్రసంగత్రాణ గల్గి ఏమి" అని తెలియజేశారు.

**నామ మహిమ :-** శ్రీరామ నామమహిమను నింగడించే వివిధ కృతులను రచిస్తూ నామ సంకీర్తనలను సులభశైలిలో రచించారు. "రామకోదండరామ-రామ కళ్యాణ రామా" పాహిరామచంద్ర రాఘవ" "...వరా రామ నామమనే కండ చక్కెర మిశ్రమము జేసి భజించే శంకరునికి తెలుసును...ఇంత సౌఖ్యమనినే జెప్పచాల"

**పంచరత్న కృతులు :-** 1. జగదానందకారక -నాటరాగం, 2. సాధించినే ఓ మనసా 3. దుడుకుగల - గౌడరాగం 4. కనకన రుచిరా - వరాళి రాగం 5. ఎందరో మహానుభావులు -శ్రీరాగం



ఈ కృతులు సంగీత రచనలోనూ, సాహిత్య రచనలోనూ విశిష్టమైనవి. త్యాగరాజునకు సంగీత, సాహిత్యాలలో ఉండే పాండితీపరిపుష్టిని పట్టిచూపే ఈ కీర్తనలలో పరిశీలిస్తే, ఎంతో వేదాంత విషయాలలోతు కూడా కనిపిస్తుంది. త్యాగరాజ కృతులలో సంగీతమాధురితో పాటు సాహిత్య సంపద అపారంగా ఉంది. నేటి తరంవారు అధ్యయనం చేయదగిన ఎన్నో విషయాలు ఈ నిధిలో నిక్షిప్తమయ్యాయి. బాధాకరమైన విషయమేమిటంటే- తమిళనాడు, కేరళ, కర్ణాటక వారికి ఉండే సంగీత సాహిత్య రసజ్ఞత తెలుగువారికి కొరవడింది. త్యాగరాజకృతులు అర్థస్పృహతో తమిళులు అధ్యయనం చేసి ఆరాధిస్తుంటే, మనవాళ్ళు మాత్రం వాటిని అంతగా పట్టించుకోవడం లేదు. దీనివల్ల నష్టపోయేది మనమే.

అపూర్వమైన సంకీర్తన సామ్రాజ్యాన్ని స్థాపించిన త్యాగరాజ బ్రహ్మను సంపాదించిన తెలుగువారు ధన్యులు-భారతీయులు భాగ్యవంతులు.

"త్యాగరాజు శివుండు, తా భాగవతుల - కగ్రగణ్యుండు, తారకమనవరతము

జపము సల్పు కతాన తత్సదృశుడితడు మానవుడుకాడు, దేవుండు మనకు నిజము." - అని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కీర్తించిన మాటలు అక్షరసత్యాలు.

"నాదమహాఖిలాధ్వపరిణాహ వివేకము- తా శరీర మర్యాదకు లొంగి వచ్చిన మహాత్ముడు" తెల్గుల కీర్తిపంట...." అని విశ్వనాధవారు త్యాగయ్యను ప్రస్తుతించారు.





## ముక్కోటి ఏకాదశి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : తెలుపు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : తెలుపు |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : తెలుపు |
| 9. | పూజించవలసిన ఫోటో | : విష్ణుమూర్తి |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : విష్ణుమూర్తి |
| 11. | పూజించవలసిన దైవము | : విష్ణుమూర్తి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : పసుపు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : తామర పువ్వులు, తులసిదళములు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : జాజిమాల |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : పాయసం |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : తీపిపదార్థములు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : ఆకుపచ్చ పండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : విష్ణు అష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : నారాయణకవచము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | శ్రీమన్నారాయణ హృదయం : శ్రీమన్నారాయణ స్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | :విష్ణు సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : విష్ణుపురాణము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : దశావతారములు |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : విష్ణు, వేంకటేశ్వర |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : శ్రీకాకుళం, కృష్ణాజిల్లా |
| 26. | చేయవలసిన ధ్యానములు | : విష్ణు ధ్యానములు |
| 27. | చేయించవలసిన పూజలు | : విష్ణు సహస్రనామ పూజ |

28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : విష్ణు అష్టోత్తరము
29. ఆచరించవలసిన వ్రతము : సత్యనారాయణ వ్రతము
30. ఉపవాసము నియమము : వున్నది
31. జాగరణ నియమము : ఉన్నది (రాత్రి నిద్రపోరాదు)
32. సేకరించవలసిన పుస్తకములు : విష్ణు నిత్యపూజ విష్ణుస్తోత్రమాల, విష్ణు సహస్రనామ స్తోత్రమ్
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : విష్ణు సహస్రనామ సోత్రమ్, విష్ణుపురాణం
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : సత్యనారాయణస్వామి వ్రతము
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : ఉత్తరద్వార దర్శనము
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : లక్ష తులసిపూజ
37. పర్వదిన నక్షత్రము : –
38. పర్వదిన తిథి : ఏకాదశి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శనివారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : మ॥ 12గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : ఎర్రటి ప్రమిదలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : రెండు
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5
44. వెలిగించవలసిన వత్తులు : తామర వత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : కొబ్బరి నూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : పసుపుతోరము
48. నుదుటన ధరించవలసినది : తిరునామము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం నమోనారాయణాయ
50. జపమునకు వాడవలసిన మాల : తులసి మాల
51. మెడలో ధరించవలసిన మాల : తులసి మాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : విష్ణుమూర్తి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : తూర్పు.







## ముక్కోటి ఏకాదశి

**అధరం మధురం వదనం మధురం నయనం మధురం హసితం మధురం।**
**హృదయం మధురం గమనం మధురం మధురాధిపతే రఖిలం మధురమ్॥**

అట్టి సుమధుర మూర్తిని ఈ 'ఏకాదశి'రోజున వేయికనులతో వీక్షించి సేవించి తరించి పోవాలని మూడు కోట్లమంది దేవతలు వైకుంఠమునకు చేరుకునే పుణ్య ప్రదమైన రోజు కనుక! ఇది వైకుంఠ ఏకాదశిగా "ముక్కోటి ఏకాదశి"గా భక్తులు పిలుస్తూ ఉంటారు. ఇట్టి పర్వదినం ప్రతిసంవత్సరం ధనుర్మాసములో పూర్ణిమకు ముందు వచ్చే ఏకాదశి అవుతుంది.

ప్రముఖ దేవాలయాలలో (తిరుపతి, భద్రాచలం మున్నగు వైష్ణవ) పుణ్య క్షేత్రాలలో మామూలు రోజులలో అయితే, ఉత్తర ద్వారాలను మూసి ఉంచుతారు. ఈ "ముక్కోటి ఏకాదశి" రోజున మాత్రం వాటిని తెరచి ఉంచుతారు. ఆ రోజు భక్తులు సూర్యోదయానికి పూర్వమే నిద్రలేచి కాలకృత్యములు, స్నానసంధ్యాదులు ముగించుకొని అట్టి ప్రముఖ ఆలయాలలో ఉత్తర ద్వారం ద్వారా ప్రవేశించి ప్రదక్షిణలు ముగించుకుని దైవదర్శనం చేసుకుంటూ ఉంటారు. అలా ప్రదక్షిణ క్రమాన్నే "ముక్కోటి ప్రదక్షిణ" అని పిలుస్తూ ఉంటారు.

ఈ వైకుంఠ ఏకాదశినే "పుత్రద" ఏకాదశి అని కూడా అంటారు. దీని విశిష్ఠతను తెలిపే ఒక కథ ఉన్నది. పూర్వం "సుకేతుడు" అను మహారాజు 'భద్రావతి' అను రాజ్యాన్ని ప్రజాభీష్టాలను తరచు గమనిస్తూ వాని పరిపాలన ఎల్లప్పుడు జ్ఞప్తికి ఉండేలా ప్రజలకు సర్వసౌఖ్యాలను కలిగిస్తూ ప్రజల మన్నలను పొందుతూ

ఉండేవాడుట! అట్టి మహారాజు భార్య పేరు 'చంపక'. ఆమె అంతటి మహారాణి అయినా, గృహస్థధర్మాన్ని స్వయంగా చక్కగా నిర్వహిస్తూ అతిథి అభ్యాగతులను గౌరవిస్తూ, అటువంటి ఉత్తమమైన భర్త తనకు లభ్యమవటం పూర్వజన్మ పుణ్యఫలంగా భావిస్తూ, భర్తను పూజిస్తూ, ఇంకా ఎన్నో పుణ్యకార్యాలు వ్రతాలు చేస్తూ ఉండేది. తదనుగుణంగా మహారాజు కూడా ఆమెను ప్రోత్సహించేవాడు. అట్టి అన్యోన్య పుణ్యదంపతులకు మాత్రం, 'పుత్రసౌభాగ్యం' కరువై, అది వారి జీవితంలో తీరని లోటుగా మారింది.

ఆ మహారాజు కూడా పుత్రకాంక్షతో ఎన్నో తీర్థాలను సేవిస్తూ ఉండగా! ఒక పుణ్యతీర్థం వద్ద కొందరు మహర్షులు తపస్సుల చేసుకుంటున్నారనే 'వార్త' తెలుసుకుంటాడు. ఆ దివ్యమూర్తులను సందర్శించి వారిని సేవించి తనకు పుత్ర భిక్ష పెట్టమని ప్రార్థిస్తాడు.

వారు మహారాజు వేదనను గ్రహించి రాజా! మేము 'విశ్వదేవులము'. మీకు పుత్రసంతాన భాగ్యము తప్పకలుగుతుందని ఆ దివ్య తేజోమూర్తులు దీవిస్తూ, నేడు సరిగా 'పుత్రద ఏకాదశి'. నీవు నీ భార్యతో ఈ ఏకాదశి వ్రతాన్ని ఆచరించిన యెడల మీ మనోభీష్టము తప్పక నెరవేరుతుంది అని చెప్తారు. అంత, ఆ వ్రత విధానాన్ని ఆ మహర్షుల ద్వారా ఉపదేశము పొంది, ఆ పుణ్యమూర్తులకు మరోమారు కృతజ్ఞతా పూర్వకముగా ప్రణమిల్లి శెలవు తీసుకుంటాడు.

వెను వెంటనే అమితోత్సాహముతో నగరానికి చేరుకుని నదీ తీరాన జరిగిన వృత్తాంతమంతా 'చంపకా'దేవితో చెప్తాడు. ఆమె కడు సంతోషించి ఆ దంపతులు యిరువురు భక్తి శ్రద్ధలతో శ్రీలక్ష్మీనారాయణులను, పార్వతీ పరమేశ్వరులను పూజించి, ఉపవాస, జాగరణలతో, భగవన్నామసంకీర్తనలతో మహర్షులు ఉపదేశించిన విధంగా 'ఏకాదశీ వ్రతాన్ని' పూర్తిచేస్తారు.

అనంతరం కొద్దికాలానికి హరి హరాదుల కృపాకటాక్షముతో కులవర్ధనుడైన కుమారుడు కలుగుతాడు. ఆ పిల్లవాడు శుక్ల పక్షచంద్రునిలా దినదిన ప్రవర్ధమాన మగుచూ, సత్ శీలముతో విద్యాబుద్ధులు నేర్చుకుని యౌవ్వనము రాగానే, తల్లితండ్రుల అభీష్టముపై యువరాజై! ప్రజారంజకముగాపాలిస్తూ ఏకాదశ వ్రత విశిష్టతను రాజ్యమంతటా వివరిస్తూ! ప్రజల అందరిచేత ఈ వ్రతాన్ని చేయిస్తాడు. అది ఈ 'పుత్రద ఏకాదశి' లోని మహత్యం. అట్టి మహిమాన్వితుడైన శ్రీ మహావిష్ణువును ఒక్కసారి మనమంతా ఇలా ప్రార్థించుదాము.

శ్లో॥ సశంఖ చక్రం సకిరీట కుండలం సపీతవస్త్రం సరసీరు హేక్షణం ।
సహార వక్షస్థల కౌస్తుభశ్రియం నమామి విష్ణుం శిరసా చతుర్భుజం॥

---

మోహన్ వారి విష్ణు సహస్ర నామ స్తోత్రమ్, వెల : 6/- తప్పక చదవండి.





## ఇంకొక కథ

యుధిష్టిరుడు, శ్రీకృష్ణ భగవానునితో "స్వామీ! పుష్య మాసమున కృష్ణ పక్ష మందు వచ్చు ఏకాదశి నామమేమి? దాని విధి విధానమేమి? ఏ దేవతను పూజించ వలెను? చెప్పు"మని కోరెను.



శ్రీకృష్ణభగవానుడు "రాజేంద్రా, చెప్పుచున్నాను వినుము. నాకు యజ్ఞములు చేసిన దానికంటే అధికమైన సంతోషము గలిగించునది ఏకాదశి వ్రతానుష్ఠానము, అందువలన ఏకాదశి వ్రతము చేయవలెను.

పుష్యమాసమున కృష్ణపక్ష మందు "సఫల" నామము గల ఏకాదశి యుండెను. ఆ దినమున విధిగా నారాయణ భగవానుని పూజించవలెను. ఏకాదశి శుభప్రదాయిని, అందుచేత ఈ వ్రతము అవశ్యము చేయుట ఉచితమైనది. ఎట్లనిన నాగులలో శేషనాగు, పక్షులలో గరుడపక్షి, దేవతలలో శ్రీవిష్ణు భగవానుడు, మనుష్యులలో బ్రాహ్మణుడు శ్రేష్ఠమైనవారు. ఈ విధముగ సమస్త వ్రతములందు ఏకాదశి తిథి శ్రేష్ఠమైనది.

రాజా! సఫల ఏకాదశి నామమునుచ్ఛరించుచూ ఫలములతో శ్రీహరిని పూజించవలెను. నారీ ఫలము (కొబ్బరికాయ) ఆకు, వక్కలు, నిమ్మపండు, దానిమ్మ పండు, రేగుపండు, మామిడి ఫలములతో దేవ దేవేశ్వరుడైన శ్రీహరిని పూజించ వలెను. ధూపదీపములతో భగవానుని అర్చించవలెను. సఫల ఏకాదశినాడు విశేషమైన దీపదానము చేయు విధానము గలదు. రాత్రి సమయమున వైష్ణవులతో కలిసి జాగరణ చేయవలెను. జాగరణ చేసిన లభించు ఫలము వేల సంవత్సరములు తపస్సు చేసిననూ లభించదు.

నృపశ్రేష్ఠా! ఇప్పుడు 'సఫల' ఏకాదశి కథను వినుము. చంపావతియను ఒక ప్రసిద్ధమైన నగరముండెను. ఇది ఒకప్పుడు మాహిష్మత రాజు యొక్క రాజధాని. మాహిష్మాతునకు ఐదుగురు పుత్రులు. వీరిలో జ్యేష్ఠ పుత్రుడు. సదా పాపకర్మలకు

చేయుచుండెడివాడు. పరస్త్రీలోలుడు. వేశ్యాసక్తుడు. తండ్రి ధనమును పాపకర్మలను వినియోగించువాడు. ఇతడు దేవతలను, వైష్ణవులను, బ్రాహ్మణులను సదా నిందించు చుండెడివాడు.



తన పుత్రుని పాపకర్మలు చూచిన తండ్రి వానికి 'లుంభకు'డని పేరు పెట్టి తన రాజ్యము నుండి వెడలగొట్టెను. ఇతడు అరణ్యమునకు పోయి అచట నివసించుచూ దోపిడీలు చేయుచుండెను. ఒకరోజు రాత్రి దొంగతనము చేయుచుండగా కాపలాకాయు సిపాయిలు పట్టుకొనిరి. అప్పుడితడు తాను మాహిష్మతీ రాజు పుత్రుడను అని చెప్పగా వారు విడిచి పెట్టారు.

అరణ్యమందితడు మాంసమును, వృక్షఫలములను తినుచూ జీవనము గడుపుచుండెను. ఇతని విశ్రామ స్థలము రావిచెట్టు. ఇది బహు పురాతనమైన వృక్షము. ఈ వనమందీ వృక్షమును దేవతగా తలచెదరు. ఇతడొకనాడు ఏకాదశీ వ్రతమును పాటించెను. పుష్యమాస కృష్ణపక్ష మందు దశమి దినమున వృక్షఫలములను తినెను. శరీరముపై వస్త్రములు సరియైనవి లేక చలిలో వణకుచూ రాత్రి యంతయూ నిదురకాక నీరసముతో పడియుండెను. 'సఫల'ఏకాదశి దినముననూ లేవలేక పడియుండెను. మధ్యాహ్న సమయమునకు ఆకలి బాధతట్టుకొనలేక నెమ్మదిగా లేచి ఫలములను తెచ్చుకొని రావి వృక్షము చెంతకు వచ్చెను. అప్పటికి సూర్యుడు అస్తమించెను. తెచ్చిన ఫలములను వృక్షము మొదలు యందుంచి "లక్ష్మీపతి విష్ణు భగవానుని ఈ ఫలములతో సంతుష్టుడు గావలె"నని అనుచూ నివేదన చేసెను. అనంతరము రాత్రి అంతయూ నిదురపోలేదు. ఈ విధముగా అనాయాసముతో ఏకాదశి వ్రతమును పాటించెను.



ఆ సమయమున ఆకాశవాణి "రాజకుమారా! నీవు సఫల ఏకాదశీ వ్రత ఫల ప్రభావముతో రాజ్యమును, పుత్రప్రాప్తిని పొందెదవు" అని పలికెను.

వరము పొందిన లుంభకుడు దివ్యరూపమును పొందెను. అప్పటి నుండి ఇతడు బుద్ధి విష్ణుభగవానుని యందే లగ్నమై యుండెను. రాజ్యము ప్రాప్తించెను. దివ్యమైన ఆభరణములతో తేజరిల్లుతూ, పదునైదు సంవత్సరములు రాజ్యపాలన చేసెను. అనంతరము శ్రీకృష్ణ భగవానుని కృపతో 'మనోజ్ఞ'నామము గల పుత్రుడు కలిగెను. ఇతడు పెద్దవాడు అయిన వెంటనే ఇతనికి రాజ్యమప్పగించి లుంభకుడు శ్రీకృష్ణ భగవానుని చేరెను.

ఈ సఫల ఏకాదశి వ్రతము చేసినవారికి శోకము గలగదు. ఈ లోకమున సుఖ భోగములనుభవించి మరణానంతరము మోక్షమును పొందెదరు. ఈ వ్రతము చేసిన వారి జన్మ ధన్యమైనది. ఈ మహిమను చదివిననూ, వినిననూ, రాజసూయ యజ్ఞఫలము లభించును" అని చెప్పెను.





## బుద్ధ జయంతి

నేటికి రెండున్నర వేల సంవత్సరములకు పూర్వము భూమిపై ధర్మము పేరుతో పశువులను వధించు చుండిరి. అప్పుడు జీవ హత్య నిలుపుటకు మాయాదేవి గర్భమున భగవానుడు బుద్ధునిగా అవతరించెను. ఇతని తండ్రి శుద్ధోదనుడు. వీని రాజధాని కపిల వస్తు నగరము. బాల్యమున బుద్ధుని నామము సిద్ధార్థుడు.

జ్యోతిష్కులు "ఈ బాలుడు రాజగును. కాని విరక్తుడై లోకకళ్యాణ కారుడగు" నని చెప్పిరి. అప్పుడు శుద్ధోదన రాజు పెద్ద భవనము నిర్మించి రాకుమారుని అందులో ఉంచెను. రోగములు, దుఃఖములు, మృత్యువులు యేమి తెలియ నివ్వక పెంచెను.

ఇతనికి యశోధరతో వివాహము జరిగెను. వీరికొక పుత్రుడు కలిగెను. వారి పేరు రాహులుడు. సిద్ధార్థుడు ఒకమారు నగరము చూచుటకై తండ్రి ఆజ్ఞ తీసికొని వెలుపలకు వచ్చెను. నగరము నందు తిరుగు సమయమున ఒక వృద్ధుడు కనిపించెను. మరొక మారు నగరము సందర్శించునప్పుడు ఒక రోగి కనిపించెను. మూడవమారు దర్శించునప్పుడు చనిపోయినవాడు కనిపించెను. ఈదృశ్యములను చూచిన సిద్ధార్థుని మనస్సు చలించెను. సంసార సుఖము నుండి విరక్తి జెంది అమరత్వమును పరిశోధించుటకై ఒక అర్ధరాత్రి దినమున రాజభవనమునుండి వెలుపలకు వచ్చెను. ఒక వనమందు తపస్సు ప్రారంభించెను. అంతమున జ్ఞానబోధ ప్రాప్తించి సిద్ధార్థుడు బుద్ధభగవానుడయ్యెను.

బుద్ధ భగవానుడిట్లు చెప్పెను :- సంసారము దుఃఖమయము, తృష్ణ దుఃఖ కారణము. తృష్ణ నశించిన, దుఃఖము నశించును. రాగ ద్వేష అహంకారములను వదలిన జీవులు ముక్తులగుదురు. 1. సత్యము 2. నమ్రత 3. సదాచారము 4. సద్విచారము 5. సద్గుణము 6. సమృద్ధి 7. ఉన్నతమైన లక్ష్యము 8. ఉత్తమమైన ధ్యానము ఈ ఎనిమిది సాధనములను బుద్ధ భగవానుడు మానవుల ఉన్నతి కొరకు చెప్పెను.

ఈ విధముగ ప్రపంచ మంతయు తిరిగి మానవ ధర్మములను ప్రచారము గావించెను. యజ్ఞములందు పశువధను మాన్పించెను. జీవులయెడ ప్రేమ, అహింస సద్భావములతో అమర సందేశమిచ్చెను.

## సరస్వతీ జయంతి

శక్తి ఒక్కటే. శక్తినే అనేక పేర్లతో పిలుస్తాం....ప్రకరణ విధానాన్ని అనుసరించి, ఆ పరాశక్తిచైతన్య విద్యగా ప్రకాశించగానే 'సరస్వతీ' అనిపిలుస్తాం. ఉపాసనలో ఉన్న రహస్యమేమిటంటే ఏదేవతని ప్రధానంగా, అభీష్టంగా కొలుస్తున్నామో ఆ దేవతలోనే ఇతర దేవత లందరూ సమన్వయమౌతారు.

మనదేశీయులందరూ ప్రధానంగా సరస్వతీ ఉపాసకులే. జ్ఞానం, విద్య, వాక్కు మొదలైన శక్తులే సరస్వతి. విద్యకీ, జ్ఞానానికి ప్రాధాన్యమిచ్చిన దేశం మనది. ఆవిద్య ద్వారానే సంపద, సంపాదించాలన్నా, సంపాదించిన సద్వినియోగం చేయాలన్నా అవసరమైనది బుద్ధిశక్తి. మేధ, ఆలోచన, ప్రతిభ, ధారణ, ప్రజ్ఞ, స్ఫురణ...ఇటువంటి ధీశక్తుల సమాహార స్వరూపమే శారద. దేవీభాగవత ప్రారంభంలోనే వ్యాస మహర్షిఅమ్మ వారిని స్తోత్రించారు.

**సర్వచైతన్య రూపాం తాం ఆద్యాం విద్యాం చ ధీమహి**
**బుద్ధిం యోనః ప్రచోదయాత్ ॥**

“అఖండ చైత్యంగా ఉన్న ఆద్యా (మొదటిది) విద్యాస్వరూపిణి అయిన పర తత్త్వమూర్తి (సరస్వతి)ని ధ్యానిస్తున్నాము. ఆ శక్తి మాబుద్ధులను ప్రేరేపించునుగాక:” ఇదే గాయత్రీ మంత్రభావం. సర్వులూ జపించ దగ్గ మహామంత్రమిది. ఏ ఉపదేశాలు అవసరం లేకుండానే అమ్మను ఈ మంత్రంతో ఉపాసించవచ్చు. 'సరస్సరణ శీలత్వాత్..' ప్రవాహ రూపమైన చైతన్యమే సరస్వతి. చైతన్యం లక్షణం ప్రవాహం.





పరబ్రహ్మ లక్షణం చైతన్యం. జ్యోతి లక్షణం కాంతి, ప్రసరణ కాంతియొక్క లక్షణం, కాంతి చేతనే జ్యోతి గుర్తింపబడుతోంది. అదేవిధంగా చైతన్య మయమైన 'విద్య' వల్లనే పరబ్రహ్మ గోచరింపబడుతున్నాడు. ఈ కాంతీ జ్యోతులు అవిభాజ్యులు. ఆ విధంగానే పరబ్రహ్మ, పరాశక్తీ అవిభాజ్యం.

ఈ విద్య అలౌకికమైన బ్రహ్మవిద్య (పరవిద్య)గా, లౌకిక విద్యలుగా పరిణమించింది. ఆ సరస్వతీ వైభవం తొలి వాఙ్మయమైన వేదంలోనే పరిఢవిల్లింది. **ఇదమంధతమః కృత్స్నం జాయతే భువనత్రయం, యది శబ్దాత్మకం జ్యోతి రా సంసారం సదీప్యతే - అని 'దండి' మహాకవివచనం.** శబ్దమనే జ్యోతి లేకుంటే జగమంతా అంధకార బంధురమే. నాదాత్మకమై, ప్రణవమై, అక్షరస్వరూపమై, సప్తస్వర లసితమై “వ్యక్తీకరణ శక్తియై” భాసించే జగదంబ సరస్వతి.

**ప్రాణశక్తిః సరస్వతీ॥** అని వేదం నిర్వచించింది. మనలో రహస్యమై ఉన్న ఆత్మజ్యోతి ప్రకాశమే ప్రాణం. ఆ ప్రాణం ఆ ప్రాణం మన సర్వాణువుల్లోనూ ప్రవహిస్తోంది (ప్రసరిస్తోంది). ఈ 'ప్రసరణ' శక్తినే 'సరస్వతి' అన్నారు.

**“అంబితమే దేవితమే నదీతమే సరస్వతీ”॥ (ఋగ్వేదం)**

అమ్మలలో శ్రేష్ఠురాలు, దేవతలలో నదులలో శ్రేష్ఠురాలు...సరస్వతి. ఒక మహానదిగా ప్రవహించిన సరస్వతీ నది గురించి మనవేద పురాణాలలో విస్తృతంగా వర్ణించారు. కానీ అవన్నీ పుక్కిటి పురాణాలుగా తీసివేశారు, మేధావులని పించుకొనే వాళ్ళు. కాని ఇటీవల ఉపగ్రహాలు పంపిన సమాచారం ప్రకారం, అంతర్వాహినిగా వున్న సరస్వతీనది వివరాలు బయటపడేసరికి అనేక పరిశోధనలుచేసి, మళ్లీ మన సనాతన వాఙ్మయం వర్ణించిన సరస్వతీ నది నిజంగానే ఒకనాడు ఉండేదని ఋజువుచేశారు.

బ్రహ్మవైవర్త, దేవీ భాగవతాది పురాణాల్లో ఒక మహామహా నదిగా ప్రవహించిన సరస్వతి, కలియుగం ప్రారంభమైన కొన్నివేల సంవత్సరాలకు 'అంతరిస్తుంది' అని భవిష్య ద్వచనం పలికింది. ఇప్పటి ఈ పరిశోధనల వల్లనైనా పురాణ వాక్కుల సత్యం ఋజువయ్యింది. అన్న ప్రదాయినిగా, ధనప్రదాయినిగా శారదాదేవిని వేదం ఉపాసించింది.

**ప్రణోదేవీ సరస్వతీ । వాజేభిర్వాజినీవతీ ధీనా మవిత్ర్యవతు॥**

అని ఋగ్వేదం బహుళంగా సరస్వతీ సూక్తాలు పలికింది. అన్న ప్రదాయిని అయిన తల్లీ, బుద్ధి శక్తుల్ని రక్షించే మాతగా సాక్షాత్కరించినది. అంతేకాదు సర్వాభీష్టాలను పిదికి ఇచ్చే దివ్యధేనువుగా సరస్వతి దర్శనమిచ్చింది. సానోమంద్రేష మూర్జం దుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు ॥ (ఋగ్వేదం)

"వాగ్దేనువు" అన్నారు అమ్మను. వ్యక్తమయ్యేది వాక్కు. 'వాగ్వి సర్వస్యకారణం' జ్ఞానసారం వాక్కు. జ్ఞానవాహిని వాక్కు. వాక్కే సర్వమునకు కారణం. వేదపురాణ, ఇతిహాస, మంత్ర, తంత్ర...ఇలా అన్ని విద్యలూ వాగాధారాలే. "వాగ్భూషణం భూషణమ్" అని మనిషికి మంచి మాటే అలంకారమనీ, మాటవల్లనే సర్వజగత్తూ నడుస్తోందని ఆ వాక్కుని దేవతగా ఉపాసించి...తరింపజేసే వాక్సంపదను సాధించారు మన ఋషులు. మనదేశమే భారతదేశం. భారతీశబ్ద సంబంధంచేత- 'విద్య'కి ప్రాధాన్యం, జ్ఞానానికి ప్రామాణ్యం ఇచ్చిన దేశమిది.

**భారతీ భారతానస్మాన్‌॥** "భారతీదేవి మమ్ములను 'భారతు' లను చేయుగాక...అనగా భా=జ్ఞానము నందూ, దివ్యత్వమునందూ, రతాన్=ఇష్టము కల వారినిగా చేయుగాక"- అని నామ మహిమ. శుద్ధత్వం అమ్మరూపం. కాబట్టి అన్నీ తెల్లదనం ఉట్టిపడే స్వచ్ఛోపకణాలే అమ్మవి.

**"సర్వశుక్లాం శుద్ధరూపాం" అన్నారు.** కనుకనే "శారద నీరదేందుఘనసారపటీ రమరాళమల్లికాహార తుషారఫేన రజతా చలకాశ ఫణీశ కుందమందార సుధాపయోధి సిత తామరసామరవాహినీ శుభాకారత నొప్పు" భారతీదేవి ధవళిమను సందర్శించి సమర్పించాలని కోరుకున్నారు పోతన మహాకవి. ఇన్ని తెల్లని వస్తువులను పేర్కొనడం ఎందుకు? అంటే ఏ ఒక్క ధవళిను కూడా అమ్మ మేని స్వచ్ఛతకి సరిపోలేదని భావం. సరస్వతీ విభిన్న శక్తులగురించి 'చండీ సప్తశతి'లో చెప్పారు.అక్కడి సరస్వతీ వైభవం – శుంభ నిశుంభలను సంహరించిన మహాసరస్వతి వీరసరస్వతి.

**యాదేవీ సర్వభూతేషు 'బుద్ధి' రూపేణ సంస్థితా ।**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః....**
**యా దేవీ సర్వభూతేషు 'స్మృతి' రూపేణ సంస్థితా ।**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః....**
**యా దేవీ సర్వభూతేషు 'భ్రాంతి' రూపేణ సంస్థితా ।**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః....**
**యా దేవీ సర్వభూతేషు 'వృత్తి' రూపేణ సంస్థితా ।**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః....**

బుద్ధి, స్మృతి, భ్రాంతీ, వృత్తి. అన్నీ అమ్మశక్తులే. యుద్ధ విద్యా సరస్వతీ అన్నారు. యుద్ధంలో అప్రమత్తంగా విజయాన్నిచ్చే తల్లి సరస్వతి. బుద్ధితోముఖంగా, సర్వజాగరూకతతో కావలసిన చోటు యుద్ధస్థలమేకదా. కాబట్టి దైవీశక్తులు, అసురీశక్తి సాధించిన విజయంలో అంతిమ విజయం సాధించిన అమ్మ సరస్వతి.

'మహాకాళి' సర్వదుర్భావాలు సంహరించి శుద్ధంచేశాక, 'మహాలక్ష్మీ' పలుదైవీ సంపదను సమకూర్చాక, సృష్టిశక్తియే సరస్వతి జ్ఞానరూపిణిగా ఆవిర్భవించి



పరంపరలకు హేతువౌతుంది. కనుకనే నవరాత్రులలో మూడుపేర్లు మూడు రూపాలతో ఒకే అమ్మ ఆరాధించబడుతోంది.

చివరి మూడు రోజులూ సరస్వతీ ఆరాధనకి ప్రాముఖ్యం.'మూలా' నక్షత్రం నుండి సరస్వతిని ఆరాధించితీరాలి. ప్రతిపత్(పాడ్యమి) నుండి నవమి వరకూ నవరాత్రులూ పూజించలేనివారు కనీసం మూలా నక్షత్రంనుండి నవమివరకు సరస్వతిని ఆరాధించాలనీ, అదీ వీలుగానప్పుడు 'నవమి' నాడైనా పూజించాలి అని ధర్మశాస్త్రవచనం. పిల్లలు మొదలుకొని అందరూ సరస్వతిని ఆరాధించాల్సిందే. ఆ తల్లిని ఆరాధించనివాడు కృతఘ్నుడు కాక మరెవరు? యాజ్ఞవల్క్య, వాల్మీకి, వ్యాసాది మహర్షులంతా సరస్వతీ ఉపాసనతో దివ్యాక్షరాలని సాక్షాత్కరించుకొని లోకాన్ని అనుగ్రహించారు.

**'మేధాసిదేవి విదితాఖిల శాస్త్రసారా విద్యాస్సమస్తా స్తవదేవి భేదాః'**

అమ్మా! సమస్తశాస్త్రములసారము నీవు. సమస్త విద్యలూ నీ స్వరూపములే. ఇయంబ్రహ్మశక్తి...కనుక ......జ్ఞాని ఉండే, దివ్యావస్థ, స్థితప్రజ్ఞ.

అమ్మవారి పరిపూర్ణతత్వరూపం. అందుకే భగవద్గీతలో "ఏషాం బ్రాహ్మీ స్థితిః పార్థ!" అని శ్రీకృష్ణుడు వానియొక్క అవస్థను 'బ్రాహ్మీస్థితి' లోనైనా, లోక విద్యాలోనైనా, ఆత్మ విద్యలోనైనా అనుగ్రహమే ఆధారం.

**పరావాక్పరిమితా పదాని తానీ సద్బ్రాహ్మణా యే మనిషిణః।**
**శ్రాణి విహితా నేజ్గయంతి యం వాచో మనుష్యావదంతి ॥**

అన్ని సరస్వతి సూక్తమ్‌లో వాక్ నామం చెప్తారు. వాక్స్వరూపం నాలుగు రూపాలుగా ఉన్నది. 1. పరా 2. పశ్యంతీ 3. మధ్యమా 4. వైఖరీ. మనమాట పలికేముందు అది మన మనోభావాత్మకంగా గోచరిస్తుంది. అది పశ్యంతి దానిని ప్రేరేపించే అజ్ఞాత సంస్కారం.పరా అదిలోన మాటలుగా కూర్చుకొనేది. 'మధ్యమ' పైకి వినబడేది 'వైఖరీ' ఈవిధంగా వీటి ప్రయాణ స్థానం-మూలాధారం నుండి నాభి,హృత్,కంఠ, జిహ్వ (.....నాలుక),లు వీటికి మూలమైన నాదం ఈ సరస్వతీ రూపమే.

**వరావృక్షేషు యా వాక్సా పశ్యన్తీ పక్షిషు స్మృతా ।**
**మధ్యమా పశుషు ప్రోక్తా మనుస్యేషు చ వైఖరీ ॥**

భావప్రకటన కోసం వృక్షాలు 'పరా' పశ్యని,పక్షులు 'పశ్యన్తి' వాక్కును, పశువులు 'మధ్యమా' వాక్కును, మనుష్యులు 'వైఖరీ' వాక్కును ఉపయోగిస్తారు. ఈ నాలుగు వాక్కుల గురించి 'కాశీఖండం'లో శ్రీనాథమహాకవి చక్కగా వివరించాడు. "శబ్దబ్రహ్మము కారణం. బిందాత్మకమై బిందునిష్యందత్వమున పురుషేచ్ఛా ప్రయత్న

మున మూలాధారావస్థిత పవన సంధు క్షణమున అభివ్యక్తమై' 'పరా' వాక్కనబడును. ఆబ్రహ్మము 'నాభి' పర్యంతము ఆ వాయువు చేతన భివ్యజ్యమానమై విమర్శ రూపమైన మనస్సుతోకూడి సామాన్య స్పంద ప్రకాశరూపిణియు, కార్యబిందు తత్వాత్మికము, ఈశ్వరాధి దేవతయునై 'పశ్యన్తీ' వాక్కనబడును.

ఆ బ్రహ్మవాయువు చేతనే హృదయపర్యంతమభి వ్యజ్యమానమై నిశ్చయాత్మక బుద్ధియుక్తమై, విశేషస్పంద స్వరూపము, నాదబిందుమయ హిరణ్య గర్భాధిదేవత యునై 'మధ్యమవాక్క' నబడును. ఆ బ్రహ్మమాస్య పర్యంతము ఆ వాయువు చేతనే కంఠాది స్థానముల యందభివ్యజ్యమానమై 'వైఖరీ' వాక్కనబడును. నీవీ చతుర్విధ సూక్ష్మ స్థూల మాతృస్వరూపవు ఇట్టి దేవీ! మహాలక్ష్మీ నీకు నమస్కారము. ఇది అగస్త్య మహర్షి కొల్హాపురీ మహాలక్ష్మీ దేవిని స్తుతిస్తూ పల్కిన పల్కులు. ఒకే పరాశక్తియొక్క వివిధ శక్తి రూపాలను ప్రస్తావించినప్పుడు దేవతా భేదాలు లేవు అన్నది స్పష్టమే కదా! గాయత్రీదేవి బ్రాహ్మీ, సావిత్రీ, సరస్వతీ అనే రూపాలతో మూడు సంధ్యాల లోనూ ఉపాసింపబడుతోంది. ఈ మూడు సారస్వత రూపాలే. వైఖరీ వాక్ స్వరూపంగానే సమస్త వాఙ్మయ, సంగీతాదులు మనకు లభిస్తున్నాయి. వాక్కులకు రెండు రకాలైన శక్తులున్నాయి. 1. నాదశక్తి 2. బ్రహ్మశక్తి, నాదశక్తి ద్వారా వాగ్రూపిణి అయిన సరస్వతి తన శబ్దశక్తినీ, బ్రహ్మశక్తిద్వారా తన విశ్వవ్యాప్తినీ వెల్లడిస్తోంది.

'ఉత్పతిస్థానత్వేన అస్తిఅస్యాః ఇతి సరస్వతీ' ఉత్పత్తిస్థాన స్వరూపిణియై, జగత్కారణ శక్తి సరస్వతి. శ్వేతపద్మవాసినియైన తల్లికనుక 'శారద' అన్నారు. 'భారతి' అనే శబ్దానికి 'బిభర్తీతి' అని అర్థం చెప్పారు. సర్వజీవకోటినీ భరించే శక్తి కనుక భారతి. వాక్కుల శక్తి కనుక 'వాగీశ్వరి'. శారదాదేవి శివశక్తిగా, శివానుజగా భాసిస్తోంది. కారణం ఇరువురూ జ్ఞానమయ రూపులు కనుక, మంత్రశాస్త్రంలో శారదా రూపాలు అనేకం ఉన్నాయి. వాగీశ్వరీ, వాగ్వాదినీ, మహాసరస్వతీ, సిద్ధసరస్వతీ, నీలసరస్వతీ, ధారణ సరస్వతీ, నకులీ సరస్వతీ, పరా సరస్వతీ, బాలా సరస్వతీ, కింకిణీ సరస్వతీ, సర్వశుక్లా సరస్వతీ, ఘటసరస్వతీ, చింతామణీ సరస్వతీ, జ్ఞాన సరస్వతీ, అంతరిక్ష సరస్వతీ.... ఇలా ఎన్నో! అమ్మ వైభవం అనంతం, ఏమాత్రం స్మరించినా తరించుతాం. ఆతల్లి కాలికొన గోటికాంతులే ఈ సకల జగత్తుకీ పోషకాలు. శుద్ధసత్త్వగుణ సంకేతమైన, గుణదోష పరిశీలనాత్మక బుద్ధికి ప్రతీకయైన శ్వేత హంసపై ఆసీనయైన చల్లని తెల్లని కాంతి పుంజం శారదాంబ.

**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః**
**"శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్..."**

**(మల్లినాథసూరి)**



"చరాచరత్మకమైన జగత్తు సర్వం సరస్వతీ శక్తిని ఆశ్రయించియే జీవిస్తోంది. దివ్యానందప్రదమైన ఆమె చరణాన్నే నేను శరణు పొందుతున్నాను." సర్వజీవులలో చైతన్య స్వరూపిణిగా ప్రవహించేశక్తియే 'సరస్వతి'. వేదాలలో 'అంబితమే, నదీతమే, సరస్వతీ' అని అమ్మలలో, నదులలో, దేవతలలో శ్రేష్ఠురాలుగా కీర్తించబడిన జగదంబ శారద. "శ్రీమాతా" అని కీర్తించబడిన ఆ తల్లి విశ్వేశ్వరుని వాక్, బుద్ధి, జ్ఞానాది ధీశక్తులకు అధిష్ఠాత్రి. సర్వజీవులకు ఆ తల్లి వల్లనే ఉలుకూ, పలుకూ, ఎరుక ఏర్పడుతున్నాయి.

**"సర్వచైతన్య రూపాంతాం ఆద్యాం విద్యాంచ ధీమహి బుద్ధిం యానః ప్రచోదయాత్"**– అని వ్యాసభగవానుడు, "దేవీభాగవతమ్" మహాపురాణానికి ఆదిలో, అమ్మవారిని స్తోత్రించాడు. మన బుద్ధి శక్తులను ప్రేరేపించే విద్యా స్వరూపిణి శారదాంబ. ఈ సరస్వతీ దేవిని విశేషంగా, తప్పనిసరిగా పూజించవలసినతిథి–మాఘ శుద్ధ పంచమి. దీనిని 'శ్రీపంచమి' అంటారు. అమ్మవారిని తెల్లనిపువ్వులతో పూజించి, క్షీరాన్నం, చెరకులు, నేతివంటలు, నారికేళ కదళీఫలాలు శుక్లవస్త్రాలు, శుక్ల చందనం నివేదించాలి. ఈరోజున పిల్లలకు విద్యాభ్యాసం చేయిస్తే, విద్యలో ఉత్తమ శ్రేణులు పొంది విజయం సాధించడం తథ్యం.

**మాఘస్య శుక్లపంచమ్యాం...**
**మానవో మనవో దేవా మునీంద్రాశ్చ ముముక్షవః।**
**వసవో యోగినస్సిద్ధా నాగా గంధర్వ రాక్షసాః॥**
**మద్వరేణ కరిష్యంతి కల్పే కల్పే లయావధి ।**
**భక్తియుక్తశ్చ దత్త్వా వై చోపచారాణి షోడశ ॥** **(దేవీభాగవతము)**

'మాఘశుద్ధ పంచమి' నాడు విశ్వమంతా మానవులు,దానవులు, దేవతలు, మునులు, ముముక్షువులు, వసువులు, యోగులు, సిద్ధులు,నాగులు, గంధర్వులు, రాక్షసులు అందరూ సరస్వతీ దేవిని ఆరాధిస్తారు. అయితే ఆ అమ్మ అనుగ్రహం లేనిదే, అమ్మను ఆరాధించాలనే బుద్ధి పుట్టదు. ఇకనుండి మన తెలుగువారు కూడా అమ్మ అనుగ్రహంపొంది ఈ దివ్యతిథిని శారదారాధన చేసి తరించాలని కోరుకుందాం. ఆంధ్రప్రదేశ్‌లో ఆదిలాబాద్ జిల్లాలో గోదావరీ తీరాన బాసర ఉన్న క్షేత్రంలో ఈ మాఘశుద్ధ పంచమి నాడు శారదాదేవి జన్మదినోత్సవం మహావైభవంగా జరుగుతుంది. ఈ క్షేత్రాన వెలసిన అమ్మవారిపేరు వాసరా సరస్వతి.

శ్రీ వేదవ్యాసుడు ఇక్కడే తపస్సు నాచరించి, అమ్మవారి సాక్షాత్కారాన్ని పొంది వేద విభజన, పురాణ , భారత రచనాశక్తిని పొందారు. అమ్మవలన సైకత(ఇసుక) మూర్తిని నిర్మించాక, అందులో చైతన్యరూపిణి అయిన శారదాదేవి ప్రతిష్ఠితమయ్యింది. ఇక్కడ మహాకాళీ, మహాలక్ష్మీ ఆలయాలు, దత్తాత్రేయ మందిరం, వ్యాసమందిరం

ఉన్నాయి. ఇక్కడ సరస్వతి 'స్వయంభువు' అనీ, వ్యాసమహర్షికి దర్శనాన్ని అనుగ్రహించిందని పురాణ కథనం. సుమారు రెండు వందల ఏళ్లక్రితం సనాతన ధర్మవిధ్వంసులైన పరమతస్థుల దాడిలో అనేక దివ్య దేవాలయాల మాదిరిగానే, ఈ దేవాలయంలోని కొన్ని విగ్రహాలు, పరిసర దేవాలయాలు ధ్వంసమయ్యాయి. అప్పుడు శూరశిరోమణి అయిన ముక్కాజీ పటేల్, కొందరు యువకుల సాయంతో, ఆ దుండగులను తరిమి, శ్రీ సరస్వతీ మందిర పునర్నిర్మాణం గావించారు. నాటి జగద్గురు పీఠాధిపతులు పరమహంస పరివ్రాజకాచార్యులగు శ్రీశ్రీశ్రీ విద్యారణ్య భారతీ స్వామివారిచే పునఃప్రతిష్ఠ గావింపజేశారు.

ఈ ఆలయానికి ఆంధ్రప్రదేశ్ నుండేగాక మహారాష్ట్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్ మొదలుకొని దేశం నలుమూలలనుండి భక్తులు. అధిక సంఖ్యలో వచ్చి దేవిని దర్శించుకుంటూ, విశేషార్చనలతో అమ్మవారిని ఆరాధిస్తున్నారు. ముఖ్యంగా విద్యాప్రాప్తికై ఇక్కడ విద్యార్థులచేత అక్షరాభ్యాసం చేయించి దేవికి పలక, బలపం, కాగితం, కలం మొదలైనవి సమర్పిస్తారు.

**ఉత్సవాలు :-** ఇక్కడ 1. మాఘశుద్ధ పంచమి 2. ఆశ్వయుజ శారద నవరాత్రులు 3. మహా శివరాత్రి ఉత్సవం మహావైభవంగా జరుగుతాయి. పావన గోదావరీ జలాలలో స్నానంచేసి, శారదామాతను దర్శించడం ఒక దివ్యానుభూతి. ఈ దేవి సన్నిధిలో మంత్ర జపాద్యనుష్టానాలు శీఘ్రంగా ఫలవంతమౌతాయనడంలో సందేహంలేదు. 'బ్రహ్మాండపురాణం' లో ఈ క్షేత్ర మహాత్మ్యం విశేషంగా వర్ణింపబడింది. వ్యాస మహర్షిచేత ప్రతిష్ఠితమైన దేవత కనుక, ఈ క్షేత్రానికి, 'వ్యాసపురి' 'వాసర' అనిపేర్లు. కాలక్రమంగా మహారాష్ట్ర ప్రభావంచేత 'బాసర' (బాసర్) అని పిలువబడుతోంది.

**మధుకరం :-** పుష్పానికి ఏవిధమైన బాధ కలగనీయక, తుమ్మెద పువ్వు నుండి తేనెను గ్రహించిన విధంగా, భిక్షుకవృత్తిచే గృహాలనుండి గ్రహింప బడిన భిక్షను 'మాధుకరం' అంటారు. ఈ క్షేత్రంలోని ఇప్పటికీ 'మాధుకరదీక్ష'తో ఉపాసన చేసేవారున్నారు. శ్రీ దేవతా అనుగ్రహం పొందగోరువారు దేవీ ఆలయములో నియమ నిష్ఠలతో 11,21,41 రోజులు దీక్షతో, గురూపదేశ మంత్రాన్ని అనుష్ఠానంచేస్తూ, మధ్యాహ్నం గ్రామంలోకి వెళ్లి భిక్షను స్వీకరించి శ్రీ సరస్వతీ దేవికి నివేదించి భుజిస్తారు. ఇదీ ఒక్కపూట మాత్రమే. వీరి కోసమని గ్రామంలోని కొందరు గృహస్థులు శుచిగా వండి వుంచుతారు కూడా. ఈవిధంగా దీక్షతో ఉపాసన చేసే వారికి, ఆనతి కాలంలోనే స్వప్నంలో శారదామాత సాక్షాత్కరించి కామితార్థాలను ప్రసాదిస్తుంది. ఈ విధంగా అమ్మను ఉపాసించి తరించిన మహాత్ములెందరో ఇప్పటికీ మనదేశంలో ఉన్నారు. హైదరాబాద్ నుండి మీటర్‌గేజ్‌రైలు మార్గములో 'బాసరక్షేత్రం' చేరవచ్చు. నిజామాబాద్‌కి 35 కి.మీ. దూరంలో ఉన్నది క్షేత్రం.





**ఇంద్రనీలాలకా చంద్రబింబాననా పక్వబింబాధరా రత్నమౌళీధరా ।**
**చారువీణాధరా చారుపద్మాసనా శారదాపాతుమాం లోకమాతా సదా ।**
**(వాస్యకృత వాసరా సరస్వతీ స్తుతి బ్రహ్మాండపురాణం)**

జీవుడు జన్మ నెత్తడానికి కారణం 'అవిద్య'. అవిద్య అంటే విద్య లేకపోవడం. విద్య అంటే జ్ఞానం. అనేక విషయాలు తెలుసుకునే శక్తే జ్ఞానం. ఏ కారణం చేత జీవుడు అనేక జన్మల నెత్తుతున్నాడో తెలుసుకోవడమే పరమ జ్ఞానం. ఆ జ్ఞానం నిత్యంగా నిలబడటం కష్టం. నిత్యంగా నిలబడటం అంటే–ప్రతి క్షణమూ ఆ జ్ఞానం వీడకుండా ఉండటం. కాల ప్రవాహంలోని ప్రతి క్షణమునందూ, ఆ జ్ఞానం మనలో ప్రవహిస్తూ ఉండాలి. ప్రవహించే దానిని వేదం 'సరస్వతి' అని చెప్పింది. అందుచేతనే విద్యకీ, జ్ఞానానికీ అధిదేవత సరస్వతి. మంత్రరూపమైన ఆ సరస్వతిని ఉపాసిస్తే, ఆ జ్ఞానం కలుగుతుంది. ఆ విషయము "అశ్వలాయనుడు" అనే మహర్షి దర్శించాడు.

ఆ ఉపాసనా మార్గం తమకు కూడా బోధించమని అనేకమంది ఋషులు, అశ్వలాయనుణ్ణి అడిగారు. సరస్వతీ మహామంత్ర స్వరూపమైన ఆ ఉపాసనా మార్గాన్ని అశ్వలాయనుడు సాంగోపాంగంగా వారందరికీ వివరించాడు. అది "సరస్వతీ రహస్యోపనిషత్"లో క్రోడీకరింపబడింది. కలియుగంలో, సర్వజన సులభంగా ఉండటానికి, ప్రార్థనా శ్లోక స్వరూపంగా, ఆ ఉపాసన సంగ్రహీకరింపబడింది."సామాం పాతు సరస్వతీ" (ఆ సరస్వతి నన్నుపాలించుగాక) అని మకుటంగా గల ఆ పది శ్లోకాలు "దశశ్లోకి" అని పేరుతో ప్రసిద్ధమైనాయి.

ఈ "దశశ్లోకి" భక్తి శ్రద్ధలతో ఆరు నెలలు పఠిస్తే వాక్కు ప్రసన్నమౌతుంది. ఇది పఠించి, మాఘ శుద్ధ పంచమినాడు, ఏ విద్య ప్రారంభించినా, ఆ విద్య సర్వతోభిముఖంగా వృద్ధి చెందుతుంది. నిత్యధ్యానం చేసేవారికి, వాక్సిద్ధి కలుగుతుంది. మహాగ్రంథ రచనాశక్తి కలుగుతుంది. సకల విద్యలసారం గ్రహించే వివేకం అబ్బుతుంది.

## రథసప్తమి



| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రంచేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిర ములో ముగ్గులు వుంచాలి. |
| 4. | చేయవలసిన స్నానము | : మగవారు జిల్లేడూకులతో, ఆడవారు చిక్కుడు ఆకులతో స్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఎర్రటివి |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎర్రటి |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఎరుపు |
| 9. | పూజించవలసిన ఫోటో | : సూర్యనారాయణమూర్తి |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : స్ఫటిక సూర్యుడు |
| 11. | పూజించవలసిన దైవము | : ఆదిత్యుడు |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : ఎరుపు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : (ఎర్రచామంతి), కనకాంబరాలు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : ఎర్రచామంతి, కనకాంబరాలు |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : చిక్కుడు కాయలతో పొంగలి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : బూరెలు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : ఎర్రటిపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : సూర్యఅష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిన స్తోత్రాలు | : సూర్యాష్టకమ్ |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : ఆదిత్యహృదయం |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : సూర్య సహస్రనామాలు |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : ఆదిత్యారాధన |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : ద్వాదశాదిత్యులు |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : సూర్య |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : అరసవెల్లి,గొల్లలమామిడాడ, పెద్దాపురం |





| | | |
|---|---|---|
| 26. | చేయవలసిన ధ్యానములు | : సూర్యధ్యానము |
| 27. | చేయించవలసిన పూజలు | : సూర్య అష్టోత్తర నామార్చన |
| 28. | దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : సూర్యనమస్కారములు |
| 29. | ఆచరించవలసిన వ్రతము | : రథసప్తమి వ్రతము |
| 30. | ఉపవాసము నియమము | : లేవు |
| 31. | జాగరణ నియమము | : లేదు |
| 32. | సేకరించవలసిన పుస్తకములు | : సూర్యనారాయణ నిత్యపూజ, ఆదిత్యారాధన |
| 33. | సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : ఆదిత్యారాధన |
| 34. | స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : రథసప్తమీ వ్రతకథ |
| 35. | దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : మహాసౌర పారాయణ |
| 36. | దేవాయలమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : అరుణపారాయణ |
| 37. | పర్వదిన నక్షత్రము | : - |
| 38. | పర్వదిన తిథి | : మాఘసప్తమి |
| 39. | పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : ఆదివారము |
| 40. | పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ॥6గం॥నుండి 12గం॥ |
| 41. | వెలిగించవలసిన దీపారాధన కుంది | : ఎర్రటి ప్రమిదలు (ఇత్తడి) |
| 42. | వెలిగించవలసిన దీపారాధనలు | : 2 దీపారాధన |
| 43. | వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 7+7 |
| 44. | వెలిగించవలసిన వత్తులు | : ఎర్రటి దూదివత్తులు |
| 45. | దీపారాధనకు వాడవలసిన నూనె | : ఆవునెయ్యి |
| 46. | వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : 7 వత్తులతో |
| 47. | ధరించవలసిన తోరము | : ఎర్రటితోరము |
| 48. | నుదుటన ధరించవలసినది | : ఎర్రటి కుంకుమ |
| 49. | 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం హ్రీం సూర్యాయ నమః |
| 50. | జపమునకు వాడవలసిన మాల | : కెంపు మాల |
| 51. | మెడలో ధరించవలసిన మాల | : కెంపు మాల |
| 52. | మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : సూర్య |
| 53. | చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. | ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : తూర్పు. |

## రథసప్తమి

సాధారణంగా అందరూ అంటూ ఉంటారు. ఎంతో పుణ్యం చేసుకుంటేగాని, ఈ సృష్టికారకుడైన ఆ పరమాత్మను ఈ చర్మ చక్షువులతో దర్శించుటకు సాధ్యముకాదని! ఎంతో తపః సంపన్నులైన ఋషిపుంగవులకే అదిసాధ్యమని! అంటారు. కాని అట్టి సర్వాంతర్యామి, త్రిమూర్తి స్వరూపుడు నిత్యం మన ముంగిటకు వచ్చి మన పాపపుణ్యాలతో బేరీజు వేయకుండా! అందరినీ సమభావనతో చూస్తూ! మన యోగక్షేమాలను తిలకిస్తూ! ఆయన ప్రత్యక్ష సాక్షికావున! మనం అను నిత్యం తెలిసో తెలియకో చేస్తున్న పాప-పుణ్యాల గణాంకాలను చిట్టాలో వేసుకుంటూ! మనం వార్కి అర్పించే నమస్కారాలకు! ప్రతిఫలంగా మన సర్వపాపాలను పోగొట్టి, సర్వవ్యాధులు నయంచేస్తూ! ఉండే ఆ పరమాత్మ మరి ఎవరోకాదు. ఈ భూమండలంల్లోని సమస్త మానవాళి తరతరాలుగా నమ్మికొలిచే! శుభంకరుడైన ప్రత్యక్షదైవం ఆ సూర్యభగవానుడే! ఇట్టి పరమాత్మ యొక్క "సూర్యజయంతి" పండుగను "రథసప్తమి" పేరుతో మాఘమాసం శుద్ధ సప్తమినాడు విశేషంగా జరుపుతారు. ఆ రోజు సూర్యోదయ సమయమందు గ్రహనక్షత్రాల సన్నివేశం "రథం" ఆకారంలో ఉంటాయిట! అందువల్లనే దీనికి "రథసప్తమి" అని పేరు వచ్చిందని పండితోత్తములు చెబుతూ ఈ రోజు అరుణోదయకాలమందే! సూర్యునికి ప్రీతికరమైన జిల్లేడు ఆకులు మధ్య రంధ్రంచసి ఆ రంధ్రంపైన రేగుపండ్లను ఉంచి శిరస్సులపైన, భుజాలపైన, హృదయంపైన ఉంచుకుంటూ! శిరస్నానంచేసి, ఆ జిల్లేడు ఆకు రంధ్రము గుండా! సూర్యదర్శనం చేసుకుని నమస్కరిస్తారు.

స్త్రీలు! ఈ రోజు చిక్కుడు ఆకులు, చిక్కుడు పువ్వులు, చిక్కుడుకాయలు వివిధ ఫల, పుష్పాలను సేకరించుకుని, "సంక్రాంతి గొబ్బిళ్ళు" పిడకలుగా అయినవి! తెచ్చి పాలదాలిగా! తులసికోట ప్రక్కన సూర్యునికి ఎదురుగా అమర్చుకుని ఆవుపాలతో పొంగలి తయారుచేసుకుని, తులసికోటముందు "సూర్యప్రతిమను" ఉంచి స్వామివార్కి షోడశోపచారములతో పూజలుగావించి చిక్కుడాకులపై పొంగలి ప్రసాదం ఉంచి సూర్యదేవునికి నివేదన చేస్తారు.

ఇలా సూర్యారాధనవల్ల ఆయురారోగ్య ఐశ్వర్యాలు సిద్ధిస్తాయని మన పూర్వీకుల నుండి ఇప్పటివరకు గల ధృఢమైన విశ్వాసం. సైన్సు ప్రకారంగా









ఆలోచించినా, నవీనులు కూడా ఎంతోమంచివి అని ఆమోదిస్తున్నవి "ఉదయిస్తున్న సూర్యకిరణాలు" "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అన్న పెద్దలమాటను సర్వులు ఆమోదిస్తున్నదే! మొత్తం మన శరీరం యొక్క ఆరోగ్యం అంతా ఆయన అధీనంలో ఉంది.

**శ్లో॥ ఆదిత్యాయచ సోమాయచ మంగళాయచ బుధాయచ**
**గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥**

జ్యోతిష్యంలో కూడా! సూర్యునికి ప్రముఖస్థానం ఉంది. ఆయన గ్రహాలంతటికి రాజు కాబట్టి ఆయన నయనకారకుడైనాడుట! "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం!" అన్నట్లు ఈయన అనుగ్రహాన్ని బట్టే కంటిచూపు ఆధారపడి ఉంటుందిని జ్యోతిషశాస్త్ర కోవిదులు చెప్తారు. ఈ చరాచర సృష్టి అంతా! గ్రహగతులమీదనే ఆధారపడి ఉంటుందిట! భూమిపై జన్మిస్తున్న మానవాళి జీవనగమనంలో సుఖ దుఃఖాలకు గ్రహాలయొక్క ఉచ్ఛ, నీచ స్థితులే ప్రధాన కారణమని, ఈ గ్రహదోష నివారణార్థం జరిపే జప,దాన, అభిషేక, అర్చనలతో గ్రహశాంతులు జరిగి జాతకుడికి తప్పక సత్ఫలితాలను ఇస్తాయని అనాదిగా! భాస్కరాచార్యుడు, వరాహమిహురుడు వంటి శాస్త్రజ్ఞులచే వ్రాయబడిన గ్రంథాల ప్రామాణికంగా ఇవి ఋజువు అవుతున్నాయి అని జ్యోతిష్యపండితులు చెప్తూ ఉంటారు.

**శ్లో॥ బ్రహ్మ స్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరః**
**అస్తమానే స్వయం విష్ణుః త్రయీ మూర్తద్దివాకరః ॥**

అనునట్లు ఈ పరమాత్మ ఉదయకాలమందు బ్రహ్మగా, మధ్యాహ్నకాలమందు మహేశ్వరుడుగా! సాయంకాలమందు విష్ణుస్వరూపంగా ప్రకాశిస్తూ ఉంటాడుట! ఈ సూర్యోపాసన చేయుట అనునది ఎంతోశక్తి దాయకం. పాండవులు వనవాస కాలమందు సూర్యోపాసనతో "అక్షయపాత్రను", సత్రాజిత్తు "శమంతకమణి" ని వరంగా పొందినారుట! ఈ సూర్యదేవుని మహిమను "ఆదిత్యహృదయం"లో ఎంతో విశిష్టంగా అగస్త్యుడు వర్ణించాడు. శ్రీరామచంద్రుడు ఈ ఆదిత్య హృదయపారాయణ చేసి రావణునిపై విజయం సాధించాడుట!

**శ్లో॥ "సప్త సప్త మహాసప్త సప్తద్వీప వసుంధర**
**సప్తార్క వర్ణమాదాయ సప్తమీ రథసప్తమి ॥"**

అన్నశక్తిమంతమైన "సూర్యగాయత్రీని" విశ్వామిత్రుడు! సూర్యునికి అంకితం ఇచ్చినాడుట. ఈ రథసప్తమి పుణ్యకాలమందు అందరు విధిగా దీనిని స్మరిస్తారు. మనం ఎన్నోజన్మలు ఎత్తుతేకాని ఈ దుర్లభమైన మానవజన్మ మనం పొందలేము. ఇంతటి మహిమాన్వితమైన పుణ్యదినం "రథసప్తమి". ఆ రోజు ప్రాతఃకాలమందు పుణ్యస్నానాలుచేసి సమీప ఆలయాలలో ఈ దేవదేవునికి విశేషపూజలు గావించి వారి కృపాకటాక్ష వీక్షణలతో! భోగభాగ్యాలను అనుభవిస్తూ జన్మరాహిత్యాన్ని పొందుదాం!

## భీష్మ ఏకాదశి



1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి.
3. చేయవలసినఅలంకారములు : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు
4. చేయవలసిన స్నానము : తలంటుస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : తెలుపు
6. పూజామందిరంలో చేయవలసినవి : పూజాకు ఉపయోగపడు వస్తువులు–పటములకు గంధము,కుంకుమ ఉంచాలి
7. మందిరంలో పరచవలసిన వస్త్రము : తెలుపు
8. కలశముపై వస్త్రము రంగు : తెలుపు
9. పూజించవలసిన ఫోటో : విష్ణుమూర్తి
10. పూజించవలసిన ప్రతిమ : విష్ణుమూర్తి
11. పూజించవలసిన దైవము : విష్ణుమూర్తి
12. తయారు చేయవలసిన అక్షతలు : పసుపు
13. పూజకు కావలసిన పువ్వులు : తామర పువ్వులు,తులసి దళములు
14. అలంకరణకు వాడవలసినపూలు : జాజిమాల
15. నివేదన చేయవలసిననైవేద్యం : పాయసం
16. సమర్పించవలసిన పిండివంటలు : తీపి పదార్థములు
17. నివేదించవలసిన పండ్లు : ఆకుపచ్చ పండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : విష్ణు
19. పారాయణ చేయవలసిన స్తోత్రాలు : నారాయణకవచం
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : శ్రీమన్నారాయణ హృదయం
21. పారాయణచేయవలసిన సహస్రాలు : విష్ణు సహస్రనామాలు
22. పారాయణ చేయవలసినగ్రంథం : విష్ణు పురాణము
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : దశావతారములు
24. దర్శించవలసిన దేవాలయాలు : విష్ణు, వేంకటేశ్వర
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : శ్రీకాకుళం, కృష్ణాజిల్లా
26. చేయవలసిన ధ్యానములు : విష్ణుధ్యానం
27. చేయించవలసిన పూజలు : విష్ణు సహస్రనామా పూజ





28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : విష్ణు అష్టోత్తరములు
29. ఆచరించవలసిన వ్రతము : సత్యనారాయణ వ్రతము
30. ఉపవాసము నియమము : వున్నది
31. జాగరణ నియమము : ఉన్నది (రాత్రి నిద్రపోరాదు)
32. సేకరించివలసిన పుస్తకములు : విష్ణు నిత్యపూజ, విష్ణుపురాణం
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు : విష్ణుసహస్రనామస్తోత్రమ్, విష్ణుపురాణం
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : సత్యనారాయణవ్రత పుస్తకములు
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : బ్రహ్మోత్సవ దర్శనం
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు : లక్షతులసిపూజ
37. పర్వదిన నక్షత్రము : –
38. పర్వదిన తిథి : ఏకాదశి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : శనివారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : మ॥12గం॥నుండి 2గం॥
41. వెలిగించవలసిన దీపారాధన కుంది : ఎర్రటి ప్రమిదలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : రెండు
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : 5+5
44. వెలిగించవలసిన వత్తులు : తామరవత్తులు
45. దీపారాధన వాడవలసిన నూనె : కొబ్బరినూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : పంచహారతి
47. ధరించవలసిన తోరము : పసుపుతోరము
48. నుదుటన ధరించవలసినది : తిరునామము
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం నమోనారాయణాయ
50. జపమునకు వాడవలసిన మాల : తులసిమాల
51. మెడలో ధరించవలసిన మాల : తులసిమాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : విష్ణుమూర్తి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : తూర్పు

## భీష్మఏకాదశి

ప్రతిసంవత్సరము మాఘశుద్ధ మందు వచ్చే ఏకాదశిని "భీష్మఏకాదశి" అంటారు. నిజానికి భీష్మాచార్యులువారు 'ఏకాదశి' నాడు శరీరాన్ని విడచి నిష్క్రమించ లేదని పరమభాగవతోత్తములుచెప్తూ ఉంటారు. మరయితే, ఇది భీష్మ ఏకాదశి ఎలా అయినట్లు? అనుసందేహము మనకు వెంటనే కలుగుట సహజం! ఆలాగునే మరీ వీరికి భీష్ములవారు అనుపేరు ఎలావచ్చింది? వీరి అసలు పేరు ఏమిటి? అన్నవి తెలియాలి అంటే! వీరి జన్మ వృత్తాంత విశేషాలను ఒకసారి పరిశీలిద్దాం.

**అంతకాలేచ మా మేవ స్మర న్ముక్త్వా కలేవరమ్**
**యః ప్రయాతి స మద్భావంయాతి నాస్త్యత్రసంశయః॥**

మనకు మనపెద్దలు చెప్తూ ఉంటారు! సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ వారినోటి వెంట పలికిన ఆ పలుకులకు అర్థమేమిటో! ఎవరైతే అంత్యకాలమందు (మరణసమయ మందు) ఆ శ్రీకృష్ణభగవానుని స్మరిస్తూ ప్రాణములను విడుస్తారో! వార్కి తప్పక మోక్షమిస్తానని వారి చెప్పినారుట! అలా చెప్పిన కృష్ణ పరమాత్మను, తన ధర్మవర్తనంతో, తపశ్శక్తితో మరణకాలమందు తనవద్దకే రప్పించుకుని, వారి సమక్షమందే మానవాళి కందరికి బాధలను తొలగించే "శ్రీ విష్ణు సహస్రనామాలను" పారాయణ చేస్తూ తన పరివారమంతా చూస్తూ ఉండగా! మోక్షాన్ని పొందిన భక్తాగ్రేస్వరుడు ఈ భీష్మాచార్యుల వారు, అట్టి భాగ్యశీలి పురాణ గాథ ఇది.





నారద పురాణం ఉత్తరభాగంలో సకలశాస్త్ర కోవిదుడు పురాణజ్ఞుడైన సూతుడు నైమిశారణ్యములోని ముని శ్రేష్ఠులకు ఎన్నో ఏకాదశుల మాహాత్మ్యాలను చెప్తూ "భీష్మఏకాదశి" ని గూర్చి ఇలా తెలియజేసినారుట!

భీష్మాచార్యులవారు దక్షిణాయనంలో అంపశయ్యమీదపడినా, ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చేవరకూ ఆగి ఇహలోకమందు జీవి అనుభవించవలసిన శిక్షను తనకు తానుగానే విధించుకుని, పరమాత్మ దర్శనభాగ్యము అగుటవల్ల తన తప్పులన్నీ పరమాత్మ మన్నించినాడని సంతృప్తిచెంది, ఆ విష్ణుస్వరూపుని సహస్రనామాలతో స్తుతిస్తూ, తన తండ్రి తనకు ఇచ్చిన వరప్రభావముచే; సాక్షాత్తు శ్రీకృష్ణుని సమక్షంలో "స్వచ్ఛందంగా" శరీరాన్ని విడచి ప్రాణవాయువును నిష్క్రమింపచేసి, పరమాత్మలో ఐక్యమై మోక్షసిద్ధి పొందిన, ఆదర్శపుణ్య పురుషుడు ఈ భీష్మ పితామహులు. నిజానికి వీరు శరీరాన్ని చాలించింది ఏకదాశి నాడు మాత్రం కాదు.

**మాఘమాసస్య చాష్టమ్యాం శుక్ల పక్షేచ పార్థివ ।**
**ప్రాజాపత్యేచ నక్షత్రే మధ్యం ప్రాప్తే దివాకరే ॥**

అనగా ! 'శోభకృన్నామ సంవత్సరం' మాఘమాసం, శుక్లపక్ష అష్టమినాడు, రోహిణీ నక్షత్రంలో (అంటే శ్రీకృష్ణపరమాత్మ జన్మనక్షత్రం) సూర్యభగవానుడు నడినెత్తిమీద ప్రకాశిస్తూ ఉండగా! (అభిజిత్ లగ్నంలో) ఆయన పరమాత్మతో ఐక్యమైనాడు. అట్టి భక్తాగ్రేశ్వరుని జ్ఞాపకార్థం శ్రీకృష్ణ పరమాత్మ భీష్మాచార్యులవారి పేరిట వరంగా ఒక ఏకాదశిని కేటాయించి దానికి "భీష్మఏకాదశి" అని పేరు పెట్టినారు, అని సూతముని మునిపుంగవులు చెప్పియున్నారు.

ఇంతకీ వీర్కి భీష్ములవారు అను పేరు ఎలా వచ్చిందో! వీరి అసలు పేరు ఏమిటో? అన్న సందేహాన్ని కూడా నివృత్తి చేసుకుందాం! వీరి అసలు పేరు 'దేవ వ్రతుడు' ఈతని తండ్రి శంతన మహారాజు. ఈతనికి వివాహ వయస్సువచ్చిన పట్టించుకోకుండా! శంతనుడు, ఒకరోజు సిగ్గువిడచి కుమారుడు దేవవ్రతునితో కుమారా! నీవు నాకు ఒకే ఒక పుత్రుడవు కనుక, నీకు తోడుగా తమ్ముడు ఉండేలా నేను 'దాసరాజు'ఏకైక పుత్రిక 'సత్యవతిని' వివాహమాడదలిచాను అని చెప్తాడు.

అందులకు "దేవపుత్రుడు" ముందు కాలమందు జరుగబోయే పరిస్థితులను అవగాహన చేసుకుని సత్యవతి తండ్రి 'దాసరాజు' వద్దకు వెళ్ళి నా తండ్రిగారు 'శంతన మహారాజు' అభీష్టాన్ని నేను ఆమోదిస్తున్నాను. ఒకటి "నా తండ్రికి-సత్యవతికి" పుట్టిన పుత్రునికే ఈ రాజ్యం మొత్తం చెల్లుబాటు అవుతుంది. రెండు నా తండ్రికి సత్యవతి ద్వారా పుత్రున్ని కన్నా, ఒక వేళనాకు వివాహమైన పక్షంలో ఇబ్బందులు తలెత్తుతాయి కాబట్టి ! అసలు నేను వివాహమే పరిత్యజిస్తున్నాను. అను రెండు అతిభయంకరమైన (భీషణమైన) ప్రతిజ్ఞలుచేసి, తండ్రిచే "స్వచ్ఛంద

మరణం" అనే వరాన్నిపొంది, ఆజన్మాంతమూ తన ప్రతిజ్ఞను నిలుపుకున్న ఆదర్శ పుణ్యపురుషుడు కాబట్టి "భీష్మాచార్యులు" అయినారు.



వారి అంత్యకాలమందు ఆ కృష్ణభగవానుని స్తుతించిన వేయినామాలు ఆ పరమాత్మచే అవి ఆమోదించబడుటచే! నేడు అవి "శ్రీ విష్ణు సహస్రనామాలు"గా ప్రాచుర్యం పొంది భక్తుల మనోభీష్టాలను నెరవేరుస్తున్నాయి. మనమూ ఒక్కసారి ఆ పరమాత్మను ఇలా స్తుతించుకుందాము.

**నమోఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః**

అట్టి ఆదర్శపుణ్య పురుషుడు భీష్మాచార్యులువారి "భీష్మఏకాదశి" పర్వదినం మనమంతా విశేషంగా జరుపుకుని శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహపాత్రులౌదాము.

### ఇంకొక కథ :



యుధిష్ఠిరుడు "జగన్నాథా! శ్రీ కృష్ణా! ఆదిదేవా! జగత్పతీ! మాఘ మాస కృష్ణ పక్ష మందు వచ్చు ఏకాదశి నామమేమి? దాని విధి విధాన మెట్టిది? ఎట్టి ఫలము లభించును? దయతో చెప్పు"దని కోరెను.

శ్రీ భగవానుడు "నృపశ్రేష్ఠా! మాఘ మాస కృష్ణ ఏకాదశి "షట్‌తిల" నామ ముతో ప్రసిద్ధి గావించినది. ఇది సమస్త పాపములను నశింపజేయును. నీవిప్పుడు "షట్‌తిల" కథను వినుము. దీనిని పులస్త్యముని, దాల్భ్యునితో చెప్పెను.

దాల్భ్యుడు,పులస్త్యునితో "బ్రహ్మన్! పాపకర్ములు చేయు ప్రాణులు నరకమునకు పోవు చున్నారు. దీని నివారణోపాయము దయతో చెప్పు"దని కోరెను.

పులస్త్యముని "మహాభాగా! నీవు మంచి మాట అడిగితివి, చెప్పుచున్నాను వినుము. మాఘమాసము వచ్చిన తరువాత ఇంద్రియ నిగ్రహము గలిగియుండి పవిత్రముగ స్నానాదులు చేసి కామము, క్రోధము, అహంకారము, లోభము, చాడీలు చెప్పుట మొదలగునవి త్యజించవలెను. భగవానుని స్మరించుచూ భూమిపై పడియున్న ఆవుపేడను సంగ్రహించి దాని యందు నువ్వులు, ప్రత్తిగింజలువేసి, 108 పిడకలు చేయవలెను. మాఘ మాసమందు ఆర్ద్రా, మూలానక్షత్రము లొచ్చినప్పుడు కృష్ణపక్ష ఏకాదశిన వ్రతము చేయవలెను. చక్కగా స్నానముచేసి పవిత్రులై శుద్ధ భావముతో శ్రీ విష్ణు భగవానుని పూజించవలెను. ఏదైన మరచిపోయిన శ్రీకృష్ణుని నామమునను ఉచ్చరించవలెను. కృష్ణ, కృష్ణ, కృష్ణ అనుచు హోమము చేయవలెను. చందన అగరు కర్పూర నైవేద్యాదులతో, శంఖ చక్రగదాధరుడైన శ్రీహరిని పూజించవలెను.







అనంతరము పదే పదే శ్రీకృష్ణుని నామముచ్చరించుచూ గుమ్మడికాయ, కొబ్బరికాయ లతో భగవానునకు అర్ఘ్యమివ్వవలెను. మరియు అన్య పదార్థములతోను, నూరు వక్కలతోను భగవానుని పూజించవలెను.

సచ్చిదానంద స్వరూప శ్రీకృష్ణా! మీరు దయా స్వరూపులు, ఆశ్రయదాతలు, పురుషోత్తమా! సంసార సముద్రమందు మేము మునిగి యుంటిమి. మాపై ప్రసన్నులు కండు. కమల నయనా! మీకు నమస్కారము. విశ్వ భావనా! మీకు నమస్కారము. సుబ్రహ్మణ్య మహాపురుషా! ఆది పురుషులైన మీకు నమస్కారము. జగత్పతే! లక్ష్మీదేవితో కలసి నేనొసగిన అర్ఘ్యము స్వీకరింపుడు అని పూజించవలెను.

అనంతరము బ్రాహ్మణుని పూజించవలెను. జలపాత్రను (కుండను) దానము చేయవలెను. దీనితోపాటు ఛత్రమును, చెప్పులను, వస్త్రములను కూడ దానమొసగ వలెను. దానమొసగునపుడు "ఈ దానముతో శ్రీకృష్ణ భగవానులు నాపై ప్రసన్నులు గావలెను. నా శక్తికి తగినట్లుగా బ్రాహ్మణునకు నల్లని గోవును దానము చేసితిని. ద్విజశ్రేష్ఠా! నువ్వులతో నిండియున్న పాత్రనుకూడ దానము చేసితిని అనుచు దానము చేయవలెను. ఆ నువ్వులు భూమిపై జల్లగా ఎన్ని శాకలు పుట్టునో అన్నివేల సంవత్సరముల వరకు దానము చేసినవారు స్వర్గలోకమందుండెదరు.

నువ్వులతో స్నానముచేయుట, నువ్వులతో నలుగుపెట్టుకొనుట, నువ్వులతో హోమము చేయుట, నువ్వులు కలిపిన నీరును త్రాగుట, నువ్వులను దానము చేయుట, నువ్వులను భుజించుట, ఈ ఆఱు విధములుగ నువ్వులను ఉపయోగించిన ఏకాదశి "షట్‌తిల" అనబడును. ఇది సర్వ పాపములను నశింపజేయును" అని చెప్పెను.

### ఇంకొక కథ :

భీష్మాచార్యుని తెలియనివారు ఉండరు. ఆయన స్వచ్ఛంద మరణము కలవాడు. భారతయుద్ధములో ఇతడు సేనానియై పది దినములు యుద్ధముచేసి పదనొకండవనాడు శిఖండి బాణములతో నేలకొరిగి, అంపశయ్యపైపడి ఉత్తరాయణ పుణ్యకాలమునకై వేచి యున్నాడు.

అంపశయ్యపై ఒరిగినది కార్తీక శుద్ధ ఏకాదశి అనియు మాఘశుద్ధ అష్టమినాడు ప్రాణత్యాగము చేసెనని హేమాద్రి మొదలగు వ్రతగ్రంథకారులు చెప్పుచున్నారు. కొందరు భీష్ముడు అంపశయ్యపై ఒరిగినది కార్తీక శుద్ధ ఏకాదశి కాదనియు, మార్గశిర శుద్ధ ఏకాదశియనియూ వాదమున్నది. వ్రతగ్రంథములలో కార్తీకశుద్ధ ఏకాదశి యనియే యున్నది. "వ్రతచూడామణి" లో కూడ అట్లేయున్నది.

శరతల్పగతుడగు భీష్ముడు ధర్మరాజుకు రాజధర్మాలను, దాన ధర్మములను సూక్ష్మ ధర్మములను తెలిపిన పిదప శ్రీకృష్ణుడు సంతుష్టుడై, "భీష్మాచార్యా! నీవు ధన్యుడవు. ధర్మమును వినిపించినావు. కార్తీక శుక్లపక్ష ఏకాదశి నీవు జలముకోరగా అర్జునుడు బాణము సంధించి పాతాళ గంగను తెచ్చెను. ఆ పవిత్రజలముతో నీవు నీ దుంగములు నేటివరకూ పరితుష్టములైనవి కనుక పూర్ణిమ వరకూ (ఏకాదశినుండి) సకల జనులు నీకు అర్ఘ్యమిత్తురు గాక" అని చెప్పెను.

కాని భీష్ముడు తన ప్రాణోత్క్రమణ సమయమందు ధర్మరాజుతో ఇట్లనెను. (చూ.అను శాసనిక పర్వం అధ్యాయం 168) "ఓ యుధిష్ఠిరుడా! అమాత్య (మంత్రులు) సహితుడవై దైవవశమున ఇక్కడకు వచ్చినావు. సహస్రాంశువగు సూర్యుడు ఉత్తరాయణమునకు కదలినాడు. ఈ వాడి మొనలుగల అంపశయ్యపై పడుకొని యున్న నాకు ఈ ఏబది ఎనిమిది (58) రాత్రులూ నూరేండ్లుగా అయినవి. మాఘమాసము వచ్చినది. ఇది సౌమ్యమగు మాసము. శుక్లపక్షము మాసమును నాలుగు భాగములు చేసిన ఒకభాగము విడచి మూడు భాగములు శేషించియున్నది. (అనగా అష్టమి) ఈ లెక్కల ప్రకారము మాఘశుద్ధ అష్టమి నుండి 58 దినములు తీసివేసిన మార్గశిర శుక్ల ఏకాదశియగును. ఆ దినముననే భీష్ముడు అంపశయ్యపై ఒరిగెనని నిర్ధారింపవలయును. కాని శ్రీకృష్ణుడు మొదలగువారు భారత యుద్ధానంతరము మరణించిన వారందరికీ అంత్యక్రియలు నిర్వర్తించిన తర్వాత నెలదినములు గంగా తీరముననే యున్నట్లు భారతములో (శాంతిపర్వం 1-2) చెప్పబడింది. తరువాత శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునితో, భీష్మునితో.........

**పంచాశతం షట్చ కురు ప్రవీర శేషం దినానాం తవ జీవితస్య**
**తతశ్శుభైః కర్మ ఫలోదయై స్త్వం సమేష్యసే భీష్మ విముచ్యదేహః॥**

(శాంతి 51-14)

అన్నాడు. అంటే ఓ కురువీరా! నీ శేష జీవితం ఇంక 56 దినములు మాత్రమే. పిదప నీవు దేహమును వీడి శుభకర్మఫలోదయమును పొందుదువు. తిక్కనగారు కూడా

**అనఘ ఇనుడింక యేబది యారు దివసములకు దానుత్తరాయణమున జరింప**
**దొడగు నీవప్డు దేహంబు విడిచియేగు దపునరావృత్తి పదమున కభిముఖముగ॥**

**(శాంతి 2-115)**

అని వ్రాసారు. దీనిని బట్టి పంచాశతం షట్చయనగా 56 దినములు గనుక గంగాతీరమునుండి పాండవాదులు తరలి భీష్ముని దగ్గరకు వచ్చినది. 56 దినములకు అనగా శరతల్పగతుడైన 56 దినములకు మరణించెనని లెక్క తేలుచున్నది. అను శాసనిక పర్వంలో భీష్ముడు తాను 58 దినములే కదా అంపశయ్యపై పడియున్నా



ననెను. కావున ఆయన వాక్యమునకూ శాంతి పర్వమందలి శ్రీకృష్ణ వచనములకు పొంతనము కుదురుటలేక పోవుటచే, భారతవ్యాఖ్యాత నీలకంఠాచార్యుడు "పంచాశతం షట్చ" యను దానికి ముప్పదియని అర్థము చెప్పెను. ఎట్లన పంచాశతం షట్ అనగా నీ జీవిత సంబంధమైన దినముల శేషమును 5చే హెచ్చించబడిన ఆరును అని లెక్క గ్రహించవలెనని చెప్పెను. ఈ 30 దినములే "అశతం" శతావధి, వందదినములలో చేయదగినది ముప్పది దినములలో చేయదగునని యర్థము. అనగా ముప్పదిదో కలసిన (56/2) ఇరువది ఎనిమిది యని అర్థము ఏబది ఎనిమిది దినములుగా పడియున్నానని భీష్ముడనును. ఇది వరకు 28 దినములు గడచినవి. ముప్పది దినములు మిగిలియున్నవి. అది యెట్లన భీష్ముడు అంపశయ్యపై పడిన తర్వాత ఎనిమిది దినములు యుద్ధము జరిగినది. తరువాత యుయుత్సువునకు దుర్యోధనుని మరణాశౌచము 16 దినము క్షత్రియులు అతడితో బాటు పుర ప్రవేశము చేసిన పాండవులకును అన్నిదినములే గడచినవి. ఇప్పటి మొత్తం 24 దినములు 25 దినమున అందరికీ శ్రాద్ధము, 26వ దినమున పురప్రవేశము 27వ దినమున ధర్మజుని రాజ్యాభిషేకము, 28వ దినమున ధర్మరాజు ప్రజలను సమాధానపరచుట. అభ్యుదయముకోరి దానము 29వ దినమున భీష్ముని యొద్దకు వచ్చుట. ఆ దినమునుండి 30 దినములని గ్రహింతురుగాక!

ఈ కారణముల వల్ల భీష్ముడు మార్గశిర శుక్ల ఏకాదశినాడే శరతల్పగతుడయి నట్లు నిశ్చయమగుచున్నది. కావున వ్రతగ్రంథముల లెక్క లేమిటో విచార్యము అయిననూ పాండవులు గంగాతీరమందుండిరి యనుటకు సమన్వయం కుదురుట లేదు. నీలకంఠాచార్యుని వ్యాఖ్యను బట్టి, పాండవులున్నది 22 దినములేననవి తెలియుచున్నది. భీష్మునకీనాడు జలాంజలి యొసగిన సంవత్సరములోచేసిన పాపము తక్షణమే నశించునని చెప్పబడినది. అన్ని వర్ణములవారు భీష్మునకు తర్పణము చేయవలెనని ధర్మ నిర్ణయ సింధుకారుడు చెప్పెను. బిల్వపత్రము, గుంట గలగర, గన్నేరు పూలతో పూజింపవలెను. కొందరు భీష్మ పంచక వ్రతము అష్టమి తిథినుండి చేయుట ఆచారము. ఈ దినమున విష్ణుపూజలుచేసి, లోహముతో ధర్మజుని విగ్ర హము చేయించి దానిని నూవులరాశిపై యుంచి పూజించి దానముచేయవలెను. పిదప బ్రాహ్మణ సంతర్పణ మాచరించవలెను. శాకాహారమే భుజింపవలెను.

## శివరాత్రి



| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : తెలుపు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : తెలుపు |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : తెలుపు |
| 9. | పూజించవలసిన ఫోటో | : శివుడు |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : లింగాకారము |
| 11. | పూజించవలసిన దైవము | : శివుడు |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : తెలుపు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : మారేడు దళములు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : తెల్లపూలమాల |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : పొంగలి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : బూరెలు+గారెలు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : అరటి +జామకాయలు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : శివఅష్టోత్తరము |
| 19. | పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : శివ పంచాక్షరీ స్తోత్రం |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : దారిద్ర్యదహన స్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : శివ సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : శివారాధన, శివపురాణము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : లింగోద్భవ అధ్యాయము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : శైవ |
| 25. | దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు | : శ్రీశైలం, శ్రీకాళహస్తి, ద్రాక్షారామం |
| 26. | చేయవలసిన ధ్యానములు | : శివ ధ్యానములు |
| 27. | చేయించవలసిన పూజలు | : మహాన్యాస పూర్వక రుద్రాభిషేకం |





| | | |
|---|---|---|
| 28. | దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : ఏకాదశరుద్రాభిషేకం |
| 29. | ఆచరించవలసిన వ్రతము | : ఉపవాసవ్రతము |
| 30. | ఉపవాసము నియమము | : వున్నది (భోజనంచేయరాదు) |
| 31. | జాగరణ నియమము | : లేదు (రాత్రికి నిద్రపోరాదు) |
| 32. | సేకరించవలసిన పుస్తకములు | : శివనిత్యపూజ, శివస్తోత్రమాల, రుద్ర నమకచమకమ్, నిత్యజీవితములో రుద్రాక్షలు ద్వాదశజ్యోతిర్లింగయాత్ర |
| 33. | సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : శివదీక్ష |
| 34. | స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : శివభక్తిమాల |
| 35. | దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : శివకళ్యాణము |
| 36. | దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : 108బిందెలతో రుద్రాభిషేకం |
| 37. | పర్వదిన నక్షత్రము | : - |
| 38. | పర్వదిన తిథి | : మాఘ బహుళ చతుర్దశి |
| 39. | పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : సోమవారము |
| 40. | పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : సా॥6గం॥నుండి మరుసట రోజు ఉదయం 6 గం॥వరకు |
| 41. | వెలిగించవలసిన దీపారాధన కుంది | : ఎర్రటి ప్రమిదలు |
| 42. | వెలిగించవలసిన దీపారాధనలు | : 5 దీపారాధనలు |
| 43. | వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 5+5 |
| 44. | వెలిగించవలసిన వత్తులు | : దూదితో |
| 45. | దీపారాధన వాడవలసిన నూనె | : నువ్వులనూనె |
| 46. | వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : పంచహారతి |
| 47. | ధరించవలసిన తోరము | : నల్లటితోరము |
| 48. | నుదుటన ధరించవలసినది | : విభూది |
| 49. | 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం నమఃశివాయ |
| 50. | జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 51. | మెడలో ధరించవలసిన మాల | : రుద్రాక్ష మాల |
| 52. | మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : మీకునచ్చిన రుద్రాక్ష |
| 53. | చేయవలసిన అభిషేకము | : పంచామృతములతో |
| 54. | ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : పడమర. |

## మహాశివరాత్రి మాహాత్మ్యమ్

మనకు సాధారణంగా ప్రతినెల కృష్ణచతుర్దశి రోజున "శివరాత్రి" వస్తూనే ఉంటుంది. దానిని "మాసశివరాత్రి" గా భావించి శివానుగ్రహం పొందుటకు ఆ రోజు ఈశ్వరునకు విశేష పూజలు చేయిస్తూ ఉంటారు. అందులో అత్యంత విశిష్టమైనది, మాఘ బహుళ చతుర్దశినాడు వచ్చేది "మహాశివరాత్రి" పర్వదినం. ఇది శివపార్వతులకు ఎంతో ప్రీతికరమైనది.

**శివాయ గౌరీ వదనాబ్జ భృంగ సూర్యాయ దక్షాధ్వర నాశకాయ**
**శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ తస్మై శ్రీకారాయ నమశ్శివాయ॥**
**(శివపంచాక్షరీ స్తోత్రం)**

ఇట్టి మహేశ్వరుడు నిర్గుణ నిరాకార పరబ్రహ్మ సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామియై ఈ చరాచర ప్రపంచం అంతట వ్యాపించి ఈ సహజ లక్షణాలతో ఆయన నిరాకారుడయ్యాడు. కాని భక్తులను అనుగ్రహించేందుకు, ఆశీర్వదించేందుకు, సగుణాకార, నిర్గుణాకారాల ప్రతిరూపమే ఈ శివలింగ రూపమని, మిగిలిన దేవతలవలె "శిరము" మొదలైన ఇతర అవయవములు లేవు కాబట్టి! ఈ దేవదేవునకు లింగమే ప్రతీకగా, లింగపూజను నిరాకార ఆరాధనగా చేస్తూ ఉంటారని దైవజ్ఞులు చెబుతారు. ఇక ఈ "ఈశ్వరుడు" లింగోద్భవమూర్తిగా అవతరించుటకుగల కారణం ఏమిటో తెలుసుకుందాం.

దీనికి ఒకపురాణగాథ కలదు. ఒకసారి బ్రహ్మ, విష్ణు మూర్తులమధ్య అహంకారం తలెత్తి అది చివరకు ఎవరెవరు ఎంతటి గొప్పవారో? తేల్చుకోవాలనే స్థితికి పోటీపడసాగినారు. వారిని గమనిస్తున్న పరమశివుడు వార్కి కలిగిన అహంభావాన్ని









అణగదొక్కి వారి ఇద్దరికీ చక్కని గుణపాఠంచెప్పాలనే ఉద్దేశ్యముతో "మాఘమాసం చతుర్దశినాడు" వారి ఇరువురకు మధ్య "జ్యోతిర్లింగంగా" రూపుదాల్చాడు. వారు ఇరువురు ఆలింగంయొక్క ఆది అంతాలకు తెలుసుకోవాలని విష్ణుమూర్తి వరాహ రూపందాల్చి జ్యోతిర్లింగం అడుగు భాగాన్ని వెతుకుతూవెళ్ళగా; బ్రహ్మదేవుడు హంసరూపందాల్చి ఆకాశం అంతా ఎగిరాడు. చివరకు కనుక్కోలేక ఓడిపోయి పరమేశ్వరుని శరణువేడుకుంటారు. అప్పుడు ఆ పరమశివుడు తన నిజరూపంతో దర్శనమిచ్చి అనుగ్రహించి వారి అహంకారాన్ని పోగొట్టినాడు. దానితో బ్రహ్మ విష్ణువులు పరమేశ్వరుని ఆధిక్యతను గుర్తించి వానికి విశేష పూజలతో సేవించి కీర్తించినారు. ఆ పర్వదినమే "మహాశివరాత్రి" అయ్యింది.

శివపద మణిమాలలో 'శి'అనగా శివుడనియు 'వ' అనగా శక్తి రూపమని చెప్పబడియున్నది. ఈ "శివరాత్రినాడు" విశేషమైన కాలం "లింగోద్భవకాలం". ఈ కాలం రాత్రి 11-30 నుండి 1 గంట వరకు ఉంటుందిట! ఆ సమయంలో నిర్మల మనస్సుతో శివపంచాక్షరీ జపిస్తూ ఉపవాస దీక్షతో "పార్థివ లింగానికి" పూజాభిషేకాలుచేసి మొదటి జాములో పాలతోను, రెండవజాములో పెరుగుతోను, మూడవ జామునందు నెయ్యితోను, నాల్గవ జామునందు తేనెతోను అర్చించిన ఉమాశంకరులకు అత్యంత ప్రీతికరమని, ఆలాగునే! లక్షబిల్వార్చన ఆచరించినవార్కి విశేష పుణ్యఫలం సిద్ధిస్తుందని, శివునిచే విసర్జించబడిన "మొగలిపూవులతో" శివారాధన కనుక చేస్తే ఆ రోజు విష్ణుమూర్తి ప్రీతికొరకై స్వీకరించి వార్కి సహస్రాశ్వమేధ ఫలము లభించి శివసాయుజ్యము లభిస్తుందని పండిత శ్రేష్ఠులు "శివరాత్రి మహాత్మ్యం" గురించి వివరిస్తూ ఉంటారు.

ఇంతటి విశిష్టమైన "మహాశివరాత్రి" పుణ్యదినం రోజున సమీప శివక్షేత్రాలలో విశేషార్చనలు జరిపించుకుని మనమంతా పునీతులౌదాము.

## హోలీ

ప్రతిసంవత్సరం యావద్భారత దేశంలో "ఫాల్గుణమాసం పూర్ణిమ" తిథినాడు అత్యంత ఆనందోత్సవాలతో ఈ పండుగ జరుపుకుంటూ ఉంటారు. మరియు ఈ పండుగ వసంతఋతువు ఆగమాన్ని తెలియజేస్తూ ఉంటుంది. పూర్వం రఘు మహారాజు "హోలిక" అనే రాక్షసిని చంపిన దినంగా ఈ "హోలీ" పండుగ చేసుకుంటారుట. దీనినే ఇంకా కాముని పున్నమిగా, డోలికోత్సవముగా, ఫాల్గుణోత్సవముగా, వివిధ నామాలతో వ్యవహరిస్తూ ఉంటారు. "హోలీ" అంటే ముందుగా అందరికి రంగులే గుర్తుకు వస్తాయి.

ఈ హోలీ పండుగను గూర్చి విభిన్నమైన గాథలు కానవస్తున్నాయి. “శ్రీబాలకృష్ణుని” ఫాల్గుణ మాసం పూర్ణిమ తిథినాడు ఊయలలో (డోలికలో) వేసినట్లు శాస్త్రవచనం. అందువల్ల బెంగాలు రాష్ట్రమందు ఈ రోజు శ్రీకృష్ణుని ప్రతిమను డోలికలోవేసి ఊపుచూ “డోలికోత్సవాన్ని” జరుపుకుంటూ ఉంటారు.

‘దక్షయజ్ఞ’ సమయమందు అగ్నికి ఆత్మాహుతి అయిన సతీదేవి హిమవంతుని కూతురుగా జన్మిస్తుంది. ఆమెకు వారు పార్వతి అను నామధేయముచేస్తారు. ఇలా ఉండగా! సతీదేవి వియోగ దుఃఖముతో పరమేశ్వరుడు నిరంతర తపోదీక్షలో నిమగ్నమై ఉంటాడు. అట్టి స్వామికి పరమేశ్వరునిపై భక్తి భావముతో పార్వతి అనునిత్యము పూజించి సపర్యలు చేస్తూఉంటుంది. దేవతలు పార్వతీ పరమేశ్వరులకు కళ్యాణము చేయదలచి అందులకు మన్మధుని ఆశ్రయిస్తారు. మన్మధుడు అట్టి దేవకార్యం పరమావధిగాయెంచి అంగీకరిస్తాడు. ‘పార్వతీదేవి’ పరమేశ్వరునకు సపర్యలు చేయు సమయాన్ని తగు సమయముగా యెంచుకుని పరమేశ్వరునిపై పూలబాణం వేస్తాడు మన్మధుడు. దానితో ఆత్మధ్యానంలో ఉన్న పరమశివుని మనసు కామవికారాలకు గురిచేసి “పార్వతీ పరమేశ్వరుల” కళ్యాణానికి కారణభూతుడవుతాడు మన్మధుడు. అలా కృతకృత్యుడైన మన్మధుని దేవతలు అందరు అభినందిస్తారు. కాని పరమశివుడు ఆత్మధ్యానంలో ఉన్న తాను కామవికారాలకు ఎలాలోను అయ్యానా? అని దివ్యదృష్టితో చూచి ‘కాముకుడైన’ మన్మధుని మూడవ నేత్రము తెరచి భస్మంచేస్తాడు. అనంతరం ‘రతీదేవి’ పార్వతీ పరమేశ్వరులను “పతిభిక్ష” పెట్టమని వివిధ రీతుల వేడుకుంటుంది. సర్వమంగళ స్వరూపిణి అయిన పార్వతి ఈశ్వరుని మెప్పించి ‘రతీదేవి’కి మన్మధుడు అశరీరరూపంతో సజీవుడై ఉండునట్లు మాంగల్యభాగ్యాన్ని అనుగ్రహిస్తుంది. ఆ రోజు ఫాల్గుణ పూర్ణిమ కావున దీనిని “కాముని పున్నమిగా” జరుపుకుంటూ ఉంటారు.

మరియు పూర్వం “హోలిక” అను రాక్షసిని రఘుమహారాజు చంపినట్లు ఉన్న గాథతో పాటుగా మరియొకటి ప్రాచుర్యము పొందినది.

“హోలిక” అను రాక్షసి రోజుకు ఒక చంటిబిడ్డను తింటూ; ఒక గ్రామవాసులందరికి గర్భశోకాన్ని కలిగించేదట. ఇలా ఉండగా ఒకరోజు ఒక ముదుసలి మనవడి వంతు వచ్చిందిట! అది గమనించిన ఆ వృద్ధురాలు “హోలిక” అను రాక్షసి బారినుండి తన మనవడితోపాటు గ్రామస్తుల గర్భశోక బాధను నివారించుటకొరకై ఆ గ్రామ సమీపమందు తపోదీక్షలో ఉన్న ఒక మహిమాన్వితుడైన మహర్షిని శరణువేడుకొంటుంది. అందులకా ఋషి తల్లీ! నీవు అందులకు చింతించవలదు. ఆ రాక్షసి ఒక శాపగ్రస్తురాలు, ఎవరైనా ఆ రాక్షసిని నోటికిరాని దుర్భాషలతో తిట్టిన యెడల దానికి వెంటనే ఆయుక్షీణమై మరణిస్తుందని రేపు గ్రామస్తులను అందరును పోగుచేసి ఆవిధంగా చేయమని తరుణోపాయం చెప్పినాడు.



దానితో ఆ వృద్ధురాలు ఎంతో సంతోషంతో గ్రామంలోనికివెళ్ళి ఋషి తరుణోపాయం గ్రామస్తులందరికీ చెప్పి, ఆ రాక్షసి ఆగ్రామమునకు మరుసటి రోజు వచ్చు సమయానికి గ్రామస్తులందరిచేత అనరాని దుర్భాషలతో తిట్టిస్తుంది. ఆ దుర్భాషలను తట్టుకోలేక కొండంత “హోలీ” రాక్షసి కుప్పకూలి పోయి మరణిస్తుంది. దానితో పిల్లలు పెద్దలు ఆనందోత్సాహాలతో కేరింతలు కొడుతూ కట్టెలు ప్రోగుచేసి ఆ చితిమంటలో “హోలీరాక్షసిని” కాల్చివేసి వసంతాలు చల్లుకుంటూ పండుగ చేసుకుంటారు. నాటినుండి హోలీపండుగ వస్తోంది అంటే; పిల్లలు పిడకలు-దుంగలు ప్రోగుచేసి మంటలు వేసే ఆచారం ఏర్పడింది అని చెప్తారు. చైత్ర పాడ్యమినాడు పితృదేవతల సంతృప్తిపరచి, హోలికా భూమికి నమస్కరిస్తే సర్వదుఃఖాలు తొలగుతాయని విశ్వసిస్తారు.

ఈ పండుగ ఉత్తర భారతదేశంలో ప్రారంభించబడి దాని ప్రాచుర్యం ఆంధ్రప్రదేశ్ తెలంగాణా రాయలసీమ ప్రాంతాలతోపాటు దేశం నలుమూలలా వ్యాపించింది. చిన్నపెద్ద, ఆడ, మగ, తారతమ్యం లేకుండా! రంగులు పులుములు కుంటూ వసంతాలు చల్లుకుంటూ ఆనంద డోలికలలో తేలియాడుతుంటారు. అట్టి ఈ “హోలీ” పండుగను జరుపుకుని, మనమంతా మానసిక ఆనందంతో, ఆయురారోగ్యా లతో వెలుగొందుదాం!



## రామకృష్ణ పరమహంస జయంతి

అది బెంగాల్ ప్రాంతంలోని దక్షిణేశ్వరం. అక్కడొక ధర్మాచార్యుడు....ఒక రోజు ఒక మహిళ ఆయన వద్దకు వచ్చింది. ఆమె వెంట ఆరేళ్ల ఆమె కుమారుడు కూడా ఉన్నాడు. “స్వామీ! నా కుమారుడు మిక్కిలి అల్లరివాడు. చెప్పినట్లు వినడు. నిరంతరం తీపి పదార్థాలు తింటూనే ఉంటాడు. దాంతో తరచు అనారోగ్యం.... వీడిచేత ఇలా విపరీతంగా మిఠాయిలు తినే అలవాటు మాన్పించండి.!” అని ఆ మాతృమూర్తి ధర్మాచార్యుణ్ని ప్రార్థించింది. “రేపు రండి!” అని ఆచార్యుడు సమాధానం చెప్పాడు. వారిద్దరూ మరుసటి రోజు వచ్చారు. “రేపు రండి!” మళ్లీ ఆచార్యుని సమాధానం.

ఇలా అనేక ‘రేపు’లు గడిచిపోయాయి. ఆ ఇల్లాలికి దిగులు పట్టుకొంది. చివరికి విసుగు వచ్చింది.అయినా ఆయన మహనీయుడు. ధర్మాచార్యుడు, ఆయనని గట్టిగా అడుగలేదు! అలా రోజులు గడిచాయి. ఒకరోజున ధర్మాచార్యుడు హఠాత్తుగా బాలుడ్ని దగ్గరకి తీసుకున్నాడు. తల నిమిరాడు. “బాబూ! మిఠాయిలు విపరీతంగా తినవద్దు. అలా తినడం వల్లనీకు జబ్బుచేస్తుంది!” అని చెప్పాడు. తల్లితో “ఇక మీరు వెళ్లవచ్చు” అన్నాడు.

ఇదేమిటి స్వామీ! ఈ మాటలు చెప్పడానికి ఇన్నాళ్లు పట్టిందా! ఇవి ఎవరైనా చెప్పేమాటలే! తమరు మహనీయులు ఏదైనా మంత్రమో, మహిమో వేసి పిల్లవాడి 'తిండియావ'పోగొడుతారని ఆశపడ్డాను. ఒకతాయెత్తు అయినా ఇచ్చారు కాదే!" అన్నది ఆమె.

"అమ్మా! నాకు కూడ మిఠాయిలపై అమిత వ్యామోహంఉంది. అందువల్ల మిఠాయిలను తినకుండా నిగ్రహించుకోవడం గత కొద్దిరోజులుగా నేను సాధన చేశాను. ఐదురోజులనుండి మిఠాయిలు తినకుండా ఉండగలుగుతున్నాను. అందువల్ల పిల్లవాడికి ఇప్పుడు చెప్పాను. చేయలేని దాన్ని, ఆచరించలేని దాన్ని ఆచరించి ఉపదేశించడం తప్పు. అందుకే ఈ మాటలు చెప్పుటకు ఇన్నిదినాలు పట్టింది" అని అన్నాడు ధర్మాచార్యుడు.

మనోవాక్కాయ కర్మలందు ఇలా ఒకే రీతిగా ప్రవర్తించడమే మానవుని జీవన విధానం కావాలని నిరూపించిన ఆ మహనీయుడు రామకృష్ణ పరమహంస. అతడు, సనాతన (శాశ్వత) తత్వాన్ని మరో రూపంలో ఆవిష్కరించిన అధునాతనుడు, ప్రవృత్తి మార్గం ద్వారా సాకార పరాశక్తిని సాక్షాత్కరింప చేసుకొన్న ధర్మజీవనుడు, నివృత్తి మార్గం ద్వారా ఆత్మతత్వంతో దైవత్వంబును మును సాధించిన జీవన్ముక్త బ్రహ్మవిదుడు.

సనాతన విలువల సమిష్టి తత్వం ప్రాతిపదికగా భారతీయ సంస్కృతిసౌధం వెలసింది. సనాతనం పాతదికాదు. 'ఆద్యంత రహితంగా' ఎల్లప్పుడూ వుండేదే వైదిక జీవన తత్వం. ఇలా మొదలు తుది లేని ధర్మం. మరి ఈ ధర్మాన్ని ఈ సంస్కృతిని మళ్లీ పరిష్కరించడం ఏమిటి? అలా ఆవిష్కరించడానికి మహనీయులు ఎందుకు?

శాశ్వతంగా యుగాలతరబడి వెలుగొందే సూర్యుడు చీకటి తరువాత అవిష్కృతుడు అవుతున్నాడు. ప్రతినెల శిశిరం తరువాత వసంతం సమావిష్కృత మౌతుంది. ఎందుకు? విశ్వరచన చేసే విధాత కూడ ముందున్న దానినే మళ్లీ సృష్టిస్తున్నాడు. "ధాతా యథాపూర్వం కల్పయేత్" అన్నది వేదం.

బంగారుతో నిర్మించిన భవంతిలో కూడా బూజుచేరుకొంటుంది. కాబట్టి అప్పుడప్పుడు ప్రక్షాళన అవసరం. ఈ ప్రక్షాళన జరిగిన తర్వాత స్వర్ణమయ శోభలు పునరావిష్కృతమౌతాయి. ప్రకృతిలోను, సృష్టిలోను వికృతులు పొడసూపుతాయి. మేఘాలు తొలగిపోయి దివాకరుడు మళ్లీ యధాపూర్వవైభంతో వెలుగొందుతాడు. భారతీయ సంస్కృతి, సనాతన వైదిక సంస్కృతి వికృతులకు గురి అయినపుడల్లా మహాపురుషులు జనించారు. వికృతులను తొలగించి సంస్కృతి యధార్థ ప్రకృతిని పునరావిష్కరించారు. ఇది యుగాలుగా జరుగుతుంది. ద్వాపరయుగాంతంలో





కృష్ణుడు, కృష్ణ ద్వైపాయనుడూ ఇదే చేశారు. ఈ యుగంలో, దాదాపు రెండు వేల ఐదువందల సంవత్సరాలకు పూర్వం ఆది శంకరాచార్యులవారు అదేపనిచేశారు. నూట యాభై ఏళ్లకు పూర్వం రామకృష్ణ పరమహంస కూడా అదే చేశారు.

అది శంకారాచార్యులు కొత్తమతం కనిపెట్టలేదు. కొత్త సిద్ధాంతం సృష్టించలేదు. సనాతన సత్య సిద్ధాంతాలపై కలిగిన భ్రమలు తొలగించి ప్రేమను చూపించారు. రామకృష్ణ పరమహంస కూడ కొత్తమతం కనిపెట్టలేదు. కొత్త వైదిక సిద్ధాంతరాద్ధాంతం సృష్టించలేదు. కర్మజీవనమార్గాన్ని చేపెట్టే మనో సమజ్వల దీపంగా భాసించాడు. కొత్తది కనిపెట్టామని ఆరాధించడం పాశ్చాత్య జీవన పరిమిత బుద్ధికి జనించిన అపరిమిత అహంకారం, సనాతన రీతిని వివిధ కాలాలలో వినూతనంగా ఆవిష్కరించడం భారతీయ సంస్కారం. వేద, వేదాంత సత్య సిద్ధాంతాన్నే భారతీయ మహాపురుషులు ఆవిష్కరించారు. "ఇదిగో! కొత్తవి కనిపెడుతున్నామని" ఆర్భాటించలేదు. ఎందుకంటే సనాతన తత్వానికంటే కొత్తదీ, భిన్నమైనదీ సృష్టిలోనే లేదు. "నాన్యః పంథా అయనాయ విద్యతే" అందుకే 'డార్వినిజమ్' లాగా 'మార్క్సిజం'లాగా మనదేశంలో 'శ్రీకృష్ణాయిజమ్' 'ఆదిశంకరాయిజమ్' 'రామకృష్ణ పరమహంసాయిజమ్' 'వివేకానందాయిజమ్' పుట్టలేదు. శాశ్వతమైన భారతీయమైన వేద, వేదాంత మార్గంలో అప్పుడప్పుడు అక్కడ ఏర్పడే 'బూజు'ను, దుర్గంధాన్ని తొలగించి మార్గాన్ని సుగమం చేయడమే భారతీయ ఋషి మునుల గొప్పతనం. ఇలాంటి ఋషి రామకృష్ణ పరమహంస.

రామకృష్ణ పరమహంస జన్మించిన కాలం. భారతదేశంలో విదేశీయదాస్య భావసామ్రాజ్యం విస్తరిస్తుండిన నిశీధినీ సమయం. బ్రిటిష్ ప్రభువుల పెత్తనం చీకటి సిద్ధాంతాలను వెలయిస్తుండిన శిథిల యుగం. హిందూ జాతీయతకు, వైదిక ఆచారాలకు తెల్లదొరలు వికృతభాష్యాలు చెప్పి, దివాంధ స్వరాలు పలికిస్తుండినవేళ, కారు చీకటిని తరిమే కాంతి పుంజంలాగ శ్రీరామకృష్ణ పరమహంస ప్రభవించాడు, వివేకానంద విజ్ఞాన ధవళిమను వ్యాప్తిచేశాడు!

శ్రీరామకృష్ణ పరమహంస జన్మించి ఇప్పటికి నూటఅరవై ఏడు సంవత్సరాలైంది. కలియుగం 4,936వ సంవత్సరం చాంద్రమాన మన్మథ ఫాల్గుణ శుక్ల విదియ నాడు ఆయన జన్మించాడు. ప్రస్తుతం కలియుగం 5103వ సంవత్సరం నడుస్తోంది. సాధారణ శకం ప్రకారం ఆయన 1836 ఫిబ్రవరి 18వ తేదీన పుట్టాడు.కలియుగం 4,987 వ్యయనామ సంవత్సరం భాద్రపద బహుళ విదియనాడు పరమపదం పొందారు. సాధారణ శకం ప్రకారం అది 1886 ఆగస్టు 16వతేది.

శ్రీరామకృష్ణుని తల్లి చంద్రమణీదేవి, తండ్రి క్షుదీరామ్. వంగప్రదేశంలోని హుగ్లీ జిల్లాలోని దేరేపూర్ వారి స్వగ్రామం. సనాతన సంప్రదాయ నిష్ఠమైన వేద పండిత వంశం వారిది. వారిది మిక్కిలి సంపన్నమైన కుటుంబం. దేరేపూర్ జమీందార్

తరపున అబద్ధపు సాక్ష్యం చెప్పడానికి నిరాకరిస్తాడు క్షుదీరామ్. ఫలితంగా జమీందార్ దురాగ్రహం చెంది ఆయన భూములనూ ఇళ్లనూ లాక్కొని ఊరినుండి వెళ్లగొట్టాడు. సమీపంలోని కామార్పుకూర్ గ్రామం జమీందారు క్షుదీరామ్ కుటుంబాన్ని ఆహ్వానించాడు. క్రీస్తుశకం 1814 నుండీ ఆ కుటుంబానికి కామార్పు కూర్ స్వగ్రామ మైంది. అక్కడే రామకృష్ణుడు జన్మించాడు.

రామకృష్ణ పరమహంసకు తల్లిదండ్రులు పెట్టిన పేరు గదాధర్. ఆయనకు రామకుమార్ అనే అనే అన్న, కాత్యాయని అనే అక్కయ్య ఉండేవారు. గదాధర్‌కు తొమ్మిదవ ఏట ఉపనయనమైంది. గదాధర్‌కు తొమ్మిదవ ఏట ఉపనయమైంది. గదాధర్‌కు చిన్నప్పటి నుండీ సాధుసంతులన్నా గోసాయిలన్నా ఎంతో ఇష్టం. ఒళ్లంతా విభూతి పులుముకొని కౌపీనం ధరించి తాను కూడ అప్పుడే గోసాయి అయిపోయి నట్లు మురిసి పోయాడు బాల గదాధర్. జానపద మహిళలు గదాధరుడు బాల కృష్ణుడుగా భావించి అతనితో ఆడుకునేవారు. ఆ బాలుడు మంచి గాయకుడు. అద్భుత చిత్రకారుడు, పదునైదవ గదాధరుడు తన చెల్లెలు సర్వమంగళ, ఆమెభర్త చిత్రాన్ని యధాతథంగా గీచి అందరినీ ఆశ్చర్యపరిచాడు.

ఏడవయేట గదాధర్‌కు పితృవియోగం కలిగింది. పదునైదవ ఏట కలకత్తా చేరి అన్న రామకుమార్‌తో నివసించసాగాడు. కలకత్తా శివారు ప్రాంతంలో దక్షిణేశ్వరంలో రాణి రాసమణి అనే మత్స్యకార మహిళ ఒక కాళికా మందిరాన్ని రాధామాధవ ఆలయాన్ని నిర్మించింది. రామకుమార్ అక్కడ ప్రధాన అర్చకుడు గదాధర్ అన్నకు సహాయకుడు. అప్పుడే ఆయన 'రామకృష్ణ' అన్న పేరు స్థిరపడింది. రామకృష్ణునికి ఏళ్ళురాక మునుపే కేనారాంభట్టాచార్య అనే ధర్మాచారుడు. ఆయనకు శక్తి ఉపాసనా మహా మంత్రాన్ని ఉపదేశింశారు. రామకుమార్ మరణం తరువాత రామకృష్ణుడు కాళికాలయ బాధ్యతను పూర్తిగా స్వీకరించాడు. దక్షిణేశ్వరం ఆయన ఆజీవన కార్యక్షేత్రం.

బాల్యంలోనే వైరాగ్యభావం సిద్ధించిన రామకృష్ణ భౌతిక సుఖాలపట్ల, ఇంద్రియ వాంఛల పట్ల పూర్తిగా విముఖుడయ్యాడు. కానీ తల్లి, అన్నల బలవంతంమీద రామకృష్ణునికి ఇరవైమూడవ ఏట, ఐదేళ్లవయస్సు గల శారదామణీదేవి అన్న వధువుతో వివాహం జరిగింది. తనపద్దెనిమిదవ శారదాదేవి దక్షిణేశ్వరానికి వచ్చి భర్తతోకలసి జీవించడం ఆరంభించింది. శారదా రామకృష్ణుల దాంపత్య విషయ వాంఛలకు అతీతమైన ఇంద్రియ ధర్మ దివ్య జీవనం. పరాశక్తితో వారు అద్వైతం సాధించారు. వారు లక్ష్మీనారాయణులు, కాళికాపరమశివులు.

"శివో భూత్వా శివం యజేత్" తమ దాంపత్యం గురించి శ్రీరామకృష్ణుడు ఒకసారి ఇలా వివరించాడట' ఆమె నాపాదాలు ఒత్తుతుంది. నేను ఆమెపాదలకు



నమస్కరిస్తాను" కృష్ణుడుగా మారి శివారాధన చేయడం తత్త్వంలో అద్వైతం ఆచరించడమే.

అయితే జీవుని ప్రస్థానంలో చివరిమజిలీ అయిన అద్వైతస్థితిని సాధించడానికి వేదోక్త కర్మ పథమే రాజమార్గంద్వైత భ్రాంతి నివృత్తి కాక పూర్వమే అద్వైతస్థితి వస్తుందని భావించడం అధఃపతనానికి కారణం.అనాదిగా ఆర్యులు దీన్ని ధ్రువీకరించి నారు.రామకృష్ణ పరమహంస జీవన ప్రస్థానం ఇందుకు మరో సజీవ సాక్ష్యం. వర్ణభేదాలు, లక్ష్యసాధనలూ ఇవన్నీ మానవునికి గతజన్మ పాపపుణ్యాల ప్రాతిపదికగా ప్రారబ్ధమయ్యేవి. ఈ జన్మలో సంచితమయ్యే పాపపుణ్యాలు వచ్చే జన్మకు ప్రారబములు ఇలా అనేక జన్మల ప్రారబ్ధ సంచితాల సమాహారం జీవుని ప్రస్థానం. వీటన్నిటినీ క్రమక్రమంగా తొలగించుకుంటూ ముందుకు సాగాలని ఆత్మవికాసం చెందే కొలదీ ఇవి నెమ్మదిగా వదలి పోతాయనీ రామకృష్ణులు బోధించారు. తొలిరోజులలో శూద్రస్త్రీ నిర్మించిన ఆలయంలో అర్చకత్వం స్వీకరించడానికి ఆయన విముఖత చూపాడు. కానీ క్రమంగా సమస్త మానవాళితోను, సమస్త జీవజాలంతోను అద్వైత స్థితిని ఆయన సాధించారు.

కొబ్బరిచెట్లు ఎదిగే కొద్దీపాతమట్టలు తమంతతామే రాలిపోతాయి. ఆత్మవికాసం పొందే కొద్దీ కులభేదం వంటివి తొలగిపోతాయి. పుండు మానిపోతే పుండుపై కట్టు పొలుసు దానంతట అదే తొలగిపోతుంది. కానీ పుండుమానక ముందు పొలుసును లాగివేస్తే మాత్రం పుండు తీవ్రమై రక్తం కారుతుంది....! జీవుడు అద్వైతస్థితిని సాధించే పద్ధతి గురించి రామకృష్ణ పరమహంస ఇచ్చిన వివరణ ఇది.

మేము ఏమీ చేయనక్కరలేదు... "దేవుడు ఇక్కడ ఉన్నాడు" అంటూ గుండెను గుద్దుకొని మెట్ట వేదాంత ధోరణిలో అకర్మణ్యతను బోధించే వారికి ఇది మొట్టికాయవంటిది. వేదోక్త మార్గాన్ని విడిచి పెట్టమని ప్రోత్సహించే వారికి చెంపపెట్టు వంటిది. అందుకే అద్వైతానుభూతిని అనుక్షణం అనుభవించిన ఆ మహనీయుడు ఏనాడు కూడ సంధ్యావందనము, దేవతార్చనము వంటి నిత్యకర్మలను వదలి పెట్టలేదు. అద్వైత తత్త్వమే తానుగా భాసించిన ఆదిశంకరుడు కూడ ఇదే బోధించాడు. 'భూగర్భ మంతటా నిండి ఉన్ననీటిని ప్రయత్నించి తవ్వి తీసినప్పుడే తాగవచ్చును.'

అద్వైత భావ ధారాగ్రహణానికి అవసరమైన ఈ పురుష ప్రయత్నమే వేదోక్త కర్మజీవనమార్గం! అందువల్ల వేదాంత లక్ష్యసిద్ధికి పురుషుని ప్రయత్నము, శ్రమ అత్యంత అవసరం అని రామకృష్ణుడు ఆచరించి బోధించాడు.

వైదికధర్మం, సంస్కృతి సర్వమత సంపుట మన్న సత్యాన్ని ఆదిశంకరులు మరోసారి ఆవిష్కరించారు. అన్ని మతాలను, ఆరాధనా పద్ధతులను సమన్వయంచేసి

షణ్మతాచార్యుడయ్యాడు. ఆ పరంపరలోని రామకృష్ణపరమహంస కూడ అన్ని మతాలనూ సమన్వయ పరచి హిందు జాతీయ తత్త్వంలోని మౌలిక విలువలను మరోసారి ఋజువుచేశాడు. "ఏకంసత్ విప్రాః బహుధా వదన్తి" అన్న ఈ మౌలిక సత్యం భారతీయుల సహిష్ణుతా స్వభావం. రామకృష్ణ పరమహంస బుద్ధదేవుని పూజించారు. జైన, సిక్కు గ్రంథాలను పఠించాడు. తాంత్రిక సంప్రదాయాల వారితో ఆత్మీయత పెంచుకున్నారు. బ్రహ్మసమాజ ప్రార్థనలను చేశారు. ఇలా అన్ని మతాలను అక్కున చేర్చుకొనే అనాది హైందవ సంప్రదాయాన్ని ఆయన అనుసరించాడు, అందరికీ ఆరాధ్యుడయ్యాడు.

రామకృష్ణ పరమహంస తనను దేవుడని చాటుకోలేదు. "అనంత విశ్వవ్యాపకుడైన దేవుడు తన దేహంలో కూడ వ్యాపించాడు. అందరి దేహాలలోను వ్యాపించి ఉన్నాడు. ఆదిమధ్యాంతర రహితుడ్ని ఆరడుగుల మానవ దేహానికి ఎలా పరిమితం చేస్తారు? ఏమి చూసి, ఏమి గ్రహించి నన్ను అవతార పురుషుడని చాటుతున్నారు? అని ఆయన శిష్యులను మందలించేవారట. వైదిక సంప్రదాయ పరంపరకు చెందిన అసలుసిసలైన ధర్మాచార్యుడు ఆయన. అందుకే ఆయన అద్భుతాలు, 'ఇంద్రజాలాలు' ప్రదర్శించలేదు. విభూతులు, తాయెత్తులు, రుద్రాక్షలు "సృష్టించి" అందరినీ ఆశ్చర్యంతో ముంచలేదు. ఆదిశంకరులు తరతరాలకు దారిచూపేందుకు ఒక శిష్య పరంపరను సృష్టించినట్టే, రామకృష్ణ పరమహంసకూడా శిష్యపరంపరను రూపొందించారు. అదే ఆయన చూపించిన మహామహిమ. హైందవ సంస్కృతి కేతనాన్ని విశ్వగగన వీధులలో పరమోన్నతంగా విహరింపచేసిన వివేకానందుడు ఆయన సృష్టించిన అత్యద్భుతం.

ధర్మబద్ధ కర్మజీవనుడు అతిసామాన్యుడైనప్పటికీ అసమాన్యుడుగా విరాజిల్లు గలడని నిరూపించి నిరుపమానుడు రామకృష్ణుడు. పదునైదవ ఏట కేవలం ఒక గుడి పూజారి. ముప్పైఏళ్ళ తరువాత జాతీయ మహామందిరంలో సకల దేవతా ఆరాధకుడు. అయిన భరతమాతృ సమారాధకుడు. తరతరాలకు స్ఫూర్తి దాయకుడు. ఆది శంకరుని శిష్యులతో సమ ఉజ్జీగా వివేకానందుణ్ని ఆయన తీర్చిదిద్దాడు. ఆదిశంకర శిష్యులు హైందవ జాతీయ మౌలికతత్వాన్ని భారతదేశ నలుచెరగులా పునఃప్రతిష్ఠ చేశారు. రామకృష్ణుని శిష్యులు హైందవ జాతీయ పరిమళాన్ని అవనీతలమంతా వ్యాపింపచేశాడు.

హిందుత్వపు ఔన్నత్యాన్ని పాశ్చాత్యులు అంగీకరించనిదే స్వజాతీయులు అంగీకరించని దుస్థితిలో ఉన్న తరుణంలో, 'వివేకానంద' కిరణాలతో పాశ్చాత్య భారతీయ సంస్కృతీ సత్యాన్ని భాసింపచేసిన ధర్మ భాస్కరుడు శ్రీ రామకృష్ణ పరమహంస.







## శనిత్రయోదశి

1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
1. లేవవలసిన సమయము : ఉదయం 5 గంటలు
2. శుభ్రపరచవలసినవి : పూజామందిరము
3. చేయవలసినఅలంకారములు : శివుని ఫోటో
4. చేయవలసిన స్నానము : తలస్నానము
5. ధరించవలసిన పట్టుబట్టలు : నలుపు
6. పూజామందిరంలో చేయవలసినవి : విభూది ధరించాలి
7. మందిరంలో పరచవలసిన వస్త్రము: నలుపు
8. కలశముపై వస్త్రము రంగు : –
9. పూజించవలసిన ఫోటో : శనీశ్వరుడు
10. పూజించవలసిన ప్రతిమ : శివలింగము
11. పూజించవలసిన దైవము : ఈశ్వరుడు
12. తయారు చేయవలసిన అక్షతలు : ఎరుపు
13. పూజకు కావలసిన పువ్వులు : నీలవర్ణపు పుష్పములు
14. అలంకరణకు వాడవలసినపూలు : నీలవర్ణమాల
15. నివేదన చేయవలసిననైవేద్యం : బెల్లం
16. సమర్పించవలసిన పిండివంటలు : నల్లనువ్వులతో జీడీలు
17. నివేదించవలసిన పండ్లు : నల్లటి ద్రాక్షపండ్లు
18. పారాయణ చేయవలసినఅష్టోత్తరం : శనిఅష్టోత్తరము
19. పారాయణ చేయవలసిని స్తోత్రాలు : శని స్తోత్రము
20. పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు : శని చాలీసా
21. పారాయణచేయవలసిన సహస్రాలు: శనైశ్చర సహస్రనామము
22. పారాయణ చేయవలసినగ్రంథం : శనిగ్రహారాధన
23. పారాయణ చేయవలసిన అధ్యాయములు : దశరథుడు శనిని జయించుట
24. దర్శించవలసిన దేవాలయాలు : ప్రత్యేక శనిదేవాలయము
25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : మందపల్లి
26. చేయవలసిన ధ్యానములు : శని ధ్యానములు
27. చేయించవలసిన పూజలు : తైలాభిషేకం

| | |
|---|---|
| 28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు | : తైలాభిషేకం |
| 29. ఆచరించవలసిన వ్రతము | : శని తైలాభిషేకం |
| 30. ఉపవాసము నియమము | : వున్నది |
| 31. జాగరణ నియమము | : లేదు |
| 32. సేకరించవలసిన పుస్తకములు | : శనిగ్రహారాధన |
| 33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు | : – |
| 34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి | : – |
| 35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు | : శనేశ్వర కళ్యాణము |
| 36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు | : – |
| 37. పర్వదిన నక్షత్రము | : – |
| 38. పర్వదిన తిథి | : త్రయోదశి |
| 39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది | : శనివారము |
| 40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము | : ఉ॥6గం॥నుండి 7గం॥ |
| 41. వెలిగించవలసిన దీపారాధన కుంది | : నల్లటి ప్రమిదలు |
| 42. వెలిగించవలసిన దీపారాధనలు | : 2 |
| 43. వెలిగించవలసిన వత్తులసంఖ్య | : 2+2 |
| 44. వెలిగించవలసిన వత్తులు | : నల్లటి వత్తులు |
| 45. దీపారాధన వాడవలసిన నూనె | : నువ్వులనూనె |
| 46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి | : పంచహారతి |
| 47. ధరించవలసిన తోరము | : నల్లటి |
| 48. నుదుటన ధరించవలసినది | : నల్లని కుంకుమ |
| 49. 108 మార్లు జపించవలసిన మంత్రం | : ఓం శం శనయే నమః |
| 50. జపమునకు వాడవలసిన మాల | : రుద్రాక్షమాల |
| 51. మెడలో ధరించవలసిన మాల | : రుద్రాక్షమాల |
| 52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ | : శివప్రతిమ |
| 53. చేయవలసిన అభిషేకము | : తైలాభిషేకము |
| 54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి | : పడమర. |







## శనిత్రయోదశి

**నీలాంజన సమాభాసం । రవిపుత్రం యమాగ్రజమ్**
**ఛాయామార్తాండ సంభూతం । తం నమామి శనైశ్చరమ్ ॥**

అని ముందుగా ఆ శనీశ్వరునికి ప్రణమిల్లి వారి పుట్టు పూర్వోత్తరాలు వారు మన 'జాతకం'లో ప్రవేశించే సందర్భంలో కలిగే ఉపకార, అపకారాలు, వారి ఆరాధనలో కలిగే సత్ఫలితాలు మున్నగునవి సమీక్షించుకుందాం !

అదేమిటండి ! ప్రారంభించుటయే కరుణామయుడు 'శనీశ్వరుడు' అని వ్రాసారు? శనిపేరు చెబుతేనే ఈ మానవాళి అంతా హడలిపోతుందికదా! అట్టి శనిభగవానుడు కరుణామయుడు ఎలా అవుతాడు? అని ఆశ్చర్యపోకండి. వారి చరిత్ర ఒక్కసారి అవగాహన చేసుకుంటే ! మీకే అవగతమవుతుంది.

**ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయచ**
**గురుశుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥**

నవగ్రహాలలో ఏడవవాడైన శనీశ్వరుడు "సూర్యభగవానునికి ఛాయాదేవికి" కలిగిన కుమారుడు "శ్రుతకర్మ" ఈ శనీశ్వరుడు. నిజానికి వారిని మనసారా పూజించి ఆరాధించే భక్తులయొక్క అన్నికష్టాలనుంచి గట్టెక్కించే కళంకములేని కరుణామూర్తి ఈ శనీశ్వరుడని చెప్పుకోవచ్చు.

ఈ సర్వజగత్తుకు తన ప్రకాశవంతమైన కాంతి కిరణాలతో వెలుగును ప్రసాదించేది 'సూర్యభగవానుడు'. 'ద్విష్టా' కుమార్తె అయిన 'సువర్చల' అను అందమైన స్త్రీని ఆదిత్యుడు వివాహం చేసుకుంటాడు. వారి యొక్క దాంపత్య ఫలంగా మనువు, యముడు అను ఇద్దరు కుమారులు, యమున అను కుమార్తెయు కలిగినారు. ఆ పుణ్య దంపతులు ఎంత అన్యోన్య దంపతులు అయినప్పటికీ; అనునిత్యము పెరిగిపోతున్న సూర్యభగవానుని నుండి వచ్చే వేడిమిని సువర్చలాదేవి తాళలేకపోతూ ఉంటుంది. దానికి తగు తరుణోపాయము కొరకు అన్వేషిస్తూ సూర్యభగవానుని వేడిమిని తట్టుకునే శక్తివంతమైన రూపాన్ని తన తపోబలంతో తన 'నీడ' నుంచి తన పోలికతో ఏ మాత్రము భేదము లేకుండా, రూపలావణ్యవతియైన స్త్రీని సృష్టించి ఆమెకు 'ఛాయా' అను నామకరణం చేసి సూర్యభగవానుని చెంతకు పంపుతుంది.

అలా! ఆ మార్పు చాలాకాలం వరకు ఆదిత్యునకు తెలియదు. తదుపరి కొంతకాలమునకు ' ఆ ఛాయాదేవికి' సూర్యభగవానుని సాంగత్యముతో తపతి అనే కుమార్తె, శ్రుతశ్రవసి, శ్రుతకర్మ అనే కుమారులు కలిగినారు. ఈ "శ్రుతకర్మ" కాలక్రమములో కాశీపట్టణమును సందర్శించి విశ్వేశ్వరుని సేవించి తాను తన పేరుతో ఒక శివలింగాన్ని ప్రతిష్ఠించుకుని దానిని పూజించినాడు. ఆ పూజా ఫలంతో

